ఓమ్

# బ్రాహ్మధర్మము

అనఁగా

భారతవర్ష బ్రాహ్మసమాజములకు

ప్రధానాచార్యులవారగు

మహర్షి దేవేంద్రనాథఠాకూరుగారిచే

సర్వజనులకును పరమార్థతత్త్వజ్ఞానోదయము చేత

సర్వేశ్వరుని ప్రత్యక్షదర్శనప్రాప్తి సంఘటిల్లుట కొరకు

రచింపఁబడిన

## శ్రుతిస్మృతి సంగ్రహసారము

ప్రథమఖండము శ్రీ పాలపర్తి నరసింహముగారిచేతను

ద్వితీయఖండము శ్రీ పాలవఝ్ఝుల లక్ష్మీనారాయణగారిచేతను

అనువాదింపఁబడి

ఆంధ్రబ్రాహ్మధర్మప్రచారకనిధి పక్షమున, బ్రహ్మర్షి డాక్టర్ సర్

రఘుపతి వెంకటరత్నంనాయఁడుగారిచే

ప్రకటింపఁబడినది

ప్రథమఖండము చెన్నపట్నము 'వావిళ్లప్రెస్' యందును

తీయఖండము రాజమహేంద్రవరము 'సరస్వతీ పవర్ ప్రెస్' యందును

ముద్రితము

1935

ఓమ్।

# ప్రకాశకుని విజ్ఞప్తి

విశ్వవిఖ్యాత కవీశ్వరుఁడగు ఋషివర్యుని జనకులును పూజ్యులును నగు మహర్షి దేవేంద్రనాథ టాగూరు పరమ యోగీంద్రులలో నొకరు. వీరు హైందవ వేదములలోని శాశ్వత సత్యములను దివ్య తేజస్వంతమైన స్వీయ జీవితములో ప్రకటించి ధర్మజీవనమునకు సహాయకారియై శ్రుతి స్మృతి సారమగు "బ్రాహ్మధర్మము" ను నవభారతవర్షమున కొక యమూల్యవరముగాఁ బ్రసాదించినారు. ఈ పవిత్ర గ్రంథము మన దేశములో ననేక ప్రధాన భాషలలోని కనువదింపఁ బడినది. దాదా పేఁబది సంవత్సరములై శ్రీ సి. శ్రీధరులు నాయుడుగారిచేఁ గావింపఁబడిన యాంధ్రానువాదమును బెక్కేండ్లకుఁ బూర్వము శ్రీ మన్నవ బుచ్చయ్యపంతులుగారు సంపాదించి ప్రచురించినారు. ఆ ప్రచురణములో పునశ్శోధ నమునకు నభివృద్ధికి నెంతయో యవకాశ ముండుటవలనను, చాలకాలమునుండి యది యముద్రితమైకూడ నుండుటవలనను అనేక నూతనలక్షణములతో మఱియొక యనువాద మవసర మైనది. శ్రీ పాలపర్తి నరసింహముగారు "బ్రాహ్మధర్మ ప్రథమ భాగము" నాంధ్రమున వ్రాయుచున్నారని తెలిసినప్పుడు,

శ్రీ పీఠికాపురము మహారాజావారిచే సుస్థాపితమైన "ఆంధ్ర బ్రాహ్మధర్మ ప్రచారకనిధి" ఆ యనువాదము నుపయోగింపఁ గోరఁగా నరసింహముగారు కొంతకాలమునుండి కావించుచున్న ప్రథమభాగానువాదమును పూర్తిచేయుట కంగీకరించిరి. ఈ ప్రయత్నము ముగిసినతరువాత, నొకవేయి ప్రతుల ప్రచురణాధికారమును ప్రచారకనిధికిచ్చి, గ్రంథముయొక్క యితర స్వామ్యములను (కాపీరైటు) తమకే యుంచుకొనవలెనను నభిప్రాయమును వారు వెలువఱచిరి. అనువాదమునకును, అనుమతికిని నరసింహముగారు రెండువందల రూప్యముల గౌరవభృతిని పొందిరి. ఈ మహాగ్రంథము రెండుభాగములును కలిపి ప్రకటించుట యత్యవసరముగాఁ దోఁచి నిధి ప్రారంభదశనుండియు పరమగౌరవాస్పదులగు ప్రచారకవర్యులుగాఁ దోడ్పడి కృషిచేయుచున్న శ్రీపాలావజ్ఝల లక్ష్మీనారాయణగారిని ద్వితీయభాగము ననువదింపవేడగా వారు వెంటనే యంగీకరించి తమ ప్రయత్నమును శీఘ్రముగా సంపూర్తికావించుట ప్రశంసనీయము. మఱియు సుబోధకమగు నొక యుపోద్ఘాతమును విరచించి యుపయోగకరములగు కొన్ని సూచికలను కూడ కూర్చినారు. ఏ ప్రతిఫలమును గ్రహింపఁ దలఁపకయే యథేచ్ఛగా నుపయోగించుకొనుట కీ గ్రంథరాజము నంతయు

వారు నిధియధీనమునం దుంచిరి. పరమశ్రేయస్కర మగు నీ మహాగ్రంథము నతిసంతృప్తికరముగా నాంధ్రీకరించిన వీరిరువురి యమూల్య ప్రయత్నమును హృదయపూర్వకముగా నభినందించుచు, ధర్మపథమున నాతురులగు యాత్రికుల కెందఱకో నీ బ్రాహ్మధర్మము మార్గోపదేశ మొనర్చు నుజ్జ్వలదీపముగా నుపయోగించుననను నాశావిశ్వాసములు ప్రేరేపింప ఆంధ్రబ్రాహ్మధర్మ ప్రచారకనిధి యీ పుస్తకమును ప్రచురించుట గౌరవముగాఁ దలంచుచున్నది. చక్కఁగా నిర్మింపఁబడి దాదాపారువందల పుటలైన పెద్దగ్రంథమునకు మూల్య మొక్కరూప్య మధికముకాదని నమ్ముచున్నాము. అంతియకాక నిధికర్త యథోచితముగాఁ బంచిపెట్టుటకును కొన్ని ప్రతులు కలవు.

ఓమ్ ! సత్యమేవజయతే !

ఓమ్ ! బ్రహ్మకృపాహి కేవలమ్ !

ఓమ్

## ఉపోద్ఘాతము.

---

బ్రాహ్మసమాజము ఏ గ్రంథమును ప్రత్యేక ప్రమాణ గ్రంథమునుగా నంగీకరింపక, సత్యమే నిత్యమును అవినశ్వరమును అగు శాస్త్రమని నిర్ధారణచేసియుండినను, మహర్షి దేవేంద్రనాథ ఠాకూరుగారిచే రచింపబడిన 'బ్రాహ్మధర్మము' బ్రాహ్మధర్మ సిద్ధాంతములను విశదీకరించు ప్రమాణ గ్రంథముగా చాలవరకు అంగీకరింప బడుచున్నది. ఇట్టి ఆశతోనే మహర్షి ఈ గ్రంథమును రచించెను. తరువాత మరికొంత కాలమునకు బ్రహ్మానంద కేశవచంద్ర సేనుడు ముఖ్యములగు సమస్త మతగ్రంథములనుండియు, విషయములను గ్రహించి, దీనిపోలికనే ఇంకను విశాలతరమగు 'శ్లోకసంగ్రహ' మను మరియొక గ్రంథము ను ప్రచురించెను. బ్రాహ్మధర్మముయొక్క సార్వజనీన భావమునకు ఈ రెండవ గ్రంథమే ఎక్కువ అనుకూలముగానున్నను బ్రాహ్మసమాజమునందు మహర్షియొక్క 'బ్రాహ్మధర్మము'న కున్నంత వాడుక, వ్యాపకత్వము దీనికి రాలేదను సంగతి గమనింపదగియున్నది. 'బ్రాహ్మధర్మము' కొన్ని శతాబ్దములలోనే హిందూదేశములోని అనేక వాడుక భాషల

లోనికి భాషాంతరీకరింపబడినది. బంగాళీ భాషలో అనేక ముద్రణములు జరిగినవి. ఇది రచింపబడిన సందర్భము మహర్షియే తన 'స్వీయచరిత్ర' యొక్క ౨౩ వ యధ్యాయమునందు లిఖించి యుండుటచే, ఈ విషయము సర్వవిదితమయి యున్నది. ఇది ౧౮౪౮ వ సంవత్సరము (౧౭౭౦ శకము) నందు వ్రాయబడినది. అప్పుడు దేవేంద్రనాథుని వయస్సు ౩౧ సం॥లు. అప్పటికి బ్రాహ్మసమాజము సుస్థిరముగా సంస్థాపింపబడెను. చాలమంది దానిలో చేరిరి. కలకత్తా బ్రాహ్మసమాజము (ఆది బ్రాహ్మసమాజము) వారు అవలంబించినట్టియు, నేటికిని వారు అవలంబించుచున్నట్టియు ఉపాసనా ప్రణాళి, అదివరకే నిర్ణయింపబడెను. మానవ మనస్సుయొక్క స్వాభావిక శక్తులమీద సుస్థిరముగా స్థాపింపబడిన బ్రాహ్మధర్మమునకు పునాదిగా నుండుటకనర్హమను హేతువుచే వేదాంతము (నిర్విశేషాద్వైతవాదము) నిరసింపబడెను. కాని, బ్రాహ్మలకొక గ్రంథ మవసరమని మహర్షి భావించెను. ఆ యవసరమును తీర్చుటకే ఆయన ఈ 'బ్రాహ్మధర్మ' మును లిఖించెను. మహర్షి దీనిని ఈశ్వరభావప్రేరితమగు గ్రంథమునుగా భావించెను. ఆయన తన 'స్వీయచరిత్ర' లో "అది బలహీనమగు నా బుద్ధి ప్రణోదితము కాదు......అది నా హృదయమునుండి వెల్లువయయి ప్రవహించిన ఈశ్వరసత్యము.

సత్యముయొక్క ప్రాణమును, ప్రకాశమును అగు ఆ పరమేశ్వ రునుండియే, ఈ జీవవంత సత్యములు నా హృదయమునందు స్ఫురించినవి." అని స్పష్టముగా వ్రాయుచున్నారు. అప్పుడు జరిగిన సంగతి, ఆయన 'స్వీయచరిత్ర' లో ఇట్లు వివరించుచు న్నాడు. "బ్రాహ్మల కొరక గ్రంథ ముండవలయునని నే ననుకొం టిని. అక్షయకుమారదత్తుతో, 'దయచేసి కలము, కాగితము పట్టుకుని కూరుచుండుము. నేను చెప్పిన దంతయు వ్రాయుము' అంటిని. నా హృదయమును పరమేశ్వరుని కభిముఖముచేసి, తదేక ధ్యానముతో కూరుచుంటిని. పరమేశ్వరానుగ్రహము వలన నా మనసులో ప్రకాశించిన ఆధ్యాత్మిక సత్యములను నదీప్రవాహమువలె, ఉపనిషద్భాషలో సులభముగా, తేజ స్వంతముగా చెప్ప దొడగితిని. అక్షయకుమారుడు వానిని వ్రాయసాగెను. మూడు గంటలలో ప్రథమ ఖండము పూర్తి యయ్యెను. అది నా కెంతమాత్రమును శ్రమయని తోచలేదు. గ్రంథము వ్రాయుటకు 3 గంటలు మాత్రమే పట్టినను, దానిని పూర్ణముగా గ్రహించుటకును, దాని యంతరార్థమును చక్కగా జీర్ణము చేసికొనుటకును నా జీవితకాలమంతయు వినియోగించినను చాలదు" అని వివరించెను. ఈ విధముగా మొదటి ఖండము వ్రాయబడెను. తరువాత మరికొంతకాలము నకు ద్వితీయ ఖండము వ్రాయబడెను. ప్రథమ ద్వితీయ ఖండ

ములు రెండును పూర్తియయిన మరికొంతకాలమునకు, బంగాళీ భాషలో వానికి వ్యాఖ్యానము వ్రాయబడెను.

'బ్రాహ్మధర్మము' ఒక అమూల్యమయిన గ్రంథము. భాష ఉపనిషత్తులదయినను, అది యొక స్వతంత్ర గ్రంథము. దీనితో పోల్పదగినది బాదరాయణుని 'బ్రహ్మసూత్రము' లొక్కటే. 'బ్రహ్మసూత్రము'ల యుద్దేశము ఉపనిషదుపదేశములను సంగ్రహముగా వ్రాయుటయే. కాని, మహర్షి దేవేంద్రనాథుడు ఉపనిషద్భాష నుపయోగించుచు, ఒక స్వతంత్ర గ్రంథమునే రచించెను. ఆయన, అన్నిచోట్లను ఉపనిషద్భావములను మాత్రము తీసికొనలేదు. కొన్ని యుపనిషత్తులు పరస్పర విరుద్ధములుగా నున్నవి. ఒక్కొకప్పుడు ఒకే యుపనిషత్తుయొక్క వివిధ భాగములు సహితము పరస్పరానుగుణ్యములుగా లేవు. మహర్షి దేవేంద్రనాథుని హృదయమునందు బ్రాహ్మధర్మముయొక్క సంపూర్ణ ఆదర్శభావము ప్రతిఫలించుచుండెను. దానినే ఆయన ఉపనిషద్భాషలో వ్యక్తపరచెను. తన యుద్దేశమును సఫలము గావించుకొనుటకు దేవేంద్రనాథుడు, ఉపనిషద్వాక్యములను మాత్రమేగాక, భావములను సహితము తన యిష్టానుసారముగ నుపయోగించుకొనెను. ఈ పద్ధతి నంగీకరింపని యుపనిషత్పారకులు కొందరు, ఆయన ఉపనిషద్వాక్యముల కన్యాయము చేసినారని, ఆయనను నిందిం

తురు. ఈ గ్రంథముయొక్క నిజమయిన ప్రయోజనమును, ఉద్దేశమును గ్రహింపక పోవుటచేతనే వారిట్టి విమర్శన చేయుచున్నారు. 'బ్రాహ్మధర్మము' ఉపనిషద్వాక్యములను సంగ్రహముగా తెలుపుట కుద్దేశింపబడిన గ్రంథము కాదు. ఇది బ్రాహ్మధర్మ సిద్ధాంతములను ఉపనిషద్భాషలో తెలుపు నొక స్వతంత్ర గ్రంథము. ఆయన తన యభిప్రాయాను సారముగా ఏయే వాక్యములు బ్రాహ్మధర్మాభిప్రాయమును సమంజసముగా వ్యక్తపరచుచున్నవని యనుకొనెనో, ఆయా వాక్యములను ఉపనిషత్తులయొక్క భిన్న భిన్న ప్రదేశముల నుండి సంగ్రహించెను. మహర్షి వలననే ఈ గ్రంథరచననుగూర్చి తన 'స్వీయచరిత్ర'లో చెప్పిన వాక్యములనుండి ఈ సంగతి స్పష్టమగుచున్నది. కొన్ని సత్యములు, ఒకదాని తరువాత నొకటి తన మనోవీధియందు మెరసెననియు, ఉపనిషద్ వాఙ్మయముతో విశేష పరిచయ ముండుటచే, తానా భాష లోనే వానిని వ్యక్తము చేసితిననియు, ఆయన చెప్పుచున్నారు. దేవేంద్రనాథుడు ఉపనిషత్తులయెడల విశేష గౌరవము కల వాడు. ఆయన ధర్మభావము వానివలననే విశేషముగా పోషింపబడి అభివృద్ధి గాంచెను. కాని, ఆయన యాధ్యాత్మిక జాగరణమును, అభిప్రాయములును ఉపనిషత్తులనుండి యుత్ప న్నములయినవి కావు. అవి ఆయనకు స్వతస్సిద్ధములును,

స్వతంత్రములును అయి యుండెను. ఉపనిషత్తులు ఆయనకు గల యభిప్రాయములకు తమ యంగీకారమును తెలిపి బలపరచెను. "తన హృదయమునందలి ఆధ్యాత్మిక భావములకు, ఉపనిషత్తులలో ప్రతిధ్వనిని వింటి" నని ఆయనయే చెప్పియున్నాడు. ౧౮౩౮ వ సం॥న ఒకనాడు అకస్మికముగా గాలి కెగర గొట్టుకొని వచ్చిన ఒక కాగితపుముక్కను చదువుటవలన, ఆయనకు ఉపనిషత్తులతో ప్రథమ పరిచయము కలిగెను. ఈ విషయమునుగురించి ఆయన తన 'స్వీయచరిత్ర' లో వ్రాసియుండెను. అది దూరస్థములగు ఎన్నో ఫలముల నొసంగు ఒక సంఘటనము. దానిని సామాన్యజనులు ఆకస్మిక ఘటన యందురు. కాని, ఈశ్వర విశ్వాసులు దానియందొక నిగూఢమగు ఈశ్వరోద్దేశమును కనిపట్టుదురు. ఆ కాగితపు ముక్కలోని శ్లోకము యొక్క అర్థమును, అప్పటి బ్రాహ్మసమాజ ప్రధానాచార్యుడగు రామచంద్ర విద్యావాగీశ్వరునుండి తెలిసికొని, దాని భావ గాంభీర్యమునకును, సౌందర్యమునకును ఆశ్చర్యమునొంది, అది ఉపనిషద్వాక్యమని తెలిసికొని, ఆయన సాహాయ్యముతోనే, తనకు స్వాభావికమయిన శ్రద్ధతోను పట్టుదలతోను ఉపనిషద్ పఠనమునకు పూనుకొనెను. ఇట్లు సుమారు పది సం॥లు ఉపనిషదోద్యానమునందలి స్వాదుఫలముల తనివితీర నారగించి, తన యాధ్యాత్మిక క్షుధా నివారణము చేసి

కొనెను. ఆయన మొట్టమొదట, ఉపనిషత్తులే తన బ్రాహ్మ ధర్మమునకు పునాదిగా నుండగలవని యాశించెను. కాని, వానితో పరిచయ మధికమయినకొలదిని, వానిలో అక్కడక్కడ, బ్రాహ్మధర్మమునకు విరుద్ధములయిన భావము లున్నట్లు ఆయన కనుగొనెను. అందుచే తనకెంత అయిష్టముగా నున్నను, ఉపనిషత్తులు తన మతమునకు పునాది కావను నభిప్రాయమును వెలిబుచ్చెను. కాని, ఉపనిషత్తుల యందు ఆయన కదివరకు గల అపార గౌరవము నిలిచియే యుండి, ఆయన హృదయము ఉపనిషద్ భావభరితమయ్యెను. కనుక, బ్రాహ్మధర్మ సిద్ధాంతములను విశదీకరించు గ్రంధ మొకటి వ్రాయదలచుకొన్నప్పుడు, ఆయన దానిని ఉపనిషద్ భాషలోనే వ్రాయుట స్వాభావికము. బ్రాహ్మధర్మముయొక్క ప్రధమ ఖండములోని విషయములన్నియు, ఉపనిషత్తుల లోనివే. కాని, ఆయన వానిని భిన్నభిన్న స్థలములనుండి సంగ్రహించెను. ఇట్లు సంగ్రహించుటలో, ఆయన వాక్యములను తరుచు వానివాని పూర్వ సందర్భములనుండి విడదీసియు, అప్పుడప్పుడు వానిని తన యిష్టానుసారముగా మార్చియు, తన యభిప్రాయానుగుణ్యములగు నూతన వాక్యములను సమకూర్చెను. ఆయన కేవలము ఉపనిషత్తులనే ప్రకటించుచున్నయెడల, ఆయన తీసికొనిన ఈ స్వాతంత్ర్యము నింద

నీయమే అయి యుండును. కాని, ఆయన యుద్దేశము వేరు. మే మిదివరలో చెప్పినట్లుగా, ఆయన ఒక స్వతంత్ర గ్రంథమును రచించుచుండెను. భాషమాత్రమే ఉపనిషత్తులది. ఉపనిషత్తులయందు అభిమాన గౌరవములు కలవారు, ఉపనిషద్ వాక్యములతో మహర్షి తీసికొనిన ఈ స్వాతంత్ర్యమునకు ఆగ్రహపడవలసిన యవసరములేదు. మహర్షి 'బ్రాహ్మధర్మము' ను ఉపనిషద్ భాషలో వ్రాసినందువలన ఉపనిషత్తులను గౌరవించుటమాత్రమేగాక, వానికి గొప్ప సేవకూడ చేయగలిగెను. మహర్షియొక్క గ్రంథమువలన, ఉపనిషత్తులు జనసామాన్యమునకు అదివర కెన్నడును కానంత ప్రేమపాత్రమయ్యెను. అవి ఎంత ఉపయోగములోనికి తీసికొని రాబడగలవో, అంత ఉపయోగములోనికి తీసికొనిరాబడెను. ఉపనిషత్తులలోని అత్యుత్తమములగు శ్రుతులను వాని సందర్భముల నుండి విడదీసి, వాని చుట్టును పెరిగియున్న నిరర్థకములు, ఒక్కొకచోట అనర్థకములు కూడ నగు బరువులనుండి తొలగించి, వానినొక క్రమపద్ధతిని శ్రేణీవిభాగము గావించి, మహర్షి ఉపనిషత్తులను పూర్వముకంటె ఎక్కువ ఆకర్షణీయముగ చేసి, జనసామాన్యము సహితము వాని మధురభావ ప్రాశస్త్యములను సులభముగా గ్రహింపగలుగు నట్లొనర్చెను. మహర్షి చేసిన ఈ మార్పులు, విరుపులు మూలగ్రంథము

యొక్క ఉద్దేశమును చాలచోట్ల అభివృద్ధి నొందించి, దానిని మరింత సఫలము గావించెను. ఇందు కుదాహారణముగా 'బ్రాహ్మధర్మము' ప్రథమ ఖండముయొక్క ౧౬ వ యధ్యాయమునందలి "యశ్చాయ మస్మిన్నాకాశే తేజోమయోఽమృతమయః పురుషః సర్వానుభూః। యశ్చాయ మస్మిన్నాత్మని తేజోమయోఽమృతమయః పురుషః సర్వానుభూః। తమేవ విదిత్వాతి మృత్యుమేతి, నాన్యఃపన్థా విద్యతేఽయనాయ॥" అను ౧౭ వ శ్లోకమును తీసికొనుడు. ఇది బృహదారణ్యకోపనిషత్తుయొక్క రెండవ యధ్యాయములోని పంచమ బ్రాహ్మణమునుండి తీసికొనబడినది. ఇందు మహర్షి విశేష స్వాతంత్ర్యము తీసికొని, మూల శ్రుతులను తన యిష్టము వచ్చినట్లెల్ల ఉపయోగించుకొనెను. ౧౦ వ వాక్యములోని కొంత భాగమును ౧౫ వ వాక్యములోని ఇంకొక భాగమునకు కలిపి, ఈ రెంటితో నేర్పడిన వాక్యమును మరల శ్వేతాశ్వతరోపనిషత్తులోని ౬ వ యధ్యాయము ౧౫ వ శ్లోకములోని కొన్ని భాగములతో కలిపి, పయి వాక్యమును సమకూర్చెను. మూలవాక్యముల నొకసారి చదివినయెడల, వాని భాగముల నిట్లు విడదీసి, మార్చి ఈ నూతన వాక్యమును కూర్చుటవలన, వాని కెంత శోభ, ఎంత అందము వచ్చినదో పాఠకుడు తెలిసికొనగలడు. బ్రాహ్మధర్మములో

నందు ఈ శ్లోకముయొక్క భాగములన్నియు మూలమునందు మొలిచినట్లున్నవి కాని, అతికినట్లు లేవు. 'బ్రాహ్మధర్మము' లోని ఈ శ్లోకమును చదివిన వారెవ్వరును బృహదారణ్యకములోని మూలముకొరకు కాశింపరు. ఉపనిషత్తులయందపార గౌరవము గల వారును భాష్య సహితముగా వానితో విశేష పరిచయము గలవారును అయిన పండిత శివనాథశాస్త్రి, కవి రవీంద్రనాథ రాకూరు మొదలయినవారు సహితము మూలముల నుపేక్షించి 'బ్రాహ్మధర్మము' లోని శ్లోకములనే వాడిరి. మహర్షి రచితమగు ఈ 'బ్రాహ్మధర్మము' జనసామాన్యమున కుపనిషత్తులతో విశేష పరిచయము కలిగించిన దనుటకు సందేహము లేదు.

బ్రాహ్మసమాజ సిద్ధాంతములను ఒక క్రమపద్ధతిని తెలిపి, వానికి భాష్యము వ్రాయవలయునని మహర్షి యుద్దేశము. వాని నతడు ఉపనిషద్ భాషలో వ్రాసి తన యుద్దేశమును జయప్రదముగా నెరవేర్చుకొనెను. అక్కడక్కడ కొంచెము విశృంఖలత యున్నను, ప్రథమ ఖండముయొక్క ౧౬ అధ్యాయములలోను జ్ఞాతముగనో అజ్ఞాతముగనో ఒక పద్ధతి అంతర్నిహితమయి యున్నది. ధీమంతులగు అనేక మతకర్తలను సహితము కష్టపెట్టిన దుస్సాధ్యవిషయమగు 'ఈశ్వర నిర్వచనము' ను ప్రథమాధ్యాయము మీయ్య బ్రయత్నించుచు

న్నది. ఉపనిషత్తులనుండి, విశేషముగా తైత్తిరీయమునుండి మహర్షి కొన్ని శ్లోకముల నుదహరించి, పరమ సత్యముయొక్క స్వరూప స్వభావాదులను, చక్కగా నిర్వచించి విశదీకరించి ఈ కృత్యమునందు నిజముగా జయము గాంచుచున్నాడు. రెండవ శ్లోకములో "దేనినుండి సమస్త భూతములు ఉత్పన్న మగుచున్నవో, ఉత్పన్నములయిన సమస్త భూతములును దేనివలన జీవించుచున్నవో, భూమండలమునుండి తరలిపోయిన తరువాత మరల అవన్నియు దేనినిగూర్చి పోవుచున్నవో దేనియందు ప్రవేశించుచున్నవో, అదే బ్రహ్మమని ఆయన నిర్వచించుచున్నాడు. ఈ శ్లోకములో అనిర్ధారణముగా విడిచి పెట్టినదానిని, దీని తరువాతి శ్లోకములో నిర్ధారణము చేయు చున్నాడు. దానియందు పరమేశ్వరుడు 'ఆనంద' మని పిలువ బడుచున్నాడు. 'ఆనంద' మనగా 'ప్రేమ' యని కొందరందురు. కాని, ఆనందమును ప్రేమయు ఒకటి కావు. అవి పరస్పర సం బంధము కలవి. ఒకదానినొకటి విడిచియుండవు. ప్రేమయొక్క ప్రకాశమే ఆనందము. ఆనందమునందు ప్రేమభావము ఇమి డియే యున్నది. శ్రుతియందలి 'ఆనంద' మను పదము 'ప్రేమ' యను పదముకంటె అధిక భావగాంభీర్యము కలది. ౪ వ శ్లోక మునందు, ఈశ్వర భావముయొక్క రెండు వస్తువులు—మానవబుద్ధి కతీతమయిన ఆయన యనంతత్వమును, అయినను

ఆయనకు మానవునితోగల ప్రేమపూర్వక సంబంధమును—ఉభయమును చక్కగా ప్రస్ఫుటితము చేయబడినవి. తరువాతి శ్లోకములో ఆ ప్రేమ సంబంధము మరింత స్పష్టముగా తెలుపబడినది. ఈ జీవునకు పరమేశ్వరుడే పరమ సంపద, అతడే పరమానందము అని చెప్పు బృహదారణ్యకమునందలి చక్కని శ్లోకముతో ఈ యధ్యాయము ముగియుచున్నది. రెండవ యధ్యాయము సృష్టియొక్క కార్యక్రమమును జనశ్రుత్యను సారముగా తెలుప బ్రయత్నించుచున్నది. కాని, మహర్షి బహునిపుణతతో, సృష్టియొక్క విశేష వివరణము నిచ్చుట మానివేసి, ఇప్పుడు సృష్టిలో మనకు కానవచ్చునవేవియు ఆదియందు లేవనియు, అప్పుడు విశ్వస్రష్టయును, అనంతమును నిత్యమును అగు పరమాత్మమాత్రమే యుండెననియు సామాన్యముగా చెప్పి సంతృప్తి నొందుచున్నాడు. మూడవ యధ్యాయములో బ్రహ్మజ్ఞానోపలబ్ధియొక్క మార్గము చెప్పబడినది. జిజ్ఞాసువు, బ్రహ్మజ్ఞానియు భక్తుడును అగు గురువు నన్వేషించి, భక్తిపూర్వకముగా ఆయనను సమీపించి, బ్రహ్మవిద్య నభ్యసింపవలయునని ప్రోత్సహింపబడుచున్నాడు. పరమేశ్వరుని మహిమాతిశయమును, బ్రహ్మజ్ఞానముయొక్క ప్రాశస్త్యమును కొన్ని సుందరమయిన శ్లోకములలో వర్ణింపబడినవి.

నాలవ యధ్యాయము, మానవునికి గల బ్రహ్మజ్ఞానము యొక్క స్వభావమునుగురించి మరింత స్పష్టముగా తెలుపు చున్నది. ఆధునిక అజ్ఞేయతావాదము కనబరచు అభ్యంత రముల నెదురు చూచి, వానికి తగిన సదుత్తరములను ఆ కాలముననే ఉపనిషదృషు లియ్యగలుగుట చూడ ఆశ్చర్య మగుచున్నది. కేనోపనిషత్తుయొక్క భాషలో "మనము ఈశ్వరునిగురించి ఎరుగము అన్నమాటయు సత్యము కాదు, ఆయనను గురించి పూర్ణముగా ఎరుగుదుము అన్నమాటయు సత్యము కాదు" అని చెప్పబడుచున్నది. "ఆయననుగురించి ఎరుగుదుము, అయినను ఆయననుగురించి ఎరుగము" అను నీ వాక్యముయొక్క అర్థము నెవ రెరుగుదురో, వారే ఈశ్వరు నెరిగినవారు. తరువాతి యధ్యాయములలో ఈశ్వర స్వభావ మును గురించి బ్రాహ్మలకు గల యభిప్రాయము ఇంకను వివర ముగా తెలుపబడినది. ౫ వ యధ్యాయములో ఈశ్వరుని సర్వాంతర్యామిత్వము నొక్కిచెప్పబడినది. ౬ వ యధ్యాయ ములో బ్రహ్మమును తెలిసికొను సాధనము విశేష వివరముగా తెలుపబడినది. బ్రహ్మమును తెలిసికొను సాధనను గురించి తెలుపు సందర్భములలో, అనేకోపనిషత్తులలో చెప్పబడి గంభీరార్థయుక్తములగు ననేక శ్లోకములను మహర్షి ఎత్తి చూపెను. ౭ వ యధ్యాయములో బ్రహ్మముయొక్క మహా

దైశ్వర్యము విశేషముగా వివరింపబడినది. అత డద్వైత పర బ్రహ్మము, దేవతల కెల్లను పరమ దైవతము. ఆయనకు జనకుడు లేడు. అతడు కారణాంతరమునుండి ఉత్పన్న మయినవాడుగాని అర్థాంతరముగా మారువాడుగాని కాడు. అయినను ఆయన మానవుల హృదయ గుహాయం దున్నాడు, అధ్యాత్మయోగముచేత తెలియబడును. అధ్యాయముయొక్క చివర 3 శ్లోకములలోను బ్రహ్మమును తెలిసికొను విధానము చెప్పబడినది. ప్రణవము (ఓంకారము) వింటితోను, జీవాత్మ బాణముతోను, పరమాత్మ లక్ష్యము తోను పోల్చబడినవి. విలుకాడు అప్రమత్తుడయి, వింటితో బాణమును లక్ష్యముమీది కెట్లు ప్రయోగించునో, అట్లే సృష్టిస్థితిలయకారకుడగు పరబ్రహ్మమును సూచించు ఓంకార ముయొక్క సహాయముతో, మానవాత్మ ఏకాగ్రచిత్తముతో పరబ్రహ్మమువయిపున కనుసంధానము చేయవలయును. ౮ వ యధ్యాయము ఈశ్వరుని సర్వవ్యాపకత్వమును నొక్కి చెప్పు చున్నది. అతడు సర్వవ్యాపి, సర్వద్రష్ట. నేత్రవిహీనుడును బాహువిహీనుడును అయినను, సర్వమునకును కర్తయయి యున్నాడు. అతడు ప్రకృతియందును, మానవ హృదయము నందును ఏకమాత్ర సర్వాంతర్యామియయి యున్నాడు. భౌతిక ప్రపంచముయొక్క క్షణభంగుర దృశ్యములలో నిత్య

డును, చేతనములకు చేతనమును, సమస్త జీవరాసులయొక్క ఏకమాత్ర కామ్యవిధాతయు, మన ఆత్మలకు ఆత్మయు అయియున్నాడు. ఆయనను తెలిసికొనుటవలననే హృదయ శృంఖలములు తెగి మర్త్యుడు అమృతు డగుచున్నాడు.

౯ వ యధ్యాయము జీవాత్మకు పరమాత్మతోడి సంబంధముయొక్క స్వభావ మెట్టిదో వివరించుచున్నది. మహర్షి దేవేంద్రనాధునకు శ్రీ శంకరాచార్యులవారి నిర్విశేషాద్వైతవాద మన్న చాల అసహ్యము. అందుచేతనే ఆయన జీవాత్మయొక్క సత్యత్వ వ్యక్తిత్వములనుగురించి నొక్కి చెప్పుచున్నాడు. ఋగ్వేద భాషలో, తిరువాత అనేకోపనిషత్తులు అనుకరించిన భాషలో, మహర్షి జీవాత్మ పరమాత్మలను పరస్పరము సఖులయి, ఏక వృక్షము నాశ్రయించుకొనియున్న రెండు పక్షులకు పోల్చుచున్నాడు. ఇది బహు గంభీరమును, అర్థయుక్తమును అగు రూపకము. ఇది జీవాత్మ పరమాత్మలకు గల సన్నిహిత సంబంధమును—ఒకే పోలికనుండు స్వభావముగలిగి, నిరంతరము కలిసియుండు, అయినను పరస్పరము వేరగు, ఇద్దరు స్నేహితులకుండు అతి సామీప్య సంబంధమును—ఏక కాలమున స్ఫురింపజేయుచున్నది. మానవుడు తన కార్యములకు బాధ్యుడయి, తన కర్మఫలముల ననుభవింపవలసియున్నాడు. పరమేశ్వరుడు అన్నిటిని చూచుచున్నను,

అన్నిటిని తెలిసికొనుచున్నను, మానవుని కర్మలవలన లిప్తుడు కాడు. మానవుడు తన స్వరూపమును తాను తెలిసికొన్న యెడల, పరమ శాంతితో, ఆనందముతో జీవించును. మోహపరవశుడయి తన స్వరూపమును తాను మరచిపోవుట చేతనే శోకపరవశు డగుచున్నాడు. మహర్షి వేరు వేరు ఉపనిషత్తులనుండి అనేక శ్లోకముల నుద్ధృతము చేసి ఈ భావమును విశేషముగా పెంచి చెప్పుచున్నాడు పరమేశ్వరుడు పుత్రుని కంటెను, విత్తముకంటెను, ఇంకను మిగిలిన సర్వముకంటెను ప్రియతరుడని చెప్పబడుచున్నాడు. అతడు చూడదగినవాడు, తెలిసికొనదగినవాడు, మనన నిదిధ్యాసనములు చేయదగినవాడు. మానవు డాయనను తెలిసికొనినయెడల, జీవితము యొక్క పరమార్థము నొందగలడు. తెలిసికొననియెడల, మహానర్థకము వాటిల్లును. ఈ యధ్యాయముయొక్క చివర శ్లోకములో, పరమేశ్వరుడు సునిర్మలమగు శాంతికి దారితీయు అవినశ్వర ధర్మముయొక్క ప్రవర్తకుడని చెప్పబడియున్నాడు.

పదవ యధ్యాయములో పరమేశ్వరుని యారాధనకు, ఉపాసనకు, ధ్యానమునకు అనుకూలమగు కొన్ని సూత్రములు చేర్పబడినవి. వీనిలో మొదటిది పురాతనమగు ఓంకారము. ఊర్ధ్వలోక నివాసులగు దేవతలవలెనే ఈ ఓంకారము యొక్క సహాయముతోనే పరమేశ్వరుని ధ్యానింపవలెను.

తరువాతి సూత్రము ఋగ్వేదములోని ప్రసిద్ధమగు గాయత్రీ మంత్రము. చిట్ట చివరది కృష్ణయజుర్వేదమునుండి అనేకోప నిషత్తులలోనికి తీసికొనబడినట్టియు, పరమేశ్వరుడు అగ్నియం దును, జలమునందును, భూమియందును, ఆకాశమునందును అంతర్యామియయి యున్నాడని అర్థ మిచ్చు శ్లోకము.

౧౧ వ యధ్యాయము బ్రహ్మజ్ఞానము కష్టసాధ్యమను విషయమునుగురించి చెప్పుచున్నది. పరమేశ్వరుడు ఇంద్రి యాతీతుడు. అతడు విశేష పాండిత్యముచేతగాని, తీక్ష్ణమగు బుద్ధిచేతగాని తెలియబడడు. అతడు ఎవరిని వరించునో, వారికి తన దివ్య దర్శనము నిచ్చును. అతడు సమస్త భూత ములయందును గూఢముగా నున్నాడు. శ్రేష్ఠమయిన గురువు లయొక్క సాహాయ్యముతో ఆయనను తెలిసికొన బ్రయత్నిం పవలయును.

౧౨ వ యధ్యాయములో పరమేశ్వరుని సర్వాంత ర్యామిత్వము ఇంకను పెంచి చెప్పబడినది. ఆయన సర్వత్ర ఉన్నాడు. పక్షు లెట్లు తాము వసించు వృక్షము నాశ్రయించి యుండునో, అట్లే, సమస్త జీవులును ఆయనయందు ప్రతిష్ఠిత ములయి యున్నవి. మానవాత్మకును ఆయనకును గల సం బంధము ఇందు ప్రధానముగా వర్ణింపబడినది. ఆయన మన సమస్త కార్యములను చూచుచున్నాడు, మన యోగ్యతననుస

రించి, బహూకరణమో శిక్షయో చేయుచున్నాడు. బుద్ధిహీనులు బాహ్యవిషయములను మాత్రమే చూచుచున్నారు. కాని, వివేకము గలవారు సర్వభూతాంతరాత్మయగు పరమాత్మనే సర్వత్ర దర్శించి ఆయనను తప్ప మరి దేనిని కోరరు. "దేని వలన నేను అమృతత్వము నొందజాలనో, దానితో నేనేమి చేసికొందును?" అను మైత్రేయియొక్క గంభీరవచనముతోను, బృహదారణ్యకమునందలి "నన్ను అసత్యమునుండి సత్యమునకు నడిపించుము, అంధకారమునుండి వెలుగునకు నడిపించుము, మృత్యువునుండి నిత్యజీవమునకు నడిపించుము" అను గంభీర ప్రార్థనతోను, ఈ యధ్యాయము ముగియుచున్నది. ౧౩ వ యధ్యాయము సత్యముయొక్క ప్రభావమును తెలుపు చక్కని శ్లోకముతో ఆరంభమగుచున్నది. సత్యమే జయించును, అనృతము జయింపదు, సత్యానుసరణమువలననే పరమాత్మ లభ్యమగును, పరమాత్మయే సత్యముయొక్క పరమ నిధానము, అని చెప్పుచున్నది. కాని, ఈ భావము అంతటితో ఆపివేయబడినది. తరువాతి శ్లోకములలో సాధారణ లక్ష్యమేమియు ఉన్నట్లు కనపడదు. వానియందు మరల వెనుకటి విషయమే, పరమేశ్వరుని స్వరూప నిర్ణయమే చెప్పబడినది. అతడు జన్మరహితుడనియు, "నేతి నేతి" అను వాక్యముచేత మాత్రమే నిర్వచింపబడదగినవాడనియు చెప్పబడినది.

అయినను, అతడు సమస్తమునకును ఈశానుడనియు, సమస్తమునకును అధిపతియనియు చెప్పబడినది. జీవాత్మ పరమాత్మలు ఛాయాతపములవలె, ఒకదానినుండి మరియొకటి విడదీయుటకు వీలులేనివయినను, అవి పరస్పరము సంపూర్ణముగా భిన్నములని, ఆ యుభయమునకును గల పరస్పర సంబంధమును నిరూపించు ఒక చక్కని శ్లోకముతో ఈ యధ్యాయము సమాప్తమగుచున్నది. ౧౪ వ యధ్యాయము అనంతునియొక్క వైభవమును ప్రశంసించుచున్నది. భూమయందే (అనంతమునందే) ఆనందము కలదనియు, అల్పమునందు సుఖము లేదనియు, ప్రారంభ శ్లోకము నుడువుచున్నది. తరువాతి శ్లోకములో "అనంతుడగు పరమేశ్వరుడు దేనియందు ప్రతిష్ఠితుడయి యున్నాడు?" అని శిష్యుడు ప్రశ్నించుచున్నాడు. "స్వీయ మహిమయందే"యని గురువు ప్రత్యుత్తరమిచ్చుచున్నాడు తరువాత, మరికొన్ని శ్లోకములలో అనంతునియొక్క మహిమాతిశయము విశేషించి చెప్పబడినది. అతడు ఊర్ధ్వమునందును, అధోభాగమునందును, దక్షిణపార్శ్వమునందును, ఉత్తర పార్శ్వమునందును అనంతాకాశమునందంతటను నిండి అనంత దేశమునకు శాసకుడయి యున్నాడు. అట్లే, అతడు భూతమునకును భవిష్యత్తునకును, నేటికిని రేపటికిని ఈశానుడయి, సమస్త కాలమునకును నియా

మకుడయి యున్నాడు. ఒక్కడయ్యును, సమస్త జీవరాసుల కును వానివాని ప్రయోజనానుసారముగా పదార్థములను సమ కూర్చుచున్నాడు. సమస్త విశ్వమును ఆదియందు ఆయన నుండియే ఉత్పన్నమగుచున్నది, అంతమునందు ఆయనయందే ప్రవేశించుచున్నది. అతడు విశ్వకర్త, విశ్వనియన్త ఆయన గాక మరియొక ప్రభువు లేడు. అతడే విశ్వముయొక్క సంరక్షణమునకు ఏకమాత్ర హేతువు. అతడు వాక్కుచేతగాని, మనస్సుచేతగాని పొంద నశక్యుడు "అత డున్నాడు" అను ఆత్మప్రత్యయము గలవాడు మాత్రమే ఆయనను తెలిసికొన గలడు.

ప్రథమ ఖండముయొక్క మొదటి ౧౪ అధ్యాయములును కేవలము ఆధ్యాత్మిక విషయములనే తెలుపుచున్నవి. కాని, చివర రెండు అధ్యాయములు, అనగా ౧౫, ౧౬ అధ్యాయములు కేవలము నైతిక విషయములను గురించియే బోధించుచున్నవి. ౧౫ వ యధ్యాయమునందలి శ్లోకములు ఉపనిషత్తులలో కెల్ల విశేషముగా నైతిక వర్తనమును గురించి యుపదేశించు కఠోపనిషత్తునుండి, చాలవరకు గ్రహింపబడినవి. "దుష్ప్రవర్తనమునుండి మరలకపోయినను, నియతమానసుడును, సమాహితచిత్తుడును కాకపోయినను, కేవలము ప్రజ్ఞానముచేతనే, ఎవడును బ్రహ్మమును పొందజాలడు, అని మొదటి

శ్లోకమే నొక్కి వక్కాణించుచున్నది. తరువాత, శ్రేయమున కును ప్రేయమునకును గల భేదము చూపబడియున్నది. శ్రేయము వేరు ప్రేయము వేరు, ఈ రెండు మార్గములును మానవుని పొందుచున్నవి. ధర్మమార్గమును, అనగా శ్రేయో మార్గమును పట్టినవాడు శుభమును పొందుచున్నాడు. సులభ మగు ప్రేయోమార్గము ననుసరించువాడు పురుషార్థమునుండి భ్రష్టుడగును. మానవునియొక్క స్వభావము, పురోగమనము, అతని కార్యములను ఆచరణను అనుసరించి ఏర్పడును. పుణ్య కర్మముచేత పుణ్యాత్ముడగును, పాపకర్మముచేత పాపాత్ము డగును. ఎవని యింద్రియములు అవశములయి యుండునో, ఎవని మనస్సు నియమింపబడి యుండదో, అతడు దుష్టాశ్వ ములచే నడుపబడు రథమువంటివాడు. అట్టి మానవుడు తప్పక దుఃఖము నొందును, బ్రహ్మమును పొందజాలడు. కాని, ఎవడు ఇంద్రియములను అశ్వములను ప్రజ్ఞానమను కళ్లెముతో పట్టి తన స్వాధీనమునం దుంచుకొననో, అతడు ఆకాశమునందు వ్యాప్తమయిన వస్తుసమూహమును నేత్రము దర్శించునట్లు, బ్రహ్మవేత్తలు ఏ పరమేశ్వరుని పరమపదమును సదా, ప్రత్యక్ష ముగా సందర్శింతురో, అట్టి యుత్కృష్టజీవిత గమ్యస్థానమును, తన హృదయమునందే పొందగలడు.

ఇట్లే ౧౬ వ యధ్యాయముకూడ నైతికాదర్శములనే ఇచ్చి, తదనుసరణమునకయి ప్రోత్సహించుచున్నది మనస్సు నెట్టి స్థితిలో నుంచుకొని పరమేశ్వరు నన్వేషింపవలెనో మొదటి శ్లోకము వివరించుచున్నది. అతడు బాహ్యేంద్రియములను అంతరింద్రియములను నిగ్రహింపవలెను, సమస్త భౌతిక విషయ కాంక్షలనుండియు విముక్తి నొందవలయును అట్టి మనో నిగ్రహముగలవాడు పాపముచేగాని, శోకముచేగాని స్పృశింప బడడు, పరమేశ్వరుని పొంది ఆనందము నొందుచున్నాడు. తరువాత, ముండకోపనిషత్తునుండి సత్యము, ధర్మము, మంగళ కార్యములు అవశ్యానుసరణీయములను ఉన్నత నైతికాదర్శ ములను బోధించు కొన్ని శ్లోకములు సంగ్రహింపబడినవి. ఎవ డీ విధముగా పరమేశ్వరు నన్వేషించునో, అతడు బ్రహ్మధామ మును పొందగలడు. తరువాత, శ్వేతాశ్వతర ఋషి తన యుపనిషత్తునందు చేర్చుకొనిన "బాహ్యమున ఆకాశమునం దంతటను, అంతరమున ఆత్మయం దంతటను, ఏ తేజోమయ అమృతమయ పురుషుడు అధిష్ఠించియున్నాడో, ఎవనిని తెలిసి కొనుటవలన, మానవులకు అమృతత్వము లభ్యమగునో, అట్టి మహాపురుషుని నేను తెలిసి కొంటిని" అని ప్రకటించు యజు ర్వేద జయధ్వానముతో ప్రథమ ఖండము ముగియుచున్నది.

ప్రథమ ఖండము రచింపబడిన కొంతకాలమునకు ద్వితీయ ఖండముకూడ రచింపబడెను. దీనియందు మహర్షి బ్రాహ్మధర్మాదర్శానుసారముగా ఆస్తికులగు సమస్త మానవులు సమస్త గృహస్థులు విధ్యుక్తముగా నాచరింపవలసిన దినకృత్యములు, నైతిక ధర్మములు మొదలయిన వానిని విశదీకరించెను. బ్రాహ్మధర్మము సర్వదా, సర్వత్ర గృహమునందును సంఘమునందును ఆచరింపబడవలసిన మతమేగాని, ఆరణ్యకమతమువలె ఏయరణ్యములయందో, ఆచరింపబడవలసిన మతము కాదని మహర్షి యభిప్రాయము. కనుక, ప్రథమ ఖండములో వివరింపబడిన ఆధ్యాత్మిక సత్యముల కనుబంధముగా, అనుష్ఠేయములను ఆచరణయోగ్యములును అగు కొన్ని ధర్మబోధక వాక్యములనుకూడ చేర్చుట బ్రాహ్మల కవసరమని ఆయన యనుకొనెను. కాని, ఈశ్వరావేశమువలన ఆధ్యాత్మిక సత్యములు హృదయమునం దప్రయత్నముగా, ఒకదానితరువాత నొకటి చొప్పున, వాటంతటవి స్ఫురించుటచే అనాయాసముగా రచింపబడిన ప్రథమ ఖండమువలె గాక, ఈ ద్వితీయ ఖండము యొక్క రచన ఆయనకు చాల శ్రమ యనిపించెను. మనుసంహిత, మహాభారతము, భగవద్గీత, మహానిర్వాణతంత్రము మొదలయిన హైందవ సనాతన ధర్మగ్రంథముల నెన్నిటినో విశేషముగా పరిశీలించి, వానియందలి బ్రాహ్మధర్మానుష్ఠాన

యోగ్యముల యిన వాక్యముల నేరి ౧౬ అధ్యాయములు గల యీ ఖండమును రచించెను.

మొదటి యధ్యాయమునందు కుటుంబములోని వివిధ వ్యక్తులయెడలను, ముఖ్యముగా తలిదండ్రుల యెడలను, గృహస్థు ఆచరింపవలసిన విధులు వ్యక్తీకరింపబడినవి. ౨ వ యధ్యాయమునందు గార్హస్త్య జీవనము విశేషముగా ప్రశంసింపబడి, దాని ఆదర్శ లక్షణములు వివరింపబడినవి. పురుషుడు గృహస్థాశ్రమమును స్వీకరించువరకు సంపూర్ణుడు కాడనియు, సగముగానే యుండుననియు చెప్పబడినది. భార్యాభర్తలు పరస్పరము నిర్వర్తింపవలసిన విధులు కొన్ని శ్లోకములలో చెప్పబడినవి. కాని, వానిలో చాలభాగము భార్యకు సంబంధించునవే అయి యున్నవి. భార్య భర్తను నీడవలె అనుసరించుచు, సదా భర్తయొక్క సుఖ సంతోషాదులకు తోడ్పడుచుండవలయునని ఉపదేశింపబడినది. భార్య విషయమయి భర్తకుకూడ ఇట్టియుపదేశమును చేయకపోవుటశోచనీయము. ఇందువలన, జీవితమునందు భార్య భర్తతో సమభాగినిగా నుండజాలదనుట స్పష్టమగుచున్నది. 3 వ యధ్యాయమునందు గృహస్థు కుటుంబమునందలి వివిధ వ్యక్తులయెడల, భార్య, కుమాళ్లు, కుమార్తెలు మొదలయిన వారియెడల, నిర్వర్తింపవలసిన విధులు చెప్పబడినవి. తండ్రి కుమారె

యెడల జరుపవలసిన ఆదర్శ ధర్మము వివరింపబడినది. కుమార్తె విశేషప్రేమతో పెంపబడి, కుమారులతో సమముగా విద్యాబుద్ధులు గరపబడి, సచ్చరిత్రుడును సద్వంశజుడును అగు వరున కిచ్చి వివాహము చేయబడవలయునని చెప్పబడినది. సందర్భాను సారముగా కన్యాశుల్కము విశేషముగా గర్హింప బడినది. ౪ వ యధ్యాయమునందు గృహస్థు జ్ఞానధర్మముల నార్జింపవలసిన యావశ్యకత నొక్కి చెప్పబడినది. వయోవృద్ధులు యువకులనుండి కూడ జ్ఞానధర్మములను గ్రహింప బ్రయత్నింపవలయును. మానవుని గౌరవము వార్ధక్యము, అరణ్యవాసము మొదలయిన బాహ్యచిహ్నములవలన లభ్యమగునది కాదు. విజ్ఞానధర్మములవలననే అతడు గౌరవార్హుడగును. ౫ వ యధ్యాయమునందు క్షమాశీలతయొక్కయు, సంతుష్టియొక్కయు సాధన అవశ్యం కర్తవ్యమని నిర్దేశింప బడినది. జీవితమునందు కష్టములు, దుఃఖములు అనివార్యములు. ఉన్నదానితో సంతుష్టియు, తప్పనిదానికి తల యొగ్గుటయునే వానికి ప్రతిక్రియలు, సౌఖ్యమునకు రహస్య ప్రక్రియలు. ౬ వ యధ్యాయమునందు ప్రత్యేకము ఏ ఒకే విషయము చెప్పబడియుండలేదు. సత్యము, త్రికరణశుద్ధి, ధర్మశీలత, సంయమము, పారిశుద్ధ్యము, ధైర్యము మొదలయిన గుణములు ప్రశంసింపబడినవి. సత్యమునకు మహో

—౨—

న్నతస్థాన మీయబడినది. ౭ వ యధ్యాయమునందు 'సాక్షి' యొక్క అర్థము నిర్వచింపబడి, న్యాయస్థానములయం దిచ్చు సత్యసాక్ష్యము మెచ్చుకొనబడినది. సత్యసాక్ష్యము నిచ్చు మానవునికంటె ఘనతరమగు పురుషుని దేవతలు సహితము ఎరుగరని ప్రస్తావింపబడినది. ౮ వ యధ్యాయమునందును ఏదో యొక ప్రత్యేకాంశమే చెప్పబడలేదు. సమస్త పరిస్థితుల యందును ధర్మ మనుసరణీయము, ధర్మ మెన్నడును విడనాడ రాదు. అన్యాయ వర్తనమునకు కోపోద్రేక మొక క్షంతవ్య కారణము కాజాలదు, చెడుగునకు బదులు మంచి చేయువాడే నిజముగా మంచివాడు. మంచిచేతనే చెడుగును జయింపవల యును. దుష్టులతో సాంగత్యము కూడదు, బుద్ధిమంతులతోన, సాధుపురుషులతోను సహవాసము చేయవలెను. కృతఘ్నత ఘోరపాపము. అను సంశములు వరుసగా పేర్కొనబడినవి. ౯ వ యధ్యాయమునందు దానశీలత, పరోపకారము మెచ్చు కొనబడినవి. దానముయొక్క ఉద్దేశము నిర్మలమయినదయి యుండవలెను. పాత్రాపాత్రతల నెరిగి దానము చేయవలెను, విచక్షణలేని దానము, అశ్రద్ధతో చేసిన దానము, రెండును సమానముగా నింద్యములే. ఆకలిగొన్నవారి కన్నము, దాహము గలవారికి దాహము, శ్రాంతులకు విశ్రాంతి స్థానము, రోగుల కౌషధము మొదలయిన దానములు

పేర్కొనబడినవి. విద్యాదానము సర్వశ్రేష్ఠమని ప్రశంసింప బడినది. సన్నిహితులకు సాహాయ్యము చేయక, పేరు ప్రతిష్ఠలకొరకు దూరస్థులకు చేయుదానము నిరసింపబడినది. దానము చేయుటచే అర్థార్జనము క్షమింపబడదు, అను నంశములు వివరింపబడినవి. ౧౦ వ యధ్యాయమునందు ఆత్మ సంయమము విశేషముగా ప్రశంసింపబడినది. ఆత్మసంయమమునకు జ్ఞానమే అమోఘసాధనము. అసూయ, క్రోధము, అత్యాశ మొదలయినవే మనస్సంయమమునకు ముఖ్యప్రతిబంధకములు. ఇవి సమూలముగా తొలగింపబడవలెను, అను నంశము లుదాహరింపబడినవి. ౧౧ వ యధ్యాయమునందు సత్యధర్మ లక్షణములగు ఓర్పు, క్షమ, ఇంద్రియనిగ్రహము, పారిశుద్ధ్యము, జ్ఞానము మొదలయిన సుగుణములు పేర్కొనబడినవి. సంఘక్షేమమునకయి నేరస్థులకు యుక్తదండన మావశ్యకము. అధర్మ దండన మపకీర్తికరము. నేరస్థులను మంచిమార్గమునకు తెచ్చుటలో క్షమ యొక మంచి సాధనము, అని కూడ చెప్పబడినది. ౧౨ వ యధ్యాయమునందు కూడ ఓర్పు, క్షమ, ధర్మము, వినయము మొదలయినవి ప్రశంసింపబడినవి. ధర్మానుష్ఠానము విషయమయి సందేహము కలిగినప్పుడు అంతరాత్మప్రబోధమే కర్తవ్యమనియు, కర్త యొక్క ఉద్దేశమే ముఖ్యముకాని, జయాపజయములు

కొవనియు చెప్పబడినది. ౧౩ వ యధ్యాయమునందు ఇంద్రియసంయమము అత్యంతావశ్యకమని చెప్పబడినది. ఇంద్రియసంయమము లేనివాడు అశ్వమును వశమునందుంచు కొనలేని సారథివలెను, తుపానులో చిక్కుకొన్న ఓడవలెను వినాశమునొందునని చెప్పబడినది. ఒక్క చిన్నరంధ్రము ఒక పెద్ద పాత్రయందలి నీటినంతను ఎట్లు కార్చివేయునో, అట్లే, ఒక్క యింద్రియము అవశమైనను సర్వనాశము సంభవించుననియు, కనుక, మానవుడు సమస్త ఇంద్రియములను, మనస్సును సంపూర్ణముగా వశపరచుకొనవలయుననియు కూడ చెప్పబడినది. ౧౪ వ యధ్యాయమునందు పాపమునుండి మరలి పుణ్యకార్యములే చేయవలయుననియు, పుణ్యకార్యములు చేయువాడు ఇహమునందును పరమునందును కూడ సౌఖ్యము నొందుననియు, ధర్మమొక్కటే శరీరముతో పాటు వినాశమునొందక, మరణానంతరముకూడ వెంటవచ్చు స్నేహితుడనియు చెప్పబడినది.

౧౫వ యధ్యాయమునందు ధర్మజీవనము విషయమయి విస్తరించి చెప్పబడినది. పాపము కేవలము కర్మేంద్రియములచేత మాత్రమేగాక, వాక్కుచేతను, మనస్సుచేతను కూడ చేయబడుననియు, మానవులు తమ తమ కర్మాను సార

ముగా ఉత్తమాధమ మధ్యమ గతుల నొందుచుందురనియు చెప్పబడినది.

౧౬వ యధ్యాయమునందు ధర్మజీవనము మరియొకసారి విశేషముగా ప్రశంసింపబడినది. ఒకొ్కకప్పుడు అధర్మ ప్రవర్తనము ఐశ్వర్యమునకు తోడ్పడినను, అట్టి ఐశ్వర్యము క్షణభంగురము కావునను, అధర్మ మెన్నటికయిన వినాశము నొందించును గనుకను, ధర్మము నెన్నడు పరిత్యజింపగూడదు. మెల్లమెల్లగా, నిలకడగా, ధర్మము నార్జింపవలయును. ఎన్నడును విడువని ఆత్మబంధువు ధర్మమొక్కటే. తల్లిదండ్రులు, స్నేహితులు, ఇతర బంధువులు, వీరెవరును ప్రాణప్రయాణ సమయమున తోడ్పడ జాలరు ధర్మమొక్కటే వెంటనంటి వచ్చును. కనుక, స్వసహాయార్థము విశేష శ్రమచేసి ధర్మ మార్జింపవలయును. ఈ ప్రసిద్ధ గ్రంథములోని విషయము లిట్లు సంగ్రహముగా తెలుపబడినవి.

---

# అధ్యాయ సూచిక

## ప్రథమ ఖండము


| అధ్యాయము | పుటలు | శ్లోకములు లేక వాక్యములు |
|---|---|---|
| ౧ | ౧-౧౮ | ౯ |
| ౨ | ౧౯-౨౬ | ౪ |
| ౩ | ౨౭-౫౦ | ౧౩ |
| ౪ | ౫౧-౬౭ | ౮ |
| ౫ | ౬౮-౭౯ | ౫ |
| ౬ | ౮౦-౯౬ | ౮ |
| ౭ | ౯౭-౧౨౦ | ౧౬ |
| ౮ | ౧౨౧-౧౩౪ | ౯ |
| ౯ | ౧౩౫-౧౬౦ | ౧౭ |
| ౧౦ | ౧౬౧-౧౭౦ | ౬ |
| ౧౧ | ౧౭౧-౧౭౮ | ౫ |
| ౧౨ | ౧౭౯-౧౯౬ | ౯ |
| ౧౩ | ౧౯౭-౨౦౭ | ౭ |
| ౧౪ | ౨౦౮-౨౩౩ | ౧౩ |
| ౧౫ | ౨౩౪-౨౪౭ | ౧౦ |
| ౧౬ | ౨౪౮-౨౭౫ | ౧౮ |

# అధ్యాయ సూచిక

## ద్వితీయ ఖండము


| అధ్యాయము | పుటలు | శ్లోకములు లేక వాక్యములు |
|---|---|---|
| ౧ | ౧-౧౬ | ౮ |
| ౨ | ౧౭-౪౦ | ౧౪ |
| ౩ | ౪౧-౪౮ | ౫ |
| ౪ | ౪౯-౭౩ | ౧౪ |
| ౫ | ౭౪-౮౬ | ౭ |
| ౬ | ౮౭-౧౦౪ | ౧౦ |
| ౭ | ౧౦౫-౧౧౧ | ౪ |
| ౮ | ౧౧౨-౧౨౬ | ౮ |
| ౯ | ౧౨౭-౧౪౩ | ౧౦ |
| ౧౦ | ౧౪౪-౧౫౭ | ౭ |
| ౧౧ | ౧౫౮-౧౭౦ | ౮ |
| ౧౨ | ౧౭౧-౧౭౯ | ౫ |
| ౧౩ | ౧౮౦-౧౯౨ | ౭ |
| ౧౪ | ౧౯౩-౨౧౬ | ౧౪ |
| ౧౫ | ౨౧౭-౨౨౯ | ౮ |
| ౧౬ | ౨౩౦-౨౪౬ | ౯ |

# శ్లోకానుక్రమణిక

## ప్రథమ ఖండము




| శ్లోకారంభములు లేక వాక్యారంభములు | అధ్యాయము | శ్లోకము | పుట. |
|---|---|---|---|
| అణోరణీయాన్ | ౭ | ౬ | ౧౨౪ |
| అదృష్ట మవ్యవహార్య | ౯ | ౫ | ౧౮౧ |
| అదృష్టో ద్రష్టా | ౧౩ | ౮ | ౨౦౧ |
| అనన్దా నామ తే లోకాః | ౧౫ | ౧౦ | ౨౮౬ |
| అనేజదేకం | ౫ | ౨ | ౪౧ |
| అపరా ఋగ్వేదో | ౩ | ౨ | ౨౯ |
| అపాణిపాదో | ౭ | ౮ | ౧౨౫ |
| అశబ్దమస్పర్శ | ౧౧ | ౧ | ౧౪౧ |
| అస్మిన్ ద్యౌః పృథివీ | ౪ | ౧౧ | ౧౧౨ |
| ఆకాశో వై నామ | ౧౮ | ౧౧ | ౨౨౭ |
| ఆత్మానమేవ ప్రియముపాసీత | ౯ | ౭ | ౧౮౪ |
| ఆత్మా వా అరే ద్రష్టవ్యో | ౯ | ౯ | ౧౮౭ |
| ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే | ౧ | ౩ | ౫ |
| ఇదంవా అగ్రే | ౨ | ౧ | ౧౯ |
| ఇహచేద వేదీ | ౮ | ౭ | ౬౮ |
| ఇహైవ సన్తోఽథ | ౯ | ౧౩ | ౧౫౩ |

| శ్లోకారంభములు లేక వాక్యారంభములు. | అధ్యాయము. | శ్లోకము | పుట. |
|---|---|---|---|
| ఈశా వాస్య మిదం సర్వం | ౫ | ౧ | ౬౭ |
| ఉత్క్రాంత ఉపనిషత్ | ౧౬ | ౧౭ | ౨౮౨ |
| ఉత్తిష్ఠత జాగ్రత | ౧౧ | ౪ | ౧౮౫ |
| ఋతం పిబన్తౌ సుకృతస్య లోకే | ౧౩ | ౮ | ౨౦౫ |
| ఏకధైవానుద్రష్టవ్య | ౮ | ౮ | ౧౦౮ |
| ఏకో దేవః సర్వభూతేషు గూఢః | ౧౨ | ౩ | ౧౭౨ |
| ఏకో వశీ సర్వభూతాన్తరాత్మా | ౭ | ౮ | ౧౨౯ |
| ఏతద్వై తదక్షరం గార్గి | ౩ | ౪ | ౩౩ |
| ఏతత్ జ్ఞేయం నిత్యమేవాత్మ సంస్థం | ౧౬ | ౧౪ | ౨౬౪ |
| ఏతస్మా జ్జాయతే | ౨ | ౩ | ౨౩ |
| ఏతస్య వా...ద్యావాపృథివ్యౌ విధృతే తిష్ఠతః | ౩ | ౬ | ౩౭ |
| ఏతస్య వా...నిమేషా...సంవత్సరా ఇతి విధృతాస్తిష్ఠన్తి | ౩ | ౮ | ౩౯ |
| ఏతస్య వా...ప్రతీచ్యోऽన్యాః [తిష్ఠతః | ౩ | ౭ | ౪౦ |
| ఏతస్య వా.. సూర్యాచంద్రమసౌవిధృతౌ | ౩ | ౫ | ౩౮ |
| ఏతై రుపాయై ర్యతతే యస్తు విద్వాన్ | ౧౬ | ౧౧ | ౨౬౦ |
| ఏష దేవో విశ్వకర్మా | ౩ | ౪ | ౧౦౨ |
| ఏష సర్వేశ్వర | ౮ | ౧౦ | ౧౧౧ |
| ఏష సర్వేషు భూతేషు | ౧౧ | ౨ | ౧౮౨ |
| ఏషాస్య పరమా గతి | ౧ | ౯ | ౧౬ |
| ఓమ్ బ్రహ్మవాదినో వదన్తి | ౧ | ౧ | ౧ |
| ఓమితి బ్రహ్మ | ౧౦ | ౧ | ౧౬౧ |

| శ్లోకారంభములు లేక వాక్యారంభములు. | అధ్యాయము. | శ్లోకము | పుట |
|---|---|---|---|
| ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానం | ౧౦ | ౨ | ౧౬౩ |
| ఆత్మా వా అరే ద్రష్టవ్యః | ౧ | ౬ | ౧౧ |
| తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం | ౪ | ౫ | ౧౦౮ |
| తం వేద్యం పురుషం వేద | ౧౦ | ౫ | ౧౬౪ |
| తతో యదుత్తరతరం | ౯ | ౧౮ | ౧౫౫ |
| తతః పరం బ్రహ్మపరం | ౯ | ౧౫ | ౧౫౬ |
| తత్సవితుర్వరేణ్యం | ౧౦ | ౩ | ౧౬౮ |
| తదేజతి తన్నైజతి | ౫ | ౩ | ౪౩ |
| తదేతత్ ప్రేయః పుత్రాత్ | ౯ | ౬ | ౧౮౮ |
| తదేతద్ బ్రహ్మాపూర్వం | ౧౧ | ౫ | ౧౪౪ |
| తద్వా ఏతదక్షరం గార్గి | ౩ | ౧౧ | ౮౫ |
| తద్విజ్ఞానార్థం | ౩ | ౧ | ౨౪ |
| తద్విష్ణోః పరమం పదం | ౧౫ | ౯ | ౨౮౮ |
| తద్యథా రథనాభౌ చ | ౯ | ౧౧ | ౧౫౦ |
| తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ | ౬ | ౧ | ౭౦ |
| త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్ | ౪ | ౧ | ౯౪ |
| తస్య హ వా ఏతస్య బ్రహ్మణో నామ | ౧౮ | ౭ | ౨౨౧ |
| త్రిరున్నతం స్థాప్య | ౪ | ౧౬ | ౧౧౯ |
| దివ్యోహ్యమూర్తః పురుషః | ౧౩ | ౨ | ౧౯౯ |
| ద్వా సుపర్ణా | ౯ | ౧ | ౧౩౫ |
| ధర్మం చర | ౧౬ | ౬ | ౨౫౫ |
| న చక్షుషా గృహ్యతే | ౬ | ౭ | ౯౮ |

| శ్లోకారంభములు లేక వాక్యారంభములు | అధ్యాయము. | శ్లోకము. | పుట. |
|---|---|---|---|
| న జాయతే మ్రియతే వా | ౮ | ౧౨ | ౧౧౩ |
| న తత్ర చక్షుర్గచ్ఛతి | ౪ | ౨ | ౫౩ |
| న తత్ర సూర్యో భాతి | ౬ | ౫ | ౭౮ |
| న తస్య కశ్చిత్ పతి రస్తి లోకే | ౮ | ౩ | ౧౦౧ |
| న తస్య కార్యం కరణం చ విద్యతే | ౮ | ౨ | ౯౯ |
| న సందృశే తిష్ఠతి రూప మస్య | ౧౨ | ౬ | ౧౭౮ |
| నాయమాత్మా ప్రవచనేన లభ్యో | ౧౧ | ౩ | ౧౮౩ |
| నా విరతో దుశ్చరితాత్ | ౧౫ | ౧ | ౨౩౪ |
| నాహం మన్యే | ౪ | ౬ | ౬౦ |
| నిత్యో ఽనిత్యానాం | ౭ | ౭ | ౧౩౧ |
| నైన మూర్ధ్వం న తిర్యఞ్చం | ౧౨ | ౫ | ౧౭౬ |
| నైనం పాప్మా తరతి | ౧౬ | ౨ | ౨౫౦ |
| నైవ వాచా న మనసా | ౧౪ | ౧౨ | ౨౨౯ |
| పరమేవాక్షరం ప్రతిపద్యతే | ౯ | ౪ | ౧౪౦ |
| పరాచః కామా ననుయన్తి బాలాః | ౧౨ | ౭ | ౧౯౧ |
| ప్రణవో ధనుః | ౮ | ౧౪ | ౧౧౬ |
| ప్రాణస్య ప్రాణముత | ౮ | ౬ | ౧౦౬ |
| ప్రాణో హ్యేష యః | ౬ | ౬ | ౭౯ |
| బృహచ్చ తద్దివ్య మచింత్య రూపం | ౬ | ౮ | ౯౨ |
| భయాదస్యాగ్ని స్తపతి | ౨ | ౪ | ౨౫ |
| భీషాస్మాద్వాతః పవతే | ౩ | ౧౨ | ౪౮ |
| మహాన్ ప్రభుర్వై పురుషః | ౯ | ౧౮ | ౧౫౯ |

| శ్లోకారంభములు లేక వాక్యారంభములు. | అధ్యాయము. | శ్లోకము | పుట. |
|---|---|---|---|
| మాతృదేవో భవ | ౧౯ | ౭ | ౨౫౮ |
| మామహం బ్రహ్మ నిరాకుర్యాం | ౧౦ | ౪ | ౧౯౯ |
| య ఆత్మాఽపహత పాప్మా | ౧౪ | ౧౦ | ౨౨౯ |
| య ఏకోఽవర్ణో | ౧౪ | ౪ | ౨౧౩ |
| య ఏష సుప్తేషు | ౭ | ౫ | ౧౨౯ |
| యః సర్వజ్ఞః సర్వవిత్ | ౯ | ౩ | ౭౪ |
| యతో వా ఇమాని భూతాని జాయన్తే | ౧ | ౨ | ౩ |
| యతో వాచో నివర్తన్తే...కదాచన | ౧ | ౭ | ౧౫ |
| యతో వాచో నివర్తన్తే ..కుతశ్చన | ౧ | ౪ | ౮ |
| యత్త దద్రేశ్య | ౩ | ౩ | ౩౧ |
| యదర్చిమత్ | ౮ | ౧౩ | ౧౧౪ |
| యదా పశ్యః పశ్యతే | ౬ | ౩ | ౧౩౭ |
| యదా సర్వే ప్రభిద్యన్తే | ౭ | ౬ | ౧౩౨ |
| యదా హ్యేవైష | ౧ | ౮ | ౧౩ |
| యదిదం కిఞ్చ జగత్సర్వం | ౩ | ౧౩ | ౪౭ |
| యది మన్యసే | ౪ | ౫ | ౫౭ |
| యద్వైత మనుపశ్య త్యాత్మానం | ౧౪ | ౧౩ | ౨౩౨ |
| యద్వాచా నభ్యుదితం | ౪ | ౩ | ౫౫ |
| యథాకారీ యథాచారీ | ౧౫ | ౩ | ౨౩౮ |
| యథా సౌమ్య వయాంసి | ౧౨ | ౨ | ౧౭౧ |
| యన్మనసా న మనుతే | ౪ | ౪ | ౫౮ |
| యశ్చాయమస్మి న్నాకాశే | ౧౯ | ౧౮ | ౨౯౭ |

| శ్లోకారంభములు లేక వాక్యారంభములు | అధ్యాయము. | శ్లోకము | పుట. |
|---|---|---|---|
| యస్తు సర్వాణి భూతాని | ౫ | ౪ | ౭౪ |
| యస్తువిజ్ఞానవాన్ భవతి సమనస్కః సదా శుచిః | ౧౫ | ౭ | ౨౪౨ |
| యస్తు విజ్ఞానవాన్ భవతి యుక్తేన మనసా సదా | ౧౫ | ౫ | ౨౪౦ |
| యస్త్వవిజ్ఞానవాన్ భవత్యయుక్తేన మనసాసదా | ౧౫ | ౪ | ౨౩౯ |
| యస్మాదర్వాక్ సంవత్సరోఽహోభిః పరివర్తతే | ౭ | ౮ | ౧౦౮ |
| యస్త్వవిజ్ఞానవాన్ భవత్యమనస్కః సదాఽశుచిః | ౧౫ | ౬ | ౨౪౧ |
| యస్యామతం తస్య మతం | ౪ | ౭ | ౬౨ |
| యాన్యనవద్యాని కర్మాణి | ౧౬ | ౯ | ౨౫౮ |
| యాన్యస్మాకం సుచరితాని | ౧౬ | ౧౦ | ౨౫౯ |
| యుజే వాం బ్రహ్మ పూర్వ్యం నమోభిః | ౯ | ౧౨ | ౧౫౨ |
| యేనాహం నామృతా స్యాం | ౧౨ | ౯ | ౧౯౩ |
| యో దేవానామధిపో | ౧౩ | ౩ | ౨౦౦ |
| యో దేవోఽగ్నౌ | ౧౦ | ౬ | ౧౬౮ |
| యోవా ఏతదక్షరం గార్గి ..స బ్రాహ్మణః | ౩ | ౧౦ | ౪౩ |
| యోవా ఏతదక్షరం గార్గి...తద్భవతి | ౩ | ౯ | ౪౨ |
| యోవై భూమా తత్ సుఖం | ౧౪ | ౧ | ౨౦౮ |
| రసో వై సః | ౧ | ౫ | ౧౦ |
| విజ్ఞాన సారథి ర్యస్తు | ౧౫ | ౮ | ౨౪౩ |
| విజ్ఞానాత్మా సహ దేవైశ్చ సర్వైః | ౧౬ | ౧౬ | ౨౬౭ |
| విశ్వతః చక్షు రుత | ౮ | ౧ | ౧౨౧ |

| శ్లోకారంభములు లేక వాక్యారంభములు. | అధ్యాయము. | శ్లోకము. | పుట. |
|---|---|---|---|
| వేదాహ మేతం పురుషం మహాన్తం | ౧౬ | ౧౩ | ౨౬౨ |
| వృక్ష ఇవ స్తబ్ధో | ౧౨ | ౧ | ౧౪౯ |
| శాన్తో దాన్త ఉపరత స్తితిక్షుః | ౧౬ | ౧ | ౨౭౮ |
| శృణ్వన్తు విశ్వే అమృతస్య పుత్రాః | ౧౬ | ౧౨ | ౨౬౧ |
| శ్రద్ధయా దేయం | ౧౬ | ౪ | ౨౫౬ |
| శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః | ౧౨ | ౪ | ౧౮౯ |
| శ్రేయశ్చ ప్రేయశ్చ | ౧౫ | ౨ | ౨౩౫ |
| శ్రోత్రస్య శ్రోత్రం | ౭ | ౧ | ౫౧ |
| స ఏవాధస్తాత్ | ౧౭ | ౩ | ౨౧౧ |
| స ఏష నేతి నేత్యాత్మా | ౧౩ | ౫ | ౨౦౩ |
| స ఏష సర్వస్యేశానః | ౧౩ | ౬ | ౨౦౭ |
| స తన్మయో హ్యమృత ఈశసంస్థో | ౧౭ | ౪ | ౨౧౯ |
| స తపోఽతప్యత | ౨ | ౨ | ౨౨ |
| సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ | ౬ | ౨ | ౮౧ |
| సత్యం వద | ౧౬ | ౫ | ౨౫౭ |
| సత్యమేవ జయతే | ౧౩ | ౧ | ౧౯౪ |
| సత్యా న్నప్రమదితవ్యం | ౧౬ | ౭ | ౨౫౨ |
| స పర్యగా చ్ఛుక్ర | ౫ | ౫ | ౪౬ |
| సంప్రాప్యైనం ఋషయో జ్ఞానతృప్తాః | ౧౬ | ౧౫ | ౨౬౫ |
| స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి | ౧౭ | ౨ | ౨౦౯ |
| సమానే వృక్షే | ౯ | ౨ | ౧౩౪ |
| సమే శుచౌ | ౪ | ౧౫ | ౧౧౪ |

| శ్లోకారంభములు లేక వాక్యారంభములు. | అధ్యాయము | శ్లోకము. | పుట. |
|---|---|---|---|
| స మోదతే మోదనీయం హి లబ్ధ్వా | ౧౬ | ౩ | ౨౫౧ |
| సయోఽన్య మాత్మనః ప్రియం | ౯ | ౭ | ౧౪౫ |
| సర్వతః పాణి పాదం తత్ | ౮ | ౨ | ౧౨౩ |
| సర్వస్య వశీ సర్వస్యేశానః | ౭ | ౯ | ౧౦౯ |
| సర్వా దిశ ఊర్ధ్వ మధశ్చ తిర్యక్ | ౧౨ | ౪ | ౧౮౪ |
| సర్వానన శిరో గ్రీవః | ౮ | ౩ | ౧౨౩ |
| సర్వేంద్రియ గుణాభాసం | ౯ | ౧౬ | ౧౫౭ |
| స వా అయ మాత్మా | ౯ | ౧౦ | ౧౫౦ |
| స విశ్వకృ ద్విశ్వ విత్ | ౧౪ | ౬ | ౨౧౭ |
| స వృక్ష కాలాకృతిభిః పరోఽన్యో | ౧౪ | ౫ | ౨౧౪ |
| స సేతు ర్విధృతిః | ౧౪ | ౯ | ౨౨౪ |
| హిరణ్మయే పరే కోశే | ౬ | ౪ | ౮౬ |

# శ్లోకానుక్రమణిక

## ద్వితీయ ఖండము




| శ్లోకారంభములు | అధ్యాయము | శ్లోకము | పుట |
|---|---|---|---|
| అక్రోధేన జయేత్ క్రోధం | ౮ | ౨ | ౧౧౪ |
| అజ్ఞాత పతిమర్యాదాం | ౩ | ౪ | ౪౫ |
| అతివాదాం స్తితిక్షేత | ౧ | ౮ | ౧౪ |
| అదత్తానా ముపాదానం | ౧౫ | ౬ | ౨౨౪ |
| అద్భిర్గాత్రాణి శుధ్యన్తి | ౬ | ౯ | ౭౮ |
| అధర్మాదండనం లోకే | ౧౧ | ౫ | ౧౬౫ |
| అధర్మే ణైధతే తావత్ | ౧౬ | ౩ | ౨౩౩ |
| అధార్మికో నరో యోహి | ౧౬ | ౧ | ౨౩౦ |
| అనర్థ మర్థతః పశ్యన్ | ౧౦ | ౯ | ౧౫౫ |
| అనసూయః కృతజ్ఞశ్చ | ౧౧ | ౩ | ౧౬౧ |
| అన్యాన్ పరివదన్ సాధుః | ౧౨ | ౧ | ౧౯౧ |
| అన్యాయాత్ సముపాత్తేన | ౭ | ౪ | ౧౩౨ |
| అన్నదః సుఖ మాప్నోతి | ౭ | ౮ | ౧౩౮ |
| అన్యోన్యస్యా వ్యభిచారో | ౨ | ౪ | ౨౨ |
| అరక్షితా గృహే రుద్ధాః | ౨ | ౧౩ | ౩౮ |
| అవిజ్ఞాయ ఫలం లోకే | ౧౩ | ౬ | ౧౮౮ |
| అవిసంవాదకో దక్షః | ౮ | ౯ | ౧౨౩ |

| శ్లోకారంభములు | అధ్యాయము. | శ్లోకము | పుట. |
|---|---|---|---|
| అసంతోషపరా మూఢాః | ౫ | ౨ | ౬౫ |
| ఇంద్రియాణాం తు సర్వేషాం | ౧౩ | ౪ | ౧౮౫ |
| ఇంద్రియాణాం విచరతాం | ౧౩ | ౧ | ౧౮౦ |
| ఇంద్రియాణాం హి చరతాం | ౧౩ | ౨ | ౧౮౨ |
| ఏక ఏవ సుహృద్ధర్మో | ౧౪ | ౧౦ | ౨౦౮ |
| ఏకో ధర్మః పరం శ్రేయః | ౧౫ | ౨ | ౨౧౮ |
| ఏకో౽హ మస్మీ త్యాత్మానం | ౬ | ౪ | ౧౧౦ |
| ఏకః ప్రజాయతే జన్తుః | ౧౭ | ౭ | ౨౩౮ |
| ఏష ఆదేశ ఏష ఉపదేశ | ౧౭ | ౯ | ౨౪౩ |
| ఓమాచార్యో౽స్తే వాసిన మనుశాస్తి | ౧ | ౧ | ౧ |
| ఔషధం పథ్య మాహారం | ౯ | ౯ | ౧౪౦ |
| కస్యాప్యేవం పాలనీయా | ౩ | ౨ | ౪౨ |
| కుతః కృతఘ్నస్య యశః | ౮ | ౮ | ౧౨౫ |
| కుశలః సుఖదుఃఖేషు | ౮ | ౩ | ౧౧౭ |
| కృత్వా పాపం హి సంతప్య | ౧౫ | ౮ | ౨౨౬ |
| క్రోధః సుదుర్జయః శత్రుః | ౧౦ | ౩ | ౧౪౮ |
| క్షమా వశీకృతి ర్లోకే | ౧౧ | ౭ | ౧౭౭ |
| గురూణాం చైవ సర్వేషాం | ౧ | ౫ | ౯ |
| గృహస్థః పాలయేత్ దారాన్ | ౩ | ౧ | ౪౧ |
| ఛాయేవానుగతా స్వచ్ఛా | ౨ | ౮ | ౨౯ |
| తథా నిత్యం యతేయాతాం | ౨ | ౫ | ౨౪ |
| తస్మాత్పాపం న కుర్వీత | ౧౪ | ౧౪ | ౨౧౫ |
| తస్మాద్ధర్మం సహాయార్థం | ౧౭ | ౮ | ౨౪౧ |

| శ్లోకారంభములు | అధ్యాయము. | శ్లోకము. | పుటం. |
|---|---|---|---|
| త్రిదండ మేత న్నిక్షిప్య | ౧౫ | ౮ | ౨౨౫ |
| దానా న్న పుష్కరం తాత | ౯ | ౩ | ౧౩౦ |
| దాన్తః శమపరః శశ్వత్ | ౧౦ | ౪ | ౧౫౦ |
| దేయ మార్గస్య శయనం | ౯ | ౮ | ౧౩౮ |
| ధర్మ ఏవ హతో హన్తి | ౧౪ | ౯ | ౨౦౬ |
| ధర్మకార్యం యతన్ శక్త్యా | ౧౨ | ౫ | ౧౮౭ |
| ధర్మనిత్యః ప్రశాన్తాత్మా | ౪ | ౯ | ౬౨ |
| ధర్మం శనైః సంచినుయాత్ | ౧౬ | ౪ | ౨౩౫ |
| ధర్మార్థౌ యః పరిత్యజ్య | ౪ | ౧౦ | ౬౪ |
| ధృతిః క్షమా దమోఽస్తేయం | ౧౧ | ౧ | ౧౫౭ |
| న కన్యాయాః పితా విద్వాన్ | ౩ | ౫ | ౪౮ |
| న కేనచిద్వివదేచ్చ | ౨ | ౯ | ౩౧ |
| న జాతు కామః కామానామ్ | ౧౩ | ౩ | ౧౭౩ |
| న తథైతాని శక్యన్తే | ౧౩ | ౫ | ౧౭౮ |
| న తేన వృద్ధో భవతి | ౪ | ౧ | ౪౯ |
| న ధర్మోఽస్తీతి మన్వానాః | ౧౪ | ౧౧ | ౨౧౦ |
| న నిత్యం లభతే దుఃఖం | ౫ | ౪ | ౮౯ |
| న బిభేతి రణాద్యో వై | ౬ | ౫ | ౯౪ |
| న సీదన్నపి ధర్మేణ | ౧౬ | ౨ | ౨౩౧ |
| నాత్మానమవమన్యేత | ౪ | ౩ | ౫౩ |
| నాభినందేత మరణం | ౪ | ౧౪ | ౮౧ |
| నాముత్ర హి సహాయార్థం | ౧౬ | ౫ | ౨౩౬ |
| నాస్తి సత్యసమో ధర్మః | ౬ | ౯ | ౧౦౧ |

| శ్లోకారంభములు | అధ్యాయము | శ్లోకము | పుట |
|---|---|---|---|
| నిషేవతే ప్రశస్తాని | ౧౫ | ౧ | ౨౧౭ |
| నోచ్ఛింద్యా దాత్మనో మూలం | ౪ | ౫ | ౫౬ |
| న్యాయోపార్జిత విత్తేన | ౯ | ౫ | ౧౩౪ |
| పతిప్రియ హితే యుక్తా | ౨ | ౧౦ | ౩౩ |
| పరద్రవ్యే ష్వభిధ్యానం | ౧౫ | ౪ | ౨౨౧ |
| పాత్రస్య హి విశేషేణ | ౯ | ౨ | ౧౨౯ |
| పాపం కుర్వన్ పాపకీర్తిః | ౧౪ | ౧౩ | ౨౧౨ |
| పాపం చింతయతే చైవ | ౧౪ | ౩ | ౧౯౬ |
| పారుష్య మనృతం చైవ | ౧౫ | ౫ | ౨౨౩ |
| పుణ్యం కుర్వన్ పుణ్యకీర్తిః | ౧౪ | ౨ | ౧౯౪ |
| పూర్వం వయసి తత్ కుర్యాత్ | ౪ | ౧౩ | ౬౯ |
| ప్రజనార్థం మహాభాగాః | ౨ | ౨ | ౧౮ |
| ప్రజ్ఞయా మానసం దుఃఖం | ౧౦ | ౧ | ౧౪౪ |
| ప్రజ్ఞాచక్షు ర్నర ఇవా | ౧౪ | ౭ | ౨౦౩ |
| ప్రాజ్ఞో ధర్మేణ రమతే | ౧౪ | ౫ | ౧౯౯ |
| ప్రాప్య చా ప్యుత్తమం జన్మ | ౪ | ౧౨ | ౬౭ |
| ప్రియే నాతిభృశం హృష్యేత్ | ౫ | ౬ | ౮౨ |
| ప్రియో భవతి దానేన | ౬ | ౧౦ | ౧౦౩ |
| బ్రహవో౽వినయా న్నష్టాః | ౧౨ | ౩ | ౧౭౪ |
| బంధురాత్మాత్మన స్తస్య | ౪ | ౧౧ | ౬౫ |
| బ్రహ్మనిష్ఠో గృహస్థః స్యాత్ | ౧ | ౨ | ౩ |
| భ్రాతా జ్యేష్ఠః సమః పిత్రా | ౧ | ౭ | ౧౨ |
| భ్రాతు ర్జ్యేష్ఠస్య భార్యా యా | ౨ | ౧౪ | ౩౯ |

| శ్లోకారంభములు. | అధ్యాయము | శ్లోకము. | పుట |
|---|---|---|---|
| మాతరం పితరం చైవ | ౧ | ౩ | ౬ |
| మాతృవత్ పరదారాంశ్చ | ౧౧ | ౮ | ౧౬౯ |
| మానం హిత్వా ప్రియో భవతి | ౧౦ | ౨ | ౧౪౬ |
| మిత్రధ్రుక్ దుష్టభావశ్చ | ౧౦ | ౬ | ౧౫౩ |
| మృతం శరీర ముత్సృజ్య | ౧౬ | ౭ | ౨౪౦ |
| మోహజాలస్య యోనిర్హి | ౮ | ౪ | ౧౧౮ |
| మౌనాన్న స మునిర్భవతి | ౪ | ౨ | ౫౧ |
| య ఈర్షుః పరవిత్తేషు | ౧౦ | ౫ | ౧౫౧ |
| యం మాతాపితరౌ, క్లేశం | ౧ | ౬ | ౧౧ |
| యత్ కర్మ కుర్వతోఽస్య స్యాత్ | ౧౨ | ౪ | ౧౭౬ |
| యత్ కల్యాణ మభిధ్యాయేత్ | ౮ | ౧ | ౧౧౨ |
| యదా న కురుతే పాపం | ౧౪ | ౧ | ౧౯౩ |
| యథా శ్రుతం యథా దృష్టం | ౭ | ౨ | ౧౦౭ |
| యథైవాత్మా పరస్తద్వత్ | ౧౧ | ౭ | ౧౬౭ |
| యస్తు నిశ్శ్రేయసం వాక్యం | ౮ | ౫ | ౧౨౦ |
| యస్య వాఙ్మనసీ స్యాతాం | ౪ | ౮ | ౬౧ |
| యస్య విద్వాన్ హి వదతః | ౭ | ౩ | ౧౦౮ |
| యస్యాత్మా విరతః పాపాత్ | ౧౪ | ౬ | ౨౦౧ |
| యాదృగ్గుణేన భర్త్రా స్త్రీ | ౩ | ౩ | ౪౪ |
| యావన్న విందతే జాయాం | ౨ | ౧ | ౧౭ |
| యుక్తైవ ధర్మశీలః స్యాత్ | ౪ | ౬ | ౫౮ |
| యే పాపాని న కుర్వన్తి | ౧౪ | ౪ | ౧౯౮ |
| యోఽన్యథా సన్త మాత్మానం | ౬ | ౮ | ౧౦౦ |

| శ్లోకారంభములు. | అధ్యాయము | శ్లోకము | పుట. |
|---|---|---|---|
| వశీకృత్యేంద్రియగ్రామం | ౧౩ | ౭ | ౧౯౦ |
| వార్యమాణోఽపి పాపేభ్యః | ౧౪ | ౮ | ౨౦౪ |
| విపత్స్వవ్యథో దక్షో | ౧౨ | ౨ | ౧౭౩ |
| విరక్తః పరదారేషు | ౬ | ౪ | ౯౩ |
| శక్తః పరజనే దాతా | ౯ | ౧౦ | ౧౪౧ |
| శక్త్యాన్నదానం సతతం | ౯ | ౬ | ౧౩౫ |
| శుభాశుభఫలం కర్మ | ౧౫ | ౩ | ౨౧౯ |
| శ్రావయే న్మృదులాం వాణీం | ౧ | ౪ | ౭ |
| సతాం మత మతిక్రమ్య | ౮ | ౬ | ౧౨౧ |
| సత్యమేవ వ్రతం యస్య | ౬ | ౩ | ౯౧ |
| సత్యం బ్రూయాత్, ప్రియం బ్రూయాత్ | ౬ | ౬ | ౯౬ |
| సత్యం మృదు ప్రియం వాక్యం | ౬ | ౨ | ౮౯ |
| సమక్షదర్శనాత్ సాక్ష్యం | ౭ | ౧ | ౧౦౫ |
| సర్వావయవ సంపూర్ణాం | ౨ | ౩ | ౨౦ |
| సర్వో దండజితో లోకో | ౧౧ | ౪ | ౧౬౩ |
| సర్వం పరవశం దుఃఖం | ౪ | ౪ | ౫౫ |
| సా భార్యా యా పతిప్రాణా | ౨ | ౭ | ౨౮ |
| సుఖదుఃఖం హి పురుషః | ౫ | ౩ | ౭౭ |
| సుఖం వా యది వా దుఃఖం | ౫ | ౫ | ౮౧ |
| సుఖం హ్యావమతః శేతే | ౧౪ | ౧౨ | ౨౧౧ |
| సువృత్తః శీలసంపన్నః | ౪ | ౭ | ౬౦ |
| సూక్ష్మేభ్యోఽపి ప్రసంగేభ్యః | ౨ | ౧౨ | ౩౬ |
| ఘంతాపాత్ భృశ్యతే రూపం | ౫ | ౭ | ౮౫ |

| శ్లోకారంభములు | అధ్యాయము. | శ్లోకము | పుట. |
|---|---|---|---|
| సంతుష్టో భార్యయా భర్తా | ౨ | ౬ | ౨౬ |
| సంతోషం పరమాస్థాయ | ౫ | ౧ | ౩౪ |
| సంవిభక్తా చ దాతా చ | ౯ | ౧ | ౧౨౩ |
| స్త్రీభిః భర్తృవచః కార్యం | ౨ | ౧౧ | ౩౪ |
| స్వీయం యశః పౌరుషం చ | ౬ | ౧ | ౭౩ |
| హ్రీమాన్ హి పాపం ప్రద్వేష్టి | ౧౧ | ౨ | ౧౬౦ |

# సాంకేతికములు.

మూ = మూలము
టీ = టీక
తా = తాత్పర్యము
వ్యా = వ్యాఖ్యానము
వి = విశేషార్థము
ఈ = ఈశ
కే = కేన
క = కఠ
ఛా = ఛాందోగ్య
తై = తైత్తిరీయ
బృ = బృహదారణ్యక
ముం = ముండకము

ము = ముండకోపనిషత్తు
శ్వే = శ్వేతాశ్వతర
నా = నారాయణ
మా = మాండూక్య
ప్ర = ప్రశ్న
వ = వల్లి
అను = అనువాకము
అ = అధ్యాయము
ఖ = ఖండము
బ్రా = బ్రాహ్మణము
వా = వాక్యము
శ్లో = శ్లోకము

ఓం! తత్సత్!

# బ్రాహ్మధర్మము

## ప్రథమఖండము



## మొదటి అధ్యాయము

**మూలమ్. ఓమ్ బ్రహ్మవాదినో వదన్తి** ౧

[తైత్తి. ౩-వల్లి, ౧-అను.]

టీక ఓమ్ = ఓమ్, బ్రహ్మవాదినః = బ్రహ్మవాదులు, వదన్తి = వచించుచున్నారు

తాత్పర్యము బ్రహ్మవాదులు వచించుచున్నారు

వ్యాఖ్యానము బ్రహ్మజ్ఞానరూపమయిన స్వర్గీయాగ్ని సమస్త మానవులహృదయములయందును ఉంచఁబడినది. అందఱి యాత్మలయందును పరబ్రహ్మముయొక్క అనంతమంగళభావము తుడిచివేయుటకు వీలుగాని

అక్షరములలో లిఖింపఁబడియున్నది విశ్వరూపకార్యాలోచనముచే ఆ జ్ఞానానలమును ప్రజ్వలింపఁజేసిన యెడల అనంతమంగళస్వరూపి యగుపరమేశ్వరుని దర్శనమును బొందనగును. అతఁడు విశుద్ధమయిన తన మంగళస్వరూపమును ఈసకలభౌతికపదార్థములందును, మానవుని మానసపటమునందును ముద్రితముచేసి యుంచియున్నాఁడు. ధన్యాత్ములును, సద్బుద్ధి సంపన్నులును, పాపరహితులును, సాధనాతత్పరులు నై యేమహాత్ములు పరబ్రహ్మమును తెలిసికొనఁగల్గిరో వారే బ్రహ్మవిదులు. ఇట్లు అతని నెఱింగి యితరుల కెవ్వరు ఉపదేశముచేసెదరో వారే బ్రహ్మవాదులు. బ్రహ్మవిదుఁడుగాని బ్రహ్మవాదిగాని యగుటకు దేశముతోఁగాని కాలముతోఁగాని జాతితోఁగాని పనిలేదు సకలదేశములందలి బ్రహ్మవాదులకును పరబ్రహ్మమునుగూర్చి యుపదేశించుటకు అధికారము కలదు భారతవర్షమునందలి బ్రహ్మవాదులగు ప్రాచీన ఋషులు ఉపదేశించినట్టి సమస్తయథార్థతత్త్వములును, ఆత్మప్రత్యయసిద్ధములగు సత్యములును ఈబ్రాహ్మధర్మము యొక్క ప్రథమఖండమునందు సమకూర్పఁబడినవి. అందుచే ప్రప్రథమమునసే బ్రహ్మవాదులు చెప్పుచున్నా రని యిందుఁ గలదు.

వివరణము ఈవాక్యముతో బ్రాహ్మధర్మగ్రంథమును ప్రారంభించుట సమంజసము. ఇందు చెప్పఁబోవు అభిప్రాయములు ఏకేశ్వరునియందు విశ్వాసముగలవారి యభిప్రాయములని యిది సూచించుచున్నది. బ్రాహ్మధర్మములోని భావములు సకలదేశములలోను సకలయుగములలోను గల ఏకేశ్వరవిశ్వాసులయొక్క పరిపక్వాభిప్రాయము లని మహర్షి దేవేంద్రనాథఠాకూరిగారి యుద్దేశము.

**మూ॥ యతో వా ఇమాని భూతాని జాయన్తే**
**యేన జాతాని జీవన్తి,**
**యత్ ప్రయన్త్యభిసంవిశన్తి**
**తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ** ౨

[తైత్తి. 3-వల్లి, ౧-అను.]

టీ॥ యతోవా = దేనినుండి, ఇమాని=ఈ, భూతాని= భూతములు, జాయన్తే = పుట్టుచున్నవో, జాతాని=పుట్టినవి, యేన = దేనిచేత, జీవన్తి=జీవించుచున్నవో, యత్ = దేనిని గూర్చి, ప్రయన్తి = తిరిగిపోవుచున్నవో, అభిసంవిశన్తి = (దేనియందు) ప్రవేశించుచున్నవో, తత్ = దానిని, విజిజ్ఞాసస్వ = చక్కఁగా తెలిసికొనుటకు కోరుఁడి, తత్ = అయ్యది, బ్రహ్మ = బ్రహ్మము.

తా॥ ఎవ్వనినుండి యీ సమస్తభూతములును ఉత్పన్నము లగుచున్నవో,ఉత్పన్నములై ఎవ్వనిమూలమున జీవించియుండఁ గల్గుచున్నవో, ప్రళయకాలమున నెవ్వని యొద్దకు పోవుచున్నవో, పోయి యెవ్వనిలోఁ బ్రవేశించుచున్నవో, అతనిని విశేషరూపమున దెలిసికొనుట కభిలషింపుము. అతఁడు బ్రహ్మము

వ్యా॥ ఎవ్వనినుండి స్థావరజంగమాత్మకమగు ఈవస్తుసముదాయము ఉత్పన్నమయ్యెనో, ఎవ్వని ఆశ్రయమువలన నవియెల్ల సంరక్షింపఁబడు

చున్నవో, ఎవ్వఁడు తలంచుకొన్న యెడల నందలి యొక్క కణమయినను మిగిలియుండనేరదో, అతఁడే బ్రహ్మము, అతఁడే సత్యము, అతఁడే మన ప్రభువు. సర్వశక్తిమంతుఁడగు అప్పరమేశ్వరుఁడు సత్యప్రియుఁడు, సత్యసంకల్పుఁడు. అతఁ డేమిసంకల్పించిన నయ్యది యగును. ఏపూర్ణ పురుషుని శక్తి నుండి యీ సమస్తవస్తువులును ఉద్భవించినవై తమ తమ శక్తిపుంజములను బడసియుండెనో ఆ పూర్ణ పురుషుఁడు వానిని సంహారముచేయఁ దలంచెనేని ఆ వస్తుజాలమెల్ల తమ తమ శక్తులతో అతని శక్తిలో లయముజెంది తిరిగి అతనినే చేరినవి యగుచున్నవి. వాని చిహ్నమయినను ఎచ్చోటను కనుపింపదు. పరమేశ్వరుఁ డొక్కఁడే సృష్టిస్థితిలయకర్త. మనకు కొన్ని వస్తువులు లభించినయెడల వానిగుణములను తెలిసికొని, ఉపయుక్తరీతిని వానిని సంయోగముచేసి అపూర్వమయిన యంత్రము నొకదానిని మనము నిర్మాణము చేయఁగలము. నిజమే.అంతియేగాక దానిని అనాయాసముగా మనము భగ్నముగాఁడ చేయఁగలము. కాని మన మొక్కవాలుకా రేణువునయినను సృష్టింపను జాలము, ధ్వంసమును చేయఁజాలము. సృష్టిస్థితిప్రళయశక్తి ఏకమాత్రుఁడును, అద్వితీయుఁడునగు నా పరమేశ్వరునియందే గలదు

వి ఉపనిషత్తులను రచించిన ఋషీశ్వరులు భగవత్స్వరూపము నీవాక్యరూపమున నిర్వచించి రని భావింపఁ దగును బ్రహ్మసూత్రకారుఁ డివ్విధముననే అభిప్రాయపడెను. ఏలయన, రెండవసూత్రములోనే యీ శ్రుతిని స్ఫురింపఁజేయుచు, అతఁడు “జన్మాద్యస్య” అని బ్రహ్మస్వరూప నిర్వచనమును జేయుచున్నాఁడు తైత్తిరీయోపనిషత్తులోని యీప్రాచీన నిర్వచనమునకంటె శ్రేష్ఠతరమైన బ్రహ్మస్వరూపనిర్వచన మిప్పటివరకు వేఱొండు కనుపింపదు. భగవంతుఁడు అనిర్వచనీయుఁడు నిజమునకు మూల

సత్యములగు పదార్థములు వేనినిగూడ నిర్వచింపఁజాలము. కార్యములను బట్టియే వానిని తెలిసికొనవలసియుండును ముఖ్యముగా పరమ సత్యము అనిర్వచనీయమయినది. కార్యమును బట్టియే దానిని గ్రహింపవలయును. అందుచేతనే యెవ్వనినుండి సకలభూతములు కలుగుచున్నవో యని కార్యమును బట్టి కారణమగు బ్రహ్మమును తైత్తిరీయోపనిషత్తు సూచించుచున్నది

మూ ఆనన్దాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే
ఆనన్దేన జాతాని జీవన్తి
ఆనన్దం ప్రయన్త్యభిసంవిశన్తి 3

[తైత్తి 3-వల్లి, ౬-అను.]

టీ. ఖలు = నిశ్చయముగా, ఆనన్దాత్ హి ఏవ=ఆనంద రూపుని నుండియే, ఇమాని = ఈ, భూతాని = భూతములు, జాయన్తే = పుట్టుచున్నవి జాతాని=పుట్టినవి, ఆనన్దేన=ఆనంద రూపునివలననే, జీవన్తి = జీవించుచున్నవి (ప్రళయకాలమందు) ఆనన్దం = ఆనందస్వరూపుని గూర్చియే, ప్రయన్తి = మరలిపోవుచున్నవి (ఆనందరూపునియందే) అభిసంవిశన్తి = చేరుచున్నవి.

తా ఆనందస్వరూపి యగు పరబ్రహ్మమునుండి యీ సకల భూతములును ఉత్పన్నము లగుచున్నవి ఉత్పన్నము

లయి ఆనందస్వరూపి యగు పరబ్రహ్మముచేతనే జీవించుచున్నవి; మఱియు ప్రళయకాలమున ఆనందస్వరూపి యగు బ్రహ్మమును గూర్చిపోయి అతనిలోఁ బ్రవేశించుచున్నవి

వ్యా సృష్టిస్థితి ప్రళయకర్తయుం, నిర్విశేషుఁడునగు అప్పరమేశ్వరునికి ప్రత్యేకనామ మెద్దియును లేదు. మహనీయుఁడును, సర్వగతుఁడును, సర్వవ్యాపియును, మంగళమయుఁడు నగు అప్పరమపురుషుని తమ యంతరంగములందు సాక్షాత్కరింపఁజేసికొని తన్మూలమున పరమానందము ననుభవించినట్టి ప్రాచీనబ్రహ్మవాదులు అతఁడు ఆనందస్వరూపుఁడని తెలియఁజేసిరి. మనముగూడ నెప్పుడు అతని ప్రేమయందు నిమగ్నులమై ఆనందరసమున కరగిపోవుదుమో అపుడు మనము అతనిని ఆనందస్వరూపి యని చెప్పుదుము.

వి. దేనినుండి యీ విశ్వము పుట్టుచున్నదో, దేనిచే సంరక్షింపఁబడుచున్నదో అదియే బ్రహ్మమని పూర్వశ్రుతిలో సూచితమయిన పరవస్తువునకు ఈవాక్యములో స్పష్టముగా "ఆనందము" అని నామకరణము చేయఁబడినది. ఈ శబ్దమునకు ఉపనిషత్తులలో నొక విశిష్టార్థము గలదు. విశ్వనిర్మాణ సందర్భమున ఈ పదమును తైత్తిరీయోపనిషత్తు ప్రయోగించియున్నది ఈ ఉపనిషత్తు ప్రకారము విశ్వమునందేమి, మానవజీవనమునందేమి, అయిదు విధములయిన అంతస్థులు గలవు. ౧ అన్నమయకోశము, ౨ ప్రాణమయకోశము, ౩ మనోమయకోశము, ౪ విజ్ఞానమయకోశము, ౫ ఆనందమయకోశము. విశ్వమునందలి జడపదార్థరూపమయిన భాగమునకు అన్నమయకోశమని పేరు. అంతకంటె నున్నతమయినదై ప్రాణిసముదాయములో కూడు

కొని యున్న భాగము ప్రాణమయకోశము జడమునకంటె శ్రేష్ఠమయినది జీవము. దీనికంటె శ్రేష్ఠమైనదై వృక్షములకును జంతువులకును గల భేదమును సూచించునట్టి మనస్సునకు సంబంధించినకోశము మనోమయకోశము. మనస్సునకంటె శ్రేష్ఠమయినది విజ్ఞానము. దినినే మానసికశాస్త్రజ్ఞులు బుద్ధియనిగాని హేతుజ్ఞానమనిగాని పిలుతురు. విజ్ఞానమయకోశముకంటె శ్రేష్ఠమయినది ఆనందమయకోశము. ఇదియే సర్వశ్రేష్ఠమయినది. ఇపుడు ప్రశ్న ఆనందమనఁగా నేమని. జడమునుండి ప్రాణమునకును,ప్రాణమునుండి మనస్సునకును, మనస్సునుండి విజ్ఞానమునకును అంతస్థుపై నంతస్థుగా మనము మన యాలోచనములో పైకెక్కుచు వచ్చితిమి ఇక విజ్ఞానముకంటె ఉత్కృష్టతరమైనది యేమి? అది ఆనందమే. కొందరు వ్యాఖ్యాతలు ఈ "ఆనంద" శబ్దమునకు "ప్రేమ" యని అర్థముచేసియున్నారు. ప్రేమ ఉత్కృష్టమయిన భావమె. కాని, ఆనందమును ప్రేమయు ఒకటి కావు. అవి పరస్పర సంబంధము కలవి ఒకదానినుండి యొకటి విడిచియుండవు. ప్రేమ యొక్క ప్రకాశమే ఆనందము ఆనందమునందు ప్రేమభావము ఇమిడియే యున్నది. శ్రుతియందలి "ఆనంద"మను పదము "ప్రేమ" యను పదముకంటె అధిక భావగాంభీర్యముకలది

మూ॥ యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ,
ఆనన్దం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన. ౪

[తైత్తి ౨-వల్లి, ౯-అను.]

టీ. అప్రాప్య=పొందనేరక, వాచః=వాక్కులు, మనసా సహా=మనసుతోఁగూడ, యతః=ఎద్దానినుండి, నివర్తన్తే=మరలుచున్నవో, బ్రహ్మణః=ఆ బ్రహ్మముయొక్క, ఆనన్దం = ఆనందరూపమును, విద్వాన్=తెలిసికొన్నవాఁడు, కుతశ్చన=ఎద్దానికిని, నబిభేతి=వెఱవడు

తా. ఎవ్వానిని బొందనేరక మనస్సుతోఁగూడ వాక్కు మరలి వచ్చుచున్నదో ఆ పరబ్రహ్మముయొక్క ఆనందరూపమును తెలిసికొన్నవాఁడు మఱి యెద్దానికిని భయము చెందఁడు

వ్యా ఆ యనంత జ్ఞానస్వరూపియగు పరమేశ్వరుఁడు పరిమిత వస్తువు గాదు. అతఁడు జడమునుగాదు, మనస్సునుగాదు. అందువలన మనస్సు అతనిని గ్రహింపనేరదు మనస్సు అతనిని గ్రహింపలేనిచో వాక్కును అతనిని గూర్చి యెంతమాత్రమును చెప్పఁజాలదుగదా! మనస్సు అతనిని గూర్చి చింతింపఁబోయి మఱలి వచ్చుచున్నది. వాక్కును అతనిని వర్ణింపఁబోయి చేతగాక ఆగిపోవుచున్నది. ఆ అనంతపురుషుని కేవలము మనస్సునకు మనస్సనియు, వాక్కునకు వాక్కనియు, అన్నిటికిని మూలమగు కారణచైతన్యము ఆశ్రయమనియుం నిర్దేశింపనగును ఎవ్వఁడు ఈ నిర్విశేషుఁడును సర్వవ్యాపియుఁనగు ఆనందస్వరూపునియొక్క నిరంతర సాక్షాత్కారమును తన అంతరంగమునందు పొంది మహానందమును అనుభవించుచుండునో అతని సకలాభీష్టములును నెరవేరినవగును. అతఁడు తన ప్రియతముని సహవాసముచే సంతుష్టుఁడై సఫలమనోరథుఁడగును. అతఁడు

పరమేశ్వరునికి శరణాగతుఁడును అనుగతుఁడగు దాసుఁడునై ఈశ్వరప్రియ కార్యసాధనాతత్పరుఁ డగును. లోకాపవాదమునకుఁగాని, దుస్సహామగు అవమానమునకుఁగాని, అనుచితమయిన తిరస్కారమునకుఁగాని, దుర్నివార్య మగు హింసకుఁగాని భయపడి అతఁడెన్నఁడును ఈశ్వరపరాఙ్ముఖుఁడు కాఁడు. ఆ ప్రియతముని ఆజ్ఞను ప్రతిపాలించు నిమిత్తమై ప్రాణమునైనను సమర్పించుట అతని కత్యంత సహాజమయిన కార్యము. అట్టిచో అతని నెవ్వరు భయపెట్టఁగలరు? అతఁడు తన ప్రాణదాతయొక్క హస్తమునందు తన ప్రాణము నర్పించి నిర్భయుఁడయ్యెను. సర్వమును సంహారముచేయునట్టి భయంకర మృత్యువునకు సయితము అతఁడు వెఱవఁడు.

వి. ఆనందముయొక్క అంతరార్థము నిదివరకే తెలిసికొనియున్నారము. ఈ వాక్యములో ఆ పదముయొక్క అర్థము మఱింత స్పష్టముగా నిరూపింపఁబడినది. భగవంతునిలో పరస్పర విరుద్ధములుగా కన్పట్టు సగుణ నిర్గుణములనెడు రెండు భావములు మిళితములైయున్నవి. నిర్గుణుఁడుగా అతఁ డనంతుఁడు, మానవబుద్ధి కందనివాడు భగవంతుఁడు కేవలము అనంతుఁడే యైనచో మనుష్యుఁ డతనిని గ్రహింపఁజాలకపోయి యుండును. కాని, మానవులు గ్రహింపఁదగిన మఱియొక భావమతనిలోఁ గలదు. ఈశ్వరుఁడు అనంతుఁడే గాక ఆనందస్వరూపి, ప్రేమస్వరూపి. ప్రేమస్వరూపి యగుటంజేసి ఈశ్వరునికి మానవుఁడు సమీపస్థుఁడు, ప్రియతముఁడు భగవంతుఁడు ప్రేమస్వరూపి యనియు, తన్ను ప్రేమించు తండ్రియనియు తెలిసికొన్నప్పుడు మనుష్యుఁ డతనిని చక్కఁగా గ్రహింపఁ గలుగుచున్నాఁడు. జ్ఞానవంతుఁడును గొప్పవాఁడు నగు జనకునియొక్క జ్ఞాన విశేషమును, గొప్పతనమును బిడ్డ తెలిసికొననేరఁడు. కాని పితృ

వాత్సల్యమును మాత్రము బిడ్డ ఎఱుఁగఁగలఁడు తద్విధముననే మానవుఁడు అగాధమై, అనంతమైన ఈశ్వరతత్వమును తెలిసికొనఁజాలక పోవచ్చును. అయినను అతఁడు భగవంతుని ప్రేమ స్వభావమును గ్రహించి నిశ్చల చిత్తుఁడై యుండఁగలఁడు

**మూ. రసో వై సః రసగ్ హ్యేవాయం లబ్ధ్వానన్దీ భవతి. ౫**

[తైత్తి. ౨-వల్లి, ౭-అను.]

టీ. సః=అతఁడు (ఆ పరమాత్మ), రసోవై=ఆనందకారణుఁడే, అయం=ఇతఁడు (ఈజీవుఁడు), రసగ్ హ్యేవ=ఆనందకారణునే, లబ్ధ్వా=పొంది, ఆనన్దీ=ఆనందముగలవాఁడు, భవతి=అగుచున్నాఁడు

తా. ఆ పరమాత్మ రసస్వరూపియగు తృప్తిహేతువు. రసస్వరూపుఁడగు పరబ్రహ్మమును పొంది జీవుఁడు ఆనందితుఁడగును

వ్యా ఏ మంగళమయుని ప్రేమరసమును అనుభవించి జీవుఁడు పరమానందమున నిమగ్నుఁడగునో వాక్కు అతనిని తనంతట దా రసస్వరూపుఁడని వక్కాణించును.

వి. ఈవాక్యమునందు ఋషీశ్వరుఁడు భగవంతుని ప్రేమభావమును గ్రహించి, సంతోషపారవశ్యమున అతఁడు రసస్వరూపియని ప్రకటించుచు,

మానవుఁడు కనబఱుచు నానావిధప్రేమ భావములును భగవంతుఁడనెడు నీటిబుగ్గనుండి పయికుబికెడు బుడగలవంటివని నుడువుచున్నాఁడు.

**మూ. కోహ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనన్దోనస్యాత్ ఏషహ్యేవానన్దయాతి. ౬**

[తైత్తి. ౨-వల్లి, ౭-అను.]

టీ ఆనన్దః = ఆనందరూపుఁడు (పరమాత్మ), ఆకాశే= ఆకసమునందు, యత్ నస్యాత్ = లేనట్లయిన, కోహ్యేవ = ఎవఁడుగాని, అన్యాత్=చలించును? కః=ఎవఁడు, ప్రాణ్యాత్= జీవించును? ఏషః ఏవ=ఇతఁడే, ఆనన్దయాతి=ఆనందము నిచ్చు చున్నాఁడు

తా ఆకాశమునందు ఈ ఆనందస్వరూపియగు పర మాత్మ లేకున్న ఎవఁడు చలించును? ఎవఁడు జీవించును? ఇతఁడే యెల్లవారికిని ఆనందము నిచ్చుచున్నాఁడు

వ్యా పరమాత్మ యుండుటవలననే ఈ అనుపమానమయిన జగత్తు ఉత్పన్నమయ్యెను, సమస్తజీవులును తమతమ జీవనోపాయములను బడసెను. అతఁడు లేకున్న నెద్దియు సంభవించి యుండదు. సకలసృష్టికర్తయు, సర్వాశ్రయుఁడును, మంగళస్వరూపియునగు పరమేశ్వరుఁడు ఈజగత్సంసారమును సృజించి, చక్కని నియమబద్ధమయిన యీవిధానమునెల్ల స్థాపించియుండక

పోయినచో ఈభూలోకముగాని, ద్యులోకముగాని, ఈ జంగమప్రాణులుగాని, వీని క్రియాకలాపములుగాని, సుఖసౌభాగ్యములు గాని యెక్కడనుండి యుండును? అతఁడే సమస్తలోకమునకును ఆనందమును ప్రసాదించువాఁడు. మంగళమయుఁడగు ఆ విశ్వరక్షకుఁడు మన యెల్లరసౌఖ్యమును గోరి యెందెందు నెట్టెట్టి సుఖోపాయముల సమకూర్చి యుంచెనో ఆయాసౌఖ్యములను మనము వానివానియందు పొంది కృతార్థుల మగుచున్నాము. జగత్తుయొక్క శోభాదర్శనము, రుచ్యమయిన అన్నరసాస్వాదనము, జననీజనకులవాత్సల్యము, బంధుజనుల అనురాగము, జ్ఞానశిక్ష, మతానుష్ఠానము మొదలైన వానిలో దేనినుండి యెవ్విధమున నెట్టిసౌఖ్యమును పొందినను అది యెల్ల నాతని ప్రసాదఫలితమే గదా! ఆహా! ఆయన కారుణ్య మెట్టిది! అతఁడు కేవలము విషయజన్యములగు నానావిధములయిన సౌఖ్యములను కలిగించి మిన్నకుండ లేదు. ప్రార్థించినచో అతఁడు స్వయముగా నర్పించుకొని మన హృదయమును ప్రశాంతముచేసి, మన మనస్సును సంతుష్టిపఱచి, మన యిచ్ఛను నెరవేర్చుచున్నాఁడు. విషయసుఖములచే తృప్తినొందక అనుక్షణమును తన్ను ప్రార్థించునట్టి శాంతస్వభావులగు జ్ఞానుల హృదయసీమలయందు అతఁడు తత్క్షణమే ప్రత్యక్షమై వారి నయనయుగళమునుండి స్రవించెడు శోకసంతప్తములగు అశ్రుబిందువుల తుడుచుచున్నాఁడు. అంతియేగాక, కొల్లగా అమృతజలమును వర్షించి, శుష్కించిన వారి హృదయపద్మములను వికసింపఁజేయుచున్నాఁడు. ఆహా! ఎవఁడు అమృతమయుఁడగు ఆ పూర్ణపురుషుని సాక్షాత్కారమును తన యంతరమునందు ఒక్కక్షణకాలమైనను అనుభవించి విమలానందమును పొందునో అతఁడే ఆప్పరమపురుషుని మహిమను గ్రహింపనేర్చును

ఏ సర్వమును భరించునట్టియు, సర్వమునకు శక్తి నొసంగునట్టియు భగవంతుని ఆనందస్వరూప విశేషత్వమును గూర్చి ఋషి యిందు తెలియఁ జేయుచున్నాఁడు. ఆనందరూపుఁడయిన భగవంతుఁడు లేకున్న ప్రపంచములో నెద్దియుం కదలఁజాలదనియుం, జీవింపఁజాలదనియుం అతఁడు దృఢ విశ్వాసముతో పల్కుచున్నాఁడు. మానవహృదయములో ప్రేమభావమును ప్రేరేపించువాఁడు భగవంతుఁడే.

**మూ** **యదా హ్యేవైష ఏతస్మి**
**న్నదృశ్యే౽నాత్మ్యే౽నిరుక్తే**
**౽నిలయనే౽భయం ప్రతిష్ఠాం విన్దతే**
**అథ సో౽భయం గతో భవతి** **८**

[తైత్తి, ౨-వల్లి, ८-అను]

టీ. ఏషః=ఈ సాధకుఁడు, యదా హ్యేవ=ఎప్పుడయితే, అనిలయనే = ఆధారములేని, అనిరుక్తే = చెప్పశక్యముగాని, అనాత్మ్యే=దేహములేని, అదృశ్యే=కనుపింపని, ఏతస్మిన్=ఈ పరమాత్మయందు, అభయం=భయరహితమయిన, ప్రతిష్ఠాం= స్థితిని, విన్దతే = పొందుచున్నాఁడో, అథ=అపుడు, సః = అతఁడు, అభయం=నిర్భయత్వమును, గతః=పొందినవాఁడు, భవతి=అగుచున్నాఁడు

సాధకుఁ డెప్పుడు ఈ అదృశ్యుఁడును, నిరవయవుఁడును, అనిర్వచనీయుఁడును, నిరాధారుఁడునగు పరబ్రహ్మము నందు నిర్భయస్థితిని బొందునో అపుడు ఆతఁడు భయము లేనివాఁ డగుచున్నాఁడు.

తా భయము కలిగినచో శిశువులెట్లు తమ తల్లి యొడిలోఁ జేరి నిర్భయులగుచున్నారో అదేతీరున మనమును అమృతమయుఁడగు నాపరమపురుషుని సర్వవ్యాప్తమగు క్రోడమున ప్రవేశించి భయాకీర్ణమయిన యీ సంసారభయము నుండి పరిత్రాణమును బడయుచున్నారము అపుడు మనము భయరహితులమై అదృశ్యుఁడయ్యు సర్వమును తిలకించువాఁడును, నిరాధారుఁడయ్యు విశ్వాధారుఁ డయినవాఁడును, సర్వమునకు నాశ్రయుఁ డయినవాఁడు నగు నప్పరమేశ్వరుఁ డొక్కఁడే మనకు మిత్రుఁడును సహాయుఁడు నని గ్రహించి అతనికి ఆత్మసమర్పణము గావించి, అతని ఆజ్ఞానువర్తులమై అతఁడు చూపించెడు మార్గమునందు మాఱు మాటాడక నడచుకొందుము

వ్యా. ఈ వాక్యము సాల్గవ వాక్యములోని భావమునే విశదీకరించుచున్నది. భయంకరముగను, దయాశూన్యముగను పైకి తోఁచుచున్న యీ విశ్వము ప్రేమలో ప్రతిష్ఠితమై యున్నదని తెలిసికొన్నపుడే మను

జూడు జీవితములో తటస్థించు నానావిధ అవస్థాభేదములలోను అచంచల మనస్కుఁడై యుండఁగల్గును.

**మూ యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ,**
**ఆనన్దం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కదాచన ౮**

[తైత్తి. ౨-వల్లి, ౪-అను.]

**టీ.** అప్రాప్య=పొందనేరక, యతః=ఎద్దానినుండి,వాచః=వాక్కులు, మనసాసహ=మనసుతోఁగూడ, నివర్తన్తే=మరలుచున్నవో, బ్రహ్మణః=ఆబ్రహ్మముయొక్క, ఆనన్దం = ఆనంద స్వరూపమును, విద్వాన్=తెలిసికొన్నవాఁడు, కదాచన=ఒకప్పుడును, న బిభేతి = వెఱవఁడు

తా ఎవ్వని పొందఁజాలక మనస్సుతోఁగూడ వాక్కు మరలి వచ్చుచున్నదో అట్టి పరబ్రహ్మముయొక్క ఆనందము నెవ్వఁడు తెలిసికొనునో అతఁడెన్నటికిని భయపడఁడు

వ్యా పరమేశ్వరుని మంగళస్వరూపమునందు ఎవ్వరికి విశ్వాసము లేదో, ఎవ్వరికి అతనిని గూర్చి వాస్తవమయిన అభిప్రాయ మేర్పడ లేదో అట్టివారు అఖండమై, నియమబద్ధమైన జగత్తునందు నివసించుచున్నను అంధకారబంధురమయిన గృహమునం దున్నవారివలె నానావిధ భయములచే భీతిల్లుచుందురు. కాని యెవ్వఁడు పరమమంగళాకరుఁడగు పర

మేశ్వరుని మంగళజ్యోతిని విశ్వసంసారమునం దెల్లెడలను కన్గొనునో అతఁడు ఎన్నఁటికిని భయము చెందఁడు

వి 'కుతశ్చన' (దేనికిని) అన్నపదమునకు మాఱుగా 'కదాచన' (ఎన్నఁడును) అన్నపదముండుట తప్ప ఈవాక్యమునకును ౪-వ వాక్యమునకును మఱియొట్టి భేదమును లేదు

**మూ** ఏషాస్య పరమా గతిరేషాస్య పరమా సమ్పత్
ఏషోఽస్య పరమో లోక ఏషోఽస్య పరమ
ఆనన్దః, ఏతస్యైవానన్దస్యాన్యాని భూతాని
మాత్రాముపజీవన్తి. ౯

[బృహ ౪-అ. 3-బ్రా. 3౨-వా.]

టీ అస్య=దీనికి (ఈజీవునకు), ఏషా=ఇది (పరమాత్మ), పరమాగతిః=శ్రేష్ఠమయినగతి, అస్య=దీనికి (జీవునకు), ఏషా=ఇది (పరమాత్మ), పరమాసమ్పత్=శ్రేష్ఠమైన సంపద, అస్య=దీనికి (జీవునకు), ఏషః = ఇతఁడు, పరమః=శ్రేష్ఠమైన, లోకః=లోకము, ఏషః=ఇతఁడు (పరమాత్మ), అస్య=దీనికి (జీవునకు), పరమః=శ్రేష్ఠమయిన, ఆనన్దః=ఆనందము, ఏతస్య=ఈపరమాత్మయొక్క, ఆనన్దస్య = ఆనందముయొక్కయే, మాత్రాం=అంశమును, అన్యాని భూతాని = ఇతరజీవులు, ఉపజీవన్తి=అనుభవించెదరు.

తా॥ ఇతఁడు ఈజీవులకు పరమగతి; ఇతఁడు ఈజీవులకు పరమసంపద; ఇతఁడు వీనికి పరమలోకము; ఇతఁడు వీనికి పరమానందము, ఈ పరమానందములో బిందుమాత్రమయిన ఆనందమును సకలేతరజీవులును అనుభవించును

వ్యా॥ మనము పొందఁదగిన సర్వవిధములయిన సద్గతులలో నెల్ల పరమేశ్వరుఁడే మన పరమగతి. అతనిని పొందుటయే పుణ్యముయొక్క కడపటి ఫలము. సంపదలలో నెల్ల పరమేశ్వరుఁడే మన పరమసంపద. ఈ సంపదను బడసినవానికి ఇతరసంపద యొకసంపదగనే తోఁచదు లోకములలో నెల్ల పరమేశ్వరుఁడే మనకు శ్రేష్ఠమగు ఆశ్రయముగా నుండఁదగు పరమలోకము. ఆనందములలో నెల్ల పరమేశ్వరుని పొందుటయే మనకు పరమానందమును సమకూర్పఁగల విషయము. ఈ బ్రహ్మోపలబ్ధివలన కలిగెడు పరమానందముతో పోల్చినపుడు జీవులు అనుభవించెడు నానావిధములయిన యితరానందములు అందులో ఒక లవమాత్రము. అయినను ఆ లవమాత్రమయిన ఆనందము ననుభవించుట మూలముననే సమస్తజీవులును జీవించియున్నారు.

వి॥ భగవంతుని స్వరూపస్వభావములను నిరూపించు ఈ అధ్యాయము ఈవాక్యముతో పరిసమాప్తమగుట యెంతయు సమంజసము. భాషయందును, భావమునందును ఇది చాల గంభీరముగా నున్నది. భగవంతుని తెలిసికొనుటవలన కలిగెడు ఆనందమును గూర్చి ఋషుల కెట్టి అభిప్రాయము గలదో వ్యక్తీకరించుట కిది గొప్ప నిదర్శనము. ఈశ్వరుని తెలిసికొనుటలో నెంత విలువగలదో యింతకంటె మిన్నగా నెవ్వరును చెప్పఁజాలరు బ్రహ్మజ్ఞానమువలన కలిగెడు పరమానందమును గురించిన యీమహావాక్యమును

ఏఋషీశ్వరుఁడు చెప్పినట్లు మూలమునందు గలదో ఆ యాజ్ఞవల్క్యుఁడు బ్రహ్మజ్ఞానసంజనితానందము నితరసౌఖ్యములతో పోల్చి చూపుచు అందలి భావము నిట మఱింత విశదీకరించియున్నాఁడు "ఆరోగ్యవంతుఁడును, భాగ్యవంతుఁడును, అధికారవంతుఁడు నై సకలసౌఖ్యముల ననుభవింపఁగల్గి నచో తాను ధన్యుఁడయినట్లు సాధారణముగా ప్రపంచములో మానవుఁడు తలంచుచుండును. కాని యిట్టి సౌఖ్యములు నూరుకలిగిన పితృలోకవాసు లనుభవించు నొక్క సౌఖ్యమునకు తుల్యమగును. ఇట్టి పితృలోకసుఖములు నూరు కలిపిన గంధర్వలోకమునందలి ఒక్క సౌఖ్యముతో సమానమగును." ఇట్లు ఒకసౌఖ్యమునకంటె నింకొకటి శ్రేష్ఠమైనదనియుం, బ్రహ్మజ్ఞానానందమన్నిటికన్న శ్రేష్ఠతమమనియు యాజ్ఞవల్క్యమహర్షి తెలిపెను. కాని మన మాలోచించుచున్న యీ వాక్యమునకు మరియెద్దియుం సాటిరాదు. ఇట్టి వాక్యరాజముల నేర్చి బ్రాహ్మధర్మరూపమున నొక దండగాఁ గూర్చి ఉపనిషత్తులకు మహర్షి దేవేంద్రనాథఠాకూరు మహోపకారము చేసెను.



# రెండవ అధ్యాయము

మూ ఇదం వా అగ్రే నైవ కిఞ్చిదాసీత్, సదేవ సౌమ్యేద
మగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్, సవా ఏషమహానజ
ఆత్మాఽజరోఽమరోఽమృతోఽభయః. ౧

[బృహదారణ్యకము.]

టీ ఇదంవై = ఈజగత్తుయొక్క, అగ్రే = సృష్టికిపూర్వమునందు, నైవ కిఞ్చిదాసీత్ = ఒకటియును లేదు? హే సౌమ్య=ఓప్రియదర్శనుఁడా, ఇదమగ్రే = ఈ జగత్సృష్టికిపూర్వము, ఏకమేవ=ఒక్కఁడేయైన, అద్వితీయమ్= రెండవవాఁడు లేని, సదేవ=సత్తామాత్రుఁడగు పరమాత్మయే, ఆసీత్=ఉండెను; సః=అతఁడు, ఏషః=ఈ, మహాన్=గొప్పవాఁడును, అజః = పుట్టుక లేనివాఁడును, అజరః=ముసలితనము లేనివాఁడును, అమరః=మరణము లేనివాఁడును, అమృతః=నిత్యుఁడును, అభయః = భయరహితుఁడునగు, ఆత్మ=పరమాత్మ

తా ఈజగత్తునకు పూర్వ మెద్దియును లేదు ఈజగదుత్పత్తికిపూర్వము, ఓ ప్రియశిష్యుఁడా! కేవలము ఒక్కఁడును, అద్వితీయుఁడును, సత్స్వరూపుఁడునగు పరబ్రహ్మ

ముండెను అతఁడు జన్మవిహీనుఁడు, గొప్పవాఁడునగు ఆత్మ అతఁడు అజరుఁడు, అమరుఁడు, నిత్యుఁడు, అభయుఁడు

వ్యా. సృష్టికి పూర్వము సత్పదార్థమగు కేవలము బ్రహ్మ మొక్కఁడే యుండెను తద్భిన్నమయిన రెండవవస్తువు లేదు సృష్టితరువాతఁగూడ చేతనాచేతనములగు సమస్తవస్తువులును, కేవలము అతని నొక్కనినే ఆశ్రయముగాఁ జేసికొని నిలిచియున్నవి ఇందుచేతనే అతఁడు ఏకమాత్రుఁడనియు, అద్వితీయుఁడనియు, చెప్పఁబడియెను. ఎవ్వఁడు సత్స్వరూపుఁడో, ఏకమాత్రుఁడో, అద్వితీయుఁడో అతఁడు చేతనపదార్థము అతఁడు తన్నుదా తెలిసికొనుచున్నాఁడు ఇందుచే నతఁడు ఆత్మశబ్దవాచ్యుఁ డయ్యెను. కాని ఆ యాత్మ మన యాత్మవలె అల్పమయినది గాదు ఈవిషయమును తెలియఁజేయు నిమిత్తమే అతఁడు జన్మరహితుఁడు, మహాత్ముఁడు, అజరుఁడు, అమరుఁడు, నిత్యుఁడు, అభయుఁడు అని చెప్పఁబడియెను. పరమాత్మయొక్క యిచ్ఛచే పరిమితమయిన శక్తిని పొంది అతనినుండి జన్మించినదయి, అతని యిచ్ఛానుసారముగా, అతనిని ఆశ్రయించి జీవాత్మ జీవించియున్నది. ఎంత కాలము అతని కిష్టమగునో అంతవఱకు జీవుఁ డిచట జీవించియుండును. కాని పరమాత్మ యట్టివాఁడు గాఁడు. అతఁడు స్వయంభువు, స్వతంత్రుఁడు, నిత్యుఁడు, పరిపూర్ణుఁడు

వి ఈ రెండవఅధ్యాయము విశ్వముయొక్క సృష్టిక్రమమును గూర్చి ప్రస్తావించుచున్నది సకలమతసంప్రదాయములును సృష్టిని గుఱించి తమతమ యభిప్రాయములను వెలిబుచ్చుచున్నవి ఆవాదుకననుస రించి తద్విషయమున తాను గూడ ముచ్చటించుట ముఖ్యమని మహర్షి

భావించెను అయినను సృష్టివిధానముయొక్క వివరములలోనికి వారు పోయియుండలేదు. ఇది యెంతయు సమంజసము. నిత్యుఁడును, స్వయంభువు నగు బ్రహ్మ యొక్కఁడే మొట్టమొదట నుండెననియు, అతనినుండియే సమస్తభూతములును ఉత్పన్నము లయ్యె ననియు మాత్రము చెప్పి, సృష్టిక్రమమును నిశ్చయించు భారమును నిరంతరాభివృద్ధిగాంచుచుండెడు మనుష్యుల జ్ఞానసంపత్తికిని విజ్ఞానశాస్త్రపరిశోధనలకును విడిచిపెట్టెను.

ఈవాక్యములోని మూఁడుభాగములును మూఁడుస్థలములనుండి గైకొనఁబడినవి. 'ఇదం' మొదలుకొని 'ఆసీత్' వఱకుఁగల మొదటిభాగము బృహదారణ్యకోపనిషత్తు ౧-వ అధ్యాయము ౨-వ బ్రాహ్మణము ౧-వ వాక్యములోనిది. 'సదేవ'నుండి 'అద్వితీయమ్' వరకుఁగల రెండవభాగము ఛాందోగ్యము ౬-వ ప్రపాఠకము ౨-వ ఖండము ౧-వ వాక్యములోనిది. మిగిలినది బృహదారణ్యకము ౪-వ అధ్యాయము, ౪-వ బ్రాహ్మణము, ౨౨-వ వాక్యములోనిది. సృష్టినిగూర్చి తనకుఁగల అభిప్రాయమును ఉపనిషత్తులలోని ఏదో ఒక్కవాక్యములో వ్యక్తీకరించుటకు మహర్షికి వీలుపడదయ్యెను. అందుచే మూఁడుస్థలములలోనుండి మూఁడుభాగములను గ్రహించి యీ వాక్యమును ఆయన సిద్ధముచేయవలసివచ్చెను. దీనిని బట్టి మహర్షి దేవేంద్రనాథ రాకూరుగారికి సొంతమతము ఉండెననియు, దానిని ఉపనిషద్వాక్యములమూలమున వెల్లడించుటకే యీబ్రాహ్మధర్మమును వారు రచించిరనియు, కేవలము ఉపనిషత్తులలోని సారవద్వాక్యముల నెల్ల నొకగ్రంథరూపమున గూర్చుటయే వారియుద్దేశము కాదనియు మనకు కరతలామలకము కాఁగలదు

మూ స తపోఽతప్యత స తప స్తప్త్వా
ఇదగ్ సర్వమసృజత యదిదం కిఞ్చ. ౨

[తైత్తి ౨-వల్లి, ౬-అను.]

టీ సః=అతఁడు, తపః=జగత్సృష్టివిషయకమయిన ఆలోచన, అతప్యత=ఆలోచించెను సః=అతఁడు, తపః=జగత్సృష్టి విషయకమయిన ఆలోచనను, తప్త్వా = ఆలోచించి, యదిదం కిఞ్చ=ఏది యిదయియున్నదో, ఇదగ్ సర్వం = ఈసమస్తమును, అసృజత=సృష్టించెను

తా అతఁడు విశ్వసృజనవిషయమును ఆలోచించెను ఆలోచించి యీసమస్తమును సృష్టించెను

వ్యా సృష్టికి పూర్వము పరబ్రహ్మమునకు భిన్నమయిన మఱియొక వస్తు వెద్దియును లేదయ్యెను. కావున అతఁడు పనివానిచందమున నేవో కొన్ని యితరపదార్థముల సాహాయ్యములో నీసృష్టిని గావించినవాఁడు గాఁడు అతఁడు సృష్టికార్యమును గూర్చి చింతనచేసెను. చింతించి యీసమస్తజగత్సంసారమును సృష్టించెను. మనము మృత్పాషాణలోహాదులమూలమున వస్తువిశేషములను నిర్మాణముచేయఁగలము. కాని దానిని సృష్టి యన వీలులేదు. ఇతరమగు నేవస్తువుయొక్క సాహాయ్యమును లేకుండ తన యిచ్ఛామాత్రమున వస్తువును ఉత్పన్నము చేయుటకే సృష్టి యని పేరు. కాన ఏపదార్థమును సృష్టిచేయుటకు మనకు శక్తిలేదు. సృష్టించు శక్తి కేవలము ఒక్కపరమాత్మకే కలదు. అతఁడు తనంతట దానే కేవలము తన

సహజజ్ఞానశక్తిక్రియాద్వారమున చేతనాచేతనాత్మకమయిన సమస్తవస్తువులను సృజించి యీ ఆశ్చర్యకరమయిన విశ్వయంత్రమును నిర్మాణము చేసెను

వి మూలములో ఈవాక్యమునకుముందు "సోఽకామయత బహుస్యాం ప్రజాయే యేతి" అనఁగా "నేను అనేకమగుదునుగాక, నేను జన్మింతును గాక" యను వాక్యము గలదు దీని తరువాత "స తపోఽతప్యత" అను మాటలు వచ్చును ఇచ్చోట తపస్సనఁగా కేవలము సంకల్పమే అని అర్థము కావచ్చును కాని, రాను రాను తపస్సు అనునది తీవ్రప్రయత్నమునకు పర్యాయపదమయినది. తపస్సను శబ్దప్రయోగమును బట్టి సృష్టి భగవంతుని తీవ్రమయిన మననధ్యానముల ఫలితముగాని పట్టి ఊహ గాదని మనము తెలిసికొనవలయును. ఈసృష్టికథనమును బైబిలులోని సృష్టికథనముతో మనము పోల్చి చూడవచ్చును. అందు సృష్టి భగవంతుని తీవ్రాలోచన ఫలితముగా కనుపింపదు మహర్షి దేవేంద్రనాథ రాకూరు ఈ విషయమునుగూర్చి తన వ్యాఖ్యానములో ప్రస్తావింపలేదు ఇతర సాహాయ్యమేమి లేకుండ భగవంతుఁడు సృష్టిచేసె నను సంగతిని వారు పరిస్ఫుటముగా తెలియఁజేసిరి. కాని ఈవాక్యమును రచించిన ఋషియొక్క హృదయములో "అతప్యత" అను పదముకంటె తపస్సునదియే ముఖ్యముగా నున్నట్లు తోఁచెడిని

**మూ ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః సర్వేన్ద్రియాణి చ**
**ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్యధారిణీ 3**

[ముండక-౨ ముం-౧ ఖం. 3 వా.]

టీ ఏతస్మాత్=ఇతనినుండి, ప్రాణః=ప్రాణము, సర్వేన్ద్రియాణిచ = సకలేంద్రియములు, ఖం=ఆకసము, వాయుః=వాయువు, జ్యోతిః=అగ్ని, ఆపః=ఉదకము, విశ్వస్య=సర్వమునకు, ధారిణీ=ఆధారమైయుండెడి, పృధివీ = భూమియు, జాయతే=ఉత్పన్నమగుచున్నది

తా ఇతనినుండి ప్రాణము,మనస్సు, సకలేంద్రియములు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, సర్వమునకు ఆధారభూతమయిన ఈపృథివి ఉత్పన్నము లయ్యెను

వ్యా జలము, వాయువు, అగ్ని మొదలయిన సకల విశ్వనిర్మాణోపకరణములను, ప్రాణమును, మనస్సును, సర్వేంద్రియములను కేవలము తన యిచ్ఛామాత్రముచేతనే సమస్తశక్తిమంతుఁడగు ఆపూర్ణపురుషుఁడు సృష్టిచేసెను.

వి ఈవాక్యమునందు బ్రహ్మమునకును విశ్వమునకును గల సంబంధము వివరింపఁబడినది. ఇది కైకొనఁబడిన ద్వితీయముండకములోని ప్రథమఖండమునందలి మొదటివాక్యములో జ్వలించుచుండెడి అగ్నినుండి వెలువడెడు విస్ఫులింగమువంటిది సృష్టి యని వర్ణింపఁబడియెను నాల్గవవాక్యములో స్వర్గము శిరస్సుగను, సూర్యచంద్రులు నేత్రములుగను, వివిధవస్తువులు వివిధేంద్రియములుగను వర్ణింపఁబడినవి. వీనిని వదలిపెట్టి యెట్టి వివాదములకును అవకాశ మీయనట్టియు, ఏకేశ్వరవాదులగు నెల్లవారును అంగీకరించునట్టియుం మూఁడవ వాక్యమును మహర్షి తీసికొనెను.

**మూ. భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః**
**భయాదిన్ద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతిపఞ్చమః ౭**

[కఠ-3. అ. ౬-వ. 3-వా]

టీ అస్య=ఈపరమేశ్వరుని, భయాత్=భయమువలన, అగ్నిః=నిప్పు, తపతి=మండుచున్నది, అస్య = ఈపరమేశ్వరుని, భయాత్=భయమువలన, సూర్యః=సూర్యుఁడు, తపతి=వెలుఁగుచున్నాఁడు, అస్య=ఈపరమేశ్వరుని, భయాత్=వెఱపువలన, ఇన్ద్రశ్చ=మేఘుఁడును, వాయుశ్చ = వాయువును, పఞ్చమః= అయిదవదియైన, మృత్యుః = మరణమును, ధావతి = నడచుచున్నది.

తా ఈతని భయమువలన అగ్ని మండుచున్నది; ఈతని భయమువలన సూర్యుఁడు వేడిమి నిచ్చుచున్నాఁడు, ఈతని భయమువలన మేఘుఁడును, వాయువును, మృత్యువును నడుచుచున్నారు.

వ్యా సర్వనియంతయగు పరమేశ్వరుని యిచ్ఛ ననుసరించియే అగ్ని వేడిమి నిచ్చుచున్నది, సూర్యుఁడు ప్రకాశించుచున్నాఁడు; మేఘము వర్షము కురియుచున్నది, వాయువు వీఁచుచున్నది; మృత్యువు సయితము సంచారము చేయుచున్నది ఏపదార్థమును అతని యిచ్ఛను, అతని శాసనమును అతిక్రమింపఁజాలదు సూర్యచంద్రులును గ్రహనక్షత్రములును, వాయు

జలంబులును, జడపదార్థములయ్యు ఆతని భయమువలన తమతమ కార్యములను జరుపుచున్నవి.

౨. భగవంతునిచే సృష్టింపఁబడుటయే గాక యీవిశ్వ మతనిచే పరిపాలింపఁబడుచున్నదని యీవాక్యముయొక్క తాత్పర్యము ఇందలి సూర్యాదులను మహర్షి కేవలము భౌతికవస్తువులనుగా భావించెను. కాని వాక్యములోని ఇంద్ర, పంచమ (అయిదవదేవత) అను పదములను బట్టి చూచినచో తత్పదములకు అర్థము సూర్యాదిదేవతలై యుండు నని మనకు తోఁచఁగలదు. ఇంకొక విశేషము. ఈవాక్యమును ప్రవచించిన ఋషీశ్వరుఁడు వైదికయుగమునందలి బహుదేవతావాదమును అతిక్రమించినవాఁడై ఇంద్రాదిదేవతల నెల్ల పరిపాలించెడు సర్వశ్రేష్ఠుఁడగు పరబ్రహ్మమును గుర్తించెనని మనము గ్రహింపఁదగును.



# మూఁడవ అధ్యాయము



మూ. తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్
తస్మై సవిద్వానుపసన్నాయ సమ్యక్ ప్రశాన్తచిత్తాయ
శమాన్వితాయ యేనాక్షరం పురుషం వేద సత్యం
ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్ ౧

[ముండక-౧. ముం-౨ ఖం. ౧౨, ౧౩ వా.]

టీ సః=అతఁడు (బ్రహ్మజిజ్ఞాసువు), తత్=బ్రహ్మమును, విజ్ఞానార్థమ్ = చక్కఁగా తెలిసికొనుటకై, గురుమేవ=బ్రహ్మనిష్ఠుఁడైన ఆచార్యునిగూర్చియే, అభిగచ్ఛేత్=పోవలయును; సః=అతఁడు, (ఆ) విద్వాన్=బ్రహ్మస్వరూపము నెఱింగినవిద్వాంసుఁడు, సమ్యక్=చక్కని, ప్రశాన్తచిత్తాయ=చాంచల్యరహితమయిన మనస్సుగలవాఁడై, (కామక్రోధాది దోషదూరుఁడై), శమాన్వితాయ = అంతరింద్రియనిగ్రహముతోఁగూడినవాఁడై (ఇంద్రియచాంచల్యరహితుఁడై), ఉపసన్నాయ=వచ్చినట్టి, తస్మై=వానికొఱకు (ఆ బ్రహ్మజిజ్ఞాసువుకొఱకు), యేన = దేనిచేత (ఏవిద్య చేత) అక్షరం=క్షయరహితుఁడును, పురుషం=

పూర్ణుఁడును, సత్యం=సత్స్వరూపుఁడును (అయినబ్రహ్మమును) వేద = తెలిసికొనుచున్నాఁడో, తాం=ఆ, బ్రహ్మవిద్యామ్ = బ్రహ్మవిద్యను, తత్త్వతః = యథార్థముగా, ప్రోవాచ = చెప్పవలయును

తా పరబ్రహ్మమునుగూర్చి విశేషజ్ఞానమును పొందుటకు శిష్యుఁడు ఆచార్యుని సన్నిధానమునకు పోవలయును జ్ఞానసంపన్నుఁడగు ఆ యాచార్యుఁడు శిష్యుని శాంతశమాన్వితచిత్తమును జూచి యేవిద్యవలన అక్షర సత్యపురుషుని తెలిసికొనవచ్చునో ఆవిద్యను ఉపదేశింపవలయును

వ్యా మనస్సును సంయతము చేసికొని ప్రశాంతులై పరబ్రహ్మమునుగూర్చి ఉపదేశమును పొందునిమిత్తమై బ్రహ్మవిదుఁడయిన ఆచార్యుని యొద్దకు చనుట యెల్లవారికిని కర్తవ్యము ఇఁక ఆగురువుయొక్క కర్తవ్యమేమనఁగా ఏజాతీయుఁడైనను సరే శాంతస్వభావముగలవాఁడై తన సమీపమునకు వచ్చెనేని తాను అతనికి యథావిధిగా నుపదేశము సలుపవలయును. అతని నలక్ష్యము చేయఁజనదు.

వి ఈ యధ్యాయములో బ్రహ్మజ్ఞానసంపాదన మార్గములను గూర్చియు, బ్రహ్మజ్ఞానముయొక్క ప్రాముఖ్యతనుగూర్చియు ప్రస్తావింపఁబడినది ఈవాక్యమునందు "సమిత్పాణిః శ్రోత్రియమ్ బ్రహ్మనిష్ఠమ్" అను ౧౨వ వాక్యమునందలి నాల్గవభాగము వదలివేయఁబడెను."వేదవిద్యాపారం

గతుఁడై సమిధలను చేఁదాల్చి బ్రహ్మనిష్ఠుఁడై'' అని విడిచివేయఁబడిన భాగముయొక్క అర్థము బ్రహ్మజ్ఞానార్థి సమిధలను చేతఁబట్టుకొని గురువు నొద్ద కరుగుట పూర్వపు టాచారము ఇక్కాలమున నిది యనావశ్యక మనవచ్చును కాని అతఁడు భక్తిశ్రద్ధలు గలవాఁడును సుశిక్షితుఁడు నై యుండుట పూర్వకాలమునందు వలె నిప్పుడును ముఖ్యమే. యోగ్యుఁడగు గురువునొద్ద జ్ఞానోపదేశమును పొందవలయు నని చెప్పుట యెంతయు సమంజసము. లౌకికవిద్యలను బడయుటకే యేపాఠశాలకో యేకళాశాలకో యరుగవలసియుండ బ్రహ్మజ్ఞానమును పొందుటకు సమర్థుఁడగు గురువుకడకు పోవలయు నని వేఱుగా చెప్ప పనిలేదు

**మూ** అపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వ
వేదః, శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛన్దో
జ్యోతిషమితి, అథ పరా యయా తదక్షర మధి
గమ్యతే ౨

[ముండక-౧ ముం-౧ ఖం. ౫. వా.]

టీ ఋగ్వేదః=ఋగ్వేదము, యజుర్వేదః = యజుర్వేదము, సామవేదః=సామవేదము, అథర్వవేదః=అథర్వవేదము, శిక్షా=ఉచ్చారణశాస్త్రము, కల్పః=మతవిషయక క్రియాగ్రంథము, వ్యాకరణము=శబ్దశాస్త్రము, నిరుక్తమ్=కఠినశబ్దార్థప్రతిపాదకగ్రంథము, జ్యోతిషం=జ్యోతిషము, ఇతి=ఇవి, అపరా=

శ్రేష్ఠముకానివిద్యలు, అథ=పిమ్మట, యయా=దేనిచేత (ఏవిద్య చేత),తత్=ఆ, అక్షరం=నాశరహితమయిన పరబ్రహ్మము, అధిగమ్యతే=ఎఱుఁగఁబడుచున్నాఁడో, (సా=ఆవిద్య) పరా=శ్రేష్ఠమయినది.

తా ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వవేదములును, శిక్షా, కల్ప, వ్యాకరణ, నిరుక్త, ఛన్దో, జ్యోతిషములను నీవిద్యలెల్ల శ్రేష్ఠవిద్యలు కావు దేనివలన అక్షరపురుషుని తెలిసికొనవచ్చునో అదియే శ్రేష్ఠవిద్య

వ్యా పరమేశ్వరుని స్వరూపాభిప్రాయములను గూర్చిన జ్ఞానమును పొందుటయే మనుష్యుని పరమపురుషార్థము. ఏ యే విద్యల నధ్యయనము చేసిన పరమవాంఛనీయమగు ఆ జ్ఞానరత్నము లభ్యము కాఁగలదో అదియే యథార్థమైన విద్య, అదియే శ్రేష్ఠ విద్య. మిగిలిన వన్నియు అశ్రేష్ఠవిద్యలు. ఈకారణముచేతనే ఋగ్యజుస్సామాథర్వములు, శిక్షా, కల్ప, వ్యాకరణ, నిరుక్త, ఛందోజ్యోతిషములు ఇవి యన్నియు శ్రేష్ఠముగాని విద్యలని చెప్పఁబడియెను. ఋగ్యజుస్సామాదులలో నేయే భాగములు, ఏయేశాస్త్రములు బ్రహ్మవిషయకమయిన యథార్థతత్వమును ఉపదేశము చేయునో అవియే శ్రేష్ఠవిద్యలు అవి సర్వసాధారణముగా నెల్లవారికిని నేర్పఁదగినవి.

ఏ దేనిని తెలిసికొన్న సర్వము తెలిసినదగునో అద్దానిని తనకు నెఱిగింపవలయు నని కోరఁగా అంగిరసుఁడు శౌనకునికి ఈశ్లోకరూపమున తన సమాధానమును చెప్పెను. వేదములు మిక్కిలి గౌరవబుద్ధితో చూడఁ

బడుచున్న అకాలమున నిది నుడువఁబడిన దన్న సంగతిని ముఖ్యముగా గమనింపవలయును. వేదవేదాంగము లెల్లను అపరావిద్య లనియు, బ్రహ్మజ్ఞానమే పరావిద్య యనియు ఋషీశ్వరుఁడు స్పష్టముగా వక్కాణించెను.

మూ యత్తదద్రేశ్యమగ్రాహ్యమగోత్రమవర్ణ
మచక్షుఃశ్రోత్రం తదపాణిపాదం
నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం
యద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః 3

[ముండ-౧ ముం-౧. ఖం. ౬. వా.]

టీ తత్=ఆఅక్షరస్వరూపము, యత్=ఏదియో, తత్=అది, అద్రేశ్యం=చక్షుస్సు మొదలయిన జ్ఞానేంద్రియములచే నెఱుఁగరానిది, అగ్రాహ్యం=కరములు మొదలగు కర్మేంద్రియములచె గ్రహింపరానిది, అగోత్రం=మూలములేనిది, అవర్ణం=శుక్లాదివర్ణములు లేనిది, అచక్షుఃశ్రోత్రం=కన్నులు చెవులు లేనిది, అపాణిపాదం = కరచరణములు లేనిది, నిత్యం=శాశ్వతమయినది, విభుం=వ్యాపకమయినది, సర్వగతం=సర్వాంతర్యామియైనది, సుసూక్ష్మం = అతిసూక్ష్మమయినది, ధీరాః=జ్ఞానులు, యత్=ఈ పూర్వోక్తలక్షణములుగల ఏఅక్షరస్వరూపమును, భూతయోనిం=జీవులకు జన్మస్థానమైనదిగా, పరిపశ్యన్తి=చూచుచున్నారో, తత్=అది, అవ్యయం=నాశరహితమయినది.

తా॥ ఎవఁడు జ్ఞానేంద్రియములచే తెలియఁజాలనివాఁడో, కర్మేంద్రియముల కతీతుఁడో, జన్మరహితుఁడో, రూపరహితుఁడో, చక్షుఃశ్రోత్రవిహీనుఁడో, అహస్తపాదశూన్యుఁడును, జన్మమృత్యువర్జితుఁడును, సర్వవ్యాపియు, సర్వగతుఁడును, అతిసూక్ష్మస్వభావుఁడును, అవ్యయుఁడును, సర్వభూతకారణుఁడును అగు పరబ్రహ్మమును జ్ఞానులు సర్వతోభావమున చూచెదరు

వ్యా॥ అతఁడు సృష్టికి అతీతమయిన పదార్థము, నేత్రములకు కనిపింపఁడు; హస్తములకు పట్టువడఁడు, అతఁ డేయింద్రియములకును గోచరుఁడు గాఁడు. అందువలన బ్రహ్మపరాయణులగు జ్ఞానులు సర్వభూతములకు కారణరూపమయిన అతనిని ఈసృష్టియందు సర్వతోభావమున నుపలబ్ధి చేసికొనెదరు.

వి॥ ఇది పూర్వవాక్యము తరువాతి వాక్యము బ్రహ్మజ్ఞానము సాధ్యమగునది యని సూచించుట కిది యుద్దేశింపఁబడినదై యుండనోపును. అట్లగుటంజేసి ''పరిపశ్యన్తి ధీరాః'' అన్న వాక్కులను మనము శ్రద్ధగా గమనింపఁ దగును. ఈవాక్యములోని ప్రథమభాగము బ్రహ్మమును తెలిసికొనుట యెంత కష్టమో తెలుపుచున్నది. అయినను ధీరులు అతనిని స్పష్టముగా దర్శింతురని ఋషి పల్కుచున్నాఁడు. ఆధునిక సంస్కృత వాఙ్మయములో ''ధీరః'' అన్నపదమునకు స్థిరమయిన మనస్సుగలవాఁ డని అర్థము. కాని ఉపనిషత్తులలో నిది జ్ఞానసంపన్నుఁడను అభిప్రాయమునుగూడ కల్గియుండెను.

ప్రకృతవాక్యములో 'ధీరః' అన్నశబ్దము బుద్ధిసంపత్తియు, నైతికనిష్ఠయు గలవాఁ డన్న అర్థములో నుపయోగింపఁబడిన దనుట నిస్సందేహము. తగిన సాధనల నవలంబించినచో శ్రద్ధతో నన్వేషించువాఁడు బ్రహ్మజ్ఞానమును పడయఁగలఁడని తెలుపుటకై యీశ్లోక మీయధ్యాయములో శ్రీదేవేంద్ర నాథ మహర్షి చే చేర్పఁబడియెను

**మూ ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదన్తి అస్థూల మనణ్వహ్రస్వమదీర్ఘ మలోహిత మస్నేహ మచ్ఛాయ మతమోఽవాయ్వనాకాశ మసఙ్గమరస మగన్ధ మచక్షుష్క మశ్రోత్ర మవాగమనోఽతేజ స్క మప్రాణ మముఖమమాత్రమ్. ౪**

[బృహ-3 అ-౮ బ్రా-౮. వా.]

టీ హేగార్గి=ఓగార్గి (దేనిని), బ్రాహ్మణాః = బ్రహ్మజ్ఞానులు, అభివదన్తి=నమస్కరించెదరో (అయ్యది), ఏతత్ అక్షరం = ఈక్షయరహితమయిన పరబ్రహ్మమే తత్ = అయ్యది, అస్థూలం=స్థూలవస్తువు గాదు, అనణు=అణువు గాదు, అహ్రస్వం=పొట్టిదిగాదు, అదీర్ఘం = పొడుగయినదిగాదు, అలోహితం=ఎఱుపుగాదు, అస్నేహం=ద్రవపదార్థము గాదు,అచ్ఛాయం=నీడగాదు, అతమః=చీఁకటిగాదు, అవాయు=గాలిగాదు, అనాకాశం =ఆకాశముగాదు, అసఙ్గం=సుఖదుఃఖములు లేనిది,

అరసం=రసము లేనిది,అగంధం = వాసన లేనిది, అచక్షుష్కం= నేత్రములు లేనిది,అశ్రోత్రం=చెవులు లేనిది, అవాక్ =వాక్కు లేనిది, అమనః=మనస్సు లేనిది, అతేజస్కం= తేజస్సు లేనిది, అప్రాణం=ప్రాణము లేనిది, అముఖం=నోరు లేనిది, అమాత్రం= ఉపమానరహితమయినది

తా ఓగార్గి! బ్రహ్మజ్ఞాను లెవ్వనికి నమస్కరించెదరో అతఁడు ఈ నాశరహితమయిన పరబ్రహ్మమే అతఁడు స్థూలుఁడుగాఁడు, అతఁడు అణువుగాఁడు, అతఁడు హ్రస్వుఁడుగాఁడు, అతఁడు దీర్ఘుఁడుగాఁడు,అతఁడు ఎఱుపుగాఁడు,ద్రవముగాఁడు, ఛాయగాఁడు, చీఁకటిగాఁడు, వాయువుగాఁడు,ఆకసముగాఁడు, సుఖదుఃఖములు లేనివాఁడు, రుచి లేనివాఁడు, వాసన లేని వాఁడు, నేత్రములు లేనివాఁడు, కర్ణములు లేనివాఁడు, వాక్కు లేనివాఁడు, అతఁడు మనోవిహీనుఁడు, తేజోవిహీనుఁడు, శారీరకప్రాణవిహీనుఁడు, ముఖవిహీనుఁడు, ఎవ్వనితోను అతనిని పోల్చుటకు వీలుగాదు

వ్యా అతఁడు స్థూలవస్తువుగాఁడు, అణువుగాఁడు, పొట్టిగాఁడు, పొడుగుగాఁడు, అతని కెట్టి పరిమాణమును లేదు. అతఁడు అలోహితుఁడు. ఎఱుపు మొదలైన వర్ణములు అతనికి లేవు. అతఁడు అస్నేహము. అనఁగా తైలమువంటి పదార్థముగాఁడు. అతఁడు అవాయువు-వాయువువంటి పదార్థముసుగాఁడు, అతఁడు రసమునుగాఁడు. అతఁడు గంధమునుగాఁడు, ఇవి యెల్ల

బాహ్యజడవస్తువుల స్వభావములు ఆతఁడెన్నటికిని జడముగాఁడు. అందువల నసే యివి యెవ్వియు నాతనియందు కించిత్తయినను లేవు. అతఁడు జడవస్తు వెట్లు కాఁడో ఆదేతీరున మనవంటి జడశరీరవిశిష్టుఁడునుగాఁడు. అతనికి స్థూలప్రాణము లేదు నోరు మొదలయిన అవయవములును లేవు. మన మన శ్శరీరము లెట్లు పరస్పరసంబంధము గలవై, తత్సంబంధమువలన మన మెట్లు చూచుటకు, వినుటకు, మాటాడుటకు వీలు కలుగుచున్నదో అట్టి విధమున పరమేశ్వరుఁడు శరీరమనోవిశిష్టుఁడగు జీవిగాఁడు అందుచే మనవలె నతఁడు చక్షువులతో చూచుటలేదు, నోటితో మాటాడుటలేదు. అతఁడు నేత్రవిహీ నుఁడు, శ్రోత్రవిహీనుఁడు, వాగ్విహీనుఁడు అతఁడు మనోరహితుఁడు అనఁగా అతఁడు దేహశూన్యమగు మనస్సునుగాఁడు, అందువలన నతనికి మానసికవ్యా పార మించుకైనను లేదు. ఆతఁడు అసంగుఁడు అనఁగా సాంసారికసుఖదుఃఖ ములందు తగిలినవాఁడు గాఁడు అతఁడు జడమునుగాక మనస్సునుగానిచో నింక నతఁడేమి? అతఁడు ఛాయయా? అంధకారమా? ఆకాశమును బోలిన యొకానొక అవస్థావిశేషమా? కాఁడు అతఁడు ఛాయగాని, అంధకారము గాని, ఆకాశమువంటి యొకానొక అవస్థావిశేషముగాని కాఁడు అతఁడు నిత్య సత్యవస్తువు, అతఁడు అనంతస్వరూపి, జ్ఞానస్వరూపి, అతనితో దేనిని బోల్చుటకును వీలులేదు. జడముకంటె మనస్సెవ్విధమున శ్రేష్ఠమో అదియే తీరున మనస్సుకంటె జ్ఞానస్వరూపియగు పరమాత్మ అనంతగుణముల శ్రేష్ఠుఁడు. అతని జ్ఞానము సృష్టింపఁబడిన మానసికజ్ఞానము వంటిదిగాదు జ్ఞానక్రియ అతనికి స్వభావసిద్ధము. ఏ వస్తువునయినను తెలిసికొనుటకు ఆ సర్వజ్ఞుఁడయిన పరమపురుషునికి ఇంద్రియము లావశ్యకములుగావు. భూతకాలవృత్తాంతము నెఱుంగుట కయినను అతనికి జ్ఞాపకశక్తి ఆవశ్యకముగాదు. ఏకకాలమునందే

అతఁడు సమస్తవస్తువులను గ్రహించుచున్నాఁడు మనకువలె నతనికి క్రోధము లేదు, ద్వేషమును లేదు, అసూయయు లేదు, శోకమును లేదు అంటియేగాదు. మనకువలె నతనికి దయయు లేదు, స్నేహమును లేదు, ప్రేమయు లేదు, హర్షమును లేదు అతఁడు మంగళస్వరూపి అతని మంగళభావములో నంతర్భూతమైయున్న స్నేహమును, కరుణయు, ప్రీతియు నతని నుండి ప్రవహించి జగత్తును తడుపుచున్నవి. అతఁడు మన మానసికవృత్తులగు న్యాయ, దయా, స్నేహ, ప్రేమభావములను ఎన్నియో మడుంగు లతిక్రమించుచున్నాఁడు. మనప్రేమ ఆ అనంతప్రేమలో లవమాత్రము

వి. పూర్వవాక్యములోని భావమునే యిదిగూడ స్ఫురింపఁజేయుచున్నది. మూలవాక్యమునందలి కడపటిభాగము మాత్రమిందు విడిచివేయఁబడినది బ్రహ్మజ్ఞానసంపాదనములోఁగల కష్ట మిందు మఱింత స్పష్టముగా చూపఁబడినది. అతఁడు అనిర్వచనీయుఁడని యీవాక్యము గట్టిగా తెలుపుచున్నది. అయినప్పటికిని అతఁడు అగ్రాహ్యుఁడు గాఁడని నిరూపించుటయే దీని విశేషము అందుచే ఈవాక్యమునందలి "అభివదన్తి" యన్నపదము ముఖ్యముగా నాలోచింపఁదగును. ఈపదమునకు "చెప్పుదురు" అని గాని "నమస్కరింతురు" అని గాని అర్థము వ్యాఖ్యామూలరు మొదటి అర్థమును గైకొనెను. రెండవ అర్థమే యుక్తమని నా అభిప్రాయము. ఈవాక్యములో 'బ్రాహ్మణ' అన్నపదమునకు బ్రహ్మజ్ఞానులని అర్థముగాని యేదోయొకకులమువారని గాదు

మూ. ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి,
సూర్యాచన్ద్రమసౌ విధృతౌ తిష్ఠతః　　౫

[బృహ-3. అ-౮ బ్రా-౯ వా.]

టీ　హేగార్గి = ఓగార్గీ! ఏతస్యవై = ఈ, అక్షరస్య= క్షయరహితునియొక్క, ప్రశాసనే = ఆజ్ఞయందు, సూర్యాచంద్రమసౌ=సూర్యచంద్రులు, విధృతౌ = నిలుపఁబడినవారై, తిష్ఠతః = ఉన్నారు

తా　ఈ అక్షరపురుషుని శాసనమువలన, ఓగార్గీ! సూర్యచంద్రులు నిలుపఁబడినవారై యున్నారు

వ్యా　అతని శాసనముచే సూర్యుఁడు సౌరమండల మధ్యస్థానమున మహాజ్యోతిపకై నుండి తన్మండలమునంగల భూలోకమును, గ్రహములనంబడు తదితరలోకములను తన వెలుతురుచే ప్రకాశింపఁజేయుచున్నాఁడు. స్వీయశక్తిచే వానిని తమతమ గతులయందు ఆకర్షించి యుంచుచున్నాఁడు. అంతియేగాక, తన వెలుతు రొసంగుచు పశుపక్ష్యాది జంతువులను వృక్షలతాదిఉద్భిజ్జములను జీవింపఁజేయుచున్నాఁడు.సర్వమనోహరుఁడును సుధాంశుఁడునగు చంద్రుఁడుగూడ అతని నియమమునకు బద్ధుఁడై గగనమార్గమున సంచరించుచు ఒక్కొక్కరాత్రి ఒక్కొక్క నూతనవేషమును తాల్చుచు నెల్లర హృదయములను వికసింపఁజేయుచున్నాఁడు. అంతియేగాక మనోరంజకమగు తన తేజస్సు నొసంగి సకలోద్భిజ్జములను తేజోవంతములుగను చైతన్యవంతములుగను జేయుచున్నాఁడు.

వి ఇది బృహదారణ్యకోపనిషత్తులో వెనుకటి వాక్యము తరువా తిది; దీనిని మహర్షి నాల్గు భాగములుగా విడదీసి నాల్గు ప్రత్యేకవాక్యము లుగా నీ బ్రాహ్మధర్మమున పొందుపఱిచెను. ప్రాకృతిక శక్తులను శాసించు టలో భగవంతుఁడు ప్రకటించు మహత్త్వ మిందు వ్యక్తీకరింపఁబడినది అతని ఆజ్ఞాధీనులై సూర్యచంద్రులు తమతమ స్థానములందు నిలిచియున్నారు.

మూ ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి,
ద్యావాపృథివ్యౌ విధృతే తిష్ఠతః. ౬

[బృహ-3. అ-౮ బ్రా-౯. వా]

టీ హేగార్గి = ఓగార్గి, ఏతస్యవై = ఈ, అక్షరస్య = క్షయరహితుని, ప్రశాసనే=ఆజ్ఞయందు, ద్యావాపృథివ్యౌ = భూమ్యంతరిక్షములు, విధృతే = నిలుపఁబడినవై, తిష్ఠతః = ఉన్నవి.

తా ఈ అక్షరపురుషుని శాసనమువలన, ఓగార్గీ! ద్యు లోకభూలోకములు నిలుపఁబడినవై యున్నవి

వ్యా భూలోకముగాక తద్భిన్నమైన సూర్యచంద్రగ్రహనక్ష త్రాది జ్యోతిర్మయలోకములకు మొత్తముమీఁద పెట్టిన సాధారణనామము ద్యులోకము. మన పదతలమునందున్న భూలోకమును పయిభాగమునం దున్న ద్యులోకమును- ఈ రెండులోకములను మంగళస్వరూపియగు ఆ విశ్వ

రక్షకుని ఆజ్ఞచేతనే నిలిచియున్నవి వానిలోని ఒక్కకణమయినను ఆతని నియమమును తప్పించుకొననేరదు

వి భగవంతుని సర్వనియంతృత్వమునకు దృష్టాంతములుగా నిందు భూమ్యాకాశములు పేర్కొనఁబడియెను.

**మూ ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి నిమేషా ముహూర్తా అహోరాత్రాణ్యర్ధమాసామాసాఋతవః సంవత్సరా ఇతి విధృతా స్తిష్ఠన్తి ౭**

[బృహ-౩. అ-౮ బ్రా-౯ వా.]

టీ హేగార్గి=ఓగార్గి, ఏతస్యవై=ఈ, అక్షరస్య=నాశరహితునియొక్క, ప్రశాసనే=ఆజ్ఞయందు, నిమేషాః = నిమిషములు, ముహూర్తాః=ముహూర్తములు, అహోరాత్రాణి=రాత్రింబగళ్లు, అర్ధమాసాః = పక్షములు, మాసాః = మాసములు, ఋతవః=ఋతువులు, సంవత్సరాః = సంవత్సరములు, ఇతి=ఈకాలావయవములు,విధృతాః=నిలుపఁబడినవై, తిష్ఠన్తి=ఉన్నవి

తా ఈ అక్షరపురుషుని శాసనముచేత, ఓగార్గి,నిమిషములు, ముహూర్తములు, అహోరాత్రములు, పక్షములు, మాసములు, ఋతువులు, సంవత్సరములు, ఈ సమస్తమును నిలుపఁబడినవై యున్నవి

వ్యా. ఆయాకాలములందు జరుగు సకల కార్యములును అతని నియమమువలననే జరుగుచున్నవి. అతని నియమములు మీఱుటకు వీలు గానివి. వానికి లోఁబడక స్వల్పకార్యమయినను జరుగనేరదు

వి. అనుల్లంఘనీయమగు భగవంతుని చండశాసనమునకు నుదాహరణములుగా సంవత్సరములు, ఋతువులు, మాసములు, పక్షములు, పగళ్లు, రాత్రులు-ఈ యన్నింటియొక్క రాకపోక లిందు పకాృణింపఁబడినవి

**మూ ఏతస్యవాఅక్షరస్య ప్రశాసనేగార్గిప్రాచ్యోఽన్యానద్యః స్యన్దన్తే శ్వేతేభ్యః పర్వతేభ్యః ప్రతీచ్యోఽన్యాః౦**

[బృహ-3. అ-౮. బ్రా-౯. వా.]

టీ హేగార్గి = ఓగార్గీ, ఏతస్యవై=ఈ, అక్షరస్య=క్షయరహితునియొక్క, ప్రశాసనే=ఆజ్ఞయందు, శ్వేతేభ్యః=హిమవంతము మొదలగు, పర్వతేభ్యః=కొండలనుండి, ప్రాచ్యః=తూర్పుగాపోవునట్టి, అన్యాః=కొన్ని, నద్యః=నదులును, ప్రతీచ్యః=పడమటిదిక్కుగా పోవునట్టి, అన్యాః=ఇతరములగు నదులును, స్యన్దన్తే=ప్రవహించుచున్నవి

తా. ఈ అక్షరపురుషుని శాసనముచె ఓగార్గి! తూర్పు దిక్కుగా పోవునట్టియు, పడమటిదిక్కుగా పోవునట్టియు అనేకనదులు శ్వేతాచలము మున్నగుపర్వతములనుండి ప్రవహించుచున్నవి

వ్యా. పరమ మంగళస్వరూపియగు పరమేశ్వరుని నియమముచే వేగవంతములగు సమస్త నదులును ఉన్నతోన్నత పర్వతములనుండి స్రవించి సవై ప్రవహించి అసంఖ్యాకములగు జీవజంతువులకు మిక్కిలి ఉపకారమును, కల్యాణమును కలిగించునవి యయ్యెను. మన దృష్టికి గోచరముగానట్టియు, మన మెఱుఁగనట్టియు నేదో యొకపర్వతముయొక్క ఒకానొక భాగమునందు జలము కొంత చేరుచున్నది. ఆ జలరాశికి నెన్నియో వందలు మైళ్ల దూరమున నున్నవారమయినను మనము అద్దానిని అనాయాసముగా పొందుచున్నాము

వి. కొన్ని నదులను తూర్పు వైపునకును, మఱికొన్నింటిని పడమటి వైపునకును ప్రవహింపఁజేయుచు భరతఖండమునందలి విశాలమైన మైదానములనెల్ల జలసమృద్ధము చేసెడు భగవంతుని శాసనమును తెలిసికొన్నప్పుడు తనకుఁ గల్గిన ఆశ్చర్యానందములను ఋషీశ్వరుఁ డీశ్లోకమునందు వ్యక్తపఱుచుచున్నాఁడు సూర్యరశ్మిచే సముద్రజలము ఆవిరిరూపమును దాల్చి, పయికెగసి మేఘములుగా నేర్పడుటయు, అవి యేపర్వత ప్రాంతములకో వాయువశమున కొట్టుకొనిపోయి అచట వర్షించుటయు, తన్మూలమున లెక్కలేని నదులును సెలయేళ్లును బయలుదేఱుటయు, అయ్యవి తమ జలములను గొంపోయి తిరిగి సముద్రములోఁ గుమ్మరించుటయు నిశ్చయముగా ఈశ్వరుని కృపాతిశయమునకు ప్రబల దృష్టాంతము. ఈ వాక్యమును రచించిన ఋషి హిందూదేశ నైసర్గికస్వరూపమును కొంతవఱకు నెఱింగినవాఁడని మనము గ్రహింపవచ్చును బృహదారణ్యకమునందలి మూలవాక్యములో మానవులు భగవంతుని స్తోత్రము చేసినట్లు సూచించెడు పంక్తి యొకటి కలదు. దానిని

మహర్షి వదలివైచెను. దానిమూలమున వాక్యార్థమునకు లోపము కలుగు టకు మాఱుగా విలువయే హెచ్చెను.

**మూ యోవా ఏతదక్షరం గార్గ్యవిదిత్వాఽస్మిల్లోకే జుహోతి యజతే తప స్తప్యతే బహూని వర్షసహస్రాణ్యన్త వదేవాస్య తద్భవతి.**

[బృహ-3. అ-ర. బ్రా-౧౦ వా]

టీ హేగార్గి=ఓగార్గీ, యః=ఎవ్వఁడు, ఏతదక్షరం=ఈ నాశరహితుఁడగు పరమేశ్వరుని, అవిదిత్వా = ఎఱుఁగక, బహూనివర్షసహస్రాణి=అనేకసహస్ర సంవత్సరములు, అస్మిల్లోకే=ఈలోకమునందు, జుహోతి = హోమము చేయునో, యజతే=యజ్ఞము చేయునో, తపస్తప్యతే = తపస్సు చేయునో, అస్య=వీనికి, తత్=ఆఫలము, అన్తవదేవ = నాశముగలదిగనే, భవతి=అగుచున్నది

తా ఓ గార్గీ! ఈనాశరహితుఁడగు పురుషుని తెలిసికొనక బహు సహస్ర సంవత్సరములు ఈలోకమునందు హోమ, యాగ,తపస్సులఁజేసినను ఏవ్యక్తియు సుస్థిరఫలమును పొందఁజాలదు

వ్యా మంగళస్వరూపియగు పరమేశ్వరుని హృదయమునందు సాక్షాత్తుగా నెఱిఁగి అతనితో ప్రీతిభావముచే కట్టువడియుండవలయును. అతని కార్యము లెవ్వియో విని, తెలిసికొని, వాని నాచరింపవలయును.

అపుడు అతని సహవాససంజనితమయిన అనంత ఫలమును పొందనగును. అతనిని తెలిసికొనక అన్యమనస్కుఁడును విషయాసక్తుఁడునై బాహ్యాడంబరములతో దివారాత్రులు అతని ఉపాసన సలిపినను కాక లోకమును రంజింపఁజేయుటకై వ్యర్థములగు యజ్ఞయాగ క్రియాకలాపములందు మనశ్శరీరముల వినియోగించినను, కాక పేరు ప్రతిష్ఠలను ఆశించి తన సర్వస్వమును పరులకు పంచిపెట్టినను ఈశ్వరునితో నతనికి నీషన్మాత్రమయినను సంబంధ మేర్పడదు. అందువలన శాశ్వతమయిన ఫలమును కలుగదు ఎవఁడు ఈశ్వరజ్ఞానమును బడసి, ప్రీతిపూర్వకముగా నతని ప్రియకార్య సాధన తత్పరుఁడై, అతనిచే ప్రతిష్ఠింపఁబడిన ధర్మమును ఆచరించునో అతనికి ధర్మలక్షణములెల్ల లభించును. అదియుఁ గాక, అతఁడు అనంతకాలము పరమప్రార్థనీయమగు అక్షయ బ్రహ్మానందమును అనుభవించును.

వి ఇది బృహదారణ్యకము, 3-వ అధ్యాయము ౮-వ బ్రాహ్మణములోని ౧౦-వ వాక్యమని యుదాహరింపఁబడినది ఇయ్యది ఆ వాక్యములోని మొదటి సగభాగము మాత్రమే బ్రహ్మజ్ఞాన ప్రాశస్త్యమును గూర్చి యిది నొక్కి చెప్పుచున్నది అమృతత్వము, శాశ్వతశాంతి మున్నగు సుస్థిర ఫలితములు బ్రహ్మజ్ఞానమువలననే గాని యజ్ఞయాగాదులవలన నెంతమాత్రమును కలుగఁజాలవని ఋషీశ్వరుఁ డిందు స్పష్టముగా పలుకుచున్నాఁడు

మూ యోవా ఏతదక్షరం గార్గ్యవిదిత్వాస్మాల్లోకాత్
ప్రైతిసకృపణః, అథ య ఏతదక్షరం గార్గి విదిత్వా
స్మాల్లోకాత్ ప్రైతి సబ్రాహ్మణః ౧౦

[బృహ-3 అ-౮ బ్రాహ్మ-౧౦. వా]

టీ యః=ఎవ్వఁడు, ఏతత్=ఈ, అక్షరం = అక్షయుని, అవిదిత్వా=ఎఱుఁగక, అస్మాత్ లోకాత్ = ఈ లోకమునుండి, ప్రైతి=తరలిపోవుచున్నాఁడో, హేగార్గి=ఓగార్గి, సః=వాఁడు, కృపణః=దీనుఁడు, అథ=అనంతరము, యః=ఎవ్వఁడు, ఏతదక్షరం=ఈనాశరహితుని, విదిత్వా=తెలిసికొని, హేగార్గి=ఓగార్గి, అస్మాత్=ఈ, లోకాత్=లోకమునుండి, ప్రైతి=తరలిపోవునో, సః=అతఁడు, బ్రాహ్మణః=బ్రహ్మజ్ఞాని

తా ఓగార్గీ! ఎవఁడు ఈ అక్షరపురుషుని తెలిసికొనక యీ లోకమునుండి తరలి పోవునో అతఁడు కృపాపాత్రుఁడగు అతి దీనుఁడు. ఎవఁడు ఈనాశరహితుని తెలిసికొని యీలోకమును విడిచిపోవుచున్నాఁడో అతఁడు బ్రాహ్మణుఁడు (బ్రహ్మజ్ఞాని)

వ్యా భూమిలోఁ గల సమస్త జీవులలో మనుష్యుఁ డొక్కఁడు మాత్రమే బ్రహ్మజ్ఞానమునకు అధికారి. పరాత్పరుఁడగు ఈశ్వరుని, అతనిచే ప్రతిష్ఠింపఁబడిన ధర్మ సముదాయమును, తెలిసికొనెడు అధికారము కలదు. కనుకనే మనుష్యనామమున కింతటి గౌరవ మేర్పడినది. ఎవఁడు పరమోత్కృష్టమయిన యీ మానవజన్మమును పొందియు పరబ్రహ్మమును తెలిసికొనఁజాలఁడో, అతనికంటె హతభాగ్యుఁడు మఱియెవ్వఁడు గలఁడు? పరమ ప్రీతిభాజనుఁడగు పరమేశ్వరుని పొందుటచే జనించెడు 'అనిర్వచనీయానందమును ఎవ్వఁడు ఆస్వాదింపఁగల్గియు, ఆస్వాదింపఁజాలక పోయెనో

అతనికంటె దీనుఁడు మఱియెవ్వఁడు? అతఁడు కృపాపాత్రుఁడగు అతి దీనుఁడు అతని జన్మము దుర్భరమయిన పశుజన్మము ఇఁక నెవ్వఁడు అప్పర మపురుషుని తెలిసికొని ఈలోకమునుండి వెడలిపోవునో అతఁడు పరమ సౌభాగ్యవంతుఁడు. అతఁడు మానవులలో శ్రేష్ఠుఁడు, అతఁడే బ్రాహ్మణుఁడు

వి ఇది పూర్వోక్త బృహదారణ్యకోపనిషద్వాక్యములో మిగిలిన సగభాగము (బ్రహ్మజ్ఞానము మానవజీవితముయొక్క ముఖ్యలక్ష్యమగుటచే, నద్దానిని పొందక యెవ్వఁడీ లోకమును వీడుచున్నాఁడో, అట్టివాఁడు నిజ ముగా జాలిపడఁదగినవాఁడు. ఇఁక నెవ్వఁడీ జన్మములో బ్రహ్మజ్ఞానమును బడ యునో అతఁడు ధన్యుఁడు. అతఁడే బ్రాహ్మణుఁడు బ్రాహ్మణుఁడన బ్రాహ్మణ కులజుఁడని గాక బ్రహ్మజ్ఞానసంపన్నుఁడని యర్థము.

మూ తద్వా ఏతదక్షరం గార్గ్యదృష్టం ద్రష్ట్రశ్రుతం శ్రోత్ర
మతం మంత్రవిజ్ఞాతం విజ్ఞాత్రే తస్మిన్ను ఖల్వక్షరే
గార్గ్యాకాశ ఓతశ్చప్రోతశ్చ ౧౧

[బృహ- 3. అ-౮. బ్రా-౧౧. వా]

టీ హేగార్గి=ఓగార్గీ, ఏతదక్షరం=ఈనాశరహితుఁడు, అదృష్టం=దృష్టికి విషయముకాఁడు, ద్రష్టృ=(తాను) చూడ గలవాఁడు,అశ్రుతం=శ్రోత్రమునకు విషయముకాఁడు,శ్రోతృ= (తాను) వినఁగలవాఁడు, అమతం = మనసునకు పట్టుపడఁడు, మన్తృ = (తాను) మనఃకార్యమును సలుపఁగలవాఁడు, అవి

జ్ఞాతం=బుద్ధికివిషయముకాఁడు, విజ్ఞాతృ = (తాను) బుద్ధికృత్యము చేయఁగలవాఁడు, ఏతస్మిన్ అక్షరే=ఇట్టిఅక్షురునియందు, ఆకాశః=ఆకసము, ఓతశ్చప్రోతశ్చ=ఓతప్రోతభావముననున్నది (నేఁతలో పడుగు, పేక యెట్లు ఆధారాధేయములై కలిసియుండునో అట్లు ఆకాశము పరమాత్మయందు ఆధారాధేయముగా కలిసియున్నది).

తా ఓగార్గీ! ఈ క్షయరహితుఁడయిన పురుషుని ఎవ్వరును చూడలేదు. కాని అతఁడు సమస్తమును చూచును ఎవ్వరును అతనిని వినలేదు. కాని అతఁడు సకలమును వినును ఎవ్వరును అతనిని మననము చేయఁజాలరైరి కాని అతఁడు సకలమును మననముచేయును ఎవ్వరును అతనిని తెలిసికొనలేదు కాని అతఁడు సమస్తమును తెలిసికొనును ఓగార్గి! ఆకాశము ఈయవినాశియగు పరమేశ్వరునిలో ఓతప్రోతభావమున వ్యాపించియున్నది.

వ్యా దర్శనము, శ్రవణము, మననము మొదలయిన యావద్వ్యవహారముల మూలమునను మనమేమేమి తెలిసికొనఁగల్గుచున్నామో దానినెల్ల నతఁడు తెలిసికొనుచున్నాఁడు. అంతియేగాక, మనము తెలిసికోఁజాలని విషయములఁగూడ నతఁడు తెలిసికొనుచున్నాఁడు కాని అతఁ డెవ్వరి దర్శన, శ్రవణ, మనన, విజ్ఞానములకును విషయముకాఁడు. అతఁడు తన్నుఁదానెట్లు తెలిసికొనుచున్నాఁడో అట్లు మఱి యెవ్వరును అతనిని తెలిసికొనఁజాలరు.

అనంత స్వరూపుని,బుద్ధి, తా తెలిసికొని సాంతునిగ చేయఁజాలదు. అనంతుఁడును, అక్షరుఁడు నగు పురుషునిచే ఆకాశము వ్యాప్తమయి యున్నది. సర్వ వ్యాపియైన యీపరమేశ్వరుఁడు లేనిస్థలము లేదు.

వి గార్గి ప్రశ్నకు సమాధానముగా యాజ్ఞవల్క్యుఁడు చేసిన ప్రసంగములో నిది కడపటివాక్యము పడుగుపేకవలె ఈవిశ్వములో అక్షర పరబ్రహ్మము వ్యాపించియున్నాఁడని చెప్పి యాజ్ఞవల్క్యమహర్షి తనప్రసంగమును ముగించెను. అనఁగా విశ్వమంతయు ఆతనితో నిండి యున్నదని భావము ఆతఁడు తప్ప నింకేమియులేదు. మూలములో మధ్యపదములు కొన్ని మహర్షి విడిచివేసెను. అందువలన వాక్యమునందలి భావము మఱింత స్పష్టమయ్యెను.

మూ భీషాఽస్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః,
భీషాఽస్మాదగ్నిశ్చేన్ద్రశ్చ మృత్యుర్ధావతి పఞ్చమః.

[తైత్తి-౨. అ-౮ అను-౧. వా.]

టీ అస్మాత్=ఈ అక్షరస్వరూపునినుండి, భీషా=భయముచేత, వాతః=గాలి, పవతే=వీఁచుచున్నది, భీషా=భయముచేత, సూర్యః = సూర్యుఁడు, ఉదేతి = ఉదయించుచున్నాఁడు అస్మాత్=ఈబ్రహ్మమునుండి, భీషా=భయముచేత, అగ్నిశ్చ = అగ్నియును, ఇన్ద్రశ్చ = మేఘమును, పఞ్చమః= ఐదవదియైన, మృత్యుః=మరణము, ధావతి=నడచుచున్నది

తా ఈతని భయమువలన వాయువు వీఁచుచున్నది. ఈతని భయమువలన సూర్యుఁడు ఉదయించుచున్నాఁడు; ఈతని భయమువలన అగ్నియు, మేఘమును, మరణమును పనిచేయుచున్నవి

వ్యా మంగళాకరుఁడగు ఆ అక్షరపురుషుని శాసనమువలన వాయువు, సూర్యుఁడు, అగ్ని, మేఘము మొదలగు సర్వభూతములును చేరి ఈ జగత్తుయొక్క ఉపకారార్థము నియమబద్ధములై పనిచేయుచున్నవి

వి బృహదారణ్యకోపనిషత్తులోని భావమునే యిదిగూడ ధ్రువపఱుచుచున్నది

**మూ యదిదం కిఞ్చ జగత్సర్వం ప్రాణ ఏజతి నిస్సృతం**
**మహద్భయం వజ్ర ముద్యతం యఏతద్విదు రమృ**
**తాస్తే భవన్తి. ౧౩**

[కఠ-౬. వల్లి-౨. వా.]

టీ. యదిదం కిఞ్చ=ఈయుండెడి, జగత్సర్వం=జగత్తంతయును, నిస్సృతం=పరమాత్మునియందుండి వచ్చినదై, ప్రాణే=ప్రాణస్వరూపియగు అతనియందే, ఏజతి = చలించుచున్నది ఉద్యతం = సిద్ధముచేయఁబడిన, వజ్రం=వజ్రాయుధమువంటి, మహద్భయం = మిక్కిలి భయంకరమయిన, ఏతత్ = దీనిని

(బ్రహ్మమును), యే=ఎవరు, విదుః=తెలిసినవారో, తే=వారు, అమృతాః=నిత్యులు, భవన్తి=అగుచున్నారు.

తా ఈ ప్రాణస్వరూపియగు పరమేశ్వరుని అధిష్ఠాన దేవతగాఁ గల్గినదై అతనినుండియే వచ్చిన యీ సమస్త బ్రహ్మాండము నిర్దిష్ట నియమానుసారముగా నడచుచున్నది సిద్ధముచేయఁబడిన వజ్రాయుధమువలె అతఁడు అతిభయానకుఁడు ఎవరు అతని నెఱుఁగెదరో వారు అమరులయ్యెదరు

వ్యా పరమేశ్వరుఁడు ఈజగత్తునకు ప్రాణము. సర్వమును అతనినుండియే ఉత్పన్నమయినదై, అతని నాశ్రయించి ఆధారముగాఁ జేసికొని జీవించియున్నది ఎద్దియు అతని ఇచ్ఛను మీఱనేరదు అతని శాసనమువలన అన్నియుఁ తమ తమ కార్యములందు నియుక్తములై యున్నవి. ఎవ్వఁడు పాపమునందు ఆసక్తిగలవాఁడై, అతనిచే ప్రతిష్ఠింపఁబడిన ధర్మసేతువును అతిక్రమింప నుద్యమించునో అట్టివాని యెదుట నతఁడు సిద్ధముచేయఁబడిన వజ్రాయుధమువలె మహాభయానకుఁడై యుండును ఎవరు ఈపరమేశ్వరుని తెలిసికొందురో వారు అమృతులై అక్షయబ్రహ్మానందమును అనుభవింతురు

వి. ఈవాక్యమునందలి మొదటి భాగములో విశేషత్వమేమియు లేదు తక్కిన సగభాగములో నూతనభావము గలదు. భగవంతుఁడు ఉఱుమువలె భయంకరుఁడని యిందుచెప్పఁబడినది పాపాసక్తులకు పరమేశ్వరుఁడు

భయంకరుఁడు. కాని అతనిని తెలిసికొనువారు అమృతులగుచున్నారు. ఉపనిషత్తులు ప్రతిపాదించు ఈ "తెలిసికొనుట" లో అతనిని ప్రేమించుటయు, అతని యిచ్ఛను లోఁబడుటయు ఇమిడియున్నవి. 'అమృత' అన్న పదము గమనింపఁదగినది. ఉపనిషన్మతప్రకారము అమృతత్వమును పొందుటయే సకలధర్మసాధనముయొక్క పరమావధి. అమృతత్వమనఁగా నెట్టిదో ముందు ముందు మనకు స్పష్టమగును.



# నాల్గవ అధ్యాయము



మూ శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యద్వాచో హ
వాచం స ఉ ప్రాణస్య ప్రాణ శ్చక్షుషశ్చక్షుః. ౧

[కేన. ౧-ఖం. ౨-వా.]

టీ యత్ = ఏది (ఎవ్వఁడు), శ్రోత్రస్య = చెవికి, శ్రోత్రం=చెవియో, మనసః = మనస్సునకు, మనః = మనస్సో, వాచః = వాక్కునకు, వాచం హ=వాక్కో, స ఉ = అతఁడే (బ్రహ్మమే), ప్రాణస్య=ప్రాణమునకు, ప్రాణః=ప్రాణము, చక్షుషః = నేత్రమునకు, చక్షుః = నేత్రము

తా ఎవ్వఁడు శ్రోత్రమునకు శ్రోత్రమో, మనసునకు మనస్సో, వాక్కునకు వాక్కో అతఁడే ప్రాణమునకు ప్రాణము, నేత్రమునకు నేత్రము

వ్యా పరమేశ్వరు నుండియే చక్షుశ్శ్రోత్రవాగింద్రియములును, మనఃప్రాణములును తమ తమ శక్తులను పడసియున్నవి. అతని ఆశ్రయమునం దుండియే అవి తచ్ఛక్తులనెల్ల తమతమ కార్యములందు వినియోగింపఁగలుగు చున్నవి. అందుచేతనే అతఁడు శ్రోత్రమునకు శ్రోత్రమనియు, మనస్సు

నకు మనస్సనియు, వాక్కునకు వాక్కనియు, ప్రాణమునకు ప్రాణమనియు, చక్షువునకు చక్షువనియు చెప్పఁబడియెను. అతఁ డెట్లు నేత్రమునకు నేత్రమయ్యు తాను నేత్రము గాఁడో, శ్రోత్రమునకు శ్రోత్రమయ్యు తాను శ్రోత్రము గాఁడో అదేవిధమున మనస్సునకు మనస్సయ్యు తాను మనస్సును గాఁడు. అతఁడు అపరిమితజ్ఞానస్వరూపుఁడు, సకలమునకు కారణుఁడు, ఆశ్రయుఁడు

వి పరబ్రహ్మవిషయకముగా మానవుఁడు పొందఁగల్గిన జ్ఞానము యొక్క స్వభావమును గురించి యీ నాల్గవ ప్రకరణము ముచ్చటించుచున్నది ఇక్కాలపు అజ్ఞేయవాదులు తెలిపెడు కొన్నిసందేహములను మన ఋషీశ్వరులు ఆనాఁడే తెలిసికొని వానికి తగు సమాధానముల నొసంగియుండుట మిక్కిలి ఆశ్చర్యకరము భగవంతుఁడు అనంతుఁడు, అవాఙ్మానసగోచరుఁడను అజ్ఞేయవాదమును ఉపనిషత్కాలపుఋషులు గ్రహింపనివారు కారు. అయినను అతఁడు పూర్తిగా అగ్రాహ్యుఁడుగాఁడని వారిమతము ఈ విషయమును కేనోపనిషత్తునుండి కైకొనఁబడిన యీ అధ్యాయమునందలి వాక్యముల మూలమున వారు స్పష్టముగా నిరూపించియున్నారు "ఎవ్వనిచే ప్రేరేపింపఁబడి మనస్సు తనధర్మమును నెరవేర్చుచున్నది? ఎవ్వనిచే ప్రేరేపింపఁబడి ప్రప్రథమమున ప్రాణము ఉత్పన్నమయ్యెను? మఱియు నెవ్వని ప్రేరణమువలన మనుష్యులు మాటాడగల్గుచున్నారు? ఎవ్వఁడు శ్రోత్రనేత్రములకు వానివానివిషయములతో సంబంధమును కూర్చుచున్నాఁడు?" అను జిజ్ఞాస కేనోపనిషత్తునందలి ప్రథమవాక్యములోనే ప్రారంభ మగుచున్నది. ఈ ప్రకరణములోని మొదటివాక్యమును, దాని తరువాతివాక్యములును ఆ జిజ్ఞాసకు సమాధానములుగా చెప్పఁబడినవే ఇంద్రియములకును,

బుద్ధికిని భగవంతుఁడే మూలమనియు, ఇంద్రియగోచరములగు విషయము లనువలె భగవంతుని గ్రహించుటకు వీలుగా దనియు ఈవాక్యము వాక్రుచ్చు చున్నది. బుద్ధిమంతులు అతనిని తెలిసికొని అమృతులగుచున్నా రను భాగ మును ఈవాక్యమునుండి విడదీసి మహర్షి అధ్యాయాంతమునఁ జేర్చి యున్నాఁడు

మూ న తత్ర చక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి నో మనో న
విద్మో న విజానీమో యథైతదనుశిష్యాత్, అన్య
దేవ తద్విదితాదథో అవిదితా దధి ఇతి శుశ్రుమ
పూర్వేషాం యే నస్తద్వ్యాచచక్షిరే. ౩

[కేన ౧-ఖం ౩-వా.]

టీ తత్ర=అచ్చటికి (బ్రహ్మయొద్దకు), చక్షుః=నేత్రము, న గచ్ఛతి = పోనేరదు వాక్ = వాక్కు, న గచ్ఛతి = పోనేరదు నో మనః = మనస్సు చేతను కాదు, న విద్మః =బ్రహ్మ మును ఎఱిఁగినవారము కాము, ఏతత్ = దీనిని (ఈబ్రహ్మ మును), యథా = ఏవిధముగా, అనుశిష్యాత్ = శిష్యులకు ఉపదేశింపవలయునో, న విజానీమః = ఎఱుంగము; తత్ = అయ్యది (బ్రహ్మము), విదితాత్ =తెలిసినదానికంటె, అన్య దేవ = వేఱే అవిదితాత్ = తెలియనిదానికంటె, అధి= వేఱు యే = ఏయాచార్యులు, నః = మాకు, తత్ = దానిని (బ్రహ్మవిష

యమును), వ్యాచచక్షిరే=చెప్పిరో, పూర్వేషాం = పూర్వు లయిన ఆయాచార్యులయొక్క (వచనం=వాక్యమును), ఇతి = ఇట్లని, శుశ్రుమః = వింటిమి

తా. అతఁడు చక్షువులకు గమ్యుఁడుగాఁడు; వాక్కు నకు గమ్యుఁడు గాఁడు; మనస్సునకును గమ్యుఁడు గాఁడు మనకు అతనినిగూర్చి విశేషము లెవ్వియుఁ దెలియవు అదియుఁ గాక అతనినిగూర్చి యెట్లు ఉపదేశింపవలయునో అదియుఁ దెలియదు తెలిసినట్టియు, తెలియనట్టియు, సకలవస్తువులనుం డియు అతఁడు భిన్నుఁడయినవాఁడు పూర్వికులగు నే ఆచా ర్యవర్యులు బ్రహ్మమునుగూర్చి తెలిపిరో వారి సన్నిధాన మున నీవిధముగా వింటిమి

వ్యా చక్షువునకు చక్షువయ్యు అతఁడు చక్షువునకు అగోచరుఁ డు, వాక్కునకు వాక్కయ్యు అతఁడు వాక్కునకు అగోచరుఁడు ; మన స్సునకు మనస్సయ్యు అతఁడు మనస్సునకు అగోచరుఁడు. తెలిసినట్టియు మనకు తెలియనట్టియు సకలపదార్థములనుండియు అతఁడు వేఱయినవాఁడు. అతనినిగూర్చి ఉపదేశింపఁదగినది యింతమాత్రమే. మనము చక్కఁగా తెలిసికొనియున్న, ఏయేవస్తువులు గలవో వానిలో నొకటియు నతఁడుగాఁడు. మనకు తెలియనట్టి పరిమితములగు వస్తువు లెవ్వివ్వి గలవో వానిలోను నతఁడు ఒక్కటియునుఁ గాఁడు. విదితములును అవిదితములు నగు సకలపరి మితవస్తువులకును అతఁడు సృష్టికర్త, ఆశ్రయదాత, నిర్వాహకుఁడు.

అతఁడు సమస్తమునకును అంతర్గతుఁడు సర్వమునకు భిన్నుఁడయినవాఁడు ; స్వతంత్రుఁడు. ఇది పూర్వులయిన ఆచార్యుల ఉపదేశము

వి భగవంతుని గుణాతీతత్వమునుగూర్చి యీ వాక్యము నుడువుచున్నది ఇంద్రియము లతనిని గ్రహింపఁజాలవు. మనస్సు అతనిని చింతింపనేరదు. అతఁడు మనకు తెలిసినట్టియు, తెలియనట్టియు సమస్త వస్తువులకును మించినవాఁడు ఉపనిషత్తులను రచించిన ప్రాచీనమహర్షుల ఉపదేశ మిది. ఈఋషీశ్వరుఁడు తనకంటె ప్రాచీనులగు ఋషులను గూర్చి ముచ్చటించుచున్నాఁ డన్న సంగతిని మనము గమనింపవలయును.

మూ యద్వాచానభ్యుదితం యేన వాగభ్యుద్యతే తదేవ
బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే 3

[కేన. ౧-ఖం ౪-వా]

టీక యత్=ఏది, వాచా=వాక్కుచేత, అనభ్యుదితం = ప్రకాశింపఁజేయఁబడదో, యేన=దేనిచేత, వాక్ = వాక్కు, అభ్యుద్యతే = ప్రకాశింపఁజేయఁబడునో, తదేవ = దానినే, బ్రహ్మ=బ్రహ్మము (అని), త్వం = నీవు, విద్ధి = తెలిసికొనుము యత్ = దేనిని, ఇదం = ఇది (యని), ఉపాసతే = పూజించుచున్నారో, ఇదం=ఇది, తన్న=అది గాదు

తా॥ ఎవ్వఁడు వాక్కుచేత వచింపనలవిగానివాఁడో, వాక్కు ఎవ్వనిచే ప్రేరేపింపఁబడుచున్నదో అతనినే నీవు

బ్రహ్మమని తెలిసికొనుము ఏకొలఁదిపాటి పరిమితవస్తువును జనులు ఉపాసించుచున్నారో అది యెన్నఁటికిని బ్రహ్మము గాదు.

వ్యా ఎవ్వనినుండి వాక్కు వచించెడు శక్తిని పొందుచున్నదో అతఁడు బ్రహ్మము అతఁడు అధిష్ఠించుటచే వాక్కు ప్రకాశించుచున్నది గాని వాక్కుద్వారమున అతఁడు ప్రకాశితుఁ డగుటలేదు జను లుపాసించెడు పరిమితపదార్థము లెవ్వియు బ్రహ్మము గావు. కొందరు జలమును, వాయువును, అగ్నిని, శిలలను, పశువులను, పక్షులను, వృక్షములను, లతలను ఉపాసనచేయుదురు. కొందరు సూర్య, చంద్రగ్రహనక్షత్రముల నుపాసించెదరు కొందరు మనఃకల్పితములయిన దేవదేవీగణముయొక్క ప్రతిబింబములను ఉపాసనజేసెదరు. అసామాన్యశక్తిసంపన్నులగు మానవులను ఈశ్వరావతారములనుగా భావించి యెందఱు ఉపాసించుచున్నారు గారు? కాని యిం దెద్దియు బ్రహ్మము గాదు. వీని యుపాసన బ్రహ్మముయొక్క యుపాసన కానేరదు.

వి వాక్కు బ్రహ్మమును వర్ణింపఁజాల దని చెప్పినవాఁడై సాధారణముగా నారాధింపఁబడు పరిమితపదార్థములు భగవంతుఁడు కాఁడని ఋషి యిందు పల్కుచున్నాఁడు అతఁ డుద్దేశించిన వస్తువు లెవ్వియో మనకు స్పష్టముగా తెలియవు. అతని మనస్సులో విగ్రహము లుండియుండవు ఏలయన, ఆనాటికి విగ్రహపూజ ప్రారంభము కాలేదుగదా! బహుశః పూజా సమయమున వినియోగింపఁబడు అగ్నివంటి యేవస్తువులనో అతఁడు మనస్సులో పెట్టుకొనియుండును

**మూ యన్మనసా న మనుతే యేనాహుర్మనో మతమ్**
**తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే ౪**

[కేన. ౧-ఖం ౫-వా.]

టీక యత్=ఏది, మనసా = మనసుచేత, న మనుతే = చింతనసేయఁబడదో, యేన=దేనిచేత, మనః=మనస్సు, మతం= చింతన సేయఁబడుచున్నదని, ఆహుః = చెప్పెదరో, తదేవ = అదియే, బ్రహ్మ=బ్రహ్మమని, త్వం=నీవు, విద్ధి = తెలిసికొనుము. యత్=దేనిని, ఇదం=ఇది యని, ఉపాసతే = ఉపాసించెదరో, (తత్ = అది) నేదం = ఇదికాదు

తా జనులు దేనిని మనస్సుచేత మననము చేయఁజాలరో, మనస్సుయొక్క ప్రతి మననము నెవ్వఁడు తెలిసికొనునో అతనిని బ్రహ్మమని తెలిసికొనుము. జను లుపాసించెడు ఏకొలదిపాటి పరిమితపదార్థమును బ్రహ్మ మెన్నఁటికిని కాఁడు

వ్యా పరిమితపదార్థమును మనసు మననముచేయఁగలదు కాని, అనంతజ్ఞానస్వరూపియైన బ్రహ్మమును మనస్సెవ్విధమున మననము చేయఁగల్గును? అతఁడు మనస్సునకు విషయము గాఁడు అపూర్ణస్వరూపుని నెవ్వరును మననము చేయఁజాలరు అయినను అతఁడు అన్నిఁటిని మననము చేయును. అతఁడు మన సకలభావములకును, ఇచ్ఛలకును, కార్యములకును

సాక్షి. అతని ముందు చీఁకటికుకర్మలను దాఁచి యుంచఁజాలదు. అపవాదము సత్కార్మలను మ్లానముచేయనేరదు.

పై వెనుకటి వాక్యములోని భావమునే యిదియు వెల్లడించుచున్నది. ఇందు వాక్కునకు బదులు మనస్సు చేర్పఁబడినది. మూలములో నేత్రము, శ్రోత్రము, ప్రాణము అనుమాటలను చేర్చుచు నిదే రీతిని చెప్పఁబడిన మఱి మూఁడువాక్యములు గలవు మనః ప్రాణములుగాని, వాక్చక్షుశ్శ్రోత్రములుగాని మనకు బ్రహ్మమును గూర్చిన జ్ఞానమును ప్రసాదింపనేరవు.

మూ. యది మన్యసే సువేదేతి దభ్రమేవాపి నూనం
త్వం వేత్థ బ్రహ్మణోరూపమ్ ౫

[కేన ౨-ఖం. ౧-వా]

టీ. సువేద ఇతి = చక్కఁగా తెలిసికొంటినని, యది మన్యసే = తలఁచుచున్నావేని, బ్రహ్మణః = బ్రహ్మముయొక్క, రూపమ్ = స్వరూపమును, నూనం = నిశ్చయముగా, దభ్రమేవాపి = స్వల్పముగానే, త్వం వేత్థ=నీవు తెలిసికొనుచున్నావు

తా॥ బ్రహ్మమును నేను చక్కఁగా తెలిసికొంటినని తలఁచితివేని నీవు బ్రహ్మముయొక్క స్వరూపమును అత్యల్పముగనే తెలిసికొనుచున్నావు

వ్యా ఎవ్వఁడు బ్రహ్మమును చక్కఁగా తెలిసికొంటి నని తలఁచు చున్నాఁడో అతఁడు బ్రహ్మమును గూర్చి అత్యల్పమే తెలిసికొనినవాఁడు. ఏలయన, అనంతస్వరూపియగు బ్రహ్మమును చక్కఁగా తెలిసికొనుటకు వీలు లేదని అతఁడు తెలిసికొన్నవాఁడు గాఁడు అతఁడు బహుశః బ్రహ్మ మన నేదియో రూపముగల పదార్థమువంటి దని తలఁచి తృప్తిఁజెంది యుండ వచ్చును లేదా దానికంటె సూక్ష్మమైన దని భావించి యుండిన పక్షమున దేహాశూన్యమయిన పరిమిత మనస్సువంటి యేదో యొకవిధమైన పదార్థమని తలఁచి యుండవచ్చును బ్రహ్మము శరీరముగాని మనస్సుగాని కాఁ డని అతఁ డెన్నఁడును గ్రహించియుండలేదు శరీర ముండినచో అతఁడు మన ప్రత్యక్షమునకు విషయమై యుండును. ఇఁక మనస్సు ఉండినచో మన స్సునకు గ్రాహ్యుఁడై యుండును. బ్రహ్మమునకు శరీరము లేదని అనేకులకు తెలియును కాని అతనికి మనస్సు లేదన్నచో అనేకులకు స్పష్టముగా బోధ పడదు ఏలయనఁగా, వారు శుద్ధ-ముక్త-అనంత జ్ఞానస్వరూపమునకు పరి మితమనస్సుయొక్క సకలవృత్తులను ఆరోపణచేసెదరు. అతనికి క్రోధము కలదనియు, ద్వేషము కలదనియు, ప్రీతికలదనియు, దయ కలదనియు, పక్షపాతిత్వము కలదనియు వారు తలంతురు. అతనియందు ఈమనోధర్మము లెల్ల నుండినయెడల అతనిని చక్కఁగా తెలిసికొనవచ్చును అందుచేతనే అతనిని చక్కఁగా తెలిసికొన్నామని భావించువారు అతనికి ఈసకలమనో ధర్మములను ఆరోపణచేయుదురు అందులో స్థూలదృష్టిగలవారు అతనికి శరీరధర్మములను గూడ ఆరోపణ చేయుదురు మనస్సు ప్రత్యక్షమునకు అగోచరమగు వస్తువు, అతిసూక్ష్మవస్తువు, మనస్సునకంటె నెవ్వఁడు సూక్ష్మ వస్తువో, మనోధర్మమెద్దియు నెవ్వనియందు లేదో అట్టివాని నెవ్విధమున

చక్కఁగా తెలిసికొననగును? ఎవ్వఁడు ఈ సమస్త జగత్కౌశలమునకు కారణభూతుఁడో అతఁడు జ్ఞానము కల్గియుండుట నిశ్చయమే కాని, ఆ జ్ఞానము మన మానసిక జ్ఞానమువలె పరిమితమయినదా? ఆ అనంతజ్ఞానమును మనము మన క్షుద్రబుద్ధిమూలమున లోఁబరుచుకొనఁగలమా? అతఁడు ఈ జగత్తును సృష్టించెను. అంతియేగాక అతఁడు దీనిని సంరక్షించుచున్నాఁడు. అట్లగుటం జేసి అతనికి సృజన, రక్షణ శక్తులు గల వని నిరూపితమగుచున్నది. కాని, ఆ శక్తి మనశక్తివలె పరిమితమయినదా? అచింత్యమయిన అతని శక్తిని మనము మనస్సునందు ధారణచేయఁగలమా? ఎవ్వఁడు ఈసృష్టియొక్క మంగళము నిమిత్తమై దయా ప్రేమ స్నేహముల సృష్టించెనో అతనిప్రేమ ఈక్షుద్ర మానసికప్రేమవంటిదా? ఆ సత్యసుందరమంగళస్వరూపునియొక్క దురవగాహమయిన గంభీరప్రేమలోనికి నెవ్వఁడు తన బుద్ధిని ప్రవేశపెట్ట నేర్చును?

వి ఇదియుం దీని తరువాతి మూఁడువాక్యములును ద్వితీయ ఖండములోనివి. ఇది ప్రథమ వాక్యములోని మొదటి సగభాగము మాత్రమే. వెనుకటి వాక్యములలో బ్రహ్మజ్ఞానమును పొందుటలో గల కష్టములను నిరూపించినవాఁడై ఋషీశ్వరుఁడు ఇందు పరబ్రహ్మము కేవలము తెలిసికోఁజాలనివాఁడు గాఁడని చెప్పుచున్నాఁడు. అతనిని పూర్తిగా తెలిసికొనఁజాలమని గ్రహించుటయే నిజముగా తెలిసికొనుట యని ఆయన అభిప్రాయము.

మూ నాహం మన్యే సువేదేతి నోనవేదేతి వేదచ
యోనస్తద్వేద తద్వేద నోనవేదేతి వేద చ ౬

[కేన ౨-ఖం. ౨-వా.]

టీ సువేదఇతి= (బ్రహ్మమును) చక్కఁగా తెలిసికొంటి నని, అహం=నేను, న మన్యే = తలచ లేదు, (అయ్యది) న వేద ఇతి = తెలియనిదనిగాని, వేదచ = తెలిసినదనిగాని, నో = తలఁచను నః=మనలో, యః = ఎవ్వఁడు, నోనవేద ఇతి వేద చ= తెలిసినదియు తెలియనిదియుగాదు (అనెడు), తత్ =దానిని (ఆసంగతిని), వేదచ= తెలిసికొనునో, సః = అతఁడు, తత్ = దానిని (బ్రహ్మమును), వేద = తెలిసికొనుచున్నాఁడు

తా బ్రహ్మమును సరిగా తెలిసికొంటినని నేను తలం చుట లేదు అతనిని నేను తెలిసికొననివాఁడనుగాను, తెలిసి కొన్న వాఁడనుగాను."నేను తెలిసికొననివాఁడను గాను, తెలిసి కొన్న వాఁడను గాను" అనువాక్యముయొక్క మర్మమును మనలో నెవ్వఁడు గ్రహించెనో అతఁడే బ్రహ్మమును తెలిసి కొనినవాఁడు

వ్యా. "నేను బ్రహ్మమును తెలిసికొననివాఁ డను గాను" అన్న వాక్యమునకు అర్థము నేను బ్రహ్మమును గూర్చి యేమియు తెలియనివాఁడ ననిగాదు "నేను జ్ఞానప్రసాదముచే అతని అనాద్యనంతపూర్ణభావమును, అతని సత్యసుందర మంగళభావమును గ్రహించితిని కాని పరిమితవస్తువును వలె నేను అతని రూపమును నాబుద్ధిలో నిముడ్చుకొన లేకపోతి" నని భావము. విశుద్ధజ్ఞాననేత్రముచే నెవ్వఁడు అతనిని సాక్షాత్తుగా దర్శనము చేసి అతని పూర్ణస్వరూపమును తెలిసికొనెనో అతఁడు ఈవాక్యముయొక్క మర్మమును చక్కఁగా తెలిసికొనును.

వి ఈ వాక్యములో అజ్ఞేయవాదుల సందేహమునకు పూర్ణమయిన సమాధానముగలదు అనంతుఁడగు పరబ్రహ్మమును మనము పూర్తిగా తెలిసికొనఁజాల మనుట నిశ్చయము. అయినను అతనిని మన మేమాత్రమును ఎఱుగఁజాలమని నుడువుట నిజముగాదు అతనిని గూర్చి యేదో యొకవిధమయిన భావము మనమనస్సులో నుండకమానదు అనంతత్వమునుగూర్చి చింతింపవలసివచ్చినపుడు మన స్థితి యివ్విధముననే యుండును. అనంతాకాశమును మన మెఱుంగఁజాలము. అయినను పరిమితప్రదేశములకును అనంతాకాశమునకును గలభేదమును మనము తెలిసికొనఁగల్గియే యున్నాము. సాంతమగు ప్రదేశమును మన మెన్నఁడును అనంతమని చెప్పము. అనంతుఁడగు భగవంతుని గూర్చి మనకుఁగల జ్ఞానమును నిట్టిదే. ఆధ్యాత్మికజ్ఞానము నందు తమకుఁగల అనుభవమును బట్టియు అభివృద్ధినిబట్టియుం భక్తులు భగవంతుని కొలఁదిగనో గొప్పగనో తెలిసికొనియున్నారు.

మూ యస్యామతం తస్యమతం మతం యస్య న వేద సః
అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతామ్ ౩

[కేన. ౨-ఖం. 3-వా]

టీ యస్య = ఎవనికి, అమతం = (బ్రహ్మము) తెలియనిదో, తస్య = వానికి (బ్రహ్మస్వరూపము), మతం = తెలిసినది; యస్య = ఎవనికి, మతం = (బ్రహ్మస్వరూపము) తెలియఁబడినదో, సః = అతఁడు, న వేద = తెలిసికొనలేదు; విజానతాం = విశేషముగా తెలిసినవానికి, అవిజ్ఞాతం = తెలియఁబడనిదే,

అవిజానతాం = తెలియనివానికి, విజ్ఞాతం = విశేషముగా తెలియఁబడినది

తా 'నేను బ్రహ్మస్వరూపమును తెలిసికొనలే' దని యెవ్వఁడు భావించునో అట్టివాఁడు నిజముగా బ్రహ్మము నెఱిఁగినవాఁడు ఇఁక 'నేను బ్రహ్మస్వరూపమును తెలిసికొంటి'నని యెవ్వఁడు భావించునో అట్టివాఁడు నిజముగా బ్రహ్మమునెఱిఁగినవాఁడు గాఁడు తాను బ్రహ్మస్వరూపమును తెలిసికొనలేదని ఉత్తమజ్ఞాని భావించును అంత జ్ఞానవంతుఁడు గాని వాఁడు తాను బ్రహ్మస్వరూపమును తెలిసికొంటినని తలంచును

వ్యా మన పరిమిత క్షుద్రబుద్ధిచే బ్రహ్మస్వరూపమును తెలిసికొనఁజాల మను సంగతిని మనము తెలిసికొన్నయెడల, అతని అనాద్యనంత స్వరూపము మనచే తెలిసికొనఁబడినదే యగుచున్నది తన విశుద్ధజ్ఞాననేత్రమువలన జ్ఞానవంతుఁడగు నేపురుషుఁడు ఆ సత్యసుందర మంగళస్వరూపుని పూర్ణభావమును ప్రత్యక్షముగా గ్రహించునో అతఁడే బ్రహ్మభావము యొక్క అంతమును పొందుటకు నలవిగా దని తెలిసికొనును.

వి. ఇది వెనుకటి వాక్యములోని భావమును ధ్రువపఱుచుచున్నది. అల్పజ్ఞులు తాము బ్రహ్మమును పూర్తిగా తెలిసికొంటిమని చెప్పుదురు. కాని జ్ఞానులగువారు తాము పొందిన బ్రహ్మజ్ఞానము అత్యల్పమయిన దనియు, అది యొకజ్ఞానము క్రింద గణింపఁదగినది కాదనియు నుడువు

దురు. ఈ ఋషి వాక్కులు ప్రాచీనగ్రీసు తత్త్వజ్ఞుని వాక్యములను స్మరింపఁజేయుచున్నవి తనకును ఇతరులకును గల భేదమును తెల్పుచు ఆమహాజ్ఞాని తనకేమియు తెలియదని తానెఱుంగుదుననియు, అజ్ఞానముగూడ నితరులకు లేదనియు అతఁడు వచించె నట. మఱియు మహాశాస్త్రజ్ఞుఁడగు న్యూటను సముద్రతీరమున నత్తగుల్లల నేరుకొను శిశువువంటి వాఁడననియు, సత్యాన్వేషకుల కొఱకెదురుచూచుచు మాక్తిక భరితమగు సముద్రమంతయు తనకు ముందేయున్నదనియు నుడివెను.

మూ ఇహ చేదవేదీ దథ సత్యమస్తి
న చేదిహావేదీన్మహతీ వినష్టిః,
భూతేషు భూతేషు విచిన్త్య ధీరాః
ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవన్తి ౮

[కేన. ౨-ఖం ౫-వా]

టీ ఇహ = ఇచ్చట (ఈలోకమునందు), అవేదీచ్చేత్ = (బ్రహ్మమును) ఎఱిఁగినయెడల, అథ = పిమ్మట, సత్యం = పరమార్థము, అస్తి = కలుగుచున్నది ఇహ = ఇచ్చట, నావేదీచ్చేత్ = తెలిసికొననియెడల, మహతీ = విశేషమైన, వినష్టిః= అనర్థము కలుగుచున్నది ధీరాః = బుద్ధిమంతులు, భూతేషు భూతేషు = (సమస్త) జీవులయందును బ్రహ్మమును, విచిన్త్య= చూచి, అస్మాత్ లోకాత్ = ఈలోకమునుండి, ప్రేత్య = తరలిపోయి, అమృతాః = నిత్యులు, భవన్తి = అగుచున్నారు.

తా ఇచ్చట అతనిని (బ్రహ్మమును) తెలిసికొన గల్గిన యెడల జన్మము సార్థకమగును తెలిసికొన లేనిచో మహానర్థము కలుగును అందుచే ధీమంతులు సమస్త స్థావరజంగమ వస్తుజాలమునందును ఏకమాత్రుఁడగు నప్పరమేశ్వరుని ఉపలబ్ధిచేసికొని ఈలోకమునుండి తరలిపోయి అమృతు లగుచున్నారు.

వ్యా బ్రహ్మముయొక్క స్వరూపమును పరిమిత పదార్థమును వలె చక్కగా తెలిసికొనుటకు మన అల్పబుద్ధికి నలవిగాకపోయినను, బుద్ధికి మూలమగు సహజజ్ఞానమువలన అతని పూర్ణమంగళ భావమే సకలకారణములకును కారణమనియు, సకలాధారములకును మూలాధారమనియు, సకల శుభములకును నిదానభూతమనియు నిస్సంశయముగా మనము గ్రహింపఁగల్గుచున్నారము. పాపములను పోఁగొట్టుకొని జీవాత్మ అనంతస్వరూపుఁడును, జ్ఞానస్వరూపుఁడును,మంగళస్వరూపుఁడును అగు అప్పరమేశ్వరుని సర్వమునకు ఆశ్రయస్వరూపునిగా తన యంతరమునందు సాక్షాత్తుగా ననుభవింపఁగల్గుచున్నది. ఈ పృదివియం దుండఁగనే యీ ప్రకారముగా అతనిని ఎఱుఁగఁగల్గిన యెడల జన్మము సార్థకమగును అతనిని తెలిసికొనుటవలన గాక మఱి దేని మూలమున మన జన్మము సార్థకము కాఁగల్గును? తన్ను నెఱింగెడు అధికారము నొసంగుటయే అతఁడు మన యెడల చూపిన కృపలలో నెల్ల ప్రధానమయిన కృప. తిమిరావృతమయిన యీ పృథివిలో నివసించు జీవులమయ్యు అన్నిటికిని అతీతుఁడయిన ఆ సత్యసుందర మంగళస్వరూపమును మనము తెలిసికొనుచున్నారము. దీనికంటె సౌభాగ్యకరమైన విష

యము మనకు మఱియెద్దియున్నది? జగత్కౌశలమును పరికించి ఆ కౌశల కర్తయొక్క అనంతజ్ఞాన పరిచయమును మనము పొందుచున్నారము. శుభోద్దేశ్య సూచకములగు సకల నియమములను గాంచి నియంతయొక్క మంగళాభిప్రాయమును మనము తెలిసికొనుచున్నారము అతనిచే ప్రతిష్ఠిత మయిన ధర్మము నాచరించి ఆత్మను ఉన్నతిచెందించుకొనుచున్నారము. అంతియేగాక, మన యందఱిమీదను అతనికిఁ గల ప్రేమను గుర్తించి కృతజ్ఞతా పూర్ణహృదయులమై అతనిప్రేమలో నిమగ్నుల మగుచున్నాము. ఇక్కడ నుండఁగా మనము అతనిని తెలిసికొనకపోతిమేని, అతని ప్రేమలో నిమగ్నులము గాకపోతిమేని, అతనిచే ప్రతిష్ఠితమయిన ధర్మము నాచరింపమేని మనము జన్మించియేమి ప్రయోజనము? కొన్ని సువర్ణముద్రలను సంపాదించి విపులయశోగౌరవములను పొందుటచేఁగాని, నికృష్టేంద్రియసుఖముల ననుభవించుటచేఁగాని ఆత్మ తృప్తినిజెందనేర్చునా? క్షణభంగురమయిన మృణ్మయపదార్థమునందుఁగాని లేదా దోషగుణ విశిష్టమయిన అపూర్ణస్వభావమునందుఁగాని ప్రేమను నిలుపుటచే ప్రేమ సార్థకము కానేర్చునా? ఏ వ్యక్తి ఆ పరబ్రహ్మమును తెలిసికొనక, అతని సహవాస సంజనిత నిత్య భూమానందమును పోఁగొట్టుకొని యీ లోకములోని మలిన సౌఖ్యముల మరిగియుండునో అతనికి మహానర్థము సంభవించును. అతఁడు పుణ్యలోకమునకు బహుదూరమున పరిభ్రమించుచుండును స్థావర జంగమ వస్తుసముదాయముయొక్క కౌశలమును ఉద్దేశము ఆలోచనచేసి బ్రహ్మజ్ఞానమును ఉద్దీపనము చేయవలయును, ఆత్మప్రత్యయమును పోషణచేయవలయును. స్థావర జంగమవస్తు సంతానమెల్ల అతని సృష్టియే, అతని కౌశలమే. అవి అతని మంగళభావమునే ప్రకాశింపఁజేయుచున్నవి; అతని మహిమనే ప్రచారముచేయుచున్నవి, అతని నామమునే ఘోషించుచున్నవి. జ్యోతి

ర్విద్యయేమి, భూతత్త్వ విద్యయేమి, చికిత్సా విద్యయేమి, మనోవిజ్ఞాన మేమి, ఆత్మతత్త్వమేమి, ధర్మమేమి, నీతియేమి, సమస్తవిద్యలును అతని అనంత జ్ఞానమును మంగళభావమును బోధించుచున్నవి. ఈ సమస్తవిద్యలలో నుండి విద్యలకెల్ల మూలమగు పరిశుద్ధ బ్రహ్మవిద్యను బడసి బ్రహ్మజ్ఞుఁడు కావలయును. మఱియు ఈ లోకమునుండి తరలిపోయి అమృతుని ఆశ్రయము ను పొంది అమరపదవిని పొందవలయును.

వి బ్రహ్మజ్ఞాన స్వరూపమును గూర్చి తెలిపెడు ఈ ప్రసంగము కేనోపనిషత్తులోని యీ వాక్యముతో పరిసమాప్తమగుట సమంజసము. ఇహ లోకములోనే బ్రహ్మమును తెలిసికొన్న యెడల మనము ధన్యులము; తెలిసి కొననిచో మహానష్టమును పొందినవార మగుదుము. సర్వభూతములందును బ్రహ్మమును దర్శించి యీ లోకమును విడిచిపోయి జ్ఞానులు అమృతులగు చున్నారు ౧౬వ వాక్యములో ప్రయోగింపఁబడిన 'ధీరః' అన్న శబ్దము ఈ వాక్యములోఁ గూడ మనకు కనుపించుచున్నది ఆత్మ నిగ్రహమును స్థిరబుద్ధి యుంగలవాఁడని దాని అర్థము. అమృతత్వమనఁగా ఉపనిషత్తుల భావమెద్దియో యిందు మనకు కొంతవరకు గోచరమగుచున్నది. సమస్త వస్తువులయందును బ్రహ్మమును దర్శించుటచే అమృతత్వము లభ్యమగును ఈవాక్యమును బట్టి చూడ అమృతత్వము ఇక్కడినుండి తరలిపోయిన తరువాత పొందవలసినదిగా కనుపించును. కాని అది మరణానంతరము తటస్థించు నొక అవస్థావిశేషమా యేమి ?



# అయిదవ అధ్యాయము



మూ॥ ఈశావాస్యమిదం సర్వం యత్కించ జగత్యాం జగత్, తేన త్యక్తేన భుంజీథా మాగృధః కస్యస్విద్ధనమ్ ౧

[ఈశా. ౧-వా.]

టీ. జగత్యాం = బ్రహ్మాండమునందుండెడి, యత్కించ = స్వల్పమైన, ఇదం సర్వం జగత్ = ఈ జగత్సర్వమును, ఈశా = పరబ్రహ్మముచేత, ఆవాస్యం = వ్యాపింపఁ బడియున్నది. తేన త్యక్తేన = పాపేషణాది త్యాగముచేత, భుఞ్జీథాః = పరమాత్మని పొందుమా (త్వం = నీవు) కస్యస్విద్ధనం = ఒకరియొక్కధనమును, మాగృధః = కోరకుము

తా॥ ఈ బ్రహ్మాండాంతర్గతములయిన సకల పదార్థములును పరమేశునిచే వ్యాపింపఁ బడియున్నవి పాపేషణములను విడిచి బ్రహ్మానందము నొందుము నీవు పరులవిత్తమును కోరకుము

వ్యా పక్షులెట్లు తమ పిల్లలను ఱెక్కలక్రింద కప్పియుంచి వానిని అనేక విపత్తులనుండి రక్షించుచున్నవో అదియే విధమున ఈజగత్సర్వమును పరమేశ్వరునిచే ఆచ్ఛాదితమును, వ్యాప్తమునై రక్షింపఁబడుచున్నది. అతఁడు జగత్తునకు రాజాధిరాజు; అతఁడు మన తండ్రి, రక్షకుఁడు, బంధువు. అతని శాసనము సర్వత్ర వ్యాపించి యున్నది, అతని ప్రేమ యెల్లెడల వ్యక్తమగు చున్నది పాపచింతను, విషయలోలత్వమును పరిత్యజించి ఆప్రేమాస్పదుని పొందుము, పరమానందమును అనుభవింపుము. ఎట్లు శరీరముయొక్క వికారము రోగమగుచున్నదో అట్లే మనస్సుయొక్క వికారము పాపమగుచున్నది. శరీరములో జబ్బున్నపుడు ఆహారముపై నెవ్విధమున బుద్ధియుండదో అవ్విధముననే పాపమాచరించిన యెడల బ్రహ్మానందానుభవమునందు ఇచ్ఛ యుండదు కనుక పాపచింతను పాపాచరణమును, పరిత్యజించుట మూలమున మనస్సును సుస్థమును పవిత్రమును గావించి బ్రహ్మానందమును ఉపభోగింప వలయును అపరాధియు, దుశ్శీలుఁడునగు పుత్రుఁడు ఎన్నఁటికిని తనతండ్రిని ప్రేమింపఁజాలఁడు తనయెడల తండ్రికిగల ప్రేమనుగూడ ననుభవింపఁజాలఁడు. అతని శిక్షవలన సర్వదా వ్యాకులచిత్తుఁడై యుండును. ఆప్రకారముగనే పాపాచారియగు మనుజుఁడు పరమపితచే ప్రతిష్ఠింపఁబడిన ధర్మసేతువును మీఱినవాఁడై తగిన శిక్షను పొంది సర్వదా నిరుత్సాహి యైయుండును. ఇక అతని శాంతస్వరూపమును, అతని పవిత్రస్వరూపమును, అతని మంగళ స్వరూపమును స్వానుభవమునందు గ్రహించి చంచలమును, క్షుద్రమును, అపవిత్రమునైన తన చిత్తమును అతని ప్రేమరసముచే ఆర్ద్రము కావించు కొనుట యెట్లు? కావున ఎవ్వనికి బ్రహ్మము పొందవలయుననెడి ఆసక్తి కలదో అట్టివాఁడు విషయాపేక్షను పరిత్యజింపవలయును అతఁడు పాపచింతలనుండియు, పాపాలాపములనుండియు, పాపకార్యములనుండియు విపర్జి

తుఁడు కావలయును అతఁడు పరుల యెడల అన్యాయ వ్యవహారములు సలుపఁగూడదు. పరసతులపై చెడుదృష్టిని పఱుపఁగూడదు. పరుల ధనమును ఆశింపఁగూడదు.

వి ఇది మొదలుకొని ముందువచ్చు అధ్యాయములలో బ్రాహ్మ ధర్మానుసారము బ్రహ్మస్వరూప మెట్టిదో మహర్షి దేవేంద్రనాథఠాకూరు తెలియఁజేయుచున్నాఁడు ఈఅధ్యాయమునందు బ్రహ్మముయొక్క సర్వ వ్యాపకత్వమునుగూర్చి విశదీకరించియున్నాఁడు. ఇందలి వాక్యము లన్నియు ఈశోపనిషత్తునుండి గ్రహింపఁబడినవి "ఈశావాస్య మిదం సర్వం" అను నీవాక్యము ఈశోపనిషత్తులో మొట్టమొదటిది ఇది మహర్షి దేవేంద్రనాథుని జీవితముతో సమీప సంబంధమును కల్గియున్నది చినిగిన ఒక కాగితపు ముక్కమీద నున్న యీవాక్యరత్నమును పఠించిన మీదటనే మహర్షికి ఉపనిషత్తులను చదువవలయు నన్న అభిలాష జనించెను ఇందుమూలమున ఠాకూరుగారి జీవితములోనే గాక బ్రాహ్మసమాజముయొక్క చరిత్రలోఁ గూడ నొక నూతనమైన యుగ మారంభమయ్యెను.

ఈవాక్యము మొదట యజుర్వేదములో ౪౦-వ అధ్యాయములో ౧-వ మంత్రముగానుండెను. సరిగా భాషాంతరీకరించినచో దీనియర్థ మీ విధముగా నుండెను. "పరివర్తన శీలమయిన యీవిశ్వములో నున్నదంతయు ఈశ్వరునిచే వ్యాప్తమయియున్నది అతనిచే నొసంగఁబడినదానిని నీవు అనుభవింపవలయును. మరియొకరి భాగ్యము నాశింపకుము".

ప్రపంచము నెవ్విధముగా మనుష్యుఁడు చూడవలయునో యిది వెల్లడించుచున్నది. కాని మనుష్యునికిని ప్రపంచమునకును గల సంబంధమును వ్యక్తీకరించు వాక్యమునుగా మహర్షి దీనిని పరిగ్రహించియున్నాఁడు

మూ  అనేజదేకం మనసో జవీయో నైనద్దేవా ఆప్నువన్
పూర్వమర్షత్, తద్ధావతోఽన్యానత్యేతి తిష్ఠత్తస్మి
న్నపో మాతరిశ్వా దధాతి          ౨

[ఈశ. ౪-వా.]

టీ అనేజత్ = చలనములేనిది, బ్రహ్మము, ఏకం = అద్వితీయము, మనసః = మనసుకంటె, జవీయః = వేగముగలది, పూర్వం=ముందే, అర్షత్ = పోవునది ఏనత్ = దీనిని (బ్రహ్మమును) దేవాః = చక్షురాదీంద్రియములు, నాప్నువన్ = పొందనేరవు, తత్=అది (బ్రహ్మము) తిష్ఠత్ = స్థిరమయ్యును॰ ధావతః = శీఘ్రముగా నడచునట్టి, అన్యాన్=ఇతరములను, (వాగింద్రియాదులను), అత్యేతి = అతిక్రమించుచున్నది, తస్మిన్ = అతనియందుండి, మాతరిశ్వా = వాయువు, అపః = (ప్రాణులకు) దేహచేష్టాదిక్రియలను, దధాతి = విభజించియిచ్చుచున్నది

తా పరబ్రహ్మము ఏకమాత్రుఁడు అచలుఁడయ్యు అతఁడు మనస్సుకంటె వేగముగలవాఁడు సకలేంద్రియములును అగ్రగామియగు ఆపరబ్రహ్మమును పొందఁజాలవయ్యెను స్థిరుఁడై యుండియు అతఁడు శీఘ్రగమనముగల మనస్సును సకలేంద్రియములను అతిక్రమించి పోవుచున్నాఁడు అతఁడు

అధిష్ఠించి యుండుటచేతనే వాయువు సమస్తప్రాణుల శారీరిక వ్యాపారములను నడుపుచున్నది

వ్యా ఒకస్థలమునుండి మఱియొక స్థలమునకు పోవుట చలనమనఁబడును. ఏకమాత్రుఁడగు ఆ పరబ్రహ్మము సర్వప్రదేశములందును సమానముగా పూర్ణుఁడైయున్నాఁడు. అతఁడు లేని స్థానము లేదు. కావున అతఁ డొక స్థలమునుండి వేఱొక స్థలమునకు పోవుట అసంభవము. కావుననే అతఁడు అచలుఁడు. అతనికి చలనము లేదు. అచలుఁడయ్యు మనసుకంటె వేగము గలవాఁడు మనస్సు అతనిని పట్టుకొనఁజాలదు సకలేంద్రియములును తన్ను పట్టుకొనుట కెంత ప్రయత్నించుచున్నను స్థిరముగా నుండియే అతఁడు వానిని అతిక్రమించి పోవుచున్నాఁడు. వాయువు ప్రాణుల సమస్త శారీరిక వ్యాపారములను నడుపుచున్నది వాయువు లేనిచో అత్యల్పకాలములో దేహము వికలమైపోవును. కాని వాయువు ఎవ్వానినుండి యీశక్తిని పడయుచున్నదో అతఁడే లేని యెడల ఇక నయ్యది యెచ్చటినుండి శక్తినిపొంది ప్రాణికోటియొక్క శరీరరక్షణము కావింపఁగల్గును ? అందుచేతనే వాయువు అతని అధిష్ఠానమువలన ప్రాణుల సమస్త శారీరిక వ్యాపారములను నడుపుచున్నదని చెప్పఁబడియెను.

వి ఈవాక్యముగూడ మొదట యజుర్వేదములో నుండెను. ఇదియు ఈశ్వరుని సర్వవ్యాపకత్వమును గూర్చి ప్రస్తావించుచున్నది. ఎల్లెడల నున్నవాఁడగుటచే అతఁడు మనస్సుకంటె వేగము గలవాఁడు. ఇంద్రియము లతనిని పట్టుకొనఁజాలవు.

**మూ. తదేజతి తన్నైజతి తద్దూరే తద్వన్తికే,**
**తదన్తరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః 3**

[ఈశ. ౫-వా.]

టీ. తత్ = అది (బ్రహ్మము), ఏజతి = చలించుచున్నది. తత్ = అది, నైజతి = చలించుటలేదు. తత్ = అది, దూరే = దూరమునం దున్నది తత్ = అది, ఉ, అన్తికే = సమీపమునం దున్నది తత్ = అది, అస్య సర్వస్య = ఈసర్వము (జగత్తు) యొక్క, అంతః = అంతరమందును; తదు = ఆబ్రహ్మమే, అస్య సర్వస్య = ఈసర్వముయొక్క, బాహ్యతః = బాహ్యమందును (ఉన్నది)

తా. అతఁడు చలించును, అతఁడు చలింపఁడు అతఁడు దూరమున నున్నాఁడు, దగ్గర నున్నాఁడు అతఁడీ సర్వమునకు నంతరమున నున్నాఁడు, ఈ సర్వమునకు బాహ్యమునను ఉన్నాఁడు

వ్యా. స్థానాంతర ప్రాప్తికొఱకై మనుష్యులు కదలి వెళ్లుదురు. అతఁడు సర్వస్థానములందును నిండియుండుటంజేసి కదలి వెళ్లుటవలన కలుగవలసిన ప్రయోజనము ఏకకాలమునందే సిద్ధించుచున్నది అందువలననే అతఁడు చలించును, అనగా కదలుటవలన కలుగవలసిన ప్రయోజనము అతనికి సిద్ధించుచున్నదని చెప్పఁబడియెను. అతఁడు జడమువలె అచలుఁడుగాఁడు;

మృతునివలె నిష్క్రియుఁడునుగాఁడు. అతఁడు ప్రాణస్వరూపి. అతఁడు జాగ్రతుఁడును చైతన్యవంతుఁడు నగు దేవత, అతఁడు ముక్తస్వభావుఁడు. మహదాత్మ. కాని జనులెట్లు ఒకస్థానమునుండి మఱియొకస్థానమునకు వెళ్లు దురో అట్లు అతఁడు వెళ్లఁడు. ఏలయన అతఁడు సర్వత్ర పూర్ణుఁడై యున్నాఁడు. అతఁడు అపరివర్తనీయుఁడు, నిశ్చలుఁడు, సనాతనుఁడు, సత్యమైనవాఁడు. అతిదూరస్థమగు నక్షత్రమునందు అతఁడున్నాఁడు కేవలము దూరమునందేగాక అతఁడు మనకు సమీపమునఁ గూడ నున్నాఁడు. ఎంత సమీపమనఁగా, అతఁడు మనలోపలనే యున్నాఁడు అతఁ డే విధముగా మన యెల్లర యంతరముననున్నాఁడో అదియే విధమున అతఁడు మన వెలుపలనుగూడ నున్నాఁడు ప్రభువు తన సింహాసనమున నాసీనుఁడై తన రాజ్యమును శాసించురీతిగా అతఁ డెద్దియో యొక స్థలమున కూరుచుండి యున్నవాఁడుగాఁడు. అతఁడు ఒకేసమయమున సర్వస్థానములందును సమానరూపమున నున్నవాఁడై విశ్వమును పాలన సేయుచున్నాఁడు

వి ఈ వాక్యముగూడ తొలుత యజుర్వేదములో నున్న దే. యజుర్వేదమునందును ఈశావాస్యోపనిషత్తునందును ఈవాక్యము వెనుకటి వాక్యము తరువాత వచ్చు వాక్యమైయున్నది. మఱింత స్పష్టముగా ఈశ్వరుని సర్వవ్యాపకత్వమును గూర్చియే యిదియు నుడువుచున్నది. అతఁడు దూరాతిదూరమున నున్నాఁడు. సమీపాతిసమీపమున నున్నాఁడు అతఁడు సర్వమునకు లోపలను వెలుపలను నున్నాఁడు

మూ యస్తు సర్వాణి భూతాన్యాత్మన్యేవానుపశ్యతి,
సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే ౮
[ఈశ ౬ వా.]

టీ యస్తు = ఎవ్వఁడు, ఆత్మని=బ్రహ్మమునందు, సర్వాణి భూతాని = అన్నిభూతములను, సర్వభూతేషుచ = అన్ని భూతములయందును, ఆత్మానం=బ్రహ్మమును, అనుపశ్యతి = చూచుచున్నాఁడో, అతఁడు, తతః = అందువలన, న విజుగుప్సతే = నింద చెయఁడు

తా ఎవఁడు పరమాత్మయందు సకలవస్తువులను చూచునో, ఎవఁడు సకలవస్తువులయందును పరమాత్మను చూచునో అతఁడు దేనిని అలక్ష్యముచేయఁడు

వ్యా పరమాత్మలో సమస్తవస్తువులును ఉన్నవి అతఁడు సమస్తవస్తువులకు ఆశ్రయస్వరూపి అతనిని అవలంబనముగా చేసికొనియే సర్వమును నిలిచియున్నది ఎవఁడు పరమాత్మను ఆశ్రయమునుగా నెఱుంగునో, ఎవఁడు సకలభూతములయందును అతని స్వరూపమును వీక్షించునో అతఁ డెవ్వరిని నిర్లక్ష్యముచేయఁడు. ఎల్లరును ఆ అమృతపురుషుని సంతానమనియు, ఎవ్వరిని సర్వనియంతయగు ఆ విశ్వరక్షకుఁడు నిర్లక్ష్యము చేయుటగాని నిందచేయుటగాని తటస్థింపదనియు అతఁడు తెలిసికొనును. అందుచే అతఁడెవ్వరిని అలక్ష్యముచేయఁడు, నిందింపఁడు ఉత్తమాధమగుణముల ననుసరించి యెవ్వరియెడల నెట్లు వ్యవహరించుట యుక్తమో అట్లు అతఁడు ప్రవర్తించును

వి ఇదియు మొదట యజుర్వేదములోనిదే ఇందలి భావము అతి గభీరమయినది. హిందువుల మూలమతాభిప్రాయములలో నిది యొకటి.

ఇయ్యది భగవద్గీతలో తఱచుగా కనుపించుచుండును. "సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని, ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః" అని గీత ౬-వ అధ్యాయమున ౨౯-వ శ్లోకము. సృష్టి కంతకును శిరోభూషణమని చెప్పఁదగు సాధుపురుషుఁడు మొదలుకొని భూమిమీఁద ప్రాకెడు కీటక పర్యంతముగల సకల భూతజాలమునందును భగవత్స్వరూపమును, భగవంతునియందు సమస్తభూతకోటిని హైందవసాధకుఁడు తన అధ్యాత్మయోగమహిమవలన దర్శించెను. ప్రకృతి పరమాత్మలను గూర్చి యింతకంటె శ్రేష్ఠతరమైన భావమింకెద్ది గలదు?

మూ॥ సపర్యగా చ్ఛుక్రమకాయ మవ్రణ మస్నావిరగ్
శుద్ధ మపాపవిద్ధమ్, కవిర్మనీషీ పరిభూః, స్వయం
భూ ర్యాథా తథ్యతోఽర్థాన్ వ్యదధా చ్ఛాశ్వ
తీభ్య స్సమాభ్యః ౫

[ఈశ. ౮. వా.]

టీ॥ సః = పరమాత్ముఁడు, పర్యగాత్ = సర్వవ్యాపి, శుక్ర = శుద్ధుఁడు, అకాయం = అశరీరి, అవ్రణం = గాయము లేనివాఁడు, అస్నావిరం = నరములు లేనివాఁడు, శుద్ధం = నిర్మలుఁడు, అపాప విద్ధం = పాపరహితుఁడు, కవిః = సర్వదర్శి, మనీషీ = సర్వజ్ఞుఁడు, పరిభూః = మేలైనవాఁడు, స్వయంభూః = తనంతట దానుండువాఁడు, యాథా తథ్యతః = (జీవుల) సాధనానుగుణ్యముగా, అర్థాన్ = ఫలములను, శాశ్వ

తీభ్యః = శాశ్వతములయిన, సమాభ్యః = సంవత్సరములను పేరుగల ప్రజలకొఱకు, వ్యదధాత్ = విభజించి యిచ్చి యున్నాఁడు

తా. అతఁడు సర్వవ్యాపి ; నిర్మలుఁడు, నిరవయవుఁడు; గాయములుగాని నరములుగాని లేనివాఁడు ; శుద్ధుఁడు ; అపాపవిద్ధుఁడు అతఁడు సర్వదర్శి ; మనోనియంత ; అతఁ డెల్లరకంటెను శ్రేష్ఠుఁడు, స్వప్రకాశుఁడు; అతఁడు సర్వకాల మందును ప్రజలకు యథోపయుక్తము లయిన వస్తువులనెల్ల నొసంగుచున్నాఁడు

వ్యా. పరమాత్మ సర్వవ్యాపి;సకల స్థానములందును అతఁడున్నాఁడు. అతఁడు నిర్మలుడు, నిష్కళంకుఁడు, నిర్లిప్తుఁడు.అతని కెట్టి లోపముగాని దౌర్బల్యముగాని కలుగనేరదు అతఁడు నిరవయవుఁడు ఎట్టి అవయవమును అతనికి లేదు అందుచే అతఁడు నరములు లేనివాఁడు, గాయములు లేని వాఁడు, క్షతరహితుఁడు. అతని కెట్టి శారీరకమైన పీడగాని వేదనగానిలేదు. శరీరము లేనట్లే అతనికి మనస్సుగూడ లేదు కావున మనోజాడ్యములయిన పాపశోకములు అతనికి లేవు. మనవలె నతఁడు రోగముచే ఆతురతను శోకముచే వ్యాకులత్వమును పాపముచే పరితాపమును పొందఁడు. అతనికి రోగ ములేదు, శోకములేదు, పాపములేదు. అతఁడు అవ్రణుఁడు, శుద్ధుఁడు, అపాపవిద్ధుఁడు అతఁడు సర్వదర్శి, కవి.

సౌరమండలమునందలి నియమాధీన విధానమేమి, పూర్ణసుధాకరుని రామణీయకమేమి, జ్ఞానధర్మ రత్నముల అపూర్వ మనోరమస్వభావమేమి, సర్వమును అతని నిపుణమయిన అద్భుతరచన. అతఁడు మనీషి, మనస్సు యొక్క నియంత ఈమనోనియంతయగు పరమపురుషుఁడు భిన్నభిన్న జాతి జంతువుల మనస్సులందు భిన్నభిన్న నియమములను సంస్థాపనము చేసెను. కాని ఆ సకల నియమముల నేర్పాటుచేయుటలో నొక్కటే యుద్దేశము. అది యెద్దియన—అవియెల్ల సుఖముగా నుండవలయునను నదియే విశేషించి అతఁడు మనుష్యుని మనస్సును ఆశ్చర్యకరమగు నియమముల కధీనము చేసెను ఎట్టులన, జ్ఞానముయొక్కయు ధర్మముయొక్కయు ఉన్నతితో పాటు ఆత్మగూడ ఉన్నతి చెందుచుండును. మనుష్యాత్మ పరమేశ్వరుని మహాప్రయత్నఫలము అతఁడు దానిని అతినిపుణముగా సంరక్షణచేయు చున్నాఁడు మోహాతరంగములనుండియు, దుఃఖశోకములనుండియు పాప తాపములనుండియు తప్పించుకొని అయ్యది బ్రహ్మజ్ఞానమును బ్రహ్మానందమును పొందఁగల్గు ధర్మనియమముల నెల్ల నతఁడు ప్రతిష్ఠించెను. శిక్షా బహుమానములనుగూడ నతఁడు నియమానుసార మొసంగుచుండును. అతఁడు 'పరిభూః'. అందరికంటెను శ్రేష్ఠుఁడు, అతఁడు స్వయంభువు, స్వప్రకాశుఁడు సకలజంతువులును అతనిచే సృష్టింపఁబడి ప్రకాశితము లగుచున్నవి. అతఁడు జన్మరహితుఁడు, అనాది ఎవ్వరిచేతను అతఁడు సృజింపఁబడినవాఁడు గాఁడు. చిరకాలమునుండియు అతఁడు తనంతటతా ప్రకాశించుచున్నాఁడు. సర్వదా అతఁడు ప్రజాసమూహమునకు యథోపయుక్తములగు పదార్థముల నొసంగుచున్నాఁడు. వివిధ కీట, పతంగ, పిపీలికముల తోడను మత్స్య కచ్ఛప కుంభీరములతోడను, పశు పక్షి మనుష్యులతోడను అనంతకోటి

అదృశ్య సూక్ష్మజీవులతోడను నిండియున్న జలస్థలాకాశములందును వివర గహ్వరములందును అతఁడు పరిపూర్ణుఁడైయున్నాఁడు. అతఁడు వానికన్నిటికిని వాని వానికి కావలసిన సకలవిధ భోగసామగ్రిని యథోచితముగా అతి న్యాయరూపమున చిరకాలమునుండి యిచ్చుచున్నాఁడు అవి వానిని పొంది యిచ్చటి కచ్చటికి సుఖముగా సంచారము చేయుచున్నవి

వి ఇదియు మొదట యజుర్వేదములో నున్నదే. ఇందు సపర్యగాత్'' అను శబ్దము భగవంతుని సర్వవ్యాపకత్వమును సూచించుచున్నది. దీనికి ''అతఁడు చుట్టును వెళ్లును'' అని సరియైన అర్థము. ఈశ్వరునిగూర్చి ప్రయోగింపఁబడిన యితర పదములుగూడ గభీరార్థసమన్వితములై యున్నవి. అతఁడు ''శుద్ధమపాపవిద్ధమ్'' అని చెప్పఁబడియెను అనఁగా అతఁడు శుద్ధుఁడు, పాపరహితుఁడు. ఈపదములు బ్రాహ్మసమాజ ఆరాధన మంత్రములో చేర్పఁబడినవి. కవి అను శబ్దముగూడ మిక్కిలి భావగర్భితమయినది కవి యనఁగా నిపుడు కవిత్వము చెప్పువాఁడని యర్థము ఇందులో సృష్టిచేయుట అను భావముకూడ నిమిడియున్నది ఈఅభిప్రాయమే 'కవి' పదప్రయోగమువలన మనకిందు స్పష్టముగా గోచరించుచున్నది ఇఁక భగవంతుఁడు సమస్త భూతకోటికిని అక్కఱలను కనిపెట్టి జలాహారాదుల నొసంగువాఁడను భావమును వాక్యములోని కడపటిభాగము వ్యక్తీకరించుచున్నది



# ఆఱవ అధ్యాయము



**మూ** తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ బ్రహ్మ విదాప్నోతి
పరమ్ ౧

[తైత్తి. ౨-౩ వల్లి, ౧-౨ అను.]

టీ తపసా = ఏకాగ్రచిత్తముచేత, బ్రహ్మ = బ్రహ్మమును, విజిజ్ఞాసస్వ = విశేషముగా తెలిసికొనుటకు కోరుము. బ్రహ్మవిత్ = బ్రహ్మమును తెలిసికొన్నవాఁడు, పరం = బ్రహ్మమును, ఆప్నోతి = పొందుచున్నాఁడు

తా ఏకాగ్రచిత్తుఁడవై బ్రహ్మమును తెలిసికొనుటకు సంకల్పింపుము బ్రహ్మజ్ఞాని బ్రహ్మమును పొందును

వ్యా బ్రహ్మజ్ఞానము నిమిత్తమై అనన్యమనస్సుతో నతనినిగూర్చి ఆలోచింపవలయును. అంతియేకాదు శాంత సమాహితులై ఆంతర దృష్టి ద్వారమున అతని సత్యసుందర మంగళభావమును ఎఱుంగవలయును అపుడు అతనిని పొంది మీరు సఫల మనోరథు లగుదురు అంతరమునందును, బాహ్యమునందును సర్వత్ర సమానరూపమున పరబ్రహ్మము నిండి

యున్నాఁడు అతనిని పొందుటకై వేఱొక స్థానమునకు పోవలసిన పని లేదు అతనిని సాక్షాత్తుగా నెఱుంగుటయే అతనిని పొందుట. ఈ మర్త్య లోకమునందే అతనిని తెలిసికొనుటకై ప్రారంభము చేయఁదగును కాని అనంతకాల పర్యంతము అతనిని తెలిసికొనుట పూర్తికానేరదు. లోక లోకాంతరములందు అతనిని గూర్చి మన మెంత తెలిసికొందుమో అంత ఉత్కృష్టతర బ్రహ్మానందమును పొందినవారమై కృతార్థుల మగుదుము.

వి బ్రహ్మజ్ఞానము వలన కలిగెడు ఫలమును గూర్చి యీ ఆరవ అధ్యాయము ప్రస్తావించునట్లు కనఁబడుచున్నది. అతనిని తెలిసికొన్నవాఁడు జీవితపరమార్థమును పొందినవాఁ డని మొదటి వాక్యతాత్పర్యము తపస్సు వలన బ్రహ్మమును తెలిసికొనుటకు ప్రయత్నింపవలయు నని ఇది సుడుపు చున్నది తపస్సనఁగా ఏకాగ్రచిత్తత యని మహర్షి భాషాంతరీకరించెను. కొందరు ధ్యానమని అర్థము చెప్పిరి. ఏకాగ్రచిత్తతయు, ధ్యానమును తపస్సుయొక్క అంగములయినను, తపస్సునది ఈ రెంటిని మించియున్నది. దీనియందు మానవునియొక్క ప్రయత్నము మాత్రమేగాక, ఈశ్వరుని యొక్క తోడ్పాటుకూడ ఇమిడియున్నది

ఓం సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ యో వేద నిహితం
గుహాయాం పరమే వ్యోమన్ సోఽశ్నుతే సర్వా
న్కామాన్సహ బ్రహ్మణా విపశ్చితా ౨

[తైత్తి ౨-వల్లి, ౧-అను.]

టీ. సత్యం = సత్యస్వరూపుఁడును, జ్ఞానం = జ్ఞానస్వరూపుఁడును, అనంతం = అంతములేనివాఁడు నైన, బ్రహ్మ = బ్రహ్మమును, యః = ఎవ్వఁడు, పరమే వ్యోమన్ = శ్రేష్ఠమైన దేహాకాశమునందలి, గుహాయాం = బుద్ధియందు, నిహితం = ఉండునట్లు, వేద = తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, విపశ్చితా=సర్వజ్ఞుఁడయిన, బ్రహ్మణాసహ = బ్రహ్మముతోఁగూడ, సర్వాన్ కామాన్ = సమస్తభోగములను, అశ్నుతే = అనుభవించుచున్నాఁడు

తా॥ ఎవఁడు సత్యస్వరూపియు, జ్ఞానస్వరూపియు, అనంతస్వరూపియు నగు పరబ్రహ్మమును తనదేహాకాశము నందలి బుద్ధియందున్నట్లు గ్రహించునో అతఁడు సర్వజ్ఞుఁడయిన పరమేశ్వరునితోఁబాటు సకలభోగములను అనుభవించుచున్నాఁడు

వ్యా॥ పరమేశ్వరుఁడు మూలసత్యము, సకలసత్యములును అతనినుండి వెలువడి, అతఁడు అధిష్ఠించియుండుటచేతనే సంరక్షింపఁబడుచున్నవి. అతఁడు ఆదిసత్యము, అనాదిసత్యము, అతఁడు సత్యములకెల్ల సత్యము, పరమ సత్యము, సనాతనమైన ధ్రువసత్యము

ఎయ్యది తన్నుదా నెఱుఁగదో అది జడపదార్థము, ఎవ్వఁడు తన్నుఁదా నెఱుఁగుచున్నాఁడో అతఁడు జ్ఞానపదార్థము. మృత్తికా, ప్రస్తర, ధాతు, వృక్షాదులు తమ్ముఁదా మెఱుఁగనివి యగుటచే జడపదార్థములు.

జీవాత్మయుం పరమాత్మయు తమ్మును, అన్యములను నెఱుఁగఁగల్గుటచే జ్ఞానపదార్థములు కాని వీనిలో స్వప్రకాశుఁడయిన పరమాత్మయొక్క అపరిమేయమయిన స్వాభావికజ్ఞానముతో జీవాత్మయొక్క పరిమితమయిన క్షుద్రమానసిక జ్ఞానము సమానము కానేరదు పరిమితమయిన జీవాత్మకు జ్ఞానము కలదు, అజ్ఞానము గలదు, భ్రమప్రమాదమోహములు గలవు కాని అనంతుఁడయిన పరబ్రహ్మమునకు భ్రమ లేదు, ప్రమాదము లేదు, మోహము లేదు; అజ్ఞానము లేదు. అతఁడు శుద్ధ, బుద్ధ, ముక్తస్వభావుఁడు. అతఁడు జ్ఞానమునందు పరిపూర్ణుఁడు

అతఁడు అనంతస్వరూపి, అతఁడు జ్ఞానమునందు అనంతుఁడు, శక్తియందు అనంతుఁడు, మంగళభావమునందు అనంతుఁడు,—దేశమునందు అనంతుఁడు, కాలమునందు అనంతుఁడు.

ఎవ్వఁడు ఈ సత్యస్వరూపుఁడును జ్ఞానస్వరూపుఁడును, అనంతస్వరూపుఁడు నగు పరబ్రహ్మమును అతిసమీపమగు తన ఆత్మయందు సాక్షాత్తుగా తెలిసికొని అతని యిచ్ఛతో తన యిచ్ఛ నేకముచేయుచున్నాఁడో అతఁడు పరబ్రహ్మముతో బాటు సకలభోగములను అనుభవించుచు పరమపితయగు పరమేశ్వరుఁడు జగత్తు నెట్టి ఉదారదృష్టితో చూచుచున్నాఁడో, అత్యల్పములగు కీటకముల విషయమున గూడ అతఁ డెట్లు క్షేమమును వాంఛించుచున్నాఁడో అట్లే అతఁడు గూడ జగత్తును ఉదారదృష్టితో చూచును; అతని యిచ్ఛను అనుకరించును ఎవ్వెవ్వి ఈశ్వరుని కిష్టములో అవ్వియే అతఁడు చేయఁగోరు కార్యములు పరమేశ్వరుని అభిప్రాయము తప్పక సిద్ధించును అందుచే అతనికోరికలుగూడ నెఱవేరును. అట్లగుటం జేసి అతఁడు పరమేశ్వరునితో బాటు తాకోరినవి యెల్ల చెల్లించుకొనుచున్నాఁడు. సిద్ధ

మనోరథుఁడై అతఁడు పరమేశ్వరునికి సహచరుఁడును, అనుచరుఁడునై అతని విశుద్ధసహవాసమువలన సంతుష్టుఁ డగుచున్నాఁడు

వి భగవంతునితోఁబాటు తనమనోరథసిద్ధినిగూడఁ బడయుటయే బ్రహ్మజ్ఞానమును పొందుటవలన కలిగెడు ఫలమని యీవాక్యము తెలుపుచున్నది. మహర్షి యీవిషయమును విశదీకరించియున్నాఁడు కాని సత్య స్వరూపియనియు, జ్ఞానస్వరూపియనియు, అనంతుఁడనియు భగవంతుని స్వరూపనిర్వచనముచేయుటయే యీవాక్యమునందలి ముఖ్యవిషయమని మనము గ్రహింపవలయును "సత్యంజ్ఞానమనన్తమ్" అనుభాగము బ్రాహ్మ సమాజ ఆరాధన మంత్రములో చేర్పఁబడినది

మూ. యః సర్వజ్ఞః సర్వవిత్ యస్యైషమహిమా భువి దివ్యే
తద్విజ్ఞానేన పరిపశ్యన్తి ధీరా
ఆనందరూపమమృతం యద్విభాతి 3

[ముండక ౨-ముం. ౨-ఖం. ౭-వా.]

టీ. యః=ఎవ్వఁడు, సర్వజ్ఞః = సర్వజ్ఞుఁడో, సర్వవిత్ = సర్వవిదుఁడో, భువి = భూలోకమందును, దివ్యే = జ్యోతిష్మండలమునందు నుండెడి, ఏషః మహిమా = ఈసామర్థ్యము, యస్య = ఎవ్వనిదో, యత్ = ఏది, ఆనందరూపం = ఆనంద స్వరూపమో, అమృతం = అమృతస్వరూపమో, యత్ = ఏది, విభాతి = ప్రకాశించుచున్నయదో, తత్ = దానిని (బ్రహ్మ

ముచు) విజ్ఞానేన = విశిష్టమైన జ్ఞానముచేత, ధీరాః=వివేకులు, పరిపశ్యన్తి = సర్వత్ర దర్శనము చేయుచున్నారు

తా॥ ఎవ్వఁడు సామాన్యరూపమునను, విశేషరూపమునను, సమస్తవస్తువులను తెలిసికొనుచున్నాఁడో, ద్యులోకభూలోకములందుఁగల యీ మహిమ యెవ్వనిదో, ఆనందరూపుఁడై అమృతరూపుఁడై యెవ్వఁడు ప్రకాశించుచున్నాఁడో ఆబ్రహ్మమును జ్ఞానద్వారమున ధీరులు సర్వత్ర దర్శించెదరు

వ్యా॥ అతఁడు సర్వజ్ఞుఁడు, సర్వవిదుఁడు అతఁడు అన్నిటి వాస్తవికస్వరూపమును యథార్థతత్త్వమును తెలిసికొనుచున్నాఁడు. అంతియే కాదు. మనమేవస్తువు నేరూపమున దర్శించుచున్నామో అద్దియు నతఁడు గ్రహించుచున్నాఁడు పైభాగమున అనంతకోటి నక్షత్రలోకములు, ఇచట ఈ ఆశ్చర్యకరమగు భూలోకము ఈభూలోక ద్యులోకములందలి మహిమయంతయు ఆతనిదే అతఁడు సర్వత్ర ఆనందరూపుఁడై, అమృతరూపుఁడై ప్రకాశితుఁడగుచున్నాఁడు. సముద్రతరంగములందును, నదీప్రవాహమునందును సూర్యునిప్రకాశమునందును, చంద్రునిసౌందర్యమునందును, మనుష్యుని ముఖవర్చస్సునందును, పతివ్రతయొక్క పవిత్రప్రేమయందును అంతరమునందును బాహ్యమునందును ధీరులు అతనిని తమజ్ఞానచక్షుర్ద్వారమున నెల్లెడలను దర్శించెదరు

ఏ మూలమునందలి నడుమభాగమును విడిచివైచి మహర్షి మొదటి చివరిభాగములను మాత్రము నిలిపియుంచెను. ఇందుమూలమున వాక్యమున కెంతయో సౌన్దర్యమును గాంభీర్యమును వచ్చెను ఈవాక్యములోని 'ఆనం దరూపమమృతమ్' అనుభాగము బ్రాహ్మసమాజ ఆరాధనమంత్రములో చేర్పఁబడినది.

మూ హిరణ్మయే పరేకోశే విరజం బ్రహ్మనిష్కలమ్
తచ్ఛుభ్రంజ్యోతిషాంజ్యోతి స్తద్ యదాత్మవిదోవిదుః

[ముండక. ౨-ముం ౨-ఖం ౯-వా]

టీ ఆత్మవిదః = బ్రహ్మవేత్తలు, యత్ =ఏది, విరజం = నిర్మలమైనదో, బ్రహ్మ = మహత్తయినదో, నిష్కలమ్ = అవ యవములు లేనిదో, తత్ =ఆ, శుభ్రం = శుద్ధమును, జ్యోతి షాం = జ్యోతులకు, జ్యోతిః = జ్యోతియు నైన, తత్ = దానిని (బ్రహ్మమును), హిరణ్మయే = జ్ఞానమయమయిన, పరే = శ్రేష్ఠమైన, కోశే=తమ ఆత్మయందు, విదుః = ఎఱిఁగెదరు

తా ఎవ్వరు తమ యాత్మలను తెలిసికొనెదరో అట్టి వారు ఉజ్జ్వలమును శ్రేష్ఠమ్ము నైన తమ ఆత్మకోశమునందు ఆ నిర్మలుఁడును, నిరవయవుఁడును, జ్యోతులకు జ్యోతియు, నైన పరమాత్మను తెలిసికొనుచున్నారు

వ్యా ఏ మానవుని ఆత్మ జ్ఞానజ్యోతిచే ఉజ్జ్వలమగుచున్నదో, ధర్మభూషణముచే నలంకరింపఁబడిన దగుచున్నదో, ఆట్టి ఆత్మయందు అతఁడు చక్కఁగా ప్రకాశించుచున్నాఁడు ఇందువలననే మన యాత్మ పరమాత్మయొక్క శ్రేష్ఠమైన కోశమగుచున్నది అతఁడు నిర్మలుఁడు, శుద్ధుఁడు. అతఁడు జ్యోతులకు జ్యోతి అతఁడు ఆత్మయొక్క జ్యోతి, జ్ఞానజ్యోతియగు పరబ్రహ్మము ఆ జ్యోతికి రూపములేదు, అవయవమును లేదు, బ్రహ్మవిదులగు వారు జ్ఞానచక్షుర్ద్వారమున తమ యాత్మయందు ఆ సత్యజ్యోతిని దర్శించుచున్నారు

వి బ్రహ్మజ్ఞానఫలమును మఱింత చక్కఁగా విశదీకరించు ౧౦వ వాక్యమును మహర్షి ఏలనో విడిచివైచెను భగవంతుని దర్శించువానికి హృదయగ్రంథులు తెగిపోవుననియు, అనుమానములు తీరిపోవుననియు కర్మ లుడుగుననియు, ఆ వాక్యముయొక్క భావము.

మూ. న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం
నేమా విద్యుతో భాన్తి కుతోఽయమగ్నిః,
తమేవ భాన్తమనుభాతి సర్వం
తస్య భాసా సర్వమిదం విభాతి          ౫

[కఠ ౫వ. ౧౫వా.]

టీ తత్ర = అచ్చట (బ్రహ్మమునందు), సూర్యః = సూర్యుఁడు, న భాతి=ప్రకాశింపనేరఁడు, న చన్ద్రతారకం = చంద్ర

నక్షత్రములును ప్రకాశింపవు, ఇమాః=ఈ, విద్యుతః = మెఱుపులు, న భాన్తి=ప్రకాశింపవు అయం=ఈ; అగ్నిః = అగ్ని, కుతః = ఎక్కడ ?, సర్వం=అన్నియు (జగత్తు), భాన్తం=దీప్యమానుఁడైన, తమేవ = ఆ యీశ్వరుని బట్టియే, అనుభాతి = అనుసరించి ప్రకాశించుచున్నవి తస్య=అతని, భాసా = కాంతిచేత, సర్వమిదం = ఇదియంతయు, విభాతి = ప్రకాశించుచున్నది

తా సూర్యుఁడు అతనిని (బ్రహ్మమును) ప్రకాశింపఁజేయనేరఁడు చంద్రనక్షత్రములును అతనిని ప్రకాశింపఁజేయనేరవు ఈమెఱుపులును అతనిని ప్రకాశింపఁ జేయనేరవు అట్టిచో ఈఅగ్ని యెట్లు అతనిని ప్రకాశింపఁజేయనేర్చును ? సమస్తజగత్తును దీప్యమానుఁడగు ఆ పరమేశ్వరుని ప్రకాశముచే అనుప్రకాశితమై, ప్రకాశితమగుచున్నది ఈ సర్వమును అతని ప్రకాశమువలన ప్రకాశిత మగుచున్నది

వ్యా సూర్యచంద్రుల వెలుతురుచే పరమాత్మ ప్రకాశితుఁడగుట లేదు. మన ఆత్మయొక్క జ్యోతివలనను, అంతర్దృష్టివలనను అతఁడు ప్రకాశితుఁడగుచున్నాఁడు సమస్తజగత్తును దీప్యమానుఁడగు ఆపరమేశ్వరుని ప్రకాశముచే అనుప్రకాశితమై దీప్తిని బడయుచున్నది అతనినుండి విడిపోయినయెడల ఈసర్వమును నష్టమైపోవును

వి ఈవాక్యము శ్వేతాశ్వతరోపనిషత్తులో ౬-వ అధ్యాయములో ౧౪-వ వాక్యముగను ముండకోపనిషత్తులో ౨-వ ముండకములో ౨-వ ఖండములో ౧౦-వ వాక్యముగను గూడ కనుపించుచున్నది భగవంతుని మహిమావిశేషము నిది స్ఫుటముగా తెలుపుచున్నది భావమునందును భాష యందును, గంభీరముగానుండు నీవాక్యరాజము మూఁడు ఉపనిషత్తులలో గానవచ్చుట ఆశ్చర్యముగాదు కాని మొట్టమొదట నిది యేయుపనిషత్తు లోనిదో నిశ్చయించుట కష్టము. ప్రాచీనోపనిషత్తులలో చేరినది గాకపోవు టచే నిది శ్వేతాశ్వతరములోనిదై యుండదు బహుశః మొదట నిది కఠో పనిషత్తులో చెప్పఁబడి తక్కిన రెండింటిలోనికి పిదప ప్రవేశించియుండును. అగ్నిద్వారమున దేవతలు ప్రత్యక్ష మగుదు రను వైదికమతము నీవాక్య మొకవిధముగా అధిక్షేపించుచున్న దనవచ్చును సూర్యచంద్రాదులే బ్రహ్మ మును ప్రకాశింపఁజేయఁజాలనపుడు అగ్నియెట్లు ప్రకాశింపఁజేయ నేర్చునని ఈవాక్యములోఁ గలదు నిశ్చయముగా పరబ్రహ్మమే వానిని, సకలేతరపదా ర్థములను ప్రకాశింపఁజేయుచున్నాఁడు.

మూ ప్రాణోహ్యేషయః సర్వభూతైర్విభాతి
విజానన్ విద్వాన్ భవతే నాతివాదీ
ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావానేష
బ్రహ్మవిదాం వరిష్ఠః ౬

[ముండక 3-ముం. ౧-ఖం. ౪-వా.]

టీ॥ యః=ఎవ్వఁడు,సర్వభూతైః=సమస్తభూతములచేత, విభాతి=ప్రకాశించుచున్నాఁడో, ఏషః = ఇతఁడు (పరమేశ్వరుఁడు), ప్రాణః = జీవము (ఇట్లు), విజానన్ = తెలిసికొన్న, విద్వాన్=విద్వాంసుఁడు,అతివాదీ=(బ్రహ్మమును) అతిక్రమించి మాటలాడువాఁడు, న భవతే= కానేరఁడు, ఆత్మక్రీడః=పరమాత్మయందే క్రీడగలవాఁడు, ఆత్మరతిః=పరమాత్మయందే భోగముగలవాఁడును, క్రియావాన్ = సుకర్మశీలుఁడును అగు, ఏషః = ఈబ్రహ్మవిదుఁడు, బ్రహ్మవిదాం = బ్రహ్మవిదులలో, వరిష్ఠః = శ్రేష్ఠుఁడు

తా॥ ఎవ్వఁ డీ సమస్తభూతములందును వ్యక్తమగుచున్నాఁడో అతఁడు ప్రాణస్వరూపి ఈతనిని అతిక్రమించి జ్ఞాను లొక్కమాటయైనను వచింపరు వీరు పరమాత్మయందే క్రీడింతురు ; పరమాత్మయందే రమింతురు , సత్కర్మ శీలురయ్యెదరు వీరే బ్రహ్మోపాసకులలో సర్వశ్రేష్ఠులు

వ్యా॥ సర్వమునకును స్రష్టయు సర్వాశ్రయుఁడు నైన పరబ్రహ్మము లేకున్న నెద్దియు సంభవించియుండదు, ఎద్దియు నిలిచియుండదు ఇతఁడు సకలమునకును ప్రాణస్వరూపి, చలించెడు చంద్రసూర్యులేమి, చైతన్యవంతములగు వృక్షలతలేమి, బలోపేతములగు పశుపక్షులేమి, అన్నిటికిని కారణరూపుఁడై, అన్నిటికిని ఆశ్రయరూపుఁడై, అన్నిటికిని ప్రాణరూపియై, సమస్త

భూతములందును అతఁడు వ్యక్తమగుచున్నాఁడు బ్రహ్మజ్ఞుఁడయినవాఁడు అతనిని తనపరమబంధువని తెలిసికొనుచున్నాఁడు ఆ ప్రియసుహృదుని గుణకీర్తనము గావించుచు అతఁడు సర్వదా ఆనందితుఁడగును కేవలము అతనిని గూర్చి మాటలాడినంతమాత్రముననే వానికి అత్యంతమైన ప్రీతి జన్మించును. కేవలము అతనినిగూర్చిన ప్రసంగమువలననే వాని మనస్సు ఉత్సాహవంతమగును అనన్యమనస్కుఁడై ఆపరబ్రహ్మముయొక్క స్వరూపచింతనము గావించినపుడు అతని కెట్టి ఆమోదము కలుగునో అట్టిది మఱి ఎద్దానివలనను కలుగఁజాలదు. పరమేశ్వరుఁడు తన పరమపితయనియు అతఁడు పరమపూజనీయుఁ డనియు అతనియాజ్ఞను పరిపాలించుట కర్తవ్యమనియు తద్భిన్నమైన దెద్దియుం తనకు కర్తవ్యము గాదనియు బ్రహ్మజ్ఞుఁడయినవాఁడు తెలిసికొనుచున్నాఁడు అందుచే నాపరమేశ్వరుని మంగళాభిప్రాయమును గ్రహించుటకు అతఁడు సర్వదా యత్నము చేయును ఏవాక్కుల మూలమున అతని మంగళస్వరూపము వ్యక్తమగునో, అతని శుభాభిప్రాయము బోధపడునో వానిని గూర్చియే చర్చలు సలుపును, వానినే నేర్చుకొనును, వానినే ఉపదేశించును అతఁడు వాని నతిక్రమించి యేమియు మాటాడఁడు పరమేశ్వరునియందే అతని సంపూర్ణానురాగము అతనియందే అతని నిత్యామోదము అందుచేతనే యతఁడు పరమాత్మయందే క్రీడించుననియు, పరమాత్మయందే రమించుననియు చెప్పఁబడియెను కాని యెవ్వఁడు కేవలము అతనిని ప్రేమించి, అతని అభిప్రాయము నెఱింగియే యూరకుండక ఆయభిప్రాయానుసారముగా అతని ప్రియకార్యసాధనమునకుఁ గడంగి సత్కర్మశీలుఁడగునో అతఁడే యీ బ్రహ్మవిదులలో సర్వశ్రేష్ఠుఁడు, మనలో నెవ్వరికి నెంతమట్టుకు అతనియెడల అనురాగము కలుగునో అతని అభిప్రాయానుసార

ముగా పనిచేయ నెవ్వ రెంతమట్టుకు యత్నించెదరో అంతమట్టుకు వారికి శ్రేష్ఠత అబ్బుచున్నది, అంతమట్టుకు వారిజన్మము సార్థకమగును. ఇదియే మన కార్యము; ఇదియే మనలక్ష్యము.

వి బ్రహ్మాయం దానందించుటయే బ్రహ్మజ్ఞానముయొక్క ఫలమని ఈవాక్యము తెలుపుచున్నది బ్రహ్మజ్ఞానముచే బ్రహ్మప్రీతియు, బ్రహ్మప్రీతిచే బ్రహ్మసేవాభిలాషయు కలుగుననియు, జ్ఞానప్రేమ సేవలు మూ-డును విడదీయ రాని సంబంధమును కల్గియున్నవనియు నిది వెల్లడించుచున్నది.

మూ. బృహచ్చ తద్దివ్యమచిన్త్యరూపం
సూక్ష్మాచ్చ తత్ సూక్ష్మతరం విభాతి
దూరాత్ సుదూరే తదిహాన్తికే చ
పశ్యత్స్విహైవ నిహితం గుహాయామ్ ౭

[ముండక. ౩-ముం. ౧-ఖం ౭, ౮-వా]

టీ తత్ = అది (బ్రహ్మము), బృహత్ = మహాత్తైనది, దివ్యం = స్వప్రకాశమైనది, అచిన్త్యరూపం = చింతింపరాని రూపము గలది ; తత్=అది (బ్రహ్మము), సూక్ష్మాత్ చ = సూక్ష్మముకంటె, సూక్ష్మతరం = అతిసూక్ష్మముగా, విభాతి=ప్రకాశించుచున్నది, తత్=అది (బ్రహ్మము), దూరాత్=దూరముకంటె, సుదూరే = అతిదూరమునందును, ఇహ = ఇచ్చట, అన్తికేచ = సామీప్యమునందును, పశ్యత్సు = చేతన వస్తు

వులయందును, గుహాయాం = ఆత్మయందును, ఇహ ఏవ = ఇచ్చటనే, నిహితం = ఉన్నయది

తా. అతఁడు గొప్పవాఁడు, ప్రకాశవంతుఁడు, అచింత్యస్వరూపుఁడు, సూక్ష్మముకంటె సూక్ష్ముఁడయినవాఁడు అతఁడు దూరముకంటె బహుదూరమున నున్నవాఁడు అతఁడు సామీప్యమున నిక్కడనే యున్నవాఁడు అతఁడు ఇచ్చటి బుద్ధిసంపన్నములగు సకిలజీవుల ఆత్మలయందును నున్నవాఁడు

వ్యా అతఁడు బృహత్తయినవాఁడు, మహత్తయినవాఁడు. అతని ముందు మఱి యెద్దియు బృహత్తయినది గాదు, మహత్తయినదియుఁ గాదు. దీప్యమానుఁడగు అప్పరమేశ్వరుఁడు, సర్వత్ర ప్రకాశితుఁ డగుచున్నాఁడు. అతని స్వరూపము అచింత్యము అతఁడు సూక్ష్మమునకంటె సూక్ష్ముఁడు. అతిదూరముననున్న నక్షత్రములకంటె అతఁడు దూరమున నున్నాఁడు అతఁడు అతిసమీపముగాఁ గూడ నున్నాఁడు మన అందరి ఆత్మల లోపలను అతఁడు ఉన్నాఁడు అతఁడు సాక్షిరూపుఁడై సర్వత్ర నిండి యున్నాఁడు.

వి. ఈవాక్యము భగవంతుని గొప్పతనమునుగూర్చి చెప్పుచున్నది.

మూ. న చక్షుషా గృహ్యతే నాపి వాచా
నాన్యైర్దేవై స్తపసా కర్మణా వా
జ్ఞానప్రసాదేన విశుద్ధసత్వ
స్తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః ౮

[ముండక 3-ముం. ౧-ఖం. ౮-వా.]

టీ (పరమేశ్వరుఁడు) చక్షుషా=నేత్రముచేత, నగృహ్యతే గ్రహింపఁబడఁడు, నాపి వాచా=వాక్కుచేతను గాఁడు, అన్యైః = అన్యములయిన, దేవైః=ఇంద్రియములచేతగాని, తపసా = తపస్సుచేతగాని, కర్మణా వా=యజ్ఞాదికర్మలచేతగాని, న=కాఁడు తతః=అందువలన, నిష్కలం=అవయవవర్జితుఁడైన, తంతు=వానిని (ఈశ్వరుని), జ్ఞానప్రసాదేన = జ్ఞానముయొక్క అనుగ్రహముచేత, విశుద్ధసత్వః = పరిశుద్ధాంతఃకరణము కలవాఁడు, ధ్యాయమానః = ధ్యానముచేయుచు, పశ్యతే = దర్శనము చేయుచున్నాఁడు

తా అతఁడు చక్షువులకు గ్రాహ్యుఁడు కాఁడు; వాక్యమునకును గ్రాహ్యుఁడు కాఁడు; ఇతరేంద్రియముల వలనను గ్రాహ్యుఁడు కాఁడు తపస్సుచేగాని యజ్ఞాదికర్మలచే గాని అతనిని పొందుటకు వీలుగాదు పరిశుద్ధాంతఃకరణము

గలవాఁడు జ్ఞానసిద్ధిని గాంచి ధ్యానయుక్తుఁడై నిరవయవుఁ డగు ఆ పరబ్రహ్మమును పొందుచున్నాఁడు

వ్యా జ్ఞానాలోచనముచేతను, ధర్మానుష్ఠానముచేతను చిత్తము శుద్ధమయ్యేనేని అతనిని ఆత్మయందే సాక్షాత్తుగా పొంద నగును యాగయజ్ఞవ్రతానుష్ఠానములచేగాని నిరాహారము, అగ్నిసేవ మున్నగు తపస్సులచే గాని అతనిని పొంద వీలులేదు ఈ సకలమార్గములును అతనిని పొందుటకు మార్గములు గావు. జ్ఞానరూపమయిన మార్గమే అందులకు తగిన మార్గము

వి ఈ వాక్యరాజ మొక మహా ఆధ్యాత్మిక సత్యమును తెలియఁ జేయుచున్నది ఈ సత్యమునే ''పరిశుద్ధహృదయులగువారు ధన్యులు, ఏల యన వారు భగవంతుని చూడఁగల్గుదురు'' అన్నవాక్యము మూలమున ఏసు క్రీస్తు గూడ ప్రకటించెను దేశకాలములలో నెంతయో భేదముగల యిర్వురు సాధుపుంగవు లివ్విధమున నేకాభిప్రాయు లగుట నిశ్చయముగా ఆశ్చర్యకరము ఇద్దరును భగవంతుని చూడనగునని అసందిగ్ధముగా తెలుపుచున్నారు తెలిసికొన నగునని గాక, యిద్దరును (పశ్యతి) చూడ నగు ననియు, నందులో పరిశుద్ధహృదయులగువారే చూడఁగల్గుదురనియు నుడువుట ముఖ్యముగా గమనింపఁదగు విషయము బైబిలువాక్యముకంటె ఈ యుపనిషద్వాక్యము మఱింత స్పష్టముగానున్నది. యజ్ఞాది కర్మలవలనగాని తపస్సువలనగాని బ్రహ్మమును దర్శించుటకు వలనుపడదనియు, పరిశుద్ధాంతఃకరణము గలవారికే బ్రహ్మదర్శనము సాధ్యమగుననియు ఋషీశ్వరుఁడు స్పష్టముగా పల్కుచున్నాఁడు. పరిశుద్ధహృదయులన్న ఏసుక్రీస్తు ప్రయోగమునకన్న విశుద్ధసత్వులన్నపదము విశేషార్థము గలదైయున్నది ఈ అంతః

కరణ పారిశుద్ధ్యము జ్ఞానమువలన లభ్యమగును. ఉపనిషత్తులలో జ్ఞానమన్న శబ్దమునకు కేవలము బుద్ధిగత జ్ఞానమని అర్థము కాదు. జ్ఞానపద ప్రయోగము నైతిక, ఆధ్యాత్మిక పూర్ణత్వమును స్ఫురింపఁజేయును. పరిశుద్ధాంతఃకరణము గలవాఁడు ధ్యానావస్థలో బ్రహ్మదర్శనమును బడయునని ఋషీశ్వరుఁడు వచించుచున్నాఁడు ఈ వాక్యములో బ్రహ్మదర్శనమునకుఁ గావలసిన నియమములెల్ల చక్కఁగా వివరింపఁబడినవి



# ఏడవ అధ్యాయము.



మూ. తమీశ్వరాణాం పరమం మహేశ్వరం
తం దేవతానాం పరమఞ్చ దైవతమ్,
పతిం పతీనాం పరమం పరస్తాత్
విదామ దేవం భువనేశమీడ్యమ్ ౧

[శ్వేతా. ౬-అ, ౭-వా.]

టీ ఈశ్వరాణాం = ఈశ్వరులలో, పరమం = శ్రేష్ఠుండయిన, మహేశ్వరం = మహేశ్వరుఁడగు, తం = అతనిని (బ్రహ్మమును), దేవతానాం = దేవతలలో, పరమఞ్చ = శ్రేష్ఠమగు, దైవతం = దేవతను, పతీనాం = ప్రజాపతులకు, పతిం = పతిని, పరస్తాత్ పరమం = పరాత్పరుని, దేవం = దీప్యమానుని, భువనేశం = లోకేశుని, ఈడ్యం = స్తవనీయుని, విదామ = మే మెఱుఁగుదుము

తా సకల-ఈశ్వరులలో నెవ్వఁడు పరమమహేశ్వరుఁడో, సమస్తదేవతలలో నెవ్వఁడు పరమదేవతయో, సకల పతులకును నెవ్వఁడు పతియో, ఆపరాత్పరుఁడును, ప్రకాశ

మానుఁడును, స్తవనీయుఁడును అగు భువనేశ్వరుని మే మెఱుఁగుదుము.

వ్యా అతఁడు బ్రహ్మాండపతి రాజాధిరాజు. సర్వమునకు ఈశ్వరుఁడు అతని ఐశ్వర్యమునకు పరిమితి లేదు. జగత్తులో నెవ్వరెవ్వరి కెంతెంత యైశ్వర్యమున్నదో అది యంతయు నతనియైశ్వర్యము ఐశ్వర్యము పొందిన ప్రభువు లెందఱున్నారో ఆప్రభువులకెల్ల నతఁడే ప్రభువు. అందరికిని అతఁడు మహేశ్వరుఁడు. ఆతఁడు ఈభూలోకమునందలి రాజేశ్వరులకు ఈశ్వరుఁడు ఈభూలోకముకంటె శ్రేష్ఠములగు లోకములలో నివసించు దేవతలకును అతఁడు అధీశ్వరుఁడు జ్ఞానమునందును, ధర్మమునందును, ప్రీతి యందును మనుష్యునికంటె ఉత్కృష్టతరులయిన జీవులు జగత్తులోని యే భాగములో, ఏలోకములో నున్నను వారెల్లరును దేవశబ్దవాచ్యులే. ఆసమస్త దేవతలకును అతఁడు పరమదేవత, పరమపూజనీయుఁడు, నియంత. అతఁడు సకల ప్రతిపాలకులకును ప్రతిపాలకుఁడు. అతఁడు శ్రేష్ఠుఁడు. అతనిని మించినవారు మఱెవ్వరును లేరు అతఁడు మనకు సేవనీయుఁడు, అతఁడు మనకు స్తవనీయుఁడు, అతఁడు మనకు అతిశ్రద్ధేయుఁడు, పూజనీయుఁడు

వి. ఈ సప్తమాధ్యాయము భగవన్మహిమనుగూర్చి మఱింత స్పష్టముగా చెప్పుచున్నది. శ్వేతాశ్వతరోపనిషత్తు ౬-వ అధ్యాయములోని ౭-వ వాక్యమగు ఇందలి మొదటివాక్యమునందు భూలోకమునందు, తదితరలోకములందును గల సమస్తజీవరాసులకు ప్రభువుగా పరమేశ్వరుఁడు వర్ణింపఁబడియున్నాఁడు అన్యలోకములున్నట్లును, అందు మనుష్యులను

మించినజీవులు నివసించుచున్నట్లును ఉపనిషత్తులను రచించిన ఋషులు నమ్మి యుండిరి మానవులవలె సృష్టింపఁబడినవారయ్యు జ్ఞానమునందును శక్తియందును వారు మనుష్యులకంటె నధికులు. వారే దేవతలని పిలువఁబడుచుండిరి. వేదకాలమున పూజింపఁబడుచుండిన దేవతలకు ఉపనిషత్కాలమున నీస్థితి లభించెను. మహర్షి దేవేంద్రనాథ ఠాకూరుగారికిని మానవాతీతులగు నిట్టి జీవులయందు బహుశః నమ్మకముండి యుండవచ్చును. అట్టి నమ్మకము ఆక్షేపణీయముగా గూడ కనుపింపదు. భగవంతుఁడే సర్వలోకములకును కర్తయుం పరిపాలకుఁడు నై యున్నాఁడు.

మూ॥ న తస్య కార్యం కరణఞ్చ విద్యతే
న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే,
పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే
స్వాభావికీ జ్ఞానబలక్రియా చ ౨

[శ్వేతా ౬-౮. ౭-వా.]

టీ॥ తస్య = అతనికి, కార్యం = శరీరమును, కరణఞ్చ= చక్షురాదిఇంద్రియములును, న విద్యతే= లేవు తత్సమః-తత్ = అతనికి, సమశ్చ = తుల్యుఁడును, అభ్యధికశ్చ = శ్రేష్ఠుఁడును, న దృశ్యతే = కనఁబడఁడు అస్య = ఇతనియొక్క, పరా= శ్రేష్ఠ మయిన, శక్తిః= శక్తి, వివిధైవ= అనేకవిధములుగా, శ్రూయతే= వినఁ బడుచున్నది తస్య= అతనియొక్క, జ్ఞానబలక్రియాచ= జ్ఞానబల ములయొక్క క్రియయును, స్వాభావికీ= స్వభావసిద్ధమయినది.

తా॥ అతనికి శరీరముగాని ఇంద్రియములుగాని లేవు అతనితో సమానమైనవాఁడుగాని, అతనికంటె శ్రేష్ఠమయిన వాఁడుగాని యెవ్వఁడును కనుపింపఁడు. విచిత్రమును, మహాత్తరమునగు ఇతని శక్తి సర్వత్ర శ్రుతి గోచరమగుచున్నది జ్ఞానక్రియయు, బలక్రియయు ఈతనికి స్వభావసిద్ధములు.

వ్యా॥ శరీర మొక యంత్రవిశేషము, ఒక కార్యవిశేషము, పరమేశ్వరునికి శరీరమువంటి యంత్రములేదు, అతఁడు శరీరమువంటి యేయంత్రమునకును అధీనుఁడు గాఁడు. అతఁ డెవ్వరి కార్యమునుగాఁడు సమస్తకార్యములును అతనివియే. అతఁ డొక్కఁడే కారణస్వరూపి, అతనికి శరీరము లేదు, ఇంద్రియములును లేవు. అయినను అతఁడు సమస్తమును చూచుచున్నాఁడు, తెలిసికొనుచున్నాఁడు, అతఁడొక్కఁడే అన్నిఁటికంటెను శ్రేష్ఠుఁడు. అతని కెవ్వరును సమానులు కారు. అతనికంటె నెవ్వరును అధికులుకారు. అతఁడు ఈసమస్తమునకును స్రష్ట. సకలవస్తువులును అతని సృష్టి. అతఁడు విశ్వరూపమయిన ఈమహారాజ్యమునకు రాజు. అందఱును అతని ప్రజలు. అతఁడు మన పరమపిత, మనమందఱమును అతని సంతానము. అతఁడు మన ప్రభువు, మనము అతని ఆజ్ఞాధీనులమగు భృత్యులము. సర్వమును అతని నియమాధీనము, అతని నియమానుసారముగా ఉత్పన్నమగుచున్నది, అతని నియమానుసారముగా భగ్నమగుచున్నది. నభోమండలమును పరిశీలించు జ్యోతిర్వేత్తయేమి, భూగర్భమును శోధించు భూతత్వవేత్త యేమి, శారీరికనియమములను నిరూపించు శారీరవిధానవేత్తయేమి, భౌతికపదార్థతత్వమును వ్యక్తీకరించు పదార్థవిద్యావిశారదులగు పండితులేమి, ఆత్మతత్వమును గ్రహించిన సూక్ష్మదర్శులగు సుధీవరులేమి, యెల్లరును ఆశ్చర్యకరమును,

అచింత్యమునగు అతని శక్తిని కీర్తించుచున్నారు. వారిల్లరిమూలమునను అతని మహాశక్తియొక్క విస్తృతవర్ణనమే విన నగును

మనము ఇంద్రియముల ద్వారమున ప్రత్యక్షము చేసికొని ఒక్కొక్క విషయమును గుఱించి కొంచెము కొంచెముగా యుక్తి పరంపరమూలమున విచేచన చేసెదము. కాని భగవంతుని జ్ఞానక్రియ యట్టిదిగాదు. శరీరమునందలి కండరముల ద్వారా మనము మన బలమును వెల్లడిచేతుము. కాని అతని బలక్రియ యట్టిదికాదు స్వాభావికముగనే అతఁడు తన ప్రభావముచే సకలమును తెలిసికొనుచున్నాఁడు, అంతియేగాక అతఁడు కేవలము తన యిచ్ఛాబలము వలననే తన మంగళాభిప్రాయమును నెరవేర్చుకొనును ఏవిషయమును తెలిసికొనుట కైనను అతఁడు ఇంద్రియాదులమీఁద నాధారపడియుండవలసిన పనిలేదు, అంతియేగాక తనశక్తిని ప్రకటించుటకు అతనికి మఱే యే యుపకరణములూ నావశ్యకము కావు అతని జ్ఞానక్రియయు బలక్రియయు స్వభావసిద్ధములు. ఎవ్వనినుండి జ్ఞానవిశిష్టములయిన యీయసంఖ్యేయజీవరాసులు ఉత్పన్నములయ్యెనో, అతని జ్ఞాన మెంత ఆశ్చర్యకరము! ఎవ్వనిచే ఈసమస్తవస్తువులును సృష్టింపఁబడి తమతమశక్తులను పొందెనో అతనిశక్తి యెంత గొప్పది

మూ. న తస్య కశ్చిత్ పతిరస్తి లోకే
న చేశితా నైవ చ తస్య లిఙ్గమ్,
స కారణం కరణాధిపాధిపో
న చాస్య కశ్చి జ్జనితా న చాధిపః. 3

[శ్వేతా ఉ-అ, ౯-వా.]

టీ లోకే = లోకమునందు, తస్య=అతనికి, కశ్చిత్ = ఒక, పతిః = పతి, నాస్తి = లేడు ఈశితా=నియంత, నచ = లేడు తస్య = అతనికి, లిఙ్గమేవచ=అవయవమును, న= లేదు సః = అతఁడు, కారణం = సకలమునకును కారణుఁడు. కరణాధిపాధిపః = మనసునకును అధిపుఁడు, అస్య = ఇతనికి, కశ్చిత్ = ఒకానొక, జనితా = జనకుఁడును, అధిపశ్చ = అధిపుఁడును, న = లేఁడు

తా ఈ లోకములో నతనికి యజమానుఁడుగాని నియంతగాని ఒక్కఁడును లేఁడు. అతని కెట్టి యవయవము గూడ లేదు. అతఁడు సకలమునకు కారణుఁడు; మనసునకు అధిపతి ఇతనికి ఒక్కఁడును జనకుఁడు లేఁడు; అధిపతియు లేఁడు.

వ్యా అతఁడు నిత్యుఁడును, నిరవయవుఁడును, స్వతంత్రుఁడును, జన్మరహితుఁడు నగు మహాత్మ.

మూ ఏషదేవో విశ్వకర్మా మహాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః,
హృదామనీషా మనసాభిక్లృప్తో
య ఏతద్విదురమృతాస్తే భవన్తి ౪

[శ్వేతా. ౪-అ, ౧౭-వా.]

టీ ఏషః=ఈ, దేవః=దేవుఁడు, విశ్వకర్మా=జగన్నిర్మాణ కర్త, మహాత్మా=మహాత్ముఁడు సదా=సర్వదా, జనానాం=జనుల యొక్క, హృదయే=హృదయమునందు, సన్నివిష్టః=చక్కఁగా నుండెడివాఁడు హృదా = హృదయమునందలి, మనీషా=సంశయములేని, మనసా=మనసుచేత, అభిక్లృప్తః=తెలిసికొనఁతగిన వాఁడు యే = ఎవరు, ఏతత్ = దీనిని (బ్రహ్మమును), విదుః= తెలిసికొనియెదరో, తే=వారు, అమృతాః=నిత్యపదవిగలవారు, భవన్తి=అగుచున్నారు

తా ఈపరమేశ్వరుఁడు విశ్వకర్మ, మహాత్ముఁడు ఇతఁడు జనులయొక్క హృదయములందు సర్వదా చక్కఁగా వసించుచుండును హృదయమునందలి సంశయరహితమైన బుద్ధిద్వారా యితఁడు ప్రకాశితుఁడగును ఎవ్వ రీతనిని తెలిసికొనుచున్నారో వారు అమరు లగుచున్నారు.

వ్యా ఈపరమేశ్వరుఁడు విశ్వమును సృజించెను, రచించెను అట్లగుటం జేసి యితఁడు విశ్వకర్మ ఇతఁడు మహాత్ముఁడు, జీవాత్మవలె ఇతఁడు క్షుద్రుఁడు కాఁడు. ప్రాణమునకు ప్రాణమై ఇతఁడు సమస్త జనులయొక్క హృదయములందును సర్వదా వసించుచున్నాఁడు. సంశయరహితమైన నిర్మలజ్ఞానద్వారమున ఇతఁడు ప్రకాశితుఁడగును. ఎవ్వ రీతనిని అనుసంధానము చేసి తెలిసికొన గల్గుచున్నారో వారలు ఈతని సహవాససంజనితభూమానందమును నిత్యము అనుభవించెదరు.

వి ఇందు భగవంతుఁడు మానవుని హృదయాంతర్గతుఁడై యుండు నన్న విశేషభావ మొకటిగలదు. సంశయరహితమును, పరిశుద్ధమునగు మనస్సున కతఁడు గోచరుఁ డగుననియు, అట్టి జ్ఞానమును పొందుటవలన మనుజుఁడు అమృతత్వమును బడయుననియు నీవాక్యము తెలుపుచున్నది.

మూ తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం
గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్,
అధ్యాత్మయోగాధిగమేన దేవం
మత్వా ధీరో హర్షశోకౌ జహాతి ౫

[కఠ ౧-అ, ౨-వ, ౧౨-వా.]

టీ దుర్దర్శం = దుర్జ్ఞేయుఁడును, గూఢం = సూక్ష్మరూపియును, అనుప్రవిష్టం = సకలమునందు ప్రవేశించియుండెడివాఁడును, గుహాహితం = ఆత్మలయం దుండెడివాఁడును, గహ్వరేష్ఠం = సంకట స్థానములయం దుండెడివాఁడును, పురాణం = పురాతనుఁడైన, తం=ఆ, దేవం = దేవుని, ధీరః = ధీరుఁడు, అధ్యాత్మయోగాధిగమేన = మనస్సును విషయములనుండి మఱలించి పరమాత్మయం దుంచెడు యోగాభ్యాసముచేత, మత్వా = తెలిసికొని, హర్షశోకౌ = సంతసమును వ్యసనమును, జహాతి = విడుచుచున్నాఁడు

తా దుర్జ్ఞేయుఁడును, గూఢముగా నన్నిటియందును ప్రవేశించి యుండెడివాఁడును, ఆత్మలయందును, సంకటస్థానములయందు నుండెడివాఁడును, పురాతనుఁడైనవాఁడు నగు దేవుని ధీరుఁడు అధ్యాత్మయోగముచే తెలిసికొని హర్షశోకములను విడిచిపెట్టుచున్నాఁడు

వ్యా అతఁడు దుర్జ్ఞేయుఁడు విషయమోహముచే జ్ఞానము గోల్పోయినవాఁడు అతని నెట్టిమార్గముచేతను తెలిసికొనఁజాలఁడు. దర్శనశాస్త్రమును చదివినను, తర్కశాస్త్రమును పఠించినను అతని మనస్సులోని సంశయము లెన్నఁటికిని విచ్ఛేదము కాఁజాలవు అతని మన సెన్నఁటికిని సంతుష్టి చెందఁజాలదు సకలసత్యములకు మూలమగు సత్యము అతనియెదుట ఛాయారూపమున ప్రకాశించుచుండును కాష్ఠమునందు అగ్ని యెట్లు గూఢరూపమున నున్నదో ఆతీరుననే అతఁడు సమస్తపదార్థములయందును గూఢరూపమున ప్రవేశించి మరుఁగైయున్నాఁడు పరిశుద్ధమనస్కులగు బ్రహ్మనిష్ఠాపరుల నిర్మలజ్ఞానమునందు ఆపరమేశ్వరుఁడు దగ్ధదారువునుండి వెడలెడు అగ్నిజ్వాలచందమున ప్రకాశించుచుండును అతఁడు ఆత్మకు అంతరాత్మ. అతఁడు మన ఆత్మలయందు సర్వదా ఆసీనుఁడైయున్నాఁడు అతఁడు ఆకాశమునందును ఓతప్రోతభావమునను న్నాఁడు అతఁడు పర్వతముల గుహాగహ్వరములందును, హిమాచలముయొక్క కైలాసశిఖరమునందును, విస్తీర్ణదావానలమునందును, భీషణ సముద్రతరంగములందును, నిర్జన దుర్గమ సంకటస్థానములందును సంస్థితుఁడై నిత్యుఁడై యున్నాఁడు. అతఁడు మన సాక్షాత్పిత

అతఁడు మనపురాతనపితామహుఁడు బుద్ధిమంతులగువారు అధ్యాత్మయోగముచే దుర్జ్ఞేయుఁడైన యాపరమాత్మను తెలిసికొని హర్షశోకములనుండి ముక్తులయ్యెదరు. జీవాత్మ పరమాత్మతో సంయోగముచెందుటయే అధ్యాత్మయోగమనఁబడును అధ్యాత్మయోగమునందు మన ఇచ్ఛ యెప్పుడు అతని ఇచ్ఛతో సంయుక్తమగునో, మన జ్ఞాన మెప్పుడు అతని సత్యసుందరమంగళమూర్తిని దర్శించి సంతుష్టిచెందునో అపుడు హృదయ మతనికి ప్రీతియనెడు కానుకను సమర్పించి ఆనందసాగరమున లీనమై విషయవాంఛలవలన గలిగెడు హర్షశోకములనుండి విడివడిన దగుచున్నది. అతని యిచ్ఛతో మన యిచ్ఛ యెంత సంయోగముచెందునో, అతని జ్ఞానముతో మన జ్ఞాన మెంత సంయుక్తమగునో, అతని ప్రీతితో మన ప్రీతి యెంత కలిసిపోవునో అంత మన మతని పవిత్రసామీప్యానుభవమును పొంది పవిత్రుల మయ్యెదము. ఇట్టి యోగముచేతనే అతనిని మనము తెలిసికొన గలుగుచున్నాము, ఇట్టియోగము చేతనే అతనిచే నాదేశింపఁబడిన ధర్మానుష్ఠానమునందు బలమును పొందుచున్నాము. ఇట్టి యోగమువలననే స్వర్గము లభించును, ఇట్టియోగము వలననే ముక్తి లభించును

మూ ప్రాణస్య ప్రాణముత చక్షుషశ్చక్షురుత
శ్రోత్రస్య శ్రోత్రం మనసో యే మనో విదుః
తే నిచిక్యు ర్బ్రహ్మ పురాణ మగ్ర్యమ్ ౬

టీ (బ్రహ్మము) ప్రాణస్య=ప్రాణమునకు, ప్రాణం=ప్రాణమని, ఉత=అట్లే; చక్షుషః=నేత్రమునకు, చక్షుః=నేత్రమని,

ఉత=అస్మే, శ్రోత్రస్య=శ్రోత్రమునకు, శ్రోత్రం = శ్రోత్రమని, మనసః = మనస్సునకు, మనః=మనస్సని, యే=ఎవ్వరు, విదుః = తెలిసికొనియెదరో; తే = వారు, పురాణం = చిరంతనుఁడును, అగ్ర్యమ్ = శ్రేష్ఠుఁడునైన, బ్రహ్మ=బ్రహ్మమును, నిచిక్యుః = నిశ్చయముగా తెలిసికొనియెదరు

తా ఎవ్వరు పరబ్రహ్మమును ప్రాణమునకు ప్రాణమనియు, చక్షువునకు చక్షువనియు, శ్రోత్రమునకు శ్రోత్రమనియు, మనస్సునకు మనస్సనియు తెలిసికొనియెదరో వారు పురాతనుఁడును సర్వశ్రేష్ఠుఁడు నైన యతనిని నిశ్చయముగా తెలిసికొనియెదరు.

వ్యా ఎవ్వ రతనిని సర్వమునకు చైతన్యరూపమయిన కారణుఁడనియు, ఆశ్రయుఁడనియు తెలిసికొనియెదరో వారు ఆతనిని నిశ్చయముగా తెలిసికొనెదరు.

మూ  ఏకధైవానుద్రష్టవ్య మేతదప్రమేయం ధ్రువమ్,
విరజః పర ఆకాశాదజ ఆత్మా మహాన్ ధ్రువః  ౭
[బృహ ౪-అ, ౪-బ్రా, ౨౦-వా.]

టీ అప్రమేయం = ఉపమా రహితమును, ధ్రువం = నిత్యమునైన, ఏతత్ = ఇది (బ్రహ్మము), ఏకధావేవ =

ఒక్కటియనియే, అనుద్రష్టవ్యం = ఎఱుఁగఁదగినది ఆత్మా = పరమాత్ముఁడు, విరజః = నిర్మలుఁడు, ఆకాశాత్ = ఆకాశము కంటె, పరః = సూక్ష్మరూపి, అజః = జన్మరహితుఁడు, మహాన్ = మహత్తరుఁడు, ధ్రువః = నాశములేనివాఁడు

తా పరమేశ్వరుఁడు ఒక్కఁడే యని తెలిసికొనవల యును అతఁడు ఉపమారహితుఁడు ; నిత్యుఁడు నిర్మల మును, జన్మవిహీనమును, మహత్తరము నైన యీ ఆత్మ ఆకాశమునకంటె అతితమయినది అన్నిటికంటె అధికమయి నది, నాశము లేనిది

వ్యా అతఁడు ఏకమాత్రుఁడు. ఉపమారహితుఁడు అతనితో నుపమింపఁదగిన అతనివంటి వస్తువు మరియొకటి లేదు అతఁడు సకలవస్తు వులనుండి వేఱయినవాఁడు. అతఁడు ఆకాశమున కంటె నతీతుఁడు, ఆకా శమునందుండి అతఁడు సమస్తకార్యములను నియమించుచున్నాఁడు

మూ యస్మాదర్వాక్ సంవత్సరోఽహోభిః పరివర్తతే,
తద్దేవాజ్యోతిషాంజ్యోతిరాయుర్హోపాసతేఽమృతమ్
[బృహ ౪-అ, ౪-బ్రా, ౧౬-వా]

టీ యస్మాత్=ఎవరివలన(ఏయీశ్వరునివలన), అర్వాక్ సంవత్సరః=సంవత్సరముపొడుగున నున్న కాలము, అహోభిః=

అహోరాత్రులచే, పరివర్తతే=పరివర్తమైవచ్చుచున్నదో,తత్ = ఆ, జ్యోతిషాం=జ్యోతులకు, జ్యోతిః=జ్యోతియును, ఆయుః= ఆయుష్కారణుఁడు నైన, అమృతం=నిత్యునే (బ్రహ్మమును), దేవాః= దేవతలు, ఉపాసతే=పూజించెదరు

తా॥ ఎవ్వనిశాసనమువలన సంవత్సరము పోడుగుననున్న కాలము అహోరాత్రులచే పరివర్తనమగుచు వచ్చుచున్నదో అట్టి జ్యోతులకు జ్యోతియును, అమృతుఁడును, ఆయుష్కారణుఁడునైన పరబ్రహ్మమును దేవతలు ఉపాసించెదరు

వ్యా॥ జ్ఞానమునందును, ధర్మమునందును, ప్రీతియందును మనుష్యులకంటె నున్నతులై యితరలోకములందు నివసించునట్టియే యుత్కృష్ట జీవులు గలరో వారెల్ల పరబ్రహ్మమును నియతముగా నుపాసించెదరు. దేవతలెట్లు పరబ్రహ్మము నుపాసించెదరో అదేవిధమున మనుష్యులుగూడ వాని నుపాసించుటకు నధికారమును గల్గియున్నారు ఇది మనకు సామాన్య గౌరవముగాదు. సామాన్య సౌభాగ్యమునుగాదు

వి॥ కాలబద్ధములగు సమస్తకార్యములను నడుపుచున్న వాఁడయ్యు, అతఁడు కాలాతీతుఁడని యీ వాక్యము తెలుపుచున్నది

**మూ. సర్వస్య వశీ సర్వస్యేశానః సర్వస్యాధిపతిః,**
**స న సాధునా కర్మణా భూయాన్ నో ఏవ అసాధునా కనీయాన్. ౯**

[బృహ. ౪-అ, ౪-బ్రా, ౨౨-వా.]

టీ సర్వస్యవశీ=సర్వమును వశమందుగలవాఁడు, సర్వస్య=అన్నిఁటికిని, ఈశానః = నియమనకర్త; సర్వస్య=అన్నిఁటి యొక్క, అధిపతిః=ప్రభువు, సః = అతఁడు, సాధునాకర్మణా= సుకృత్యము చేత, నోభూయాన్=ఉత్కృష్టుఁడగుటయు లేదు. అసాధునా ఏవ=అసత్కర్మములచేతను, నకణీయాన్=నికృష్టుఁడగుటయు లేదు

తా సకలమును అతనికి వశీభూతమై యున్నది. అతఁడు అన్నిటికిని నియామకుఁడు; అన్నిటికిని అధిపతి; సత్కర్మములచే అతనికి వృద్ధి కలుగదు; అసత్కర్మములచే అతఁడు తగ్గిపోవుటయు లేదు

వ్యా పరమేశ్వరుఁడు దేనిని ఏనియమాధీనము చేసియుండెనో, అది ఆనియమమునకు లోఁబడియున్నది ఏదియు అతని శాసనమును మీఱ నేరదు అతఁడు సర్వేశ్వరుఁడు, సర్వ నియంత, సర్వాధిపతి. మంచికార్యములను చెడుకార్యములను జేసి మనుష్యుఁ డెట్లు మంచివాఁడో చెడ్డవాఁడో అగునో ఆవిధముగా అతఁడు మాఱిపోవుటకు వీలులేదు. అతని స్వరూప మెంత ఉత్కృష్టమైనదనఁగా ఇఁక నంతకంటె నెక్కువగుటకు వీలు లేనంత యుత్కృష్టమయినది. అతఁ డెంత అపరివర్తనీయుఁ డనఁగా, ఎన్నటికిని మాఱిపోయి నికృష్టుఁడు కాలేనంత అపరివర్తనీయుఁడు.

వి ఇది భగవంతుని విశ్వాతీత స్వభావమును ప్రకటించుచున్నది. అతఁడు జీవుల సుకృత దుష్కృతములచే నెంతమాత్రమును మార్పుచెందని వాఁడు. సర్వాతీతుఁడు.

మూ॥ ఏషసర్వేశ్వర ఏష భూతాధిపతిరేష భూతపాలః,
ఏష సేతుర్విధరణ ఏషాం లోకానామసంభేదాయ
[బృహ. ౪-అ, ౪-బ్రా, ౨౨-వా.]

టీ॥ ఏషః = ఇతఁడు, సర్వేశ్వరః = సమస్తవస్తువులకు నధిపతి ఏషః = ఇతఁడు, భూతాధిపతిః = భూతములకు అధిపతి ఏషః = ఇతఁడు, భూతపాలః = సమస్త భూతములకును రక్షకుఁడు ఏషః = ఇతఁడు, ఏషాం లోకానాం = ఈ లోకములయొక్క, అసంభేదాయ = భంగనివారణార్థమైన, సేతుః = సేతు స్వరూప, విధరణః = ధారణము జేయువాఁడు

తా॥ ఇతఁడు సర్వమునకు ఈశ్వరుఁడు ; ఇతఁడు సమస్తవస్తువులకును అధిపతి , ఇతఁడు సర్వభూతములకును ప్రతిపాలకుఁడు, లోకభంగ నివారణార్థమై ఇతఁడు సేతుస్వరూపియై సమస్తమును ధారణము చేయుచున్నాఁడు

వ్యా॥ ప్రజాపాలకుఁడగు పరమేశ్వరుఁడు దృఢబద్ధమయిన నియమప్రణాళిని స్థాపించి విశ్వరాజ్యమును పాలించుచున్నాఁడు. వానికి వ్యతిరేకముగా నెద్దియేని జరుగుటకుగాని విశ్వ సంసారమునకు భంగము కలుగుటకుగాని వీలులేదు. పరమేశ్వరుఁడు, లోకభంగ నివారణార్థము సేతుస్వరూపియై సమస్తమును ధారణము చేయుచున్నాఁడు.

వి సర్వాతీతుఁడయ్యు అతఁడీవిశ్వమును విచ్ఛిన్నము గాకుండ సంరక్షించుచున్నాఁడని యీవాక్యము నుడువుచున్నది. అతఁడు కనిపెట్టు చుండనిచో భిన్నప్రయోజనములును, భిన్న ప్రవృత్తులును, భిన్న స్వభావ ములును గల యీ సమస్త జీవరాసులును నశించిపోయి యుండును నది లోని జలము పొరలిపోయి చుట్టుపట్లనున్న స్థలములకు నష్టము కలిగింప కుండ దాని కిరుప్రక్కలనున్న గట్లు సంరక్షణచేయుచున్నవి. అవ్విధముననే హద్దుమీఱి చెడి పోకుండ లోకములను భగవంతుఁడు రక్షించుచున్నాఁడు.

యా అస్మిన్ ద్యౌః పృథివీ చాన్తరిక్ష
మోతం మనః సహ ప్రాణైశ్చ సర్వైః,
తమేవైకం జానథ ఆత్మానమన్యా వాచో
విముఞ్చథ అమృతస్యైష సేతుః ౧౧

[ముండక ౨-ముం ౨-ఖం. ౫-వా.]

టీ అస్మిన్=ఇతనియందు, ద్యౌః=ద్యులోకమును, పృథివీచ = భూలోకమును, అన్తరిక్షం = ఆకసమును, సర్వైః = ప్రాణైస్సహ=సమస్త ఇంద్రియములతోఁగూడిన, మనశ్చ=మన స్సును, ఓతం = ఆశ్రయించియున్నవి ఏకమేవ = ఒక్కఁడే యయిన, తమాత్మానం = ఆపరమాత్ముని, జానథ=ఎఱుఁగుఁడు అన్యాఃవాచః=ఇతరవాక్యములను, విముఞ్చథ=పరిత్యజింపుఁడు అమృతస్య = మోక్షమునకు, ఏషః=ఇతఁడు, సేతుః=కట్టవంటి వాఁడు

తా ఇతనియందు ద్యులోకమును, భూలోకమును, అంతరిక్షమును, మనస్సును సకలేంద్రియములును ఆశ్రయించుకొని యున్నవి అద్వితీయుఁడైన ఆపరమాత్మను తెలిసికొనుము ఇతరవాక్యములనెల్ల పరిత్యజింపుము అతఁడు అమృత పదవికి సేతువు

వ్యా ఇతఁడు అన్నిఁటికిని రక్షకుఁడు అన్నిఁటికిని ఆశ్రయుఁడు ఇతనిని తెలిసికొనుము ఇతరవాక్యములను పరిత్యజింపుము. ఇతనిని అతిక్రమించి ఎట్టిమాటయుఁ బలుకకుము. ఎట్టి చింతను చింతింపకుము. ఎట్టికార్యమును సలుపకుము పూర్తిగా ఇతనికి శరణాపన్నుఁడవై యుండుము. అపుడు పాపతాప మోహములనుండి ముక్తుఁడవై అమృతత్వమును పొందుదువు. ఇతఁడు అమృతత్వమునకు సేతుస్వరూపి.

మూ న జాయతే మ్రియతే వా విపశ్చిన్నాయం
కుతశ్చి న్న బభూవ కశ్చిత్.          ౧౨

[కఠ ౨-వ, ౧౮-వా.]

టీ (ఏషః = ఈ పరమాత్మ) నజాయతే = పుట్టుట లేదు. నమ్రియతేవా = మృతిపొందుట లేదు విపశ్చిత్ = సర్వజ్ఞుఁడైన, అయం = ఈ పరమాత్మ (బ్రహ్మము), కుతశ్చిత్ = మఱి యొక ఏకారణమునుండియు, న బభూవ=కా లేదు. కశ్చిత్ = మఱియొక అర్థాంతరముగాను, న బభూవ = అగుట లేదు

తా ఈ పరమాత్మకు జన్మలేదు, మృత్యువు లేదు; ఇతఁడు సర్వజ్ఞుఁడు ఇతఁడు ఏకారణమువలనను ఉత్పన్నుఁడైనవాఁడు గాఁడు మఱి యేవస్తువును తా నయ్యేడువాఁడును గాఁడు

వ్యా జన్మమును, మృత్యువును, వికారములును లేనివాఁడును, భ్రమప్రమాదశూన్యుఁడును, శుద్ధుఁడును, అపాపవిద్ధుఁడును నగు పరమేశ్వరుని వలన నీసమస్తమును ఉత్పన్నమయ్యెను కాని అతఁడుమాత్రము స్వయముగా ఏమియు కాలేదు దుగ్ధము మార్పుచెంది దధియయినట్లు,మృత్తిక రూపాంతరమును బొంది ఘటమయినట్లు, సువర్ణము అవస్థాభేదమునుగాంచి కుండలాకారమును దాల్చినట్లు, అతఁడు ఏవస్తురూపముననను మాఱియుండలేదు రజ్జువునందు సర్పభ్రాంతియు, మరీచికయందు జలభ్రాంతియు, శుక్తియందు రజతభ్రాంతియు కలిగిన విధమున పరబ్రహ్మమునందు కలిగిన భ్రాంతియే యీజగద్రూపమున ప్రకాశించుట లేదు అతఁడీ సమస్త జగత్తును సృష్టించియుండెను. జగత్తు అతని నుండి భిన్నమయిన పదార్థము అతఁడు స్వయముగా జడము కాలేదు జీవియుం కాలేదు అతఁడు సేవ్యుఁడు, ఉపాస్యుఁడు, మనమందరమును అతని సేవకులము, ఉపాసకులము

మూ యదర్చిమద్ యదణుభ్యోఽణు
యస్మిఁల్లోకా నిహితా లోకినశ్చ,
తదేతత్సత్యం తదమృతం
తద్వేద్ధవ్యం సౌమ్య విద్ధి. ౧౩

టీ యత్=ఏది, అర్చిమత్=జ్యోతిర్మయమో, యత్ = యేది, అణుభ్యః = అణువులకంటె, అణు = అణువో, యస్మిన్= దేనియందు, లోకాః = లోకములు, లోకినశ్చ = లోకులును, విహితాః=ఉన్నారో, తదేతత్ = ఆ ఇది (బ్రహ్మము), సత్యం= సత్యస్వరూపము తత్=అది, అమృతం = నిత్యము తత్=అది, వేద్ధవ్యమ్ = ఎఱుఁగతగ్గది యని, సౌమ్య=ప్రియదర్శనుఁడా! విద్ధి= తెలిసికొనుము

తా ఎవఁడు జ్యోతిర్మయుఁడో, ఎవఁడు అణువుకంటె సూక్ష్మతరుఁడో, ఎవనిలో సకలలోకములును, లోకములందు నివసించు సకలజీవులును స్థాపితములయియున్నవో అతఁడే సత్యము అతఁడే అమృతుఁడు అతఁడు ఆత్మద్వారమున ఎఱుఁగఁదగినవాఁడు కావున, ఓ ప్రియశిష్యుఁడా! నీఆత్మ మూలమున అతనిని తెలిసికొనుము

వ్యా ఓ ప్రేమాస్పదుఁడా! సర్వమునకు అంతరతముఁడగు పరమాత్మనుండి నీయాత్మను దూరము కానీయకుము. అతనినుండి యాత్మను వేరుపఱచి నీవు దీనభావములో మునిఁగి పోవకుము. కాని యాత్మను పవిత్రము గావించి అతనియొద్దకు తీసికొనిపొమ్ము. ఏకాగ్రచిత్తుఁడవై ఆత్మద్వారమున పరమాత్మను తెలిసికొనుము, అధ్యాత్మయోగ జనితమయిన పరమానందము ననుభవింపుము

మూ. ప్రణవో ధనుః శరో హ్యాత్మా
బ్రహ్మతల్లక్ష్యముచ్యతే,
అప్రమత్తేన వేద్ధవ్యం
శరవత్ తన్మయో భవేత్. ౧౪

టీ ప్రణవః = ఓంకారము, ధనుః = ధనుస్సు, ఆత్మా = జీవాత్మ, శరః = బాణము, బ్రహ్మ = బ్రహ్మము, తల్లక్ష్యమ్ = దానికి లక్ష్యమని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది అప్రమత్తేన = గుఱితప్పని యేకాగ్రచిత్తముచేత, వేద్ధవ్యం = ఎఱుఁగఁదగినది శరవత్ = బాణమువలె, (ఒక సాధకుని ఆత్మ) తన్మయః = అతనితో నిండినది (బ్రహ్మమయము) భవేత్ = అగుచున్నది

తా ప్రణవము ధనుస్స్వరూపము, జీవాత్మ శరస్వరూపము, పరబ్రహ్మము లక్ష్యస్వరూపము ప్రణవధనువును బూని జీవాత్మరూపమయిన బాణముతో పొరపాటుపడకుండ బ్రహ్మరూపమయిన లక్ష్యమును కొట్టవలెను శరము లక్ష్యమును భేదించుకొనిపోయి యందులో ప్రవేశించి, దానిచే సంపూర్ణముగా నావరింపఁబడిన దగును

వ్యా ఓంకారమును ప్రణవమందురు ఓంకారమునకు సృష్టిస్థితి ప్రళయకర్తయని యర్థము ఇది పరబ్రహ్మమును ప్రతిపాదించుశబ్దము.

జీవాత్మను శరమనియు, ఓంకారమును ధనుస్సనియు కల్పనచేయుటచే నేమని బోధపడుచున్నది? ఏదైన నొకలక్ష్యమునందు బాణమును ప్రయోగింప వలయునన్న విల్లును నుపయోగించుట యావశ్యకమగుచున్నది. అవ్విధము ననే బ్రహ్మమును లక్ష్యస్థానమునందుంచుకొని అతని సామీప్యమునకు జీవాత్మ యనుబాణమును చేర్పఁగోరితిమేని, మనకు ప్రణవమను విల్లు సహాయభూతముగా నుండఁగలదు ఎవ్వని యాత్మ బ్రహ్మ రూపమయిన లక్ష్యమును భేదించుకొనిపోయి, అతనిలో ప్రవేశించెనో అతఁడు తనయాత్మ యెట్లు పరబ్రహ్మముచే నావృతమై యున్నదో అట్లే సమస్త జగత్తును అత నిచే నావృతమై యున్నదని తెలిసికొని యున్నాఁడు.

సమే శుచౌ శర్కరవహ్ని వాలుకా
వివర్జితే శబ్దజలాశ్రయాదిభిః,
మనోనుకూలే నతుచక్షుపీడనే
గుహానివాతాశ్రయణే ప్రయోజయేత్.     ౧౫

[శ్వేతా. ౭-అ. ౧౦-వా.]

టీ సమే=సమమయ్యు, శుచౌ = శుద్ధమయ్యు, శర్కర వహ్ని వాలుకావివర్జితే=గులకరాళ్ల చేతను తప్తవాలుకచేతను విడువఁబడిన, శబ్దజలాశ్రయాదిభిః=ఉత్తమశబ్దజలాశ్రయాదు లచే, మనోనుకూలే = మనసునకు రమణీయమై, నతుచక్షు పీడనే = నేత్రపీడనకరములగు వస్తువులు లేనిదై, గుహానివా

తాశ్రయణే-గుహా = ఏకాంతమయిన, నివాత = ప్రచండ వాయువులేని, ఆశ్రయణే = స్థానమునందు, ప్రయోజయేత్ = చిత్తమును బ్రహ్మమునందు చేర్పవలయును

తా కంకఱరాళ్లుగాని గులకఱాళ్లుగాని లేనిదియు, మిట్టపల్లములు లేక సమానమయినదియు, పరిశుభ్రమయినదియు నగు ప్రదేశమునందు ఉత్తమజలశబ్దాశ్రయాదులు గల్గి మనోరమమైన స్థానమునందు, నిర్మలవాయుసేవితమయిన విశాలస్థలమునందు దృష్టిని బాధించు వస్తువుల కెదురుగా నుండునట్లు కూర్చుండి పరబ్రహ్మమునందు ఆత్మను నిలుపవలెను

వ్యా ఏస్థానమునందున్న అంతఃకరణము ప్రశస్తమయిన స్థితిలో నుండునో, అనాయాసముగా పవిత్రపురుషునియందు ఆత్మకు సంయోగము సమకూడునో అట్టిస్థానమునందు కూర్చుండి ఉపాసనను చేయుట విధాయకము. దుర్గంధయుతమును, ఉత్తప్తమును, అపరిశుద్ధమును, అపరిష్కృతము నగు స్థానమునందు కూరుచున్నచో అంతఃకరణమునందు మాలిన్యము జనించును తగిన విధమున ఈశ్వరునియందు ఆత్మ ప్రవేశింపనేరదు. కాని ఏ స్థానము సువిశాలమును పవిత్రమును పరిశుభ్రమును పరిచ్ఛిన్నమును స్నిగ్ధమును సమములై యుండునో, ఎచ్చట నిర్మలమయిన జలము లభించునో, ఎచ్చట వాయువుయొక్క ఉపద్రవముండదో, ఎచ్చట పక్షుల సుశ్రావ్యములగు ధ్వనులు విన నగునో, మఱియు నెచ్చట చూచుట కసహ్యముగా

నుండువస్తువు లుండవో అట్టిస్థానమే యపేక్షింపఁదగినది. ఇంతకంటె మరి యేస్థానము మనస్సునకు పూజ్యము కానేర్చును? ఇట్టి పవిత్రమై యోగ్యమై సౌఖ్యప్రదమైన స్థానమున జేరి ఉపాసన చేయుటయే బ్రహ్మవాదుల అభిమతము ఏస్థానమునందు మనస్సు ప్రశస్తముగను, పవిత్రముగను నిశ్చలముగను నుండఁగలదో, అట్టిస్థానమునందే ఉపాసనజేయుట కర్తవ్యము ఏలయన, మనస్సు కలతనొంది విసుగుజెంది మాలిన్యభూయిష్ఠమై యున్నచోఁ ఈశ్వరుని ఉపాసన చక్కఁగా జరుగనేరదు

మూ. త్రిరున్నతం స్థాప్య సమం శరీరం
హృదీన్ద్రియాణి మనసా సన్నివేశ్య,
బ్రహ్మోడుపేన ప్రతరేత విద్వాన్
స్రోతాంసి సర్వాణి భయావహాని ౧౬

[శ్వేతా. ౨-అ, ౮-వా.]

టీ త్రిరున్నతం = ఉరోగ్రీవమస్తకములు మూఁడును ఉన్నతముగాగల, శరీరం = శరీరమును, సమం = సమముగా, స్థాప్య = ఉంచుకొని, ఇన్ద్రియాణి = చక్షురాది ఇంద్రియములను, మనసా = మనసుతో, హృది = హృదయమునందు, సన్నివేశ్య = ప్రవేశింపఁజేసి, విద్వాన్ = జ్ఞాని, బ్రహ్మోడుపేన = బ్రహ్మమనెడి తెప్పచేత, భయావహాని = భయావహమైన, స్రోతాంసిసర్వాణి = సంసారార్ణవము యొక్క సకల ప్రవాహములు, ప్రతరేత = దాఁటును

తా వక్షస్సును, కంఠమును, శిరస్సును ఎత్తుగానుండు నట్లు నిలిపి, శరీరమును సమభావములోనుంచి, చక్షురాది ఇంద్రియములతో గూడిన మనస్సును హృదయమున ప్రవేశింపఁజేసి సంసారజలధియందలి భయంకరములయిన సమస్త స్రోతస్సులను బ్రహ్మస్వరూపమనియెడి తెప్పమూలమున దాఁట వలయును.

వ్యా పూర్వము ఉపాసనకు ఉపయుక్తమయిన స్థానమును గూర్చి చెప్పినట్లు, ఈవచనములో ఉపాసనాకాలములో నేవిధముగా కూర్చుండ వలయునో తెలుపఁబడినది. వక్షస్సు, కంఠము, శిరస్సు మూఁడును నిట్టనిలువుగా నిలిచియుండునట్లు కూర్చున్నచో మనశ్శరీరముల కెట్టి వికలత్వమును కలుగనేరదు. అందుచే ఉపాసనాకాలమునం దీమాదిరిగాఁ గూర్చుండి సకల ఇంద్రియప్రవృత్తులను మనోవృత్తులను హృదయమునందుఁ జేర్పవలయును. వానిని నానావిధబాహ్యవిషయ వ్యాపారములందు పోనియ్యక మనస్సుతోఁ గూడ ఆత్మను పరమాత్మమీఁద నిలుపవలయును అంతియేగాక హృదయ ప్రీతి నతని కర్పణజేసి కృతార్థులు కావలయును



# ఎనిమిదవ అధ్యాయము



మూ॥ విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో
విశ్వతోబాహురుత విశ్వతస్పాత్,
సంబాహుభ్యాం ధమతి సమ్పతత్రై
ర్ద్యావా భూమీ జనయన్ దేవ ఏకః.

[శ్వేతా. 3-అ, 3-వా.]

టీ॥ విశ్వతశ్చక్షుః = (అతఁడు) సర్వత్ర నేత్రములు గల వాఁడు, ఉత=అట్లులనే, విశ్వతోముఖః = సర్వత్రముఖముగల వాఁడు, విశ్వతోబాహుః = సర్వత్ర బాహువులుగలవాఁడు; ఉత=అట్లులనే, విశ్వతస్పాత్=సర్వత్ర పాదములుగలవాఁడు, సః = అతఁడు, బాహుభ్యాం = బాహువులతో (మనుజులను), పతత్రైః= తెక్కలతో (పక్షులను), సంధమతి= చేర్చుచున్నాఁడు ద్యావాభూమీ = ద్యులోకభూలోకములను, జనయన్ = సృష్టించువాఁడు, దేవః= దేవుఁడు, ఏకః=ఒక్కఁడే అగును

తా॥ ఎల్లెడల అతని చక్షువులును, ఎల్లెడల అతని ముఖమును, ఎల్లెడల అతని బాహువులును, ఎల్లెడల అతని

పాదములును నిండియున్నవి అతఁడు మనుష్యదేహములకు బాహువులను సమకూర్చెను, పక్షిశరీరములకు రెక్కలను జతపఱచెను అద్వితీయుఁడగు పరమేశ్వరుఁడు ద్యులోక భూలోకములను సృష్టించెను

వ్యా సర్వత్ర అతని చక్షువులే. అతఁడు సర్వసాక్షి. అన్నిఁటి యొక్క అంతర్బాహ్యములను సమానరూపముగా అతఁడు చూచుచున్నాఁడు. చీఁకటిరాత్రినాటి ఘోరాంధకారముగూడ అతని దృష్టిని కప్పివేయఁజాలదు సర్వత్ర అతని ముఖమే పాపాత్ములు అతని భయంకరముఖమును చూచెదరు. పుణ్యాత్ములు ఉత్సాహజనకమయిన అతని ప్రసన్నముఖమును దర్శింతురు. సర్వత్ర అతని బాహువులే. ఈ విశ్వమునందలి సకల కార్యములందును అతని బలమే. అతని కౌశలమే ప్రకాశిత మగుచున్నది. సర్వత్ర అతని పాదములు నిండియున్నవి అతఁడు సర్వత్ర పూర్ణరూపమున విలసిల్లుచున్నాఁడు అతఁడు మనుష్యదేహములకు బాహువులను, పక్షిశరీరములకు రెక్కలను సంయోగపఱచెను కార్యనిర్వహణార్థము సుఖానుభవనిమిత్తమును వేనికి నెట్టి యంగములు ప్రయోజనకరములో వానికి నట్టి యంగముల నతఁడొసంగెను. అద్వితీయుఁడగు పరమేశ్వరుఁడు ద్యులోకమును సృష్టించెను

వి ఈ అధ్యాయము భగవంతుని సర్వవ్యాపకత్వమునుగూర్చి ప్రస్తావించుచున్నది.

**మూ  సర్వతః పాణిపాద స్తత్ సర్వతోఽక్షి శిరో ముఖమ్,**
**సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి       ౨**
[శ్వేతా 3-అ, ౧౬-వా]

టీ సర్వతః పాణిపాదంతత్ = అతఁడు సర్వత్ర హస్త పదములు గలవాఁడు సర్వతోఽక్షి శిరోముఖం = నేత్ర శిరో ముఖములు సర్వత్ర గలవాఁడు లోకే = లోకమునందు, సర్వతః శ్రుతిమత్-సర్వతః = అంతట, శ్రుతిమత్ = చెవిగల వాఁడు, సర్వమావృత్య = సర్వమును వ్యాపించి, తిష్ఠతి = ఉన్నాఁడు

తా. సర్వత్ర అతని హస్తపాదములును, సర్వత్ర అతని శిరోనేత్రముఖములును, సకలలోకములందును అతని శ్రోత్రములును నిండియున్నవి అతఁడు సమస్తజగత్తున వ్యాపించి యున్నాఁడు.

వ్యా. అతఁడు సర్వప్రదేశములందును నిండియున్నాఁ డని యెఱింగి, ఓమానవులారా! శుభకర్మల నాచరించుటయందు ఉత్సాహమును కనఁబఱపుఁడు. పాపకార్యముల కావించుటయందు భయమును కల్గి యుండుఁడు

**మూ. సర్వాననశిరో గ్రీవః సర్వభూతగుహాశయః,**
**సర్వవ్యాపీ స భగవాన్ తస్మాత్ సర్వగతః శివః  3**
[శ్వేతా 3-అ, ౧౧-వా.]

టీ సర్వానన శిరోగ్రీవః = (అతఁడు) ముఖములను శిరస్సులను కంఠములను సర్వత్ర గలవాఁడు; సర్వభూతగుహాశయః = ఎల్లభూతముల బుద్ధియందుండెడివాఁడు, తస్మాత్ = అందువలన, సః = ఆ, భగవాన్ = భగవంతుఁడు, సర్వవ్యాపీ= సర్వమునందును వ్యాపించియుండెడివాఁడు; సర్వగతః = సర్వగతుఁడు, శివః=మంగళస్వరూపి

తా వివిధములయిన శిరస్సులతోడను, ముఖములతోడను, కంఠములతోడను, కూడుకొనియున్న పరమేశ్వరుఁడు సమస్తజీవుల హృదయములందును, నివాసమేర్పాటు చేసికొనియున్నాఁడు అతఁడు సర్వవ్యాపి గనుకనే సర్వగతుఁడును మంగళస్వరూపియు నాయెను

వ్యా సర్వవ్యాపియు సర్వసాక్షియు నగు పరమేశ్వరుఁడు ఎల్లర హృదయములందును, సర్వదా వసించుచున్నాఁడు. సకలజీవులమంగళమును గోరియే అతఁడు ఈవిచిత్రసృష్టిని రచించెను ఎవ్వఁడేపాటి శుభమును పొందినను అతఁడు మంగళస్వరూపియగు ఆప్పరమేశ్వరునుండియే పొందుచున్నాఁడు అతఁడు మనజ్ఞానదాత, సుఖదాత, ముక్తిదాత. అతఁడు సమస్త శుభములకును నిధివంటివాఁడు

వి భగవంతుఁడు సర్వహృదయాంతర్వర్తి యగుట యీవాక్యమునందలి విశేషము.

మూ　అపాణి పాదో జవనో గృహీతా
పశ్యత్యచక్షుః సశృణోత్యకర్ణః,
సవేత్తివేద్యం నచ తస్యాస్తి వేత్తా
తమాహురగ్ర్యం పురుషం మహాన్తమ్　　౪

[శ్వేతా. 3-అ, ౧౯-వా.]

టీ　అపాణిపాదః=(అతఁడు) హస్తపదములు లేనివాఁడయ్యును, జవనోగృహీతా=గమనగ్రహణశక్తులు గలవాఁడు. అచక్షుః = నేత్రరహితుఁడయ్యు, పశ్యతి=చూచుచున్నాఁడు. అకర్ణః=వీనులు లేనివాఁడయ్యు, సః = అతఁడు, శృణోతి=వినుచున్నాఁడు సః = అతఁడు, వేద్యం = ఎఱుఁగఁదగినవానిని, వేత్తి=ఎఱుఁగుచున్నాఁడు తస్యవేత్తా=అతని నెఱిఁగినవాఁడు, నాస్తిచ = లేఁడు　తం=అతనిని, అగ్ర్యం = మొదటివాఁడని, పురుషం = పూర్ణుఁడని, మహాన్తం = గొప్పవాఁడని, ఆహుః= చెప్పెదరు

తా. అతనికి హస్తములు లేవు; అయినను అతఁడు పట్టుకొనును　అతనికి పాదములు లేవు, అయినను అతఁడు నడుచును　అతనికి నేత్రములు లేవు; అయినను అతఁడు చూచును　అతనికి కర్ణములు లేవు, అయినను అతఁడు వినును. అతఁడు తెలిసికొనవలసిన　వాని నెల్ల తెలిసికొనుచున్నాఁడు

కాని అతనిని తెలిసికొనినవా రెవ్వరును లేరు పండితు లాతనిని సర్వమునకును ఆది యనియు, పూర్ణుఁడనియు, మహనీయుఁడనియు చెప్పిరి

**మూ** యఏష సుప్తేషు జాగర్తి కామం
కామం పురుషో నిర్మిమాణః,
తదేవ శుక్రం తత్ బ్రహ్మ తదేవామృతముచ్యతే
తస్మిన్లోకాః శ్రితాః సర్వేతదునాత్యేతి కశ్చన ౫

[కఠ. ౫-వ, ౮-వా.]

టీ యః ఏషః పురుషః=ఏ యీ పురుషుఁడు, సుప్తేషు=(జీవుల) నిద్రాసమయములందును, కామంకామం = (జీవులకు) కావలసినవానిని, నిర్మిమాణః = నిర్మించుచు, జాగర్తి=జాగరూకుఁడై యున్నాఁడో, తదేవ = అదియే (అతఁడే), శుక్రం=శుద్ధుఁడు. తత్=అది (అతఁడు), బ్రహ్మ = బ్రహ్మము, తదేవ=అదియే (అతఁడే), అమృతం = నిత్యమని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది తస్మిన్ = అతనియందు, సర్వేలోకాః= సమస్తలోకములు, శ్రితాః = ఆశ్రయముపొందియున్నవి. తదు = దానిని (అతనిని), కశ్చన=ఎద్దియును, నాత్యేతి=అతిక్రమింపలేదు

తా సమస్త ప్రాణులును నిద్రాభిభూతములై యుండు సమయమున ఏ పూర్ణపురుషుఁడు మేల్కొనియుండి అన్నిఁటి

కిని వలయు పదార్థములను నిర్మించుచున్నాఁడో, అతఁడే శుద్ధుఁడు, అతఁడే బ్రహ్మము, అతఁడే అమృతుఁడని చెప్పఁబడి యెను సకలలోకములును అతనినే ఆశ్రయముగాఁ జేసికొని యున్నవి ఎవ్వరును అతనిని అతిక్రమించి పోఁ జాలరు

వ్యా॥ మనము నిద్రించుచున్నను మేల్కొనియున్నను అతఁడు మాత్రము సర్వకాలమును మేల్కొనియుండి మనకు నావశ్యకములగు నానావిధపదార్థముల నెల్లను సిద్ధముచేయుచున్నాఁడు మన శ్రేయస్సునకై మనము పాటుపడ మానివేసినప్పుడు గూడ అతఁడు మానివేయుట లేదు. అతఁడు నిరంతరము మన హితముకొఱకు కృషి చేయుచున్నాఁడు.

మూ॥ అణోరణీయాన్ మహతో మహీయాన్
ఆత్మాగుహాయాం నిహితోఽస్య జన్తోః,
తమక్రతుం పశ్యతి వీత శోకో
ధాతుః ప్రసాదా న్మహిమాన మీశమ్ ౬

[కఠ. ౨-వ, ౨౦-వా.]

టీ. అణోః=అణువుకంటె, అణీయాన్ = మిక్కిలి అణువయినట్టియు, మహతః = గొప్పవస్తువుకంటె, మహీయాన్ = మిక్కిలి గొప్పవస్తువయినట్టియు, ఆత్మా=పరమాత్ముఁడు, అస్య జంతోః=ఈజంతువుయొక్క, గుహాయాం=హృదయమునందు, నిహితః=ఉన్నాఁడు అక్రతుం = విషయభోగసంకల్పరహితుఁ

డయిన, తమిూశం = ఆఈశ్వరుని (అస్య = ఈపరమేశ్వరుని యొక్క), మహిమానం = సామర్థ్యమును (యః = ఎవఁడు), పశ్యతి=చూచుచున్నాఁడో, (సః=వాఁడు) ధాతుః=ఈశ్వరుని యొక్క, ప్రసాదాత్=అనుగ్రహమువలన, వీతశోకః=పోయిన దుఃఖముగలవాఁడు (భవతి=అగుచున్నాఁడు)

తా పరమాత్మ సూక్ష్మముకంటె సూక్ష్మము, మహత్తు కంటె మహత్తు అతఁడు ప్రాణికోటియొక్క హృదయము నందు వసించుచున్నాఁడు విగతశోకుఁడయిన మనుజుఁడు భోగాభిలాషవర్జితుఁడగు అప్పరమేశ్వరుని, అతని మహిమను ఆయీశ్వరుని అనుగ్రహమువలననే దర్శింపఁగలుగుచున్నాఁడు

వ్యా మనఆత్మకంటె అతఁడు సూక్ష్ముఁడు హద్దులేని ఆకాశము కంటె అతఁడు అధికుఁడయినవాఁడు. అతనిని దర్శించుకొఱకై దూరమరుగ వలసిన పనిలేదు అతఁడు మన హృదయమునందును, మనస్సునందును, ఆత్మయందును వసించుచున్నాఁడు అతఁడు భోగాభిలాషవర్జితుఁడు, నిత్యపరితృప్తుఁడు, ఆనందమయుఁడు. అతని దర్శనము లభించినసాధకుని కేఁక శోక ముండదు. అతని ప్రేమలో నిమగ్నుఁ డయినయెడల వాని కేఁక సెట్టి ఆక్కఱయు నుండదు.

వి ఈవాక్యము శ్వేతాశ్వతరోపనిషత్తులోగూడ నున్నది. అందలి 3-వ అధ్యాయములో నిది ౨౦-వ వాక్యము. తైత్తిరీయ ఆరణ్యకములో

గూడ నిది కనుపించుచున్నది. ఈవాక్యము మొదటనే యుపనిషత్తులోనిదో నిశ్చయించుట కష్టము. అయినను ఈశ్వరప్రసాదమన్న భావము శ్వేతాశ్వ తరమున కనుకూలించునది యని చెప్పనొప్పును కావున నీవాక్యము మొదట శ్వేతాశ్వతరములోనిదై తరువాత నితరగ్రంథములలోనికి జేర్చుకొనఁబడి నదై యుండవచ్చును భగవంతుఁడు అతిసూక్ష్మవస్తువుకంటె సూక్ష్మతరుఁడు, అతిబృహద్వస్తువుకంటె బృహత్తరుఁడనుభావము ఉపనిషత్తులలో తఱ చుగా కనిపించుచుండును.

మూ॥ ఏకోవశీ సర్వభూతాంతరాత్మా
ఏకం రూపం బహుధాయః కరోతి,
తమాత్మస్థం యే ఽనుపశ్యంతి ధీరా
స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్. ౭

[కఠ. ౫-వ, ౧౨-వా.]

టీ॥ యః=ఎవ్వఁడు, ఏకః = ఒక్కఁడో, వశీ=సర్వమును వశీభూతముగా గలవాఁడో, సర్వభూతాన్తరాత్మా = సమస్త భూతములకు అంతరాత్మయో, తం=అతనిని, ఆత్మస్థం=హృద యమునందున్నట్లు, యేధీరాః=ఏధీరులు, అనుపశ్యన్తి=దర్శిం చెదరో, తేషాం=వారిది, శాశ్వతం సుఖం=నిత్యానందము, నేతరేషాం = ఇతరులది కాదు.

తా॥ ఎవ్వఁడు ఒక్కఁడో, అన్నిఁటికిని నియంతయో, సర్వభూతములకును అంతరాత్మయో, ఒక్కరూపమును బహు

ప్రకారములుగా జేయువాఁడో అట్టివానిని తమ ఆత్మలయం దు సాక్షాత్తుగా దర్శించు పండితు లెవ్వరో వారికే నిత్య సుఖము కలుగును; తదితరుల కెన్నఁటికిని కలుగనేరదు

వ్యా॥ సర్వమును అతని వశములో నున్నది సకలమునకును అతఁడే నియంత అతఁడు మన యెల్లరలోపలను వసించుచున్నాఁడు. అతఁడు ఏకాకి మఱెవ్వరి సాహాయ్యమును గైకొనకయే అతఁడీ విచిత్ర జగత్తును సృష్టించెను. అతఁడు నిత్యుఁడు. తనస్వరూపమునం దెట్టిమార్పును పొందకయే తన యేకరూపమును బహుప్రకారములుగా మారునట్లు చేసెను. అతఁడు మఱి యేవస్తువు కాలేదు. ఒక్కఁడును, అన్నిఁటికిని నియంతయు, సర్వభూతాంతరాత్మయు నగు నతని నెవ్వఁడు తన ఆత్మయందు సాక్షాత్తుగా దర్శించి, అతని సహవాసభాగ్యమును పడయునో అతనికి లభించు సౌఖ్యము తదితరుల కెన్నఁడును కలుగఁజాలదు.

వి. ఇదియు వెనుకటి వాక్యములోని భావమును గూర్చియే ప్రస్తావించుచున్నది. ఇందు కడపటిభాగము ముఖ్యమైనదిగా తోఁచుచున్నది. ఎవ్వరు సర్వభూతాంతర్వర్తి యగు నాపరమాత్మను తమహృదయములో దర్శింతురో వారికే శాశ్వతశాంతి లభించును గాని తదితరులకుఁ గాదు. శ్వేతాశ్వతరము ౬-వ అధ్యాయములోని ౧౧,౧౨-వ వాక్యములలో గూడ నిట్టి భావమే గలదు బహుశః కఠోపనిషత్తులో నుండియే యివి గ్రహింపఁబడియుండును.

మూ నిత్యో ఽనిత్యానాం చేతనశ్చేతనానా
మేకో బహూనాం యో విదధాతి కామాన్,
తమాత్మస్థం యేను పశ్యంతిధీరా
స్తేషాం శాంతిః శాశ్వతీ నేతరేషామ్　　౧౮
[కఠ ౫-వ, ౧౩-వా.]

టీ యః=ఎవ్వఁడు, అనిత్యానాం=అనిత్యవస్తువులలో, నిత్యః=నిత్యుఁడుగను, చేతనానాం=చేతనవస్తువులకు, చేతనః= చేతనస్వరూపుఁడుగను, బహూనాం = అనేకములలో, ఏకః= ఒకఁడుగను (ఉండి), కామాన్=కావలసినవానిని, విదధాతి= ఇచ్చుచున్నాఁడో, తం = అతనిని, ఆత్మస్థం = హృదయమున నున్నట్లు, యేధీరాః = ఏధీరులు, అనుపశ్యన్తి=దర్శించెదరో, తేషాం = వారికి, శాశ్వతీశాన్తిః = నిత్యశాంతి, నేతరేషాం= ఇతరులకు లేదు

తా ఎవఁడు సమస్త అనిత్యవస్తువులలో నిత్యుఁడో, ఎవఁడు సమస్త చేతనపదార్థములకును చైతన్యప్రదాతయో, ఎవఁడు ఏకాకియై యెల్లరికిని సమస్తకామ్యవస్తువులను పంచి పెట్టుచున్నాఁడో, అట్టివానిని ఏపండితులు తమ ఆత్మలయందు సాక్షాత్తుగా దర్శింతురో వారిదే నిత్యశాంతి; తదితరులఁ దెన్నఁటికిని గాదు

వ్యా ఈజగత్తులోని సకలవస్తువులును అనిత్యములు, అతఁడొక్కఁడే నిత్యుఁడు. అతఁడు చైతన్యమును ప్రసాదించి సకలజీవులను సృష్టించెను అతఁడు వానికి అన్నమొసంగి పాలించుచున్నాఁడు. ఈ అసంఖ్యేయ జీవకోటియొక్క అక్కఱల నెల్ల అతఁ డొంటిమై తీర్చుచున్నాఁడు. ఈ ఒక్క భూలోకములోనే అతని కెంత సంతానము ఇందలి ఒక్కొక్కజీవి కెన్నెన్ని అక్కఱలు, తా నొంటిమై యీ అన్నింటి అక్కఱలను అతఁడు తగినరీతిగా తీర్చుచున్నాఁడు. అతఁడు అత్యల్పమయిన ఒక్క కీటకముయొక్క అక్కఱలనుసయితము మఱచుటలేదు సకలభూతములకును స్నేహితుఁడును, కల్యాణస్వరూపియు నగు ఈపరమదేవత నెవ్వరు తమ హృదయమందిరమునందు సాక్షాత్తుగా దర్శింతురో వారి తృప్తిసరోవర మెన్నఁడును శుష్కము కానేరదు సదా పూర్ణమై యుండును. వారు నిత్యశాంతి ననుభవింతురు.

వి ఈశ్వరస్వరూపమునుగూర్చి యీ వాక్యములో పొందుపఱుపఁబడిన భావము మహోత్కృష్టమైనది. ఇది ఆధునిక విజ్ఞాన శాస్త్రముయొక్కయు, తత్వశాస్త్రముయొక్కయు గభీరాలోచనలతో సమన్వయము చెందుచున్నది. కొలఁది మార్పులతో ఈ వాక్యమునుగూడ శ్వేతాశ్వతరోపనిషత్తు తనలో జేర్చుకొనియున్నది

**మూ యదా సర్వే ప్రభిద్యన్తే హృదయస్యేహ గ్రన్థయః,**
**అథమర్త్యోఽమృతో భవత్యేతావదనుశాసనమ్ ౯**

[కఠ ఉ-వ, ౧౫-వా.]

టీ. ఇహ = ఇచ్చట, యదా = ఎప్పుడు, హృదయస్య గ్రంథయః = హృదయముయొక్క యజ్ఞానబంధములు, సర్వే= సమస్తములును, ప్రభిద్యన్తే= ఛేదింపఁబడుచున్నయవో, అథ= పిమ్మట, మర్త్యః=జనుఁడు, అమృతః = నిత్యుఁడు, భవతి=అగు చున్నాఁడు ఏతావత్ = ఇంతమాత్రము, అనుశాసనమితి = ఉపదేశమని తెలిసికోవలయును.

తా ఎప్పుడు సమస్తహృదయగ్రంథులును ఛిన్నము లగునో అప్పుడు జీవుఁడు అమరుఁ డగును ఇదియే ఉపదేశ మని తెలిసికొనవలయును.

వ్యా అజ్ఞానము మోహజాలమును మన హృదయగ్రంథులు. పాపాసక్తిరూపకమయినట్టియు, దురభ్యాసరూపకమయినట్టియు హృదయ గ్రంథుల నన్నిఁటిని నిర్మూలముచేయనిది ఆ పరమపవిత్ర పురుషుని పొందుట అసాధ్యము దుశ్ఛేద్యములయిన ఈ హృదయగ్రంథులనెల్ల నెప్పుడు ఛేదింపఁ గల్గుదువో అపుడే నీవు అతనిని సమీపింపఁజేయునట్టియు, నిర్భీతితోఁడను పరమానందముతోడను అతని నిత్యనివాసమును పొందఁజేయునట్టియు, ఉత్కృష్టమార్గమున నడచు నొక యాత్రికుఁడ వయితివనియు, మృత్యువు నతిక్రమించి ఆ పరమపురుషుని నీవు పొందినావనియు తెలిసికొనుము. ఇదియే అనుశాసనము ఇదియే ఉపదేశము

వి పూర్వవాక్యములో చెప్పఁబడిన అమృతత్వము నెవ్విధమున పొందనగునో యిది తెలియఁజేయుచున్నది. హృదయగ్రంథు లనఁబడు

దురభ్యాసములను, దుశ్చింతలను త్రెంచివేయనిది అమృతత్వమును పొందుటకు సాధ్యపడదని యీ వాక్యము స్పష్టముగా పలుకుచున్నది. ముండకోపనిషత్తులో గూడ నిట్టి వాక్య మొకటి కలదు. అందు హృదయగ్రంథులతోబాటు సంశయములు గూడ పేర్కొనఁబడియెను. పరమపురుషుని దర్శించినపుడే తద్గ్రంథులును, సంశయములును తొలఁగిపోవును



# తొమ్మిదవ అధ్యాయము



మూ  ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే,
తయో రన్యః పిప్పలం స్వాద్వత్త్య
నశ్నన్నన్యోఽభిచాకశీతి  ౧

[ముండక  ౩-ముం, ౧-ఖం, ౧-వా.]

టీ ద్వా సుపర్ణా=సుందరములగు ఱెక్కలుగల రెండు పక్షులు (జీవాత్మ పరమాత్మలు), సయుజా = జంటగాను, సఖాయా=మిత్రత్వముతోను, సమానం వృక్షం = శరీరమగు ఒక వృక్షమును, పరిషస్వజాతే = ఆశ్రయించియున్నవి. తయోః= వానిలో, అన్యః=ఒక్కటియగు జీవాత్మ, పిప్పలం=కర్మనిష్పన్నమయిన ఫలమును, స్వాదు = రుచికలుగునట్లుల, అత్తి= భక్షించుచున్నది. అనశ్నన్ = భక్షింపని, అన్యః=వేఱొకటి (యగు పరమాత్మ), అభిచాకశీతి=కేవలము చూచుచున్నది

తా సుందరములయిన రెండు పక్షులు ఒకవృక్షమును ఆశ్రయించియున్నవి. అవి సర్వదా ఒక్కచోటనే యుండును అవి రెండును పరస్పరస్నేహము గలవి వానిలో నొకటి

సుఖముగా ఫలమును భుజించుచుండును రెండవది తినకుండఁగనే కేవలము చూచుచుండును

వ్యా. జీవాత్మ పరమాత్మలే అసుందరపక్షిద్వయము. పరమాత్మ యొక్క సౌందర్యకాంతిని పొంది జీవాత్మ కూడ సుందరమయ్యెను. తన కంతరతముఁడగు పరమాత్మతో జీవాత్మ సర్వదా ఒక్కచో కలిసియున్నది. వాని మధ్యమున నెట్టి యెడమునులేదు. అవి రెండును ఈశరీరములోనే యున్నవి ఒకటి రెండవదానితో సఖ్యమును కలిగియున్నది. పరమాత్మ సాక్షిరూపముననుండి జీవాత్మకు కర్మఫలము నొసంగుచున్నది. జీవాత్మయు తత్ఫలము ననుభవించుచున్నది ప్రేమను జూపుచు పరమాత్మ జీవాత్మను పరిపాలించుచున్నది. జీవాత్మ సంసారమునం దున్నదై పరమాత్మను ప్రేమించుచు పరమాత్మకు ప్రియమైన కార్యమును సాధించుచున్నది పరమాత్మ స్రష్ట, జీవాత్మ సృష్టము, పరమాత్మ నియంత, జీవాత్మ తదధీనము, పరమాత్మ ఫలప్రదాత, జీవాత్మ భోక్త; మనకు పరమాత్మ యొక్కఁడే కేవలసహాయుఁడు మనము అతని ప్రసాదమువలన విషయసుఖమును, ఆత్మప్రసాదమును, బ్రహ్మానందము ననుభవించుచున్నాము శరీరరూపమయిన గూటిలో వసించుచు జీవాత్మ అఖిలమాతయగు పరమాత్మయొక్క యొడిలో పుష్టిమంత మగుచున్నది తగిన యోగ్యత యబ్బెనేని జీవాత్మ యీదేహమునుండి ముక్తిని పొంది పరమాత్మ ననుగమించి సర్వదా అతనితోఁబాటు సంచారము చేయఁగలదు

వి ఈ అధ్యాయము పరమాత్మకును జీవాత్మకును గల సంబంధమును తెలియఁజేయును ఇందలి మొదటి వాక్యము ప్రప్రథమమున ఋగ్వే

దములో ౧-వ మండలము ౧౬౪-వ సూక్తము ౨౦-వ ఋక్కు. పిదప నిది ముండకోపనిషత్తులోనికి గ్రహింపఁబడి యుండును. శ్వేతాశ్వతరములో ౪-వ అధ్యాయములోని ౬-వ వాక్యముగా గూడ నిది పొందుపఱుపఁబడియున్నది. మానవాత్మకును పరమాత్మకును గల సంబంధమును విశదీకరించుట కుద్దేశింపఁబడిన యీ ప్రకరణమునందు మహర్షి దానినిచేర్చుట ఆశ్చర్యముగాదు.

మూ సమానే వృక్షే పురుషోనిమగ్నో
ఽనీశయా శోచతి ముహ్యమానః,
జుష్టం యదా పశ్యత్యన్యమీశ
మస్యమహిమాన మితి వీతశోకః	౨

[ముండక. ౩-ముం, ౧-ఖం, ౨-వా]

టీ సమానేవృక్షే = ఒక్కవృక్షమగు శరీరమునందు, పురుషః=జీవుఁడు, నిమగ్నః=మునిఁగి, అనీశయా=దీనభావము చేత, ముహ్యమానః=మోహాయుక్తుఁడై, శోచతి = దుఃఖించుచున్నాఁడు జుష్టం=సేవితుఁడయిన, అన్యం-ఈశం=అన్యుఁడైన యీశ్వరుని, అస్యమహిమానం = ఇతని మహిమను, యదా= ఎప్పుడు, పశ్యతి=చూచుచున్నాఁడో, ఇతివీతశోకః = అప్పుడు శోకరహితుఁ డగుచున్నాఁడు

తా. శరీరములో నిమగ్నుఁడై దీనభావముచే నావరింపఁబడినవాఁడై జీవుఁడు సర్వదా శోకించుచున్నాఁడు

కాని సర్వసేవ్యుఁడగు ఈశ్వరుని, అతని మహిమను ఎన్నఁడు చూడఁగల్గునో అప్పటినుండి అతని కిఁక శోక ముండఁజాలదు

వ్యా పరమేశ్వరునివిస్మరించి విషయసుఖ సాధనార్థమై యెప్పుడు సంసారములో నిమగ్నుల మగుదుమో అప్పుడు అడుగడుగునకు మనకు శోకమే సంభవించును. కాని సర్వసేవ్యుఁడగు పరమేశ్వరుని అతని మహిమను దర్శింపగల్గినపుడు మనకు శోక ముండఁజాలదు, పరమానందము కలుగును

వి. ఇది శ్వేతాశ్వతరములో ౪-వ అధ్యాయమునందలి ౭-వ వాక్యము. ఇందును వెనుకటి వాక్యమునందలి భావమే గలదు. పరమాత్మతో నిత్యమును కలిసియున్నను మానవాత్మ యేల బాధలకు లోనగుచున్నదో యిందు తెలుపఁబడినది. "అనీశ" యే శోకమునకు కారణము. శబ్దార్థమును బట్టి చూచినచో "అనీశ" యనఁగా ఈశుఁడు (ప్రభువు) గాకపోవుట. అనఁగా శక్తి హీనుఁడగుట.

మూ యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం
కర్తార మీశం పురుషం బ్రహ్మయోనిమ్,
తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ
నిరంజనః పరమం సామ్యముపైతి
మహాంతం విభుమాత్మానం మత్వాధీరో నశోచతి.

[ముండక - ౩౧]

టీ పశ్యః = చూపుఁగలవాఁడు (జ్ఞానాపన్నుఁడగుసాధకుఁడు), రుక్మవర్ణం =జ్యోతిస్స్వరూపియును, కర్తారం=విశ్వకర్తయును, ఈశం = నాయకుఁడును, పురుషం = పూర్ణుఁడునైన, బ్రహ్మయోనిం = కారణస్వరూపి యగు బ్రహ్మమును, యదా= ఎప్పుడు, పశ్యతి = చూచుచున్నాఁడో, తదా = అప్పుడు, విద్వాన్ = విద్వాంసుఁడు, పుణ్యపాపే = పుణ్యపాపములను, విధూయ=తిరస్కరించి, నిరంజనః = నిర్దోషియై, పరమం=శ్రేష్ఠమైనట్టి, సామ్యం = పరమేశ్వరునితోసాటిని, ఉపైతి=పొందుచున్నాఁడు మహాన్తం=గొప్పవాఁడును, విభుం=సర్వవ్యాపియునైన, ఆత్మానం = పరమాత్మను, మత్వా = తెలిసికొని, ధీరః = ధీమంతుఁడు, న శోచతి=దుఃఖింపఁడు

తా ఏసమయమున జ్ఞానాపన్నుఁడగు సాధకుఁడు స్వప్రకాశుఁడును, విశ్వమునకు కర్తయు, నియంతయు కారణస్వరూపియు నగు పరబ్రహ్మమును దర్శించునో అపు డతఁడు పుణ్యపాపముల పరిత్యజించినవాఁడై నిర్లిప్తుఁడై పరమసామ్యమును పొందును ధీరాత్ములగువారు సర్వవ్యాపియగు పరమాత్మను తెలిసికొని శోకమును మానివేయుదురు

వ్యా ఎప్పుడు జ్ఞానవంతుఁడును ధర్మనిష్ఠగలవాఁడు నగు బ్రహ్మోపాసకుఁడు తన జ్ఞాననేత్రములో అతనిని ప్రత్యక్షముగా దర్శించునో అపు

డతఁడు బ్రహ్మమును పొందినవాఁడై పాపమునుండి ముక్తుఁడగును అంతియే గాక పుణ్యఫలకాంక్షియై మఱి యేకర్మలను అతఁడు చేయఁడు. విషయము లందు తగులములేనివాఁడై లోకహితము నిమిత్తమును, ఈశ్వరప్రీతి నిమిత్తమును అతఁడు ఈశ్వర ప్రీతికరములగు కార్యములనుఁ జేయును ప్రభు వెన్నఁడు హృదయమునం దాసీనుఁ డగునో అపుడు సకల మనోవృత్తులును లోఁబడిన వగును, చిత్తము సమభావమును పొంది విశుద్ధమగును. ధీరులగువారు అతనిని తెలిసికొని దీనభావముచే ముహ్యమానులు గాక శోకమును మాను చున్నారు

వి ఈ వాక్యమునందలి మొదటి నాల్గు పంక్తులును ముండకో పనిషత్తు ౩-ముండకము, ౧-వ ఖండములోని ౩-వ వాక్యములోనివి. కడపటి పంక్తి కఠోపనిషత్తు ౧-వ అధ్యాయము, ౨-వ వల్లిలో ౩-వ వాక్యము. బ్రహ్మజ్ఞానమువలన మనుష్యుఁ డెట్లు శోక ముక్తుఁడగునో యిది మఱింత స్పష్టీకరించెను

మూ పరమేవాక్షరం ప్రతిపద్యతే సయోహవై,
తదచ్ఛాయ మశరీర మలోహితం శుభ్రమక్షరం
వేదయతే ౪

[ప్రశ్న. ౪-ప్ర, ౧౦-వా.]

టీ అచ్ఛాయం=తమోవర్జితుఁడును, అశరీరం=శరీరము లేనివాఁడును, అలోహితం=లోహితాది గుణరహితుఁడును, శుభ్రం=పరిశుద్ధుఁడును, అక్షరం=అవినాశియు నైన, తత్=

దానిని (బ్రహ్మమును), యః=ఎవ్వఁడు, వేదయతే=తెలిసికొను చున్నాఁడో, సః=వాఁడు, పరం=శ్రేష్ఠుఁడయిన, అక్షరమేవ = క్షయము లేని వానినే, ప్రతిపద్యతే=పొందుచున్నాఁడు

తా ఎవఁడు ఛాయారహితుఁడును, ఎఱుపు మొదలుగాగల గుణములు లేనివాఁడును, పరిశుద్ధుఁడును, నాశము లేనివాఁడు నగు పరబ్రహ్మమును తెలిసికొనునో అతఁడు ఆ అక్షయపురుషుని పొందుచున్నాఁడు

వ్యా పరమేశ్వరుఁడు సర్వదా సర్వత్ర ప్రకాశించు చున్నాఁడు. విశుద్ధచిత్తముతో తెలిసికొన్న యెడల అతనిని పొందనగును.

మూ అదృష్ట మవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ
మచింత్య మవ్యపదేశ్య మేకాత్మ ప్రత్యయ
సారం ప్రపంచోపశమం శాంతం శివ మ
ద్వైతమ్ ౬

[మాండూక్య ౨-ఖం ౬-వా.]

టీ అదృష్టం=(అతఁడు) అదృశ్యుఁడు, అవ్యవహార్యం= వ్యవహరించుటకు వీలుకానివాఁడు, అగ్రాహ్యం=కర్మేంద్రియములకు అందనివాఁడు, అలక్షణం = చిహ్నము లేనివాఁడు, అచిన్త్యం=తలంచుటకు సాధ్యముకానివాఁడు, అవ్యపదేశ్యం=

వర్ణనచేయ నలవిగానివాఁడు, ఏకాత్మప్రత్యయసారం = అద్వితీయమయిన ఆత్మజ్ఞానమే ప్రమాణముగా గలవాఁడు, ప్రపఞ్చోపశమం=ప్రపంచధర్మాతీతుఁడు, శాంతం = శాంతస్వరూపి, శివం=మంగళస్వరూపి, అద్వైతం=ఒక్కఁడే అయినవాఁడు

ఆ పరమేశ్వరుఁడు నేత్రములకు అగోచరుఁడును, కర్మేంద్రియములకు అగ్రాహ్యుఁడును, వ్యవహరించుట కంపనివాఁడు నై యున్నాఁడు అతఁడు ఏలక్షణముల మూలమునను నిర్దేశింపఁదగిన వాఁడుగాఁడు; ఏశబ్దముల మూలమునను నిర్ణయించుటకు వీలుగానివాఁడు అతఁడు చింతించుటకు సాధ్యముగాని వాఁడు ఒక్క ఆత్మప్రత్యయమే అతని అస్తిత్వమునకు ప్రమాణము అతఁడు సమస్తసంసారధర్మమునకును అతీతుఁడు, శాంతుఁడు, మంగళుఁడు, అద్వితీయుఁడు

వ్యా అనంతజ్ఞానస్వరూపియైన అప్పరమేశ్వరుఁడు చక్షువులకు గోచరుఁడగు వాఁడు కాఁడు. అతనిని హస్తమువలన పట్టుకొనుటకు వలనుపడదు అతనిని మనస్సు ద్వారమున కల్పనచేయుటకును వీలు లేదు. పరిమితమయిన వస్తువును వలె అతనిని బుద్ధిమూలమున తెలిసికొనుటకును సాధ్యము గాదు. కేవలము నిర్మలమయిన సహజజ్ఞానమునందు అతఁడు ప్రకాశించును. ఒక్క ఆత్మ ప్రత్యయ బలమువలననే జ్ఞానగోచరుఁడగు ఆ సత్యసుందరమంగళపురుషుని అస్తిత్వమును విశ్వసించుచున్నాము ఏ అకృతుఁడును, అమృతుఁడును, అనంతుఁడు నగు పురుషుని, జ్ఞానము ప్రకాశపఱుచుచున్నదో

ఆ పూర్ణపురుషుని అస్తిత్వమునందు ఆత్మ నమ్మక ముంచుచున్నది. జ్ఞానము వలన సత్యము ప్రకాశితమగుచున్నది అట్లు ప్రకాశితమయిన సత్యము నందు ఆత్మ నమ్మకముంచుచున్నది అందుచే స్వభావసిద్ధమయిన ఈ ఆత్మప్రత్యయమే అతని అస్తిత్వమును స్థాపనచేయుంటకు ఏకమాత్రప్రమాణము. ఎప్పుడు ఆత్మప్రత్యయ సిద్ధుఁడయిన ఆ అనంతపురుషుఁడు మన సహజజ్ఞానమునందు ప్రకాశితుఁడగునో అప్పుడు బుద్ధి అతని జగద్రచనాకౌశలమును వీక్షించి మనకు అతని విజ్ఞానపరిచయమును కలిగించుచున్నది, అంతియేగాక జగత్తుయొక్క మంగళోద్దేశ్య నియమమును కనఁబఱచి ఆ నియంతయొక్క మంగళభావమును వ్యక్తముచేయుచున్నది. పరిమితమయిన బుద్ధి ఆ అనంతపురుషుని మనకు సంపూర్తిగా తెలియఁజేయలేనిదే యైనను మన సహజజ్ఞానము నది చాలవఱకు పోషించుచున్నది. అందుచే బ్రహ్మజిజ్ఞాసువయిన ముముక్షువు జగత్కార్యముయొక్క అంతర్బాహ్యముల నాలోచించి తనబుద్ధిని వికసింపఁజేసికొను విషయమున నెప్పుడును అశ్రద్ధ చూపఁగూడదు బుద్ధి వికాసమును గాంచిన కొలఁది సహజజ్ఞానము యొక్కయు, ఆత్మప్రత్యయముయొక్కయుం అధికారమును,ఉద్దేశమును విశేషరూపమున మనము స్పష్టముగా గ్రహింపఁగల్గుచున్నాము.

సంసార మెవ్వనిచే సృజింపఁబడి నియమింపఁబడుచున్నదో అతఁడు సకల సంసారధర్మమునకును అతీతుఁడు అతనికి రాగద్వేషాది మానసికవృత్తులెవ్వియుం లేవు అట్లగుటంజేసి అతఁడు శాంతుఁడు. అతఁడు మంగళస్వరూపి. ఎల్లర శుభము నుద్దేశించియే అతఁడు నియమబద్ధముగా ఈ సంసారమును పాలించుచున్నాఁడు. అతనికి సమానుఁడుగాని, అతనికంటె నధికుఁడుగాని మఱి యెవ్వఁడును లేఁడు. అతఁడు అద్వితీయుఁడు.

వి ఇంద్రియములచే గాని, బుద్ధిచే గాని పరబ్రహ్మమును తెలిసికొనుటకు వీలుగాదనియు, ఆత్మప్రత్యయము వలననే అతనిని తెలిసికొనవలయుననియు, ఈ వాక్యము ప్రతిపాదించుచున్నది ఇది చాల ముఖ్యవిషయము. బ్రహ్మజ్ఞానమునకు మూలాధారము ఆత్మప్రత్యయమే యని యీమాండూక్యోపనిషత్తును రచించిన ఋషీశ్వరుని అభిప్రాయము. మహర్షి దేవేంద్రనాథఠాకూరులవారు గూడ నట్లే తలంచిరి

మూ. తదేతత్ప్రేయః పుత్రాత్ ప్రేయో విత్తాత్
ప్రేయోఽన్యస్మాత్ సర్వస్మాత్ అన్తరతరం యదయమాత్మా. ౬

[బృహ. ౧-అ, ౪-బ్రా, ౮-వా.]

టీ యత్ అయం ఆత్మా = ఏ యీ పరమాత్మ, సర్వస్మాత్=అన్నిటికంటె, అన్తరతరం=మిక్కిలి అంతరమయినదో, తత్ ఏతత్=అదియగు ఇది (అదియగు నీబ్రహ్మము), ప్రేయః=ప్రియతరమయినది పుత్రాత్=పుత్రునికంటె, ప్రేయః=ప్రియతరమయినది విత్తాత్ = ధనముకంటె, ప్రేయః=ప్రియతరమైనది అన్యస్మాత్ = అన్యములయిన ప్రేమాస్పదవిషయములకంటె, ప్రేయః=ప్రియతరమయినది

తా అన్నిటికంటె అంతరతరమయిన యీపరమాత్మ పుత్రునికంటె ప్రియమయినది, విత్తముకంటె ప్రియమయినది తక్కిన యెల్లవానికంటెను ప్రియమయినది.

వ్యా అతనికంటెను ఆంతరికుఁడును, ప్రియతరుఁడు నగు స్నేహితుఁడు మనకు మఱి యెవ్వఁడును లేఁడు

వి భగవంతునికిని మనుష్యునికిని గల అతిగాఢమయిన సంబంధము నిది వెల్లడించుచున్నది. ఎట్టిభౌతికసంపత్తి కన్నను పుత్రుని కన్నను గూడ భగవంతుఁడు ప్రియతముఁడుగా చెప్పఁబడియెను. ఈవాక్యమున బ్రహ్మజ్ఞానము ను గూర్చియేగాక బ్రహ్మప్రీతిని గూర్చియు ఋషి ప్రస్తావించు చున్నాఁడు

**మూ సయోఽన్య మాత్మనః ప్రియంబ్రువాణంబ్రూయాత్,**
**ప్రియం రోత్స్యతీతి ఈశ్వరోహ తథైవ స్యాత్ ౭**

[బృహ ౧-అ, ౪-బ్రా, ౮-వా.]

టీ. సయః = ఇట్లు తెలిసికొనిన ఒకానొకఁడగు విద్వాంసుఁడు, ఆత్మనః = పరమాత్మకంటె, అన్యమ్ = ఇతరమయిన, ప్రియం=ప్రియవస్తువు, (అస్తీతి=ఉన్నదని) బ్రువాణం=పలుకుచున్నవానినిగూర్చి, ఈశ్వరోహ = ఈశ్వరుఁడే, ప్రియమ్ = ప్రియమయినదానిని, రోత్స్యతీతి = నశింపఁజేయుచున్నాఁడని, బ్రూయాత్ = పలుకును తథైవ=ఆప్రకారముగానే, స్యాత్ = అగును.

తా పరమాత్మకంటె అన్యము ప్రియమయినదని యెవ్వఁడు పల్కునో అట్టివానితో దేనిని నీవు ప్రియముగా

నెంచుచున్నావో అయ్యది నశించిపోవునని బ్రహ్మవాది నుడువును అట్లు నుడువుట కతని కధికారముగలదు అతఁ డేమి చెప్పుచున్నాఁడో అది నిజముగా జరుగుచున్నది

వ్యా పుత్త్రుఁడు భార్య, ధనము, జనము—ఇవి యెల్ల అనిత్యములు, ఎప్పుడో యొకప్పుడు సంసారమునందలి యీసమస్తప్రియవస్తువులతో తప్పక యెడబాటు కలిగియే తీరును. కాని యిహమునందేమి, పరమునందేమి అంతరతముఁడగు ప్రియతమునితో నెన్నఁడును విచ్ఛేదము కలుగనేరదు ఎవఁడు పరమేశ్వరునికంటె భిన్నమైనవానిని ప్రియముగా చూచుకొనునో అతని ప్రియవస్తుసముదాయమునకు అవశ్యము వినాశము సంభవించును విషయాసక్తులును విముగ్ధులు నగువారికి ఇట్టి ఉపదేశమును చేయుటకు జ్ఞానులగు బ్రహ్మోపాసకుల కధికారము గలదు ఎవ్వరు ఈ ఉపదేశమును గ్రహింపరో అట్టివారు దుఃఖము ననుభవింతురు. అంతరతరుఁడును, మంగళాకరుఁడునగు పరమాత్మయే యెల్లరకును సర్వముకంటె ప్రియతరుఁడు. అతనిని ప్రేమించినయెడల అతనికి ప్రేమాస్పదమగు సమస్తమును ప్రేమింపవలసియుండును. అదియుఁగాక, ఈ జగత్సంసారము యొక్క మంగళమునుద్దేశించి వేనియెడల విశేషమైన ప్రీతిని అనురాగమును చూపవలయునని అతఁడు ఆదేశించుచున్నాఁడో వానియెడల అధికమయిన ప్రీతిని అనురాగమును చూపవలయును కాని పరమాత్మకంటె అన్యవస్తువును అధికముగా ప్రేమించుటయు దానిని జూచి ముగ్ధమగుటయు విశుద్ధమును విహితమునగు ప్రీతియొక్క లక్షణముగాదు.

వి భగవంతునికంటె ఐహికవస్తువుల నెక్కువగా ప్రేమించుట యెంత అనర్థదాయకమో యీవాక్యము తెలుపుచున్నది.

మూ ఆత్మానమేవ ప్రియ ముపాసీత
సయ ఆత్మానమేవ ప్రియముపాస్తే
న హాస్య ప్రియం ప్రమాయుకం భవతి          ౮

[బృహ ౧-అ, ౪-బ్రా, ౮-వా]

టీ ఆత్మానమేవ = పరమాత్మునినే, ప్రియం=ప్రీతికివిష యముగా, ఉపాసీత=ఉపాసింపుడి సయః=ఎవఁడు, ఆత్మానమేవ= పరమాత్మునినే, ప్రియం = ప్రియమైనవానినిగా, ఉపాస్తే = ఉపాసనచేయుచున్నాఁడో, అస్య = ఇతనియొక్క, ప్రియమ్= ప్రియము (వీను ప్రీతియుంచిన వస్తువు) ప్రమాయుకం=మరణ శీలము, న భవతి=కాదు.

తా పరమాత్మనే ప్రియుని రూపమున ఉపాసనచేయ వలయును. ఎవఁడు పరమాత్మను ప్రియుని రూపమున ఉపాసన చేయునో అతని ప్రియమెన్నఁడును మరణశీలము కాదు

వ్యా ఎవ్వఁడు మన మానసక్షేత్రమున ప్రీతియనెడు కోమల మయిన పూ మొగ్గను స్థాపించెనో అతనిని మనము శ్రద్ధాపూర్వకముగా విక సింపఁజేసిన ఆపుష్పముతోడనే అర్చింపవలయును. అనశ్వరుఁడగు పర మేశ్వరుఁ డెవ్వరికి ప్రియుఁడో వారి ప్రియవస్తువు మరణించునది గాదు. ఎన్నఁటికిని వారికి దానితో ఎడబాటు కలుగఁజాలదు.

మూ ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో
మన్తవ్యో నిదిధ్యాసితవ్యః ౯

[బృహ ౨-అ, ౪-బ్రా, ౫-వా.]

టీ అరే = ఓమైత్రేయీ! ఆత్మావై = పరమాత్మయే, ద్రష్టవ్యః=చూడఁదగినది; శ్రోతవ్యః = వినఁదగినది; మన్తవ్యః= మననము చేయఁదగినది, నిదిధ్యాసితవ్యః = నిశ్చయముగా ధ్యానింపఁదగినది

తా పరమాత్మయొక్క దర్శన, శ్రవణ, మనన, నిదిధ్యాసనములను చేయవలయును పరమాత్మను దర్శింపవలయును అనఁగా ఈవిశ్వమునందు అతని జ్ఞానమును, శక్తిని, మహిమను తెలిసికొనవలయును మఱియు సర్వమునకు ప్రాణరూపమున సర్వప్రదేశములందును అతఁడున్నట్లు గ్రహింపవలయును అదియుఁగాక, అతని మహిమాప్రతిపాదకములయిన సకలోపదేశ వాక్యములను ఆచార్యుని ద్వారమున వినవలయును జగత్తునందు అతనిమహిమను దర్శనముచేసియు, ఆచార్యుని యొద్ద ఆతని మాహాత్మ్యమును గూర్చి వినియు సమస్తమును ఆలోచనాపూర్వకముగా తిరుగతిరుగ మననము చేయవలయును తదనంతరము అతని నిదిధ్యాసనమును కావింపవలయును అతని సత్తనుగూర్చి నిశ్చయత్వమును పొంది, అతనిమీఁద మనస్సును నిలుపవలయును.

ఏ భావగర్భితమయి యీచిన్నవాక్యము యాజ్ఞవల్క్యునికిని మైత్రేయికిని జరిగిన సంభాషణములోనిది ఇది బృహదారణ్యకములోని ౨ వ అధ్యాయములోనేగాక ౪ వ అధ్యాయములోని ౫ వ బ్రాహ్మణ ములోఁగూడ కానవచ్చుచున్నది రెండవ అధ్యాయము నాల్గవ బ్రాహ్మణ ములోని అయిదవవాక్యములో పొందుపఱుపఁబడిన సంభాషణములోని చివరభాగమిది భర్తయు, భార్యయు, బిడ్డలును వారివారిలోఁగల పరమా త్మనుబట్టి ప్రియతము లగుచున్నారని వాక్రుచ్చినవాఁడై యాజ్ఞవల్క్య మహర్షి పరమాత్మయే దర్శింపఁదగినవాఁడును, వినఁదగినవాఁడును, మననము చేయఁదగినవాఁడును ధ్యానింపఁదగినవాఁడు నని స్పష్టపఱుచుచున్నాఁడు. యాజ్ఞవల్క్యుని యీ యుపదేశానంతరము బ్రహ్మజ్ఞానోపలబ్ధికి శ్రవణ, మనన, నిదిధ్యాసనములు ముఖ్యసాధనములుగా హిందూధర్మసాధకులచే పరిగ్రహింపఁబడెను ఈవాక్యమునందలి ద్రష్టవ్యః అన్నశబ్దమునం దిమిడి యున్న దర్శనమును సాధనాంగములలోఁ జేర్పకపోవుట గమనింపఁదగును. శ్రవణ, మనన, నిదిధ్యాసనములనెడు సాధనములు సులభముగా నర్థమగుచు న్నవి. దర్శనమన్నది స్పష్టముగా బోధపడుటలేదు. కాని దర్శన మన్న పదము బ్రహ్మోపలబ్ధివిషయమున ఉపనిషత్తులలో నేమి, యితరధార్మిక వాఙ్మయములో నేమి తఱచుగా ప్రయోగింపఁబడునదియే యైయున్నది. కాని బ్రహ్మదర్శనము శ్రవణ, మనన, నిదిధ్యాసనముల నభ్యసించిన పిమ్మట లభించునదిగాని ముందుగనే లభ్యమగునదిగాదు. కాని యీవాక్యములో దర్శనము మొదటనే పేర్కొనఁబడినది. కావున నిది ప్రత్యక్షమై యుండ దనుట స్పష్టము సృష్టిమహిమలో బ్రహ్మమును దర్శించుటయే యీ'' ద్రష్ట

వ్యః" అనుపదముయొక్క భావమై యుండనోపును. మహర్షి దేవేంద్రనాథ రాకూరుగా రివ్విధముననే అభిప్రాయపడిరి.

మూ సవా అయమాత్మా సర్వేషాం భూతానా మధిపతిః,
సర్వేషాం భూతానాం రాజా ౧౦

[బృహ. ౨-అ, ౫-బ్రా, ౧౫-వా.]

టీ. సోయం = అట్టియీ, ఆత్మావై = పరమాత్మయే, సర్వేషాం భూతానాం=సమస్తభూతములకును, అధిపతిః = అధిపతి సర్వేషాం భూతానాం = సమస్తభూతములకును, రాజా=రాజు

తా అట్టి యీ పరమాత్మయే సకలభూతములకును అధిపతి; సర్వభూతములకును రాజు

వ్యా ఇతఁడు సమస్తమును నియమమునం దుంచుచున్నాఁడు తగిన శిక్షా బహుమానములను విధించుచున్నాఁడు.

మూ తద్యథా రథనాభౌ చ రథనేమౌ చారాః
సర్వే సమర్పితా ఏవమేవాస్మిన్నాత్మని
సర్వాణి భూతాని సర్వేదేవాః సర్వేలోకాః
సర్వే ప్రాణాః సర్వ ఏత ఆత్మానః సమర్పితాః ౧౧

[బృహ. ౨-అ, ౫-బ్రా, ౧౫-వా]

టీ తత్ యథా = అది యెట్లు లనఁగా, అరాఃసర్వే= చక్రము మధ్యనుండు కొయ్యలు (ఆకులు) అన్నియు, రథ నాభౌచ = చక్రముయొక్క నాభియందును, రథనేమౌచ = చక్రముయొక్క చుట్టునందును, సమర్పితాః=ఉంచఁబడియున్నవి ఏవం ఏవ=ఈవిధముగానే, అస్మిన్నాత్మని=ఈపరమాత్మయందు సర్వాణి భూతాని=సకలభూతములు, సర్వే దేవాః=సమస్త దేవతలు, సర్వే లోకాః=సమస్తలోకములు, సర్వే ప్రాణాః = అన్నిప్రాణములు, సర్వే ఏతే ఆత్మానః=ఈసకల జీవులు, సమర్పితాః=ఉంచఁబడి యున్నవి

తా రథచక్రముయొక్క ఆకు లన్నియు నాభియందును, చుట్టును నెట్లు అమర్పఁబడియున్నవో అవ్విధముననే సమస్తభూతములు, సమస్తదేవతలును, సకలలోకములును, సకల ప్రాణులును, ఈ సకల జీవులును పరమాత్మయందు ఉంచబడియున్నవి.

వ్యా జలము, అగ్ని, వాయువు మొదలుగాఁగల సకలభూతములును, మానవులకంటె శ్రేష్ఠులగు అన్యలోకములందు నివసించు ధర్మాత్ములగు సకల జీవులును, సూర్యుఁడు చంద్రుఁడు గ్రహములు నక్షత్రములు పృథివి మున్నగు సమస్త లోకములును, ప్రాణులయొక్క సర్వవిధ ప్రాణ వ్యాపారములును అసంఖ్యేయ లోకములలోఁ గల అనంతజీవులయొక్క ఆత్మ లెల్లను ఈ పరమాత్మ నాధారముగా చేసికొని యున్నవి

వి సమస్తమును బ్రహ్మములో నున్నదను విషయమును చక్కని ఉపమానద్వారమున ఈ వాక్యము వ్యక్తీకరించుచున్నది.

మూ యుజే వాం బ్రహ్మ పూర్వ్యం నమోభిః
అనాదిమత్వం విభుత్వేన వర్తసే
యతో జాతాని భువనాని విశ్వే ౧౨
[శ్వేతా ౨-అ, ౫-౪, అ-౪-వా]

టీ వామ్=మీా, పూర్వ్యం = చిరంతనుఁడైన, బ్రహ్మ= బ్రహ్మమును, నమోభిః = నమస్కారములచేత, యుజే = ధ్యానించుచున్నాను అనాదిమత్ = ఓఆద్యంతశూన్యుఁడవగు పరమాత్మా, త్వం=నీవు, విభుత్వే=వ్యాపకత్వముచేత, వర్తసే= ఉన్నావు యతః=నీవలన, విశ్వానిభువనాని=అన్నిలోకములు, జాతాని=కలిగినవి.

తా మీాయొక్కయు మాయొక్కయు చిరంతనుఁ డయిన పరబ్రహ్మమునందు నేను నమస్కారపూర్వకముగా నా ఆత్మను సంయోగపఱుచుచున్నాను ఓఆద్యంతశూన్యుఁడ వగు పరమాత్మా! నీవు సర్వవ్యాపకుఁడవై యున్నావు నీనుండి యీసమస్త భువనములును ఉత్పన్నము లయినవి

వ్యా మీాయొక్కయు మాయొక్కయు నిత్యపరబ్రహ్మమును నేను నమస్కారపూర్వకముగా ధ్యానించుచున్నాను. మీారును నాతోఁ గలిసి అత నిని ధ్యానింపుఁడని బ్రహ్మవాదియగు ఆచార్యుఁడు శిష్యులకు చెప్పుచున్నాఁడు.

వి ఈవాక్యము శ్వేతాశ్వతరోపనిషత్తులోని రెండువాక్యములు చేర్చి కూర్పఁబడినది. "యుజే" మొదలుకొని "నమోభిః" వరకుఁ గల మొదటిభాగము ౨ - వ అధ్యాయము, ౫ - వ వాక్యములోనిది. ఈ భాగము తొలుత ఋగ్వేదము దశమమండలములో పదుమూఁడవ సూక్తములో మొదటిఋక్కు. తక్కినభాగము ౪ - వ అధ్యాయము ౪-వ వాక్యములోనిది

మూ ఇహైవ సన్తోఽథ విద్మస్తద్వయం
న చేదవేది ర్మహతీ వినష్టిః,
య ఏతద్విదురమృతా స్తేభవన్తి
అథేతరే దుఃఖమేవాపియన్తి ౧౩

[బృహ. ౪-అ, ౪-బ్రా, ౧౪-వా]

టీ అథ=తర్వాత, ఇహఏవసన్తః=ఐహికమునందుండఁగానే, వయం=మనము, తత్ = దానిని (బ్రహ్మమును), విద్మః= తెలిసికొనుచున్నారము నచేత్ అవేదిః= తెలిసినవారలము గామేని, మహతీవినష్టిః=విశేషమయిన వినాశమున్నది యే = ఎవరు, ఏతత్=దీనిని (బ్రహ్మమును), విదుః= తెలిసికొనియెదరో, తే=వారు, అమృతాః = నిత్యపదవిగలవారు, భవన్తి = అగుచున్నారు అథ=పిమ్మట, ఇతరే=అన్యులు, (బ్రహ్మవిదులు కాని వారు) దుఃఖమేవ=దుఃఖమునే, అపియన్తి=పొందుచున్నారు

తా. ఇచ్చట నుండఁగనే మనము అతనిని తెలిసికొన్ని నారము మనము అతనిని తెలిసికొనక పోతిమేని మహావినాశమును పొందియుందుము ఎవరు ఇతనిని తెలిసికొందురో వారు అమరులగుదురు. తదితరు లెల్లరు దుఃఖమును పొందుదురు

వ్యా. ఏమి ఆశ్చర్యము, ఇక్కడ నుండఁగనే మనము అతనిని తెలిసికొంటిమి. అంధకారమయమైన యీ సంసారమునందు నిమగ్నులమై, సంసారముచే ఆచ్ఛన్నులమై యున్నను మన జ్ఞాననేత్రము ఆ సత్యజ్ఞాన జ్యోతిని గ్రహింపఁగలదై యున్నది అంతియేగాక, మన హృదయ మతనికి తన విశుద్ధమయిన ప్రీతి నర్పించి పాప తాపములనుండి పరిత్రాణమును పొందుచున్నది దీనికంటె ఆశ్చర్యకరమయిన విషయ మింకేమి గలదు? ఇందు మూలమున మనము ధన్యుల మైతిమి. ఈ భూలోకమున నతఁ డెన్నియో విధములయిన ప్రాణులను సృష్టిచేసెను మఱి వేనికిని అతఁడిట్టి సామర్థ్యమును గాని అధికారమును గాని ఒసఁగి యుండలేదు. ఎంతయు అనుగ్రహించి మనకు మాత్రము అతఁడీ అధికారమును ప్రసాదించెను. ఇందువలన మనము కృతార్థులమైతిమి ఇందువలన మనము సకల సంపదలను వడసితిమి. అతనిని మనమిచట తెలిసికొనలేకపోతిమేని, అతనితో మనము నిరంతరనిత్య సంబంధపాశమువలన కట్టువడకపోతిమేని మనము మితిలేని దుర్గతిపాలగుదుము అట్టులయినచో, ఈ సంసారవిపత్సాగరమునఁ బడిన మనకు ఆశ్రయమెక్కడ? లోకుల నిష్ఠురాఘాతములనుండి మనము శాంతిని బడయున దెక్కడ? పాపతాపములనుండియు, మృత్యుభయమునుండియు మనకు మఱెవ్వరు పరిత్రాణము నొసంగఁగలరు?

వి బ్రహ్మము నెఱుంగుటలోఁ గల మహాభాగ్యమునుగూర్చి యీ వాక్యము ముచ్చటించుచున్నది ఇట్టివాక్యమింకొకటి కేనోపనిషత్తులోఁ గూడఁగలదు (చూ 3౪-వ వాక్యము.)

మూ తతో యదు త్తరతరం తదరూపమనామయమ్
యఏతద్విదురమృతాస్తే భవన్తి
అథేతరే దుఃఖమేవాపియంతి. ౧౪

[శ్వేతా. 3-అ, ౧౦-వా.]

టీ తతః=ఆకార్యముకంటె, యత్=ఏది, ఉత్తరతరం= కారణమునకు కారణమో, తత్=అది (బ్రహ్మము) అరూపం= రూపరహితము, అనామయం = రోగశోకరహితము యే = ఎవరు, ఏతత్=(దీనిని) (బ్రహ్మమును), విదుః = తెలిసికొనియె దరో, తే=వారు, అమృతాః=మరణధర్మము లేనివారు, భవన్తి=అయ్యెదరు అథ = పిమ్మట, ఇతరే = అన్యులు, దుఃఖమేవ = దుఃఖమునే, అపియన్తి=పొందెదరు

తా ఎవ్వఁడు కారణమునకు కారణమో అతఁడు రూపరహితుఁడు, నిరామయుఁడు ఇతనిని తెలిసికొనెడువారు అమరులయ్యెదరు తదితరులెల్లరును దుఃఖమును పొందెదరు

వ్యా ఈ సంసారములో నేయే కారణములవలన సమస్త కార్యములును ఉత్పన్నములగుచున్నవో ఆ కారణములకెల్లను కారణము

పరబ్రహ్మము అతఁడు రూపహీనుఁడు, నిరామయుఁడు ఎవ్వ రీతని జ్ఞాన చక్షుమూలమున ప్రత్యక్షముచేసికొని యితనితో అచ్ఛేద్యమయిన సంబంధము నేర్పాటుచేసికొనెదరో అట్టివారు అమృతు లయ్యెదరు, తదన్యు లెవ్వరును సాంసారికతాపదుఃఖముల నతిక్రమింప నేరరు.

మూ తతః పరం బ్రహ్మపరం బృహన్తం
యథానికాయం సర్వభూతేషు గూఢమ్
విశ్వస్యైకం పరివేష్టితార మీశం
తం జ్ఞాత్వాఽమృతా భవన్తి ౧౫

[శ్వేతా 3-అ, ౭-వా]

టీ తతఃపరం=విశ్వకార్యమునకు కారణమును, బ్రహ్మపరం = బ్రహ్మమును, బృహన్తం = గొప్పదియును, యథానికాయం=శరీరమును అతిక్రమింపకుండ, సర్వభూతేషు=సమస్తభూతములయందును, గూఢం = అంతర్యామియైయున్న, విశ్వస్య=ప్రపంచమునకు, ఏకం = ఒక్కఁడై నట్టి, పరివేష్టితారం=చుట్టుకొనఁబడిన, తం-ఈశం = ఆయీశ్వరుని, జ్ఞాత్వా = తెలిసికొని, అమృతాః=చావు లేని వారుగా, భవన్తి=అగుచున్నారు

తా విశ్వకారణమయిన పరబ్రహ్మము అన్నిటికంటె అధికుఁడయినవాఁడు అతఁడుసర్వభూతముల శరీరములందును గూఢరూపమున నున్నాఁడు ఒక్కఁడై విశ్వమునంతయు

వ్యాపించియున్న ఆపరమేశ్వరుని తెలిసికొని సమస్త జనులును అమరు లయ్యెదరు

వ్యా ఆతనినుండియే ఈసమస్తజగత్తు సృష్టియయ్యెను. అందుచే తనే ఆతఁడు సకలకార్యములకును కారణ స్వరూపుఁడు, గొప్పవాఁడు అంతర్బాహ్యములందలి సకలస్థానములందును అతఁడు సర్వదా నిండియున్నాఁడు. అయినను అతని నెవ్వరును నేత్రముల మూలమున చూడఁజాలరు ఏలయన అతఁడు జ్ఞానస్వరూపి, జ్ఞానస్వరూపిని జ్ఞానమూలముననే చూడనగును. ఎవ్వరు దీనిని తెలిసికొందురో వారు పరబ్రహ్మముతో నిత్యసహవాసమును పొందుదురు

మూ సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్,
సర్వస్య ప్రభుమీశానం సర్వస్య శరణం సుహృత్.
[శ్వేతా 3-అ. ౧౭-వా]

టీ సర్వేన్ద్రియగుణాభాసం = (అతఁడు) సకలేంద్రియ గుణములను ప్రకాశింపఁజేయువాఁడు, సర్వేన్ద్రియవివర్జితం = సకలేంద్రియ రహితుఁడు సర్వస్య=అన్నిటికి, ప్రభుం=ప్రభువు ఈశానం = ఈశ్వరుఁడు సర్వస్య = అన్నిటికిని, శరణం=రక్షకుఁడు, సుహృత్=మిత్రుఁడు.

తా అతని మూలమున సకలేంద్రియములయొక్క గుణములును ప్రకాశమును పొందుచున్నవి కాని అతఁడు

స్వయముగా నేయింద్రియములును లేనివాఁడు అతఁడు సకలమునకును ప్రభువు, సకలమునకును ఈశ్వరుఁడు; సకలమునకును ఆశ్రయుఁడు, మిత్రుఁడు

వ్యా మనకు జ్ఞానసుఖసామర్థ్యముల నొసంగఁగోరి అతఁడు మన యింద్రియములనెల్ల నందుకు తోడ్పడు వివిధ గుణములతో నలంకరించెను. నేత్రము విశ్వవిభుని విశ్వరాజ్యమునందలి అత్యాశ్చర్య శోభ నవలోకించి పరితృప్తి నొందుచున్నది కర్ణము మనోహర విహంగరవములను, మధుర సంగీత స్వరమును, బ్రహ్మ గుణానుకీర్తనమును ఆకర్ణించి అమృతాభిషిక్తమగుచున్నది. జిహ్వ నానారస సమ్మిళిత చర్వ్య, చోష్య, లేహ్య పేయరూపములగు వివిధప్రకారరుచ్యపదార్థముల స్వాదమును గ్రహించి చరితార్థమగుచున్నది. ఘ్రాణేంద్రియమగు నాసిక బహువిధసుగంధపుష్పముల మనోహరసౌరభమును గ్రహించియు, సర్వాంగవ్యాప్తమగు స్పర్శేంద్రియము సుస్నిగ్ధ మందమారుతహిల్లోలమున పారవశ్యము పొందియు మానవుని సుఖసరోవరమును పూర్ణముచేయుచున్నవి. సకల మంగళాకరుఁడగు పరబ్రహ్మమే యీసమస్తమునకును ఏకమాత్రకారణము ఎట్టిశక్తులను ఇంద్రియజాలమున కొసంగియుండెనో ఆశక్తుల కనురూపముగా వానికి విషయములగు సకలపదార్థములను, అతఁడు సృష్టించియుండుటచేతనే మనము ఇంద్రియసంచితమహాసౌఖ్యము ననుభవించి సంతోషింపఁగల్గుచున్నాము. అతఁడు మనకు హస్తద్వయమును ప్రసాదించియుండుటచేతనే మనము సకల వస్తువులను పట్టుకొనఁ గల్గుచున్నాము. అతఁడు మనలను గమనేంద్రియసంయుక్తులనుగా చేయుటచేతనే మనము సర్వత్రగమనాగమనముచేయ సమర్థులమగుచున్నాము. అతఁడు మనకు వాగింద్రియమును దయచేయుటచేతనే

మనము మనోభావముల నెల్ల వెల్లడించి సుఖింపఁ గల్గుచున్నాము అతఁడు మనకుఁ గల ఒక్కొక్క ఇంద్రియమును సౌఖ్యభాండారమునకు ఒక్కొక్క ద్వారముగా నొనరించెను మనకుఁగల ఒక్కొక్క జ్ఞానేంద్రియమును ఒక్కొక్క కర్మేంద్రియమును కల్యాణపరిపూర్ణమయిన ఒక్కొక్క ఊటయై యెడతెగకుండ కల్యాణజలమును ప్రవహింపఁ జేయుచున్నది. తద్ద్వారమున సమస్త శుభములకును అద్వితీయ ఆకరస్వరూపుఁడగు విశ్వవిధాతయొక్క అద్భుతమహిమ వెల్లడి యగుచున్నది

జీవుల ఉపకారార్థమే అతఁడు ఈ అత్యాశ్చర్య ఇంద్రియముల నెల్ల సృజించెను. ఆతఁడు అధిష్ఠించియుండుటచేతనే ఈ ఇంద్రియముల గుణములెల్లను ప్రకాశితము లగుచున్నవి. కాని స్వయముగా నతఁడు సకలేంద్రియ వివర్జితుఁడు. అతని జ్ఞానము నిమిత్తము, ఇంద్రియము లావశ్యకములుగావు అతని కర్మాచరణము నిమిత్తమును ఇంద్రియములక్కఱలేదు చక్షుః కర్ణవిహీనుఁడయ్యు అతఁడు సర్వమును చూచుచున్నాఁడు, అతఁడు సర్వమును వినుచున్నాఁడు. పాణిపాదములు లేకుండగనే అతఁడు సర్వమును గ్రహించుచున్నాఁడు; సర్వత్ర తిరుగుచున్నాఁడు. అతఁడు సర్వమునకును ప్రభువు, సర్వమునకును ఈశ్వరుఁడు; సర్వమునకును ఆశ్రయుఁడు, సర్వమునకును మిత్రుఁడు.

వి మూలమునందలి కడపటిశబ్దము 'బృహత్.' మహర్షి దానిని "సుహృత్" అని మార్చి విశేషార్థము కల్పించెను. ఇందలి మొదటి భాగము భగవద్గీతలోఁగూడఁ గలదు.

మూ. మహాన్ప్రభుర్వై పురుషః సత్వస్యైష ప్రవర్తకః,
సునిర్మలా మిమాం శాన్తిమీశానో జ్యోతి రవ్యయః
[శ్వేతా. 3-అ, ౧౨-వా]

టీ మహాన్=(అతఁడు) గొప్పవాఁడు, ప్రభుః=ప్రభువు, పురుషః=పూర్ణుఁడు, జ్యోతిః=జ్యోతిస్వరూపుఁడు, అవ్యయః = నాశరహితుఁడునైన, ఏషః=ఈ, ఈశానః=ఈశ్వరుఁడు,ఇమాం సునిర్మలాం శాన్తిం = ఈ అతినిర్మలమైన శాంతినుద్దేశించి, సత్వస్య ప్రవర్తకః=ధర్మమునందు ప్రవర్తింపఁజేయువాఁడు

తా ఈమహాపురుషుఁడు సకలమునకును ప్రభువు జ్ఞాన జ్యోతి స్వరూపియు, అనంతుఁడునగు ఈయీశ్వరుఁడు నిర్మల శాంతి నుద్దేశించి ధర్మప్రవర్తకుఁ డాయెను.

వ్యా ఈ మంగళమయుఁడగు మహాపురుషుఁడు కేవల ఇంద్రియ సుఖముల నొసంగి మనలను పశువులను వలె సంసార నిబద్ధులఁ జేయలేదు. అమూల్యమయిన ధర్మమును ప్రసాదించి మనలను స్వతంత్రులను చేసెను విషయ సుఖములకంటె సహస్రగుణములు శ్రేష్ఠమయిన ఆత్మప్రసాదము నుద్దేశించియు, మన నిర్మలశాంతి నుద్దేశించియు అతఁడు స్వయముగా ధర్మ ప్రవర్తకుఁ డాయెను. అతఁడు మనఆత్మలయందు శుభ బుద్ధిని ధర్మబలమును నిరంతరము ప్రేరణచేయుచున్నాఁడు మనము అతని ప్రసాదముచే ధర్మ బలమూలమున స్వాధీనులమై ముక్తికధికారులమైతిమి

వి మూలమునందలి "ప్రాప్తిం" అను పదమునకు బదులుగా "శాన్తిం" అను పదమును మహర్షి చేర్చెను. మహర్షి 'సత్వస్య' అను పద మునకు ధర్మమునందు అని అర్థముచెప్పెను. మ్యాక్సుమూలరు "సత్వ" మనగా "ఉనికి" అని భాషాంతరీకరించెను.



# పదవ అధ్యాయము



మూ ఓమితి బ్రహ్మ సర్వేఽస్మైదేవాబలి మాహరన్తి,
మధ్యే వామనమాసీనం విశ్వేదేవా ఉపాసతే ౧

[తైత్తి - కరము.]

టీ ఓమితి=ఓం అనునది బ్రహ్మము, అస్మై=ఈ బ్రహ్మము కొఱకు, సర్వే దేవాః = దేవతలందఱు, బలిం=పూజను, ఆహరన్తి=పొందించుచున్నారు మధ్యే=(జగతికి) మధ్యమందు, ఆసీనం=ఉండెడి, వామనం=పూజనీయుని, విశ్వే దేవాః = సమస్త దేవతలు, ఉపాసతే=ఉపాసించుచున్నారు

తా ఎవ్వఁడు ఓంకారముచే ప్రతిపాద్యుఁడో అతఁడు బ్రహ్మము సకల దేవతలును అతనికి పూజలు సమర్పించు చున్నారు జగత్తునకు నడుమనున్న పూజనీయుఁడగు పరమాత్మను సకల దేవతలును నిరంతరము ఉపాసనచేయు చున్నారు

వ్యా అద్వితీయుఁడగు ఈజగత్కర్త, ఈశ్వరుఁడు, మహేశ్వరుఁడు, పరమాత్మ, పరబ్రహ్మ మొదలగు శబ్దములచే నెట్లు పిలువఁబడు

చున్నాఁడో అదియే విధమున ''ఓం' శబ్దము చేతను పిలువఁబడుచున్నాఁడు ఎవ్వఁడు సృష్టి, స్థితి, ప్రళయకర్తయో అతఁడే బ్రహ్మము, అతఁడే ఓంకార ప్రతిపాద్యుఁడగు మహాపురుషుఁడు పృథివికంటె శ్రేష్ఠతరములయిన యితరలోకములలో నివసించు దేవతలు నిరంతర మతనిని ఆరాధించుచున్నారు మనము కూడ గొప్పవారము, శ్రేష్ఠులము కాఁగోరితిమేని దేవతలచందమున ఆ విశుద్ధమంగళస్వరూపునికి అధీనులమును, అనుగతులమునై అతని యెడల ప్రీతిభావమును మనలో ఉన్నతమును ఉజ్జ్వలమును గావించుకొని అతని ఉపాసనయందు అనురక్తి కల్గియుండుటయే మనకు కర్తవ్యము

వి ఈ పదియవ అధ్యాయము బ్రహ్మోపాసనార్థము అవలంబింపఁదగు కొన్ని సాధనములనుగూర్చి ప్రస్తావించుచున్నది తైత్తిరీయోపనిషత్తు ౧-వ అధ్యాయములోని ౫-వ వాక్యమునుండియు, కఠోపనిషత్తు ౫-వ అధ్యాయములోని ౩-వ వాక్యమునుండియు గైకొనఁబడిన భాగములను జేర్చి మహర్షి దేవేంద్రనాథరాకూరు ఈ మొదటవాక్యమును కూర్చెను. ఓంకారద్వారమున బ్రహ్మము నుపాసింపవలయునని యిది సూచించుచున్నది. దేవతలు బ్రహ్మమును ఓంకారము మూలమున సర్వదా ఉపాసించుటయే యీ ఆదేశమునకు హేతువు వాక్యములోని మొదటిభాగము ''ఓమ్'' అనిన బ్రహ్మమే యని చెప్పుచున్నది. మొట్టమొదట ''ఓమ్'' అనునది బ్రహ్మమును సూచించు ఒకానొక చిహ్నమైయుండును. వైదికఋషులు తమ ప్రసంగములను ఓంకారముతో ప్రారంభించుచుండిరి. రానురాను దానికొక గూఢార్థ మేర్పడెను.

వాక్యములోని రెండవభాగములో దేవతలందరును బ్రహ్మము నుపాసింతు రని కలదు మూలములో ''ఓం'' అని లేదు. కఠోపనిషత్తునుండి

గైకొనఁబడిన ౩-వ భాగము తైత్తిరీయోపనిషత్తు ౧-వ అధ్యాయములోని ౫-వ వాక్యమును బోలియున్నది. బ్రహ్మము నడుమ నున్నట్లును చుట్టును దేవతలు నిలిచియున్నట్లును ఇందువర్ణింపఁబడినది భగవంతుఁ డిక్కడ "వామనం" అని చెప్పఁబడుట గమనింపఁదగియున్నది పురాణములలో వామనరూపము విష్ణుమూర్తి అవతారములలోనొకటి ఇక్కడ ఆ పదమునకు "పూజనీయ" మనియే అర్థమై యుండును ఓంకారద్వారమున బ్రహ్మము ధ్యానింపఁదగు నని తెలియఁజేయుటకు మహర్షి అక్కడక్కడ నున్న ఖండములను జేర్చి యీ వాక్యమును సిద్ధముచేసెను.

మూ ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానం
స్వస్తి వః పారాయ తమసః పరస్తాత్
ఓం కారేణైవాయతనే నాన్వేతి విద్వాన్
యత్తచ్ఛాన్త మజరమమృత మభయం పరఞ్చ ౨
[మాండూ. ౨-ఖం, ౬-వా & ప్రశ్న ౫-ప్ర, ౭-వా.]

టీ ఓం ఇతి ఏవం = ఒంకారమే ఆలంబనముగాఁ గల వారలై, ఆత్మానం = పరమాత్మను, ధ్యాయథ = ధ్యానము చేయుఁడి తమసః = అజ్ఞానాంధకారముకంటె, పరస్తాత్ = ఆవలనుండెడి, పారాయ = గట్టుకొఱకు (బ్రహ్మస్వరూపమును తెలిసికొనుటకొఱకు), వః = మీకు, స్వస్తి = మంగళము, (అస్తు = అగునుగాక) ఓంకారేణ ఏవ ఆయతనేన = ఓంకార సాధకముచేతనే, విద్వాన్ = జ్ఞాని, యత్ = దేనిని, అన్వేతి =

పొందుచున్నాఁడో, తత్ = అది, శాంతం = శాంతస్వరూప మయిన, అజరం = ముదిమిలేని, అమృతం = మరణము లేని, అభయం = భయములేని, పరఞ్చ = నిరతిశయమయిన బ్రహ్మము

తా ఓంకారప్రతిపాద్యుఁడగు పరబ్రహ్మమును ధ్యానముచేయుఁడు నిర్విఘ్నముగా అజ్ఞానతిమిరమునుండి మీరు ఉత్తీర్ణులు కండు జ్ఞానులు ఓంకారసాధనాద్వారమున శాంతుఁడును, అజరుఁడును, అమరుఁడును, అభయుఁడును, నిరతిశయుఁడు నగు ఆ బ్రహ్మమును పొందుదురు

వ్యా. విశుద్ధమును, ఉజ్జ్వలము నగు జ్ఞానము మూలమున ఆ ఓంకార ప్రతిపాద్యుఁడగు పరబ్రహ్మమును ధ్యానము చేయుఁడు. అట్లు చేసినచో మీరు నిశ్చయముగా అజ్ఞానాంధకారమునుండి ఉత్తీర్ణులై శాంతుఁడును, అజరుఁడును, అమరుఁడును, అభయుఁడును, నిరతిశయుఁడు నగు బ్రహ్మమును పొందుదురు

మూ తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహి,
ధియో యో నః ప్రచోదయాత్. 3

టీ యః = ఎవ్వఁడు, నః=మనయొక్క, ధియః = బుద్ధివృత్తులను (జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను), ప్రచోద

యాత్ = ప్రేరేపించుచున్నాఁడో, తత్సవితుః = ఆ జగత్కార ణునియొక్క, వరేణ్యం = ఉపాసింపఁదగిన, భర్గః= తేజస్సును (పరమాత్మస్వరూపమును, తేజోజ్ఞానశక్తులను), ధీమహి = ధ్యానించుచున్నారము.

తా॥ ఎవ్వఁడు మన బుద్ధివృత్తులనెల్ల ప్రేరణచేయు చున్నాఁడో ఆజగద్వ్యాపకుఁడగు పరమదేవతయొక్క పూజ నీయమగు జ్ఞానమును శక్తిని మనము ధ్యానింతము.

వ్యా॥ ఎవ్వఁడు ఈ జగత్తును పుట్టించెనో అతఁడు, తల్లిదండ్రుల రీతిని ఈ విశ్వమును పాలించుచున్నాఁడు అతని అచింత్యజ్ఞానమును, మహ చ్ఛక్తియు విశ్వమునందు నివసించు అసంఖ్యాకజీవులయొక్క కల్యాణసాధ నమునందు తత్పరములై యున్నవి. అతఁడు మనకు ధర్మపథసహాయార్థ మై బుద్ధివృత్తులనెల్ల మాటిమాటికి ప్రేరణ చేయుచున్నాఁడు వాని సాధన మువలననే మనము సర్వవిధపాపతాపములనుండియు నివృత్తి పొందు చున్నాము

వి॥ సుప్రసిద్ధమయిన యీ మంత్రము మూలమున సాధకు లెల్ల రును భగవంతుని ధ్యానింపవలసినవారై యున్నారు. ఇది ఋగ్వేదము 3-వ మండలములోని ౬౨-వ సూక్తములోని ౧౦-వ ఋక్కు. పరబ్రహ్మము నుపా సించుట కిది మిక్కిలి అనుకూలమయినది. మనుష్యుని బుద్ధియు జ్ఞానమును భగవంతునిచే ప్రేరేపింపఁబడుచున్న దని యిది వ్యాక్రుచ్చుచున్నది అట్లగుటం జేసి మానవుని బుద్ధిశక్తులలో ఈశ్వరుని జ్ఞానమును శక్తిని దర్శింప వచ్చునని

యీ మంత్రమువలన మనము గ్రహింపనగును భగవంతుఁడు కేవలము సూర్యచంద్రాదులను నడిపెడు బాహ్యదేవతయే గాఁడు. అతఁడు మన నైతిక మానసిక శక్తులను ఉత్తేజింపఁజేసెడు అంతరస్థ దేవత.

మూ. మాహం బ్రహ్మ నిరాకుర్యాం,
మా మా బ్రహ్మనిరాకరోత్ దనిరాకరణ మస్తు ४

[ఛాందో ౮-ప్రపా, ౧౫-ఖం, ౨-వా. & కేన, శాంతిపాఠము.]

టీ. అహం= నేను, బ్రహ్మ=బ్రహ్మమును, మానిరాకుర్యాం = విడువకపోవుదునుగాక! మా = (ఉపాసకుఁడనైన) నన్ను, బ్రహ్మ=బ్రహ్మము, మానిరాకరోత్ = విడువకపోవును గాక! (మత్కర్తృకం = నాచేత, బ్రహ్మణః = బ్రహ్మమునకు), అనిరాకరణం = తిరస్కరింపకపోవుట, అస్తు = అగునుగాక

తా బ్రహ్మము నన్ను పరిత్యజింపకుండుఁగాక! నేను అతనిని త్యజింపకుందునుగాక! అతఁడు నాచే సర్వదా అపరిత్యక్తుఁ డగునుగాక!

వ్యా దయామయుఁడగు జగత్పిత యేవిషయమునందును మనలను మఱచియుండలేదు. ప్రతినిమిషమును మనము అతని కృపాజలమును అనుభవించుచున్నారము అంతియేగాక, మనము ఊపిరిని లోపలికి పీల్చి కొన్నపుడెల్ల అతని కరుణాసమీరణమునే మనము సేవించుచున్నాము. అతఁడు

మనల నేవిషయమునందును మఱవలేదు మఱి యెన్నఁడును ఏ విషయము నందును అతఁడు మనలను మఱవనొల్లఁడు అతఁడు మనఁను సర్వదా ప్రేమ దృష్టితో చూచుచున్నాఁడు. కావున మనము అతనిని మఱవకుందుముగాక! కృతజ్ఞులమై మనము సర్వదా అతని ప్రేమామృతమును గ్రోలుదుము గాక! దయాపూర్వకముగా అతఁ డొసంగు ఆజ్ఞలనెల్ల మనము సంతుష్టహృదయ ముతో పాలింప నుద్యుక్తుల మగుదుము గాక!

వి తనభక్తుల నెన్నఁడును త్యజించువాఁడు గాకపోవుటచే భగ వంతుని సర్వదా స్మరింపవలయు నని ఈవాక్యము నుడువుచున్నది

**మూ తం వేద్యం పురుషం వేద యథా మా**
**వో మృత్యుః పరివ్యథాః ౫**

[ప్రశ్న. ౬-ప్ర, ౬-వా.]

టీ మృత్యుః=మృత్యువు, వః=మిమ్ము, యథా=ఏప్రకారము, మాపరివ్యథాః=బాధపెట్టదో (తథా = ఆప్రకారము, యూయం= మీరు), వేద్యం=తెలిసికొనఁదగిన, తం=ఆ, పురుషం= పరిపూర్ణుఁడగు బ్రహ్మమును, వేద=తెలిసికొనుఁడు

తా మృత్యుబాధ మీకు కలుగకుండుటకై వేద్యుఁ డగు ఆ పురుషుని తెలిసికొనుఁడు

వ్యా. ఆ అమృతపురుషుని తెలిసికొనుఁడు సకలముకంటె, మీకం టెను గూడ అతనిని అధికముగా ప్రేమింపుఁడు. అట్లుచేసినచో మీకు మృత్యుబాధ తొలఁగిపోవును. ఎవ్వఁడు బ్రహ్మమును పొందెనో, ఎవ్వనికి బ్రహ్మముతో నిత్యసహవాసము లభించెనో అతఁడు ఈలోకమునందుండియు విషయప్రపంచము నతిక్రమించును. మృత్యుపాశమునుండి విముక్తిగాం చును. అతనికి శూన్యము పూర్ణముగా తోఁచును, విపత్తు శుభమున కాధా రమగును, మృత్యువు అమృతమునకు సోపాన మగును

మూ యో దేవోఽగ్నౌ యోఽప్సు యో విశ్వం
భువన మావివేశ,
య ఓషధీషు యో వనస్పతిషు
తస్మై దేవాయ నమో నమః ౬

[శ్వేతా. ౨-అ, ౧౭-వా.]

టీ. యః = ఏ, దేవః = దేవుఁడు, అగ్నౌ = అగ్నియందును, యః = ఎవ్వఁడు, అప్సు = జలమునందును, యః = ఎవ్వఁడు, ఓష ధీషు = తరుగుల్మలతాదులయందును, యః = ఎవ్వఁడు, వనస్ప తిషు = వృక్షములయందును, యః = ఎవ్వఁడు, విశ్వం భువనం = సమస్తలోకమునందును, ఆవివేశ = ప్రవేశించియున్నాఁడో, తస్మై దేవాయ = ఆ దేవునికొఱకు, నమో నమః = నమస్కారము, నమస్కారము

తా. ఏ దేవుఁడు అగ్నియందును, ఎవ్వఁడు జలమునందును, ఎవ్వఁడు విశ్వమునందును ప్రవిష్టుఁడై యున్నాఁడో, ఎవ్వఁడు ఓషధులయందును, వనస్పతులయందును ఉన్నాఁడో ఆ దేవునికి పదేపదే నమస్కరించుచున్నాము

వ్యా. ఎవ్వఁడు అగ్నిలోనుండి అగ్నిని నియమమునందుంచుచున్నాఁడో, ఎవ్వఁడు అపారసముద్రముయొక్క భీషణతరంగములలో విరాజమానుఁడై యున్నాఁడో, ఎవని కారుణ్యము హాయినిగూర్చు వేసవికాలపు వర్షధారలలోను, ప్రాణప్రదములగు ఓషధులలోను, వనస్పతులలోను దేదీప్యమానమై యున్నదో, ఎవ్వఁడు భూలోకమునందును, ద్యులోకమునందును, అంతరిక్షమునందును, సమస్తస్థానములందును స్వయంప్రకాశుఁడై వరగుచున్నాఁడో ఆ దేవునికి పదేపదే నమస్కరించుచున్నాము

వి. ఈవాక్యము అనేకోపనిషత్తులలోఁ గలదు శ్వేతాశ్వతరములోనే గాక తైత్తిరీయసంహిత ౫-వ అధ్యాయము, ౫-వ అనువాకములో ౯-వ వాక్యముగను, కఠకసంహిత ౪౦-వ అధ్యాయములో ౫-వ వాక్యముగను ఇది కలదు. ఇది తొలుత కృష్ణయజుర్వేదములోనిది ఈవేదము వైదికయుగమునకును ఉపనిషద్యుగమునకును మధ్యకాలమున నుద్భవించినది. ఏకేశ్వరసిద్ధాంత మంగీకరింపఁబడినను అప్పటికి భగవంతుఁడు అగ్నిజలములలోను, భూమ్యాకాశములలోను వ్యాపించియుండెడు బాహ్యదేవతగనే యుండెను. భగవంతుఁడు సర్వభూతాంతరాత్మ యనెడు ఉపనిషత్తుల ప్రధాన

సిద్ధాంత మింకను వెలువడలేదు గాయత్రీమంత్రము ధ్యానమునకు మిక్కిలి అనుకూలమైన దనుటకు సందియములేదు. అయినను ఈమంత్రము బ్రాహ్మ సమాజమునందు విశేషముగా వాడఁబడుచున్నది.



# పదునొకండవ అధ్యాయము



మూ అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం
తథారసం నిత్యమగన్ధవచ్చ యత్,
అనాద్యనన్తం మహతః పరం ధ్రువం
నిచాయ్య తం మృత్యుముఖాత్ ప్రముచ్యతే ౧

[కఠ. ౧-అ, ౩-వ, ౧౫-వా.]

టీ యత్=ఏది, అశబ్దం=శబ్దము లేనిదియు, అస్పర్శం=స్పర్శము లేనిదియు, అరూపం = రూపము లేనిదియు, అవ్యయం=క్షయము లేనిదియు, తథా=ఆలాగే, అరసం=రసవర్జితమయినదియు, అగన్ధవత్ చ=వాసన లేనిదియు, అనాది = ఆది లేనిదియు, అనన్తం=అంతము లేనిదియు, మహతః=గొప్పదానికంటె, పరం = శ్రేష్ఠమైనదియు, ధ్రువం = శాశ్వతమైనదియునైన, తం = దానిని (బ్రహ్మమును), నిచాయ్య=తెలిసికొని, మృత్యుముఖాత్ = మృత్యువువాతనుండి, ప్రముచ్యతే = (జీవుఁడు) విడువఁబడుచున్నాఁడు

తా. ఎవ్వనికి శబ్దము లేదో, స్పర్శ లేదో, రసము లేదో, గంధము లేదో, ఎవ్వఁడు క్షయము లేనివాఁడో, ఆద్యంతరహితుఁడో, ఎవఁడు అధికులయినవారికంటె అధికుఁడో, ఎవ్వఁడు నిత్యుఁడో, నిర్వికారుఁడో అతనిని తెలిసికొని జీవులు మృత్యుముఖమునుండి విముక్తు లగుచున్నారు

వ్యా సృష్టికతీతుఁడయి జ్ఞానమయుఁడగు పరమేశ్వరుఁ డొకప్పుడును చక్షుశ్శ్రోత్రాది ఇంద్రియములకు విషయుఁ డగువాఁడు కాఁడు. అతఁడు నిరాకారుఁడు, నిర్వికారుఁడు, నిత్యుఁడు, మహనీయుఁడు అతనిని తెలిసికొన్న యెడల జనులు మృత్యుముఖమునుండి తప్పించుకొన్నవారై అనంత కాలపర్యంతము బ్రహ్మధామమునందు ఉన్నతిని గాంచుచుందురు

వి ఈ అధ్యాయము బ్రహ్మము నెఱుంగుటలోఁ గల కష్టములను వివరించుచున్నది భగవంతుఁడు ఇంద్రియాతీతుఁడని యీ మొదటివాక్యము నుడువుచున్నది.

మూ ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా న ప్రకాశతే,
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః
[కఠ. ౧-అ, ౩-వ, ౧౨-వా]

టీ సర్వభూతేషు = సర్వభూతములయందును, గూఢః = మఱుఁగయియుండెడి, ఏషః ఆత్మా = ఈపరమాత్మ, న ప్రకా

శతే = కనుపడఁడు. సూక్ష్మదర్శిభిః = సూక్ష్మదృష్టిగలవారిచే, సూక్ష్మయా=సూక్ష్మవస్తువును కనిపెట్టుటయందు ఆసక్తమైన, అగ్ర్యయా=ఏకాగ్రతతోఁ గూడుకొన్న, బుద్ధ్యాతు= బుద్ధిచే తనే, దృశ్యతే = దర్శింపఁబడుచున్నాఁడు

తా ఈపరమాత్మ సర్వభూతములయందును గూఢరూపమున ప్రచ్ఛన్నుఁడై యున్నాఁడు అట్లగుటంజేసి అతఁడు కనుపింపఁడు సూక్ష్మదర్శులగు బ్రహ్మజ్ఞులు తదేకనిష్ఠగల సూక్ష్మబుద్ధిద్వారా అతనిని దర్శించెదరు

వ్యా పరమాత్మ సకలశక్తుల శక్తియందును, సకలప్రాణుల ప్రాణమునందును, సకల ఆత్మల ఆత్మయందును గూఢరూపమున ప్రవిష్టుఁడై యున్నాఁడు విషయమోహముగ్ధులగువారి కతఁడు గోచరుఁడు కాఁడు. సూక్ష్మదర్శులగు పండితులు తదేకనిష్ఠతో పరిశుభ్రమయిన బుద్ధిద్వారా జ్ఞానస్వరూపియగు అప్పరమేశ్వరుని జ్ఞానతేజస్సువలన చూడఁగల్గుదురు

మూ నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన,
యమేవైష వృణుతే తేన లభ్య
స్తస్యైష ఆత్మా వృణుతే తనూం స్వామ్ 3

[కఠ. ౧-అ, ౨-వ, ౨౨-వా.]

టీ అయం ఆత్మా=ఈపరమాత్మ, ప్రవచనేన = ఉత్తమ వచనములచేత, న లభ్యః=పొందఁబడఁడు న మేధయా=గ్రంథార్థధారణశక్తిచేతనుగాదు న బహునాశ్రుతేన = మిక్కిలి వినుటచేతను గాదు. యమేవ = ఏబ్రహ్మమునే, ఏషః = ఈ సాధకుఁడు, వృణుతే=ప్రార్థించుచున్నాఁడో, సః=ఆబ్రహ్మము, తేన=ఆసాధకునిచేత, లభ్యః=పొందఁబడువాఁడు ఏషః ఆత్మా =ఈపరమాత్మ, తస్య = ఆ ముముక్షువునకు, స్వాం తనూం = తనస్వరూపమును, వృణుతే = ప్రకాశముచేయుచున్నాఁడు

తా ఉత్తమవచనములనేకములుపరించుటవలనఁగాని, బహుగ్రంథధారణశక్తి వలనఁగాని, ఎక్కువగా వినుటవలనఁగాని ఈపరమాత్మను పొందుటకువీలుగాదు. ఏసాధకుఁడు ప్రార్థనచేయునో అతఁడు మాత్రమే పరమాత్మను పొందుచున్నాఁడు ఇట్టిసాధకునికి పరమాత్మ తనస్వరూపమును ప్రకటించుచున్నాఁడు

వ్యా అనురాగమును ప్రయత్నమును లేనిచో ప్రబలమైన మేధాశక్తి యున్నను, ఉపదేశవాక్యముల నెంతగా విన్నను అతనిని పొందుటకు వీలులేదు. పిపాసాపీడితుఁడగు పథికునివలె నెవ్వఁడు వ్యాకులచిత్తుఁడై యేకాంతమున నతనిని ప్రార్థించునో అతని సమ్ముఖముననే పరమాత్మ తన స్వరూపమును ప్రకటించును. అపుడు ఆ సాధకుఁడు సిద్ధమనోరథుఁడై పవిత్రుఁడును పరితృప్తుఁడు నగును.

వి బ్రహ్మము నెట్లు పొందనగునో సూచించెడు ప్రశస్తవాక్యములు పెక్కులు ఉపనిషత్తులలోఁ గలవు వానిలో నిది యొక్కటి. ఇది కఠోపనిషత్తులోనే గాక ముండకోపనిషత్తు ౩-వ ముండకము, ౨-వ ఖండము, ౨౨-వ వాక్యములోఁగూడఁ గలదు. విశేషార్థగర్భితమయిన యీ వాక్యము ఉపనిషద్వాఙ్మయములో అసదృశమైన దని చెప్పవచ్చును బ్రహ్మజ్ఞానమును బడయుటకుఁ గావలసిన భావాత్మక నియమములను తెలిపెడువాక్యము లింకను అనేకములు ఉపనిషత్తులలోఁగలవు. ముండకోపనిషత్తు ౩-వ ముండకము, ౨-వ ఖండములోని ౪-వ వాక్యమును, అదియే ముండకములో ౧-వ ఖండములోని ౫-వ వాక్యమును, కఠోపనిషత్తు ౧-వ అధ్యాయము ౨-వ వల్లిలోని ౨౩-వ వాక్యమును నిందులకు ఉదాహరణములుగా పేర్కొన నగును.

మూ॥ ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్ నిబోధత
క్షురస్య ధారా నిశితా దురత్యయా
దుర్గం పథ స్తత్ కవయో వదన్తి. ౪

[కఠ. ౧-అ, ౩-వ, ౧౪-వా.]

టీ॥ ఉత్తిష్ఠత=(లోకులారా) లెండు, జాగ్రత = అజ్ఞాన నిద్రనుండి మేలుకొనుఁడు వరాన్ = బ్రహ్మనిష్ఠులైన ఆచార్యులను, ప్రాప్య = పొంది, నిబోధత=బ్రహ్మమును తెలిసి కొనుఁడు క్షురస్య=క్షౌరకునియొక్క, నిశితా=తీక్ష్ణముగాఁ జేయఁబడిన, ధారా=పదును, (యథా=ఏప్రకారము) దురత్య

యా=పొందనలవిగానిదో,(తథా=ఆప్రకారము) కవయః=పండితులు, తత్=ఆ ప్రసిద్ధమైన. పథః=బ్రహ్మజ్ఞానలక్షణమైనమార్గమును, వదన్తి=చెప్పుచున్నారు.

తా సకలజీవులారా! లెండు అజ్ఞాన నిద్రనుండి మేలుకొనుఁడు. ఉత్కృష్ట ఆచార్యుల యొద్ద కరిగి జ్ఞానమును పొందుఁడు పదునుగల క్షురధారవలె ఈ మార్గము దుర్గమమయిన దని పండితులు చెప్పిరి

వ్యా సకల జీవులారా! లెండు. అజ్ఞాననిద్రనుండి మేల్కొనుఁడు ఇంకెంతకాలము నిద్రాభిభూతులైయుండెదరు? ఇంకెన్నాళ్లు పరమధనమును మఱచిపోయి యుండెదరు? కాలము జరిగిపోవుచున్నది. మృత్యువు సమీపించుచున్నది జడత్వమును, అలసత్వమును పరిత్యజింపుఁడు ఉత్తమ జ్ఞానసంపన్నుఁడగు ఆచార్యునియొద్దకు నరిగి సకల ఆశలకును ఆధారభూతుఁడగు ఆ పరమప్రేమాస్పదుని తెలిసికొనుఁడు సహస్రగ్రంథములు పఠించినను సాధ్యముగాని కార్యము ఉత్తమాచార్యునివాక్యమువలన నగును. ఈశ్వరుని మార్గము నవలంబించుచో బుద్ధిని చక్కపఱుపవలసియుండును ఇంద్రియగణమును వశముచేసికొనవలసి యుండును తితిక్ష నభ్యసింపవలసియుండును. సమస్త ధర్మప్రవృత్తులను ఉన్నతము చేయవలసియుండును. ఈశ్వరప్రీతిలో మనస్సును నిమగ్నము చేయవలసియుండును అందుచేతనే యీ మార్గము దుర్గమమార్గము. అయినను ఈశ్వరుని అనుగ్రహమువలనను సాధకుని అనురాగమువలనను దుర్గమమయిన యీ పథముగూడ సుగమము కాఁగలదు

వి ఈ వాక్యము బ్రహ్మజ్ఞానసంపాదనమునకు సాధనముల నెటిం గించుచున్నదని నుడువనగును. హిందువుల ధర్మసాధనావిధానములో గురువునకు ముఖ్యమైన స్థానము గలదు తృతీయాధ్యాయములోని మొదటి వాక్యములో గురువుయొక్క ఆవశ్యకతను గూర్చి చెప్పఁబడియెను ఆ భావమే యిపు డీవాక్యమునందును గలదు అజ్ఞాననిద్రనుండి మేల్కొని ఆధ్యాత్మికజీవనముపట్ల శ్రద్ధనుచూపుటయు, సద్గురువును సమీపించుటయు ధర్మసాధకుని కుండవలసిన రెండు ముఖ్యలక్షణములుగా నిది తెలుపుచున్నది మహర్షి వానికి ఈశ్వరానుగ్రహమును గూడ జేర్చెను.

**మూ తదేతద్ బ్రహ్మాపూర్వం ఏత దమృత మభయం శాన్త ఉపాసీత ౫**

[బృహ-ఛాందోగ్య]

టీ అపూర్వం=తనకుముందు ఒకటియు లేనిది, తత్= బ్రహ్మ (ఆ బ్రహ్మము), ఏతత్=ఇదియే అమృతం=మృత్యువు లేనిదియు, అభయం=భయము లేనిదియు నైన, ఏతత్=దీనిని (బ్రహ్మమును), శాన్తస్సన్=శాంతుఁడై, ఉపాసీత=ఉపాసింప వలయును

తా అతఁడే యీ బ్రహ్మము. ఇతనికి పూర్వ మిఁక నెవ్వరును లేరు ఇతఁడు అమృతుఁడు, భయరహితుఁడు, శాంతులై ఇతనిని ఉపాసింపవలయును.

వ్యా ఎవ్వఁడు ఈ విశ్వమునకు కారణస్వరూపుఁడో అతనికి పూర్వకారణ మిఁక నెద్దియు లేదు అతఁడు అనాద్యుఁడు, అనంతుఁడు, అమృతుఁడు, పరిపూర్ణుఁడు ఆ అభయుని శరణాపన్నులైనవారికి నెట్టి భయమును నుండ నేరదు శాంతచిత్తులై అతని నుపాసింపవలయును. శాంతి యీశ్వరప్రీతియొక్క నివాసభూమి నిర్మలమును, స్థిరమునగు తటాకము వలె మన స్సెప్పుడు శాంతమగునో అపుడు ఈశ్వరస్వరూప మందు ప్రతిఫలించును ప్రబలమయిన ధనేషణమువలనను, మానేషణమువలనను చిత్తము విక్షిప్తమై, ఇంద్రియలోలత్వమువలన మనస్సు మలినమయ్యేనేని పరమ పవిత్రమయిన బ్రహ్మానందము ననుభవించుటకు వీలుండదు కావుననే శాంతచిత్తులై అతని నుపాసింపవలయును.

వి బృహదారణ్యకము ౨-వ అధ్యాయము, ౫-వ బ్రాహ్మణము లోని ౧౯-వ వాక్యమునుండియు, ఛాందోగ్యము ౧-వ ప్రపాఠకము ౪-వ ఖండములోని ౪౫-వ వాక్యమునుండియు, ౮-వ ప్రపాఠకము ౩-వ ఖండములోని ౪-వ వాక్యమునుండియు, ౩-వ ప్రపాఠకము ౧౪-వ ఖండములోని ౧-వ వాక్యమునుండియు గైకొనఁబడిన భాగములతోఁ గూర్పఁబడిన యీ వాక్యము శాంతచిత్తముతో బ్రహ్మము నుపాసింపవలయు నని యుపదేశించుట కుద్దేశింపఁబడినదై యున్నది.



# పంద్రెండవ అధ్యాయము



మూ. వృక్షఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేకః
తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్ ౧

[శ్వేతా. 3-అ, ౯-వా.]

టీ ఏకః = అద్వితీయుఁడైన పరమాత్మ, వృక్షఇవ = వృక్షముపోలె, స్తబ్ధః = చలనములేక, దివి=స్వప్రకాశమైన తన మహిమయందు, తిష్ఠతి=ఉన్నాఁడు. తేన పురుషేణ= ఆ పూర్ణునిచే, ఇదం సర్వం=ఈ జగత్సర్వమును, పూర్ణం=పూరిత మయియున్నది

తా అద్వితీయుఁడగు పరమాత్మ వృక్షమువలె నిస్తబ్ధుఁడై స్వప్రకాశమహిమచే ప్రకాశించుచున్నాఁడు ఆ పూర్ణపురుషునితో ఈ సమస్త జగత్తు నిండియున్నది

వ్యా ఈ విశ్వచక్రము, విశ్వపతియొక్క ఆశ్రయమువలన నిరంతరము తిరుగుచున్నదై, క్రమక్రమముగ ఉన్నతినిఁ గాంచుచు అతని శుభాభిప్రాయముల నెల్ల నెరవేర్చుచున్నది. సాక్షిస్వరూపియు, నియంతయుం నై తా చలింపక నిలిచియున్నవాఁడయ్యు, తా నుద్దేశించిన శుభములు

నెరవేరు విషయమున అతఁడు నిస్పందదేహుఁడై యున్నాఁడు ప్రవాహవేగమున నదీతీరస్థములగు గ్రామములును,నగరములును భగ్నములై పోవుచున్నవి, నీటివెల్లువలవలన దేశములు,ప్రదేశములును మునిఁగి పోవుచున్నవి, ఝంఝామారుతమువలనను, భయంకరభూకంపమువలనను లక్షోపలక్షల జీవరాసులు మృత్యుముఖమున పడుచున్నవి అయినను సర్వజ్ఞుఁడును మంగళాలయుఁడు నగు పరమేశ్వరుఁడు అత్యంతదుఃఖజనకములగు ఈ వ్యాపారములనెల్ల ఉత్తరకాలమున విశ్వోన్నతికి సాధనభూతములుగా చేసికొన నెంచినవాఁడై యెట్టి వ్యాకులతను పొందక నిస్తబ్ధుఁడై యున్నాఁడు. రాళ్లవర్షము కురిసినట్లు భయంకరముగా వడగండ్లుపడుచు, మేఘగర్జలతో మాటిమాటికి పిడుగులు రాలుచు పృథ్వీమండలమునకు ప్రళయావస్థ తటస్థించునట్లు తోఁచుచున్నపుడేమి? అగ్నిపర్వతమునుండి భయానకములగు అగ్నిజ్వాలలు బయలుదేరి నలుపార్శ్వములనుగల పశుపక్షిమనుష్యసమన్వితములగు గ్రామములును, పట్టణములును దగ్ధములై పోవునపుడేమి? విప్లవములును, ఘోరసంగ్రామములును ఉత్పన్నములై మానవకంఠనిస్సృతశోణితప్రవాహముతో ధరాతలము నిండిపోవునపుడేమి? అతఁడు తా నుద్దేశించిన ప్రకారము చిట్టచివరకు మేలు చేకూరుననన్న విషయమున స్థిరనిశ్చయుఁడై సమానభావముతో శాంతముగా నుండును.

అతఁడు స్వకీయప్రకాశమహిమతో ప్రకాశించుచున్నాఁడు. తక్కిన సర్వమును అతనిని అవలంబనముగా జేసికొని నిలిచియున్నది. అతఁడు మఱిదేనిని అవలంబనముగా జేసికొనియుండలేదు అతఁడు స్వకీయమహిమవలననే నిలిచియున్నాఁడు. ఈ పూర్ణపురుషునితో సమస్తజగత్తును పూర్ణమైయున్నది

వి ఈ పంద్రెండవఅధ్యాయము పరమాత్మయొక్క నిశ్చల గాంభీర్యమును వెల్లడించుచున్నది ఇందలి మొదటివాక్యము భగవంతుని నిశ్చలత్వమును నిరూపించుచున్నది బాహ్యప్రపంచమునందును మానవ సంఘమునందును కలిగెడు కల్లోలములు పరికించువాఁడయ్యు వానిచే నతఁడు చలింపక స్థిరముగా నున్నాఁడు.

మూ యథాసౌమ్య వయాంసి వాసోవృక్షం సంప్రతిష్ఠన్తే,
ఏవంహవై తత్ సర్వం పర ఆత్మని సంప్రతిష్ఠతే ౭
[ప్రశ్న. ౪-ప్ర, ౭-వా.]

టీ సౌమ్య=ప్రియదర్శనుఁడా' యథా=ఏవిధముగా, వయాంసి=పక్షులు, వాసోవృక్షం=వాసార్థము వృక్షమునందు, సంప్రతిష్ఠన్తే = ఉన్నవో, ఏవంహవై = ఈప్రకారముగానే, తత్సర్వం = స్థావరజంగమాత్మకమైన జగత్తంతయును, పరే ఆత్మని=అక్షరస్వరూపుఁడైన పరమాత్మయందు, సంప్రతిష్ఠతే= ఉనికిని పొందియున్నది

తా ప్రేమాస్పదుఁడా! సమస్తపక్షులును తమవాస స్థానములగు వృక్షములందు వసించునట్లు సర్వమును పరమాత్మయందు ఉన్నది.

వ్యా. సకల వస్తువులును సర్వవ్యాపియగు సర్వాశ్రయుని ఆశ్రయముగా చేసికొని యున్నవి. జడ జగత్తుతోఁగల సంబంధముకంటె ఉన్నత

తరమయిన సంబంధము నతఁడు మనతో గల్గియున్నాఁడు. పుత్రుఁ డెవ్విధమున తండ్రికి ఆశ్రితుఁడో అవ్విధమున నే మనమును అతనికి ఆశ్రితులము.

మూ ఏకోదేవః సర్వభూతేషు గూఢః
సర్వవ్యాపీ సర్వ భూతాన్తరాత్మా,
కర్మాధ్యక్షః సర్వ భూతాధివాసః
సాక్షీచేతా కేవలో నిర్గుణశ్చ. 3

టీ దేవః=దేవుఁడు, ఏకః=ఒక్కఁడు, సర్వభూతేషు=సమస్తజీవులయందును, గూఢః = మఱుగయియుండెడివాఁడు, సర్వవ్యాపీ=అంతట వ్యాపించి యుండువాఁడు, సర్వభూతాంతరాత్మా=సమస్తభూతములకు అంతరాత్మ, కర్మాధ్యక్షః=సమస్త ప్రాణులచేత చేయఁబడిన కృత్యముల కధికారి సర్వభూతాధివాసః=సమస్తభూతములకు ఆశ్రయుఁడు సాక్షీ=సమస్తమునకును సాక్షీభూతుఁడు, చేతా = జీవరూపమయినవాఁడు, కేవలః=ఒకదానిని అంటనివాఁడు, నిర్గుణః=సత్వరజస్తమోగుణములు లేనివాఁడు

తా ఒక్కఁడై పరమేశ్వరుఁడు సర్వభూతములందును గూఢరూపమున నున్నాఁడు అతఁడు సర్వవ్యాపి: సర్వ

భూతాంతరాత్మ అతఁడు సకలకార్యములకును అధ్యక్షుఁడు అతఁడు సర్వభూతములకును ఆశ్రయుఁడు అతఁడు జ్ఞాన స్వరూపి, సర్వసాక్షి, సంగరహితుఁడు సృష్టింపఁబడిన పదార్థములకు నే యే గుణములుగలవో తద్గుణము లెవ్వియు అతనిలో లేవు

వ్యా ఎవ్వఁడు ఈ భూలోకమున కీశ్వరుఁడో అతఁడు గ్రహ చంద్రనక్షత్రాది సకలలోకములకును ఈశ్వరుఁడు ఎవఁడు మనల సృజించినవాఁడును, మన ప్రభువు నై యున్నాఁడో అతఁడు సమస్త జగత్తునకును కర్తయు,సర్వమునకు ప్రభువునై యున్నాఁడు ఆ ఏకేశ్వరుఁడు సర్వభూతములందును గూఢరూపమున ప్రచ్ఛన్నభావముననుండి మితిలేని చరాచరములనెల్ల శాసించుచున్నాఁడు. అతఁడు సర్వవ్యాపి, సర్వమునకు అంతరాత్మ. మన జీవాత్మలలో నొక్కొక్క దానియందును అతఁడు పూర్ణరూపముననున్నాఁడు. అతఁడు సమస్తమునకును సాక్షి, కర్మాధ్యక్షుఁడు సకలస్థానములందును ఉన్నవాఁడై అతఁడు సకలమును చూచుచున్నాఁడు. అతఁడు కేవలము సాక్షీభూతుఁడై యేమియుం పట్టించుకొనక చూచుచున్నవాఁడుగాఁడు. అతఁడు కర్మాధ్యక్షుఁడై యథోపయుక్తశిక్షాబహుమానములు విధించుచు, మనము ఉత్తరోత్తరఉన్నతిని పొందునట్లు చేయుచున్నాఁడు. అతఁడు సర్వవ్యాపియు, సకలమునకు ప్రభువైయుండియు ఒక్క విషయమునందును నతఁడు తగులము కలవాఁడు కాఁడు సృష్టపదార్థములగు మనశ్శరీరములకుగల గుణము లెవ్వియు నతనికి లేవు. అతఁడు శుద్ధ జ్ఞానస్వరూపి.

వి సృష్టికిని భగవంతునికిని, ముఖ్యముగా మానవులకును భగ వంతునికిని గల సంబంధమును గూర్చి ఈ వాక్యము చెప్పుచున్నది శ్వేతా శ్వతరోపనిషత్తులో ఈ వాక్యమునకు పూర్వవాక్యమునందు సాలీడు తన దేహములోనుండియే తనగూడును నిర్మించినట్లు ఈ విశ్వముగూడ సృష్టింపఁ బడిన దని తెలుపఁబడెను.

శ్లో. యస్తూర్ణనాభ ఇవ తన్తుభిః ప్రధానజైః,
స్వభావతో దేవః ఏకః స్వమావృణోత్

జ్వలించెడు అగ్నినుండి విస్ఫులింగములు వెలువడినట్లు సాలీడు గూడు నిర్మించినట్లు పరబ్రహ్మమునుండి విశ్వము ఉత్పన్నమయిన దని ఉపనిషత్తులు చెప్పుచున్నవి

మూ సర్వాదిశ ఊర్ధ్వమధశ్చతిర్యక్
ప్రకాశయన్ భ్రాజతే యద్వనడ్వాన్,
ఏవం సదేవో భగవాన్ వరేణ్యో
యోనిః స్వభావానధితిష్ఠత్యేకః ४

[శ్వేతా ౫-అ, ४-వా.]

టీ ఊర్ధ్వం=మీఁదుగను, అధశ్చ=క్రిందుగను,తిర్యక్ = ప్రక్కలను, సర్వాదిశః = సమస్త దిక్కులును, ప్రకాశ యన్=ప్రకాశింపఁజేయుచు, అనడ్వాన్=సూర్యుఁడు, యత్= ఎట్లు, భ్రాజతే=వెలుఁగుచున్నాఁడో. ఏవం=ఈ తీరున, దేవః=

ద్యోతనస్వభావముగలవాఁడును, భగవాన్=ఐశ్వర్య సమన్వితుఁడును, వరేణ్యః=పూజనీయుఁడును, యోనిః=(జగత్తునకు) కారణుఁడును, ఏకః=అద్వితీయుఁడు నైన, సః=ఆ పరమాత్మ, స్వభావాన్ = స్వాభావికగుణములను, అధితిష్ఠతి=నియమించుచున్నాఁడు

తా సూర్యుఁ డెవ్విధమున ఊర్ధ్వ అధఃపార్శ్వాదిగ్భాగముల నెల్ల ప్రకాశింపఁజేయుచు, తా ప్రకాశించుచున్నాఁడో అవ్విధముననే అద్వితీయుఁడును, ఐశ్వర్యసంపన్నుఁడును, విశ్వప్రకాశకుఁడును, జగత్కారణుఁడును, పూజనీయుఁడునగు పరమేశ్వరుఁడును ప్రకాశించుచున్నాఁడు ఏకాకియగు అతఁడు సర్వభూతములకును వానివాని స్వభావములనెల్ల నియమించుచున్నాఁడు

వ్యా సూర్యుఁ డెట్లు సర్వమును ప్రకాశింపఁజేయుచు తా ప్రకాశించునో తద్రూపముననే అద్వితీయుఁడగు పరమేశ్వరుఁడును తన యీ సృష్టిలోపల ప్రకాశించుచున్నాఁడు అతనిని ప్రకాశింపఁజేయువాఁడు మఱెవ్వఁడును లేఁడు. అతనికి మఱెవ్వఁడును సృష్టికర్తయును లేఁడు. అతఁడు స్వయంభువు. అతఁడు స్వప్రకాశుఁడు. అతఁడు వాయువునందు శబ్దమును, అగ్నియందు ఉష్ణమును, జలమునందు శైత్యమును, పిడుగునందు బలమును, పాదములందు వేగమును, వృష్టియందు వాతత్వమును, నక్షత్రము

లందు జ్యోతిని, సకలభూతములందు వాని వాని సమస్త స్వభావములను ఏర్పాటుచేయుచున్నాఁడు.

మూ నైనమూర్ధ్వం నతిర్యఞ్చం నమధ్యేపరిజగ్రభత్,
నతస్య ప్రతిమా అస్తియస్యనామమహద్ యశః ॥
[శ్వేతా. ౪-అ, ౧౯-వా.]

టీ ఏనం=దీనిని (బ్రహ్మమును), ఊర్ధ్వం = ఊర్ధ్వదిశయం దుండెడివాఁ డొకఁడును, నపరిజగ్రభత్=ఎఱుఁగ లేదు నతిర్యఞ్చం = పార్శ్వమునందుండెడియెవఁడును ఎఱుఁగ లేదు నమధ్యే=మధ్యభాగమునందుండెడి యెవఁడును ఎఱుఁగ లేదు యస్య=ఎవనియొక్క (ఏ బ్రహ్మముయొక్క), నామ=పేరు, మహద్యశః=గొప్పకీర్తియో, తస్య=ఆ బ్రహ్మమునకు, ప్రతిమా=ఉపమానము, నాస్తి=లేదు

తా ఊర్ధ్వదేశమునం దేమి? పార్శ్వదేశములం దేమి? మధ్య దేశమునం దేమి? యెచ్చోటను ఎవ్వరును ఇతనిని తెలిసికొనఁజాలరు అతని కెవ్వరును సమానులు లేరు అతని నామము మహత్ యశః

వ్యా అత్యున్నత మానసికవృత్తి సమన్విత శ్రేష్ఠజీవులు సయితము నిస్సీమ జ్ఞానసముద్రుఁడును, అమృతమయుఁడును, మంగళమయుఁడు నగు

ఆ పరబ్రహ్మముయొక్క గాంభీర్య పరిమాణమును నిర్ణయింపఁజాలరు. అతనికి సమానులు లేరు, అతనితో పోల్పఁదగినవారును లేరు. అతనివంటి వస్తు వింకొకటి లేదు సూర్యుఁడు అతని జ్యోతియొక్క ఆభాసమును గూడ ప్రకాశింపఁజేయనేరఁడు. పిడుగు అతని బలములో నొక్కయంశమును గూడ ప్రకాశింపఁజేయనేరదు. మాతాపితలయొక్క అకృత్రిమ వాత్సల్యమేమి? ఆత్మబంధువుల స్వార్థరహితమైన ప్రేమ యేమి? పతివ్రతయగు సతియొక్క పవిత్రప్రేమ యేమి? అతని ప్రేమయొక్క ఛాయామాత్రములే అతనికి శరీరము లేదు. అతఁడు శరీరనిర్మాత అతనికి మనస్సు లేదు. అతఁడు మనస్సుయొక్క స్రష్ట అతని యశస్సు ఆకాశమువలె సర్వత్ర నిండియున్నది. అతని మహిమ ద్యులోక భూలోకములందలి ప్రత్యంశమునందును దేదీప్యమానమై యున్నది అందుచేతనే అతని నామము మహత్ యశః

మూ॥ నసన్దృశే తిష్ఠతి రూప మస్య
నచక్షుషాపశ్యతి కశ్చనైనమ్,
హృదామనీషా మనసాభిక్లప్తో
య ఏన మేవం విదురమృతాస్తేభవంతి. ౬

[కఠ ౩-అ, ౬-వ, ౯-వా.]

టీ॥ అస్య=ఈ యీశ్వరునియొక్క, రూపం = స్వరూపము, సన్దృశే=దర్శనవిషయమై, నతిష్ఠతి=ఉండలేదు ఏనం=ఇతనిని, కశ్చన=ఒక్కఁడును, చక్షుషా=నేత్రముచేత,నపశ్యతి=

చూడలేదు హృదా=హృద్గతమైన, మనీషా=సందేహములేని (నిశ్చయ) బుద్ధిచేతనే, మనసా=మననరూపముచేతను, అభిక్లృప్తః=అంతటను ప్రకాశించుచున్నవాఁడు, (భవతి = అగుచున్నాఁడు) యే=ఎవరు, ఏనం=ఇతనిని (బ్రహ్మమును), ఏవం=ఈ విధముగా, విదుః=ఎఱిఁగినవారలో, తే=వారు, అమృతాః=మరణము లేనివారలు, భవన్తి=అగుచున్నారు

తా. ఇతని స్వరూపము నేత్రగోచరమగునదిగాదు. అట్లగుటంజేసి సంశయరహితమైన బుద్ధిద్వారమున జూచినచో నితని స్వరూపము ప్రకాశితమగును ఎవ్వరీతనిని ఈ ప్రకారముగా తెలిసికొనియెదరో వారు అమరు లయ్యెదరు

వ్యా పరమేశ్వరుఁడు చక్షువులకు గోచరమగువాఁడుగాడు అతఁడు కేవలము జ్ఞాననేత్రమునకే గోచరుఁడు ఎవ్వరు అతనిని ప్రేమించుటలో ఏకాగ్రచిత్తులై యుక్తిమూలమున తమ బుద్ధిని చక్కఁబఱుచుకొని సంశయవర్జితు లయ్యెదరో అట్టివారు జ్ఞానగోచరుఁడగు ఆ సత్యసుందర మంగళపురుషుని ప్రత్యక్షముగా కన్గొని, అతనిని పొంది అమృతు లయ్యెదరు. అతని నిత్యసహవాసమువలన కలిగెడు బ్రహ్మానందము ననుభవించెదరు.

వి ఈ సుందరమయిన వాక్యము బాహ్యనేత్రములతో భగవంతుని చూచుటకు వీలుగాదనియు, బుద్ధిద్వారముననే అతనిని చూడనగుననియు ఖండితముగా తెలుపుచున్నది. మొదటి రెండుపంక్తులును ఒకటే భావమును

చెప్పుచున్నది. ఇంత ఖండితముగా చెప్పుటను బట్టిచూడ అక్కాలములో కనుల కగపడునట్టి యేదో యొకమూర్తి కల్పన జరుగుచుండెనని కాని, అట్టిది కావలయున్న కోరికయైన కొందరకుండి యుండు నని కాని స్ఫురింపఁజేయుచున్నది కాని, ఉపనిషత్కాలములో నెట్టివిగ్రహముల నుపయోగించినట్లు కానము ఎట్టులయినను ఈశ్వరుఁడు దృష్టిగోచరుఁడగు వాఁడు కాఁడని స్పష్టముగా చెప్పిన సంగతిమాత్రము గమనింపఁదగినది ఈవాక్యము కఠోపనిషత్తులో నేగాక కొంచెముమార్పుతో శ్వేతాశ్వతరోపనిషత్తు ౪-వ అ ౨౦-వ వాక్యములోను గలదు రెండవ సగభాగము శ్వేతాశ్వతరము ౪-వ అ ౧౭-వ వాక్యములోను గలదు

మూ. శ్రవణాయాపి బహుభి ర్యోనలభ్యః
శృణ్వన్తోఽపి బహవో యం న విద్యుః,
ఆశ్చర్యో వక్తా కుశలోఽస్యలబ్ధా
ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః ౭

[కఠ. ౧-అ, ౨-వ, ౭-వా.]

టీ. యః = ఏ పరమాత్మ, బహుభిః = అనేకులచేత, శ్రవణాయాపి=వినుటకు సయితము, నలభ్యః=లభింపనివాఁడో, బహవః=అనేకులు, యత్=ఏ పరమాత్మను, శృణ్వన్తోపి=వినిన వారయినను, నవిద్యుః=తెలిసికొన లేకపోయిరో, అస్య=ఈ పరమాత్మను గురించి, వక్తా=చెప్పఁగలవాఁడు, ఆశ్చర్యః= అరుదు. (అస్య = ఈ పరమాత్మను) లబ్ధా=పొందినవాఁడు, కుశలః=సమర్థుఁడు కుశల=నిపుణుఁడైన ఆచార్యునిచేత, అను

శిష్టః=శిక్షింపఁబడినవాఁడై, (అస్య=ఈ పరమాత్మను) జ్ఞాతా= తెలిసికొనువాఁడు, ఆశ్చర్యః = అరుదు.

తా వినెడు నుపాయములేక యే పరబ్రహ్మమును అనేకులు పొందఁజాలకున్నారో, వినియు నెవ్వానిని అనేకులు తెలిసికొనఁజాలకున్నారో, అట్టి పరబ్రహ్మమును గూర్చి జ్ఞానోప దేశము చేయఁగల వక్త అతిదుర్లభుఁడు. ఎవ్వఁడు అత్యంత నిపుణుఁడో అతఁడే అతనిని పొందఁగలఁడు చక్కఁగా శిక్ష పొందినట్టి జ్ఞాతలు గూడ దుర్లభులే

వ్యా. పరమేశ్వరుని యథార్థస్వరూపమును గూర్చియు, తత్త్వ మును గూర్చియు వినుట కవకాశము చిక్కకపోవుటచే అనేకులు అతనిని తెలిసికొన జాలకున్నారు అతనిని గూర్చి వినియు, ఉత్కృష్టమయిన బుద్ధియు, సముచితమయిన శ్రద్ధయు లేక పోవుటచే మఱి అనేకులు అతనిని నెఱుంగఁజాలకున్నారు. బుద్ధి వృత్తి చక్కపడనిది, పరమేశ్వరుని స్వరూప మును అభిప్రాయమును సరిగా బోధపరుచుకొనుటకు వీలులేదు. ఇందుచే పర మాత్మతత్త్వ నిపుణులగు జ్ఞానులు సర్వజాతులందును, సర్వదేశములందును అత్యల్పముగా నున్నారు సద్బుద్ధి శాలురు శ్రద్ధావంతులు నగు వారు తప్ప తదితరులు అతనిని తెలిసికొననేరరు విశుద్ధచిత్తుఁడగు పరమబ్రహ్మజ్ఞాని తప్ప అన్యుఁ డెవ్వఁడును అతనిని గూర్చి ఉపదేశింప సమర్థుఁడుగాఁడు అట్టి ఉపదేశకుఁడును లేఁడు, ఉన్నను అతఁడు లభించుటయు సుకరముగాదు. అందుచే పరమాత్మ జ్ఞానము మిక్కిలి శ్రమపడి పొందఁదగినది. అతనిని

పొందుటకై మనస్సునకు దృఢాభిప్రాయమును అందు నిమిత్తమై ప్రదేశ యత్నమును లేనిచో అతనిని తెలిసికొనుటకు గాని అతనితో సమాధియోగము సాధించుటకుగాని వీలులేదు

మూ॥ పరాచః కామా ననుయన్తి బాలా
స్తేమృత్యోర్యన్తి వితతస్యపాశమ్,
అథ ధీరా అమృతత్వం విదిత్వా
ధ్రువ మధ్రువేష్విహనప్రార్థయన్తే  ౮
[బృహ-ఐతరేయ-శ్వేతా]

టీ॥ బాలాః=బాల్యబుద్ధిగలవారలు, పరాచఃకామాన్= బాహ్యవిషయములను, అనుయంతి = పొందుచున్నారు తే= వారు (తేన = ఆకారణముచేత), వితతస్య = వ్యాపకుఁడైన, మృత్యోః = మృత్యువుయొక్క, పాశం=పాశమును, యన్తి= పొందుచున్నారు అధ=మరియు, ధీరాః = వివేకులు, అమృతత్వం = అమృతత్వమును, ధ్రువం=శాశ్వతమైన దానినిగా, విదిత్వా=తెలిసికొని, ఇహ=ఈ ప్రపంచమునందు, అధ్రువేషు= అనిత్యపదార్థములయందు (కిఞ్చిదపి = కొంచెమును), నప్రార్థయన్తే=కోరరు

తా॥ అల్పబుద్ధులగువారు సకల బహిర్విషయములందును ఆసక్తిగలవారై విస్తీర్ణమగు మృత్యుపాశమున బద్ధు

లగుచున్నారు. వివేకవంతులు నిత్యమగు అమృతత్వము నెఱింగినవారయి సంసారమునందలి అనిత్యపదార్థములలో నొక్కదానిని కోరరు.

వ్యా ఎవ్వరు బాహ్యవిషయములనే చూతురో, ఎవ్వరు తమ ఆత్మనుగాని, ఆత్మయొక్క అంతరాత్మనుగాని చూడఁజాలరో అట్టివారు బాహ్యవిషయములయందు ఆసక్తిఁగలవారై తమప్రవృత్తులకు దాసులై విస్తీర్ణమగు మృత్యుపాశమున బద్ధులగుదురు జడజగత్తును, పశుప్రకృతియు విస్తీర్ణమగు మృత్యురూపములు. కార్యకారణ శృంఖలయుక్తమయిన ప్రాకృతికనియమమే మృత్యుపాశము జడజగత్తును పశుప్రకృతియు కార్యకారణ శృంఖలయుక్త ప్రాకృతిక నియమరూపమయిన మృత్యుపాశమున కట్టఁబడియున్నవి ఉత్కృష్టమయిన మానవజన్మమును పొందియు, ప్రాపంచిక విషయవాంఛలచే నభిభూతులై స్వేచ్ఛాచారులగు బాలకులవలె నెవ్వరు ప్రవర్తించెదరో అట్టివారు మృత్యుపాశబద్ధులై స్వాధీనతను గోల్పోయి పరమపదమునకును, చరమగతికిని మిక్కిలి దూరమగుదురు. వివేకమహితులగు మనుజులు అమృతస్వరూపునితో ఆత్మకుఁ గల నిత్యసంబంధము నెఱింగినవారై ప్రపంచములో నెద్దానిని కోరరు ధర్మనియమానుసారముగా తమప్రవృత్తులపై నిగ్రహమును స్థాపించుకొని జగత్పితయొక్క మంగళాభిప్రాయమును తాము నెరవేర్పగల్గినపుడే వారు సంతృప్తిని పొందుదురు.

వి బ్రహ్మజ్ఞాన శ్రేష్ఠత్వమును గూర్చి పూర్వవాక్యము ప్రస్తావించియుండెను. ఈ అధ్యాయములోని కడపటి రెండువాక్యములును ఐహిక

కార్యముల నిష్ఫలత్వమును గూర్చి చెప్పుచున్నవి. ఇవి ఐహిక సౌఖ్యములను మృత్యుపాశముతో పోల్చి నిరసించుచున్నవి. బుద్ధిహీనులే వానిని వాంఛించు చుందురు బుద్ధిమంతులు వానిని మృత్యుముఖద్వారములుగా నెంచి త్యజింతురు హిందువుల తత్త్వాలోచనములో ఐహికభోగ నిరసనమున కిదియే ప్రారంభము

మూ యేనాహం నామృతా స్యాం కిమహం తేన
కుర్యాం అసతో మా సద్గమయ తమసో మా
జ్యోతిర్గమయ మృత్యో ర్మాఽమృతంగమయ
ఆవిరావీర్మ ఏధి రుద్ర యత్తే దక్షిణం ముఖం
తేన మాం పాహి నిత్యమ్ ౯

టీ యేన=దేనిచేత, అహం = నేను, న అమృతాస్యాం = నిత్యపదవిగలదానను కానో, తేన = దానిచేత, అహం= నేను, కిం=ఏమి, కుర్యాం=చేయుదును? మా=నన్ను, తమసః= అంధకారమునుండి, జ్యోతిర్గమయ=వెలుఁగును పొందింపుము మృత్యోః=మృత్యువునుండి, మా = నన్ను, అమృతం = నిత్యపదవిని, గమయ=పొందింపుము హేఆవిః = స్వప్రకాశచైతన్యుఁడవగు ఓపరమాత్మా! మే=నాకు, ఆవీః=నీప్రకాశస్వరూపమును, ఏధి=ప్రకటింపుము హేరుద్ర = ఓపరమేశ్వరుఁడా!, తే=నీయొక్క, యత్=ఏ, దక్షిణంముఖం=ఉత్సాహజనకమైన

ముఖమో, తేన=దానిచేత, మాం=(అశనాపిపాసాశోకమోహములతోనున్న) నన్ను, నిత్యం=సర్వదా, పాహి=రక్షింపుము

తా॥ దేనివలన నేను అమృతత్వమును పొందనో దానిని నేనేమి చేయుదును? అసత్తునుండి నన్ను సత్స్వరూపమునకు తీసికొనిపొమ్ము అంధకారమునుండి నన్ను జ్యోతిస్వరూపమునకు తీసికొనిపొమ్ము ఓ స్వప్రకాశుఁడా! నాయెదుట ప్రకాశింపుము రుద్రా! నీప్రసన్నముఖముతో నన్ను సర్వదా రక్షింపుము

వ్యా॥ దేని మూలమున నేను అమృతపురుషుని సహవాసమును బడసి అమరత్వమును పొందఁజాలనో అట్టి దానినిఁ గైకొని నే నేమి చేయుదును? విషయవిభవము, సమ్మానము, యశస్సు ఆమోదప్రమోదములు—ఇవి యెల్లను అస్థిరములు. ఇవి యొకవేళ స్థిరములైనను ప్రియతముఁడగు ఈశ్వరుని పొందఁజాలకపోయిన తరువాత వీనిని నే నేమి చేయఁదును? కావున నో పరమేశ్వరా! ఎవ్విధమున నేను నిన్ను పొందఁగలుగుదునో అవ్విధమున నన్ను చక్కఁపఱుపుము అసత్సంసారమునుండి తప్పించి నీ సత్పథమున నన్ను ప్రవేశపెట్టుము. అజ్ఞానాంధకారము పోఁగొట్టి నా ఆత్మయందు నీ జ్ఞానజ్యోతిని ప్రకాశింపఁజేయుము అమృతస్వరూపుఁడవయిన నీకడకు నన్ను తీసికొనిపొమ్ము. విపత్తులోఁబడి త్వదీయరుద్రముఖమును చూచెడు స్థితి నాకు కలుగకుండునట్లు ఓ స్వప్రకాశుఁడా! నీవు సర్వదా నా చెంత ప్రకాశించు చుండుము. ఏలయన నీ ప్రసన్నముఖమును నేను చూడఁజాల

నప్పుడు నల్దిక్కుల నాకు అంధకారమే కనుపించును. నీవు అంధకారములో నాకు ప్రదీపము. దాహార్తిలో నాకు జలము. నీవు నాకు విశ్రామస్థలము.

౨. నాల్గు వైపులనుండి నాల్గు ముక్కలను దీసి వాని నొక్కచోఁ జేర్చి మహర్షి దేవేంద్రనాథఠాకూరుగారు ఈ సుందర వాక్యమును సిద్ధము చేసిరి దీనిని బట్టి ఉపనిషత్తులలోని ఉత్తమ వాక్యములఁ గొన్నింటి నొకచో కూర్చుటయే మహర్షి ఉద్దేశము కా దనియు, ఉపనిషద్భాషలో తన అభిప్రాయముల వెల్లడించుటయే వారి తలంపనియు మనకు తెలియఁగలదు. ఉపనిషత్తులలోని సద్వాక్యముల నెల్ల నొక్క సంపుటములో చేర్చుటయే వారి ఉద్దేశమయిన పక్షమున నే యే సందర్భములందో చెప్పినవాని నిట్లు ఒక్కచో సమకూర్చియుండరు ఇందువలన మహర్షి ఉపనిషత్తులకుఁగూడ మహత్తరసేవ గావించియుండెను. "యేనాహం నామృతా స్యాం కిమహం తేన కుర్యామ్" అను ఈ వాక్యములోని ప్రథమభాగము బృహదారణ్యకము రెండవఅధ్యాయము నాల్గవబ్రాహ్మణము మూఁడవవాక్యమునందు గలదు ఇది యాజ్ఞవల్క్యునికిని మైత్రేయికినిఁ జరిగిన సంభాషణములోనిది. తాను వానప్రస్థాశ్రమమును స్వీకరింపఁబోవునపుడు యాజ్ఞవల్క్యుఁడు తన యాస్తిలో కొంతభాగమును మైత్రేయి కిచ్చెద నని చెప్పెను అపుడు "నేను దీని మూలమున అమృతత్వమును పొందఁగలనా?" అని మైత్రేయి భర్తను అడిగెను. పొందఁజాల వని యాజ్ఞవల్క్యుఁడు చెప్పఁగా మైత్రేయి "నా కమృతత్వము నొసంగఁజాలని దీనిని నే నేమి చేయుదు" నని ధర్మాసక్తి ప్రపూర్ణహృదయముతో ప్రశ్నించెను ఐహికభోగముల నిష్ఫలత్వమును వెనుకటి వాక్యమువలె నిది గూడ వ్యక్తీకరించుచున్నది. ఈ వాక్యములో రెండవభాగ మగు "అసతో మా సద్గమయ తమసో మా జ్యోతిర్గమయ

మృత్యో ర్మామృతంగమయ" అనునది గూడ బృహదారణ్యకము ప్రథమాధ్యాయము, మూఁడవ బ్రాహ్మణము, ఏడవ వాక్యమునుండి గైకొనఁబడినది. భావగాంభీర్యముగల ఈ మంత్రమును మహర్షి వెలికిదీసి బ్రాహ్మసమాజోపాసనలో చేర్చెను క్రైస్తవుల నిత్య ప్రార్థనతో నిది సాటి రాఁగలదు. ఇంగ్లాండునకు తా వెళ్లినప్పుడు పండిత శివనాథశాస్త్రిగారు తమ ఉపాసనాంతమున ఈ ప్రార్థనను చేయఁగా ఉపాసకు లెల్లరును ఈ ప్రార్థనను మిక్కిలి మెచ్చుకొనిరి. "ఆవిరా వీర్మ ఏధి" అను తరువాతి భాగము ఐతరేయోపనిషత్తులోని శాంతి పారమునుండి గ్రహింపఁబడినది. ఇది గూడ బ్రాహ్మసమాజప్రార్థనలో నిముడ్చఁబడెను "రుద్ర! యత్తే దక్షిణం ముఖం తేన మాం పాహి నిత్యమ్" అను కడపటిభాగము శ్వేతాశ్వతరోపనిషత్తు నాల్గవ అధ్యాయము ఇరువది యొకటవ వాక్యములోనిదై యున్నది. ఇందు రుద్రుని గూర్చిన స్తోత్రముఁ గలదు మహర్షి తా సిద్ధముచేసిన ప్రార్థనలో నిందలి చిట్టచివరి భాగమును మాత్రము చేర్చియున్నాఁడు. పాపాత్మునికి భగవంతుఁడు రుద్రస్వరూపిగాఁ గనుపించును. కరుణాళుఁ డగు భగవంతుఁడు తన్ను ప్రసన్నముఖముతో రక్షింపవలయునని భక్తుఁడు వేఁడికొనును.



# పదమూఁడవ అధ్యాయము



మూ॥ సత్యమేవ జయతే నానృతం
సత్యేనలభ్య స్తపసా హ్యేష ఆత్మా సమ్యక్ జ్ఞానేన,
యేనాక్రమ న్త్యృషయో హ్యాప్తకామా యత్ర
తత్ సత్యస్య పరమం నిధానమ్. ౧

[ముండక 3-ముం, ౫,౬-వా.]

టీ॥ సత్యమేవ = సత్యమే, జయతే = జయించుచున్నది. అనృతం = అసత్యము, న=జయింపదు సత్యేన = మృషావచన త్యాగముచేతను, తపసా = మనస్సుయొక్క ఏకాగ్రతచేతను, సమ్యక్ జ్ఞానేన = యథానుభూతబ్రహ్మదర్శనముచేతను, ఏషః=ఈ, ఆత్మా = బ్రహ్మాత్మ, లభ్యోహి = పొందఁదగినది కదా! ఆప్తకామాః = విగతతృష్ణులయిన, ఋషయోహి = బ్రహ్మదర్శులగు ఋషులును, యేన = సత్యైకాగ్రజ్ఞానము లనెడి యేసాధనములచేత, యత్ర=ఏబ్రహ్మమును, ఆక్రమన్తి= పొందుచున్నారో, తత్ = ఆ బ్రహ్మము, సత్యస్య = సత్యము నకు, పరమం = శ్రేష్ఠమైన, నిధానం = ఆశ్రయము (పరబ్రహ్మము)

తా॥ సత్యమే జయించును అనృతము జయింపదు సత్యము పలుకుటచేతను, మనస్సుయొక్క ఏకాగ్రతచేతను, జ్ఞానపరిపక్వతచేతను, పరమాత్మను పొందనగును ఈ సమస్త అనుష్ఠానముల మూలమునను సంతుష్టచిత్తులై ఋషులు సత్యమునకు పరమనిధానమగు పరబ్రహ్మమును పొందెదరు

వ్యా॥ శాంతచిత్తుఁడవై సత్యమును తెలిసికొనుము, సత్యమును తెలిసికొని సత్యమార్గమున నడుపుము. అట్లు చేసినచో సత్యజయమువలన నీవు జయయుక్తుఁడ వగుదువు పరమేశ్వరుని పొందఁగోరినచో సత్యమును శరణము పొందుము. అసత్యమును కపటత్వమును పరిత్యజింపుము. సత్యము నవలంబించుటవలనను, మనస్సుయొక్క ఏకాగ్రతవలనను, జ్ఞానముయొక్క పరిపక్వతవలనను, సత్యమునకు పరమనిధానమగు పరబ్రహ్మమును పొంద నగును. పూర్వకాలమునందు ఆప్తకాములును, నిర్దోషులు నగు ఋషులు ఈ సకలోపాయముల నవలంబించి సిద్ధులయిరి.

వి॥ ఈ ౧౭-వ అధ్యాయము సత్యప్రశంసతో ప్రారంభమగు చున్నది. ముండకోపనిషత్తు 3-వ ముండకములోని ౫, ౬ వాక్యములలోని భాగములను చేర్చుటచే నీవాక్య మేర్పడెను ౬-వ వాక్యములోని మధ్య భాగమగు 'సత్యేన పంథా వితతో దేవయానః' అనునది పరిహరింపఁబడి నది. దాని స్థానమున ౫-వ వాక్యములోని 'సత్యేన లభ్యస్తపసా హ్యేష ఆత్మా సమ్యక్ జ్ఞానేన' అనునది చేర్పఁబడెను. బ్రహ్మజ్ఞానమునకు తోడ్పడు నని ౫-వ వాక్యములో చెప్పఁబడిన నాల్గు విషయములలో కడపటిదగు 'బ్రహ్మచర్య' అనునది వదలివేయఁబడెను ఈమార్పులవలన సత్యప్రభావ మును స్పష్టముగా వ్యక్తీకరించుటకు వీలయ్యెను.

మూ. దివ్యోహ్యమూర్తః పురుషః సబాహ్యాభ్యన్త
రోహ్యజోఽప్రాణోహ్యమనాః
యం పశ్యన్తి యతయః క్షీణదోషాః ౨

[ముండకోపనిషత్తు]

టీ దివ్యః = (అతఁడు) దివ్యస్వరూపి, అమూర్తోహి = రూపములేనివాఁడు, పురుషః = పూర్ణుఁడు, సబాహ్యాభ్యన్తరః=బాహ్యాభ్యంతరములయం దుండెడివాఁడు, అజోహి= జన్మరహితుఁడు, అప్రాణః = శారీరక ప్రాణములేనివాఁడు, అమనాహి=మనసకరణములేనివాఁడు, యం=ఎవనిని, క్షీణదోషాః= పాపరహితులగు, యతయః=యతులు, పశ్యన్తి=చూచెదరు

తా॥ ప్రకాశవంతుఁడును, నిరవయవుఁడు నగు పూర్ణ పురుషుఁడు సర్వమునకు వెలుపలను లోపలను నున్నాఁడు అంతియేగాక, అతఁడు జన్మరహితుఁడు. అతనికి శారీరకప్రాణము లేదు, మనస్సును లేదు. దోషరహితులును, యత్నశీలురు నగుజ్ఞాను లతనిని దర్శించెదరు

వ్యా॥ అతఁడు ప్రకాశవంతుఁడు; సర్వత్ర ప్రకాశించుచున్నాఁడు అనంతమయిన యీ విశ్వమునందలి ఒక్కొక్కపదార్థము అతని అస్తిత్వమును గూర్చి సాక్ష్యమిచ్చుచున్నది వీనికిఁగల ఒక్కొక్కశక్తియు ఆ మూలశక్తిని ప్రకాశింపఁ జేయుచున్నది అతని కెట్టి మూర్తియును

లేదు. అతఁడు పూర్ణపురుషుఁడు అతఁడు సమస్తవస్తువులకు వెలుపల నున్నాఁడు. లోపలనున్నాఁడు. అతఁడు జన్మరహితుఁడు, సర్వకాలములందును నుండువాఁడు, నాశములేనివాఁడు, మనుష్యాదులవలె అతఁడు ప్రాణవాయువువలన జీవించియున్నవాఁడు గాఁడు. స్వయముగా అతఁడు ప్రాణస్వరూపి అతఁడు ప్రాణముల ప్రాణము మనస్సు అతనిచే సృష్టింపఁబడిన పరిమితపదార్థవిశేషము. అందుచే నతని కిట్టి మనస్సుండుట కవకాశము లేదు. అతని జ్ఞానక్రియ స్వభావసిద్ధమయినది ఎవ్వరు పాపాచరణమును విడిచి పవిత్రాత్ములై అతనిని అన్వేషింతురో అట్టివారు అతనిని దర్శింపఁగల్గుదురు.

వి ముండకోపనిషత్తులో ౨-వ ముండకము, ౧-వ ఖండము, ౨-వ వాక్యములోని భాగమును, 3-వ ముండకము, ౧-వ ఖండము, ౫-వ వాక్యములోని భాగములను జేర్చి యీవాక్యము కూర్పఁబడినది ఇందు "యం పశ్యన్తి యతయః క్షీణదోషాః" అనునది ముఖ్యము పాపరహితులయిన వారే భగవంతుని చూడఁగలరు

మూ యో దేవానామధిపో యస్మిన్ లోకా అధిశ్రితాః
య ఈశేఽస్య ద్విపదశ్చతుష్పదః
స వా ఏష మహానజ ఆత్మా 3

[శ్వేతా - బృహ.]

టీ. యః = ఎవ్వఁడు, దేవానాం = దేవతలకు, అధిపః- అధిపుఁడో, యస్మిన్ = ఎవ్వనియందు, లోకాః = లోకములు,

అధిశ్రితాః=ఆశ్రితములై యున్నయవో,యః=ఎవ్వఁడు, అస్య= ఈ, ద్విపదః = మనుష్యునికిని, చతుష్పదః = మృగమునకును, ఈశే=నియామకుఁడో,సవై ఏషః = అతఁడగు ఇతఁడే, మహాన్= గొప్పవాఁడు, అజః=జన్మరహితుఁడు, ఆత్మా=పరమాత్మ

తా ఎవఁడు దేవతలకు అధిపతియో, ఎవ్వనిలో సకల లోకములును ఆశ్రయమును పొందియున్నవో, ఎవ్వఁడు ద్విపాద చతుష్పాదులగు జంతువులనెల్ల శాసించియుంచుచు న్నాఁడో ఆ యితఁడు జన్మవిహీనుడగు మహాఆత్మ

వ్యా ఎవఁడు చక్షువునకు కనుపించని కీటాణువు మొదలుకొని లోకాంతరమున నివసించు దేవగణపర్యంతముగల సకల జీవులకును ఏకమాత్ర అవలంబనము అధిపతియుం నై యున్నాఁడో, ఎవ్వని శాసనానుసారములై మనుష్యులేమి, పశువులేమి. సమస్తమును చిరకాలమునుండి పరిపాలింపఁ బడుచున్నవో అతఁడు జన్మరహితుఁడగు ఈ మహా ఆత్మ.

వి ఈవాక్యములో 'యో' నుండి 'ద్విపదశ్చతుష్పదః' పర్యంతము శ్వేతాశ్వతరము నాల్గవఅధ్యాయము ౧౩-వ వాక్యమునుండియుం, మిగిలిన భాగము బృహదారణ్యకము నాల్గవఅధ్యాయము,నాల్గవబ్రాహ్మణము, ౨౫-వ వాక్యమునుండియుఁ గైకొనఁబడినవి

మూ అదృష్టోద్రష్టాఽశ్రుతః శ్రోతాఽ
మతో మన్తాఽవిజ్ఞాతో విజ్ఞాతా ౪

[బృహ]

టీ అదృష్టః=(పరమాత్మ యొరులచే) చూడఁబడనివాఁడ య్యును, ద్రష్టా=(తాను) చూచువాఁడు అశ్రుతః=(పరులచే) వినఁబడనివాఁడయ్యు, శ్రోతా=(తాను) వినెడివాఁడు, అమతః= (పరుల) మనసునకు అగోచరుఁడయ్యును, మన్తా=(తాను) ఎల్ల మానసిక విషయములను గోచరము చేసికొనువాఁడు, అవి జ్ఞాతః = (పరులచే) ఎఱుఁగఁబడనివాఁడయ్యును, విజ్ఞాతా = (తాను) సర్వమును ఎఱిఁగెడువాఁడు

తా. ఈపరమాత్మ నెవ్వరును చూచియుండలేదు. కాని అతఁడు సర్వమును చూచుచుండును ఎవ్వరును అతనిని విని యుండలేదు, కాని అతఁడు సర్వమును వినును అతని నెవ్వ రును మననము చేయఁజాలరు; కాని అతఁడు సర్వమును మన నముచేయును అతని నెవ్వరును తెలిసికొనలేదు, కాని అతఁడు సర్వమును తెలిసికొనును.

వ్యా పూర్ణపురుషుఁడగు పరమేశ్వరునికి నేత్రకర్ణాది ఇంద్రి యము లెవ్వియును లేవు కాని, నేత్రకర్ణాది ఇంద్రియములచే మనము వేనిని తెలిసికొందుమో ఆ సకలవిషయములను స్వయంభువును సర్వజ్ఞుఁడు నగు నా పరమపురుషుఁడు తెలిసికొనును. అంతియేగాక, మనము తెలిసికోఁ జాలని వానినిగూడ అతఁడు తెలిసికొనును. కాని యెవ్వరును అతని స్వరూ పముయొక్క అంతమును తెలిసికొననేరరు

వి ఈవాక్యము బృహ ౩-వ అ. ౭-వ బ్రా ౨౩-వ వాక్యము నుండియు, ౩-వ అ. ౮-వ బ్రా ౧౧-వ వాక్యమునుండియుఁ గైకొనఁబడినది. ౩-వ అ. ౭-వ బ్రా. ౨౩-వ వాక్యము ఉద్దాలక ఆరుణికిని యాజ్ఞవల్క్యునికిని జరిగిన సంభాషణములో కడపటిభాగమున నున్నది. ౩-వ అ. ౮-వ బ్రా ౧౧-వ వాక్యము యాజ్ఞవల్క్యునికిని గార్గికిని జరిగినసంవాదమునందు తటస్థించుచున్నది.

మూ స ఏష నేతి నేత్యాత్మాఽగృహ్యో నహి
గృహ్యతే. ౫

[బృహ ౩-అ, ౯-బ్రా, ౨౬-వా]

టీ. సఏషః ఆత్మా = అతఁడగు పరమాత్మ, నేతి = ఇది కాదు నేతి=ఇది కాదు అగృహ్యః=(అతఁడు) అగ్రాహ్యుఁడు (కనుక) నహి గృహ్యతే = ఇంద్రియములు, మనస్సుచే గ్రహింపఁబడఁడు కదా!

తా 'ఇది కాదు ఇది కాదు' అనియే ఆ యీ పరమాత్మను నిర్దేశించుటకు మార్గము అతఁడు ఇంద్రియములకుగాని మనస్సునకుగాని గ్రాహ్యుఁడగువాఁడు కాఁడు అందుచే నెవ్వరును అతనిని ఇంద్రియములచేఁగాని మనస్సుచేఁ గాని గ్రహింప నేరరు

వ్యా సృష్టిస్థితి ప్రళయకర్తయగు పరమేశ్వరుఁడు సృష్టి కలిత మగు వస్తువు ఈమాత్రమే అతనినిగూర్చి చెప్పఁగలము దేనిని చక్షువుల మూలమున చూడనగునో, దేనిని మనస్సుమూలమున మననము చేయనగునో అది అతఁడు కాదు. అతఁడు ఇంద్రియములకును మనస్సునకును గ్రాహ్యుఁ డగువాఁడు కాఁడు. కేవలము విశుద్ధమయిన జ్ఞానము చేతనే అతనిని దర్శింప నగును

వి ఇది బృహదారణ్యకములో ౨-వ అ. ౮-వ బ్రా ౪-వ వాక్య మునందును మఱికొన్నిచోట్లనుగూడఁ గలదు 'నేతి' 'నేతి' యనియే పర మాత్మను నిర్వచింపనగు నన్నవిషయము బృహదారణ్యకములో సర్వసామా న్యము ఇట్లే పాశ్చాత్యదార్శనికులుగూడ చెప్పియున్నారు 'ఇది కాదు. అది కాదు' అనిగాక మఱేమిచెప్పినను భగవంతుని సీమాబద్ధునిగా చేసిన ట్లగునుగాన స్పినోజా మున్నగు తత్త్వవిదులు అతనినిగూర్చి యేమియు నుడువుటకు నొప్పుకొనరైరి

మూ స ఏష సర్వస్యేశానః సర్వస్యాధిపతిః
సర్వమిదం ప్రశాస్తి యదిదం కిఞ్చ ౬

[బృహ ౫ అ, ౬ బ్రా, ౧ వా.]

టీ. సఏషః = ఆ ఈ పరమాత్మ, సర్వస్య=అన్నిఁటికిని, ఈశానః = నియంత, సర్వస్య = అన్నిఁటికిని, అధిపతిః=ప్రభువు, యదిదంకిఞ్చ=ఏదియిదై యున్నదో, సర్వమిదం = ఈసమస్తజగ త్తును, ప్రశాస్తి=నియమనము చేయుచున్నాఁడు

తా ఆ యీపరమాత్మ సకలమునకును నియంత; సకలమునకును అధిపతి జగత్తులో నేయేపదార్థములు గలవో వానినెల్ల నతఁడు శాసించుచున్నాఁడు.

వ్యా దేవతలు, మనుష్యులు, పశువులు, పక్షులు-ఈ సకలమును అతని శాసనమునకు లోఁబడియున్నవి. ఎవ్వరును అతని శాసనమును మీఱఁజాలరు.

మూ ఋతం పిబన్తౌ సుకృతస్య లోకే
గుహాం ప్రవిష్టౌ పరమే పరార్థే,
ఛాయాతపౌ బ్రహ్మవిదో వదన్తి
పఞ్చాగ్నయో యేచ త్రిణాచికేతాః 2

[కఠ ౧-అ, ౩-వ, ౧-వా.]

టీ లోకే = శరీరములో, గుహాం = బుద్ధియందు, పరమేపరార్థే = ఉత్కృష్టమైన స్థానమునందు (జీవాత్మ పరమాత్మ లిద్దరు), ప్రవిష్టౌ = ప్రవేశించి యున్నారు (వానిలో ఒకడైన జీవాత్మ) సుకృతస్య=తాను చేసెడి కృత్యముయొక్క, ఋతం = ఫలమును, పిబన్తౌ = భుజించుచున్నది (ఆ రెంటిని) బ్రహ్మవిదః = బ్రహ్మజ్ఞానులు, ఛాయాతపౌ = ఎండ నీడలును వలె, వదన్తి = చెప్పుచున్నారు యేచ = ఎవరు, త్రిణాచి

కేతాః = మూఁడుమార్లు నచికేతాగ్ని యజనము చేసినవారో, పఞ్చాగ్నయః = పంచాగ్నిగల గృహస్థులో. (తే = వారు, వదన్తి = ఇట్లు చెప్పుచున్నారు)

తా శరీరమునందలి పరమోత్కృష్ట స్థానమగు బుద్ధి లోపల జను లిద్దరు ప్రవేశించియున్నారు వారిలో నొకఁడు స్వకృత కర్మఫలము ననుభవించును, వేఱొకఁడు తత్ఫలమును విధించును బ్రహ్మవిదులగు తత్త్వజ్ఞులు వారిర్వురును ఛాయా తపముల భాతి వేఱయినవారని చెప్పుదురు పంచాగ్ని గృహస్థులును, ముమ్మారు నచికేతాగ్ని యజనము చేసినవారు నగు కర్మవాదులుగూడ నివ్విధముననే చెప్పుదురు

వ్యా జీవాత్మయు, జీవాత్మ కాశ్రయమగు సర్వవ్యాపియగు పరమాత్మయు—ఈ రెండు ఆత్మలును శరీరములోపల వసించుచున్నవి ఈ ఉభయాత్మలను, మనము సంశయరహితమయిన బుద్ధిద్వారమున తెలిసికొనుచున్నాము ఎండయుం నీడయుం నేరీతిగా ఒకదానినుండి యింకొకటి విలక్షణములుం భిన్నములునై యున్నవో అట్టులే జీవాత్మపరమాత్మలును పరస్పరభిన్న పదార్థములైయున్నవి ఎవ్విధమున ఆతపములేక ఛాయ యుండుటకు వీలులేదో అవ్విధముననే పరమాత్మయొక్క ఆశ్రయములేక జీవాత్మయు నుండఁజాలదు. పరమాత్మ జీవునికి కర్మానురూపమయిన ఫలము నొసంగును. ఆ ఫలము ననుభవించి జీవాత్మ వర్ధిల్లుచుండును జీవాత్మ పరమాత్మలు రెండును విలక్షణస్వభావములు గలవని నిశ్చయించినవారు కేవలము తత్త్వదర్శులగు

బ్రహ్మవిదులే కారు అగ్నిహోత్రులగు కర్మనిష్ఠాపరులుగూడ నీవిధమున నే చెప్పుచుందురు.

వి ఈవాక్యము ద్వైతభావమును స్పష్టముగా వ్యక్తీకరించుచున్నది ఎండయు నీడయుంబోలె పరమాత్మయు జీవాత్మయు వేఱని యిది వెల్లడించుచున్నది. ఋగ్వేదమునందలి 'ద్వాసుపర్ణా' యను ఋక్కునకంటె నీవాక్యము స్పష్టతరముగా ద్వైతభావమును ప్రకటించుచున్నది. ఒక్క వృక్షము నాశ్రయించియున్న పక్షులజంటవలె జీవాత్మ పరమాత్మ లున్నవని అందుండఁగా, ఈ వాక్యమునందు ఎండయు నీడయుంబోలె రెండును విలక్షణస్వభావమును కల్గియున్నవని చెప్పఁబడినది. ఈ అభిప్రాయము ఉపనిషత్తుల నుడివిన ఋషీశ్వరులకే గాక కర్మకాండ నవలంబించువారికిఁగూడ కలదని సూచింపఁబడినది.

---

# పదునాల్గవ అధ్యాయము

మూ **యో వై భూమా** తత్సుఖం నాల్పే సుఖమస్తి
**భూమైవ** సుఖం **భూమాత్వేవ** విజిజ్ఞాసితవ్యః ౧
[శ్వేతా. ౫-అ, ౪-వా]

టీ యోవై=ఎవ్వఁడు, భూమా = మహాత్మైనవాఁడో (బ్రహ్మమో), తత్=అది (అతఁడు), సుఖం= సుఖస్వరూపము, అల్పే = అల్పమగు (బ్రహ్మవ్యతిరేకమైన) ఏవస్తువునందు, సుఖం=సుఖము, నాస్తి=లేదు. భూమైవ = మహాత్మైన (ఈశ్వరుఁడే), సుఖం=సుఖస్వరూపి, అతః=ఆకారణమువలన, భూమాత్వేవ=మహాత్మైన (ఈశ్వరుఁడే), విజిజ్ఞాసితవ్యః=విశేషముగా నెఱుఁగఁబడవలసినవాఁడు

తా ఎవఁడు భూమాస్వరూపియో,మహాత్మైనవాఁడో అతఁడు సుఖస్వరూపి. అల్పపదార్థములందు సుఖము లేదు "భూమా" యగు ఈశ్వరుఁడే సుఖస్వరూపి "భూమా" నే తెలిసికొనుటకు ఇచ్ఛగింపవలయును

వ్యా మానవుని మనస్సు పరిమితమగు అల్పపదార్థమును పొంది యెన్నఁడును సౌఖ్యము ననుభవింపనేరదు. ఆ భూమాస్వరూపునియందే మనకు సౌఖ్యము, అల్పవిషయములందు సౌఖ్యములేదు విషయసుఖము లలో మన ఆత్మ తృప్తిని గాంచనేరదు. సమస్తవిషయసుఖములును క్షణ భంగురములు, మిక్కిలి క్షుద్రములు ఒకప్పుడవి ధర్మమున కనుకూల ములు, వేఱొకప్పుడు ప్రతికూలములు, ఒకప్పుడు సేవ్యములు, మఱియొక ప్పుడు త్యాజ్యములు ఆ భూమాస్వరూపియగు ఈశ్వరుఁడే మనతృప్తికి స్థానము, మన పవిత్రశాంతినికేతనము అందుచే అతనినే అన్వేషింపవల యును అతనినే తెలిసికొనుటకు ఇచ్ఛగింపవలయును

వి ఈ పదునాల్గవఅధ్యాయము అనంతబ్రహ్మముయొక్క మహా త్త్వమునుగూర్చి ముచ్చటించుచున్నది. ఇందలి మొదటివాక్యము నారద సనత్కుమార సంవాదములోనిది భూమాస్వరూపమునందేగాని పరిమిత వస్తువులందు సౌఖ్యము లేదని యిది తెలుపుచున్నది

మూ స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి స్వే మహిమ్ని ౨

[ఛాందో ౭-ప్రపా, ౨౪-ఖం, ౧-వా.]

టీ. భగవః = ఓస్వామీ ! సః= అతఁడు (ఈశ్వరుఁడు), కస్మిన్ = ఎచ్చట, ప్రతిష్ఠితః = ప్రతిష్ఠితుఁడై యున్నాఁడు ? ఇతి = అని (పలుకుచున్న శిష్యునిఁగూర్చి ఆచార్యుఁడు చెప్పు చున్నాఁడు), స్వే మహిమ్ని = ఆత్మసంబంధమైన మహిమ

యందు, (భూమా = పరబ్రహ్మము.) ప్రతిష్ఠితః = ఉంచబడి యున్నాఁడు.

తా. "స్వామీ ! అతఁ డెక్కడ ప్రతిష్ఠితుఁడై యున్నాఁ" డని శిష్యుఁ డడిగెను "అతఁడు తన మహిమ యందు ప్రతిష్ఠితుఁడై యున్నాఁ" డని ఆచార్యుఁ డుత్తర మొసంగెను

వ్యా పరమేశ్వరుఁడు నిరాలంబుఁడు, స్వతంత్రుఁడు, ముక్త స్వభావుఁడు. సకలవస్తువులు అతనిని అవలంబనముగా చేసికొని అతనిమీఁద నాధారపడియున్నవి. కాని అతఁడు మఱియెవ్వరిని అవలంబనముగా చేసికొని నిలిచియున్న వాఁడు కాఁడు. విశ్వరూపమైన యీ గోలము అతనికి ఆబద్ధమైనదై వ్రేలాడుచున్నది. అతఁడు ఏకమాత్ర శంకుస్వరూపియై నమస్తమును ధరించియున్నాఁడు కాని అతఁడు మఱిదేనికిని బంధింపఁబడియున్న వాఁడు కాఁడు. అతని నెవ్వరును పట్టుకొనలేదు. ఆ నిరవలంబుఁడగు పూర్ణబ్రహ్మము స్వకీయ మహిమయందు సంస్థితుఁడై యున్నాఁడు. తనలో తానే నిత్యుఁడై యున్నాఁడు. అతనికి జనకుఁ డెవ్వఁడును లేఁడు. ఆశ్రయము గూడ నతని కెద్దియులేదు

వి. నారదుఁడు సనత్కుమారునుండి "భూమా" యొక్క లక్షణములను, విని విని, "స భగవః కస్మిన్ ప్రతిష్ఠితః?" అని యడిగెను. సనత్కుమారుఁడు "స్వే మహిమ్ని యదివా న మహిమ్ని" అని ప్రత్యుత్తర మిచ్చెను

"భూమా" అనఁగా అద్వైతపరబ్రహ్మము అతఁడు తనయందే ప్రతిష్ఠను కలిగియున్నాఁడు, అని తెలుపుటకు సనత్కుమారుఁడు నారదునితో "స్వే మహిమ్ని" అని ముందుగా చెప్పెను ఈ ప్రత్యుత్తరమును విని నారదుఁడు "భూమా" కు సహితము ఆశ్రయ మావశ్యక మనుకొనునేమో యనియు, "భూమా" వేరు, "భూమాయొక్క మహిమ" వేరు, వీనిలో మొదటిది రెండవదానియందు ప్రతిష్ఠితమయి యున్నది, అని అనుకొనునేమో యనియు, ఇట్టి సందేహములు నివారించుటకు సనత్కుమారుఁడు "స్వే మహిమ్ని" అని యూరకుండక "యది వా న మహిమ్ని" అను వాక్యముకూడ వెంటనే చేర్చెను అనఁగా, భూమా తన మహిమయందు కూడ ప్రతిష్ఠితుఁడు కాఁడు, ఆయనకు ఆశ్రయ మావశ్యకమే లేదు, ఆయన ప్రతిష్ఠావిహీనుఁడు, నిరాలమ్బుఁడు అని యర్థము.

మూ స ఏవాధస్తాత్ సఉపరిష్టాత్ సపశ్చాత్
స పురస్తాత్ స దక్షిణతః స ఉత్తరతః ఈశానో
భూతభవ్యస్య స ఏవాద్య స ఉ శ్వః          3

[ఛాందో - కర.]

టీ స ఏవ అధస్తాత్ = అతఁడు దిగువనున్నాఁడు సః= అతఁడు, ఉపరిష్టాత్ = పైననున్నాఁడు. సః = అతఁడు, పశ్చాత్ = వెనుకనున్నాఁడు సః = అతఁడు, పురస్తాత్ = ముందునున్నాఁడు. సః= అతఁడు, దక్షిణతః=దక్షిణదిశయందున్నాఁడు. సః = అతఁడు, ఉత్తరతః = ఉత్తరదిశయందున్నాఁడు భూత

భవ్యస్య = కాలత్రయమునకు, ఈశానః = నియంత స ఏవ = అతఁడే, అద్య = ఇప్పుడున్నాఁడు స ఉ = అతఁడే, శ్వః = రేపును ఉండఁగలఁడు

తా. అధోభాగమున నతఁడు, ఊర్ధ్వభాగమున నతఁడు, పార్శ్వముల నతఁడు, సమ్ముఖమున నతఁడు, దక్షిణమున నతఁడు, ఉత్తరమున నతఁడు అతఁడు భూతభవిష్యత్తుల నియంత అతఁడు నేడున్నాఁడు ఇఁక మీఁదటను నుండఁగలఁడు

వ్యా. ఊర్ధ్వభాగమునం దేమి, అధోభాగమునం దేమి, పార్శ్వములం దేమి, సమ్ముఖమున నేమి, దక్షిణమునం దేమి, ఉత్తరమునం దేమి, మనకు నలుదిక్కులందును సకలస్థానములందును అతఁడు దీప్యమానుఁడై యున్నాఁడు. మనము పర్వతశిఖరమున కారోహించితిమా అక్కడను నతఁ డున్నాఁడు. దివాకరుని మధ్యాహ్నకిరణజాలము నం దెవ్విధమున నతఁడు స్వప్రకాశుఁడై యున్నాఁడో అరీతిగనే నిశయందలి గాఢాంధకారమునందును జాజ్వల్యమానుఁడై యున్నాఁడు సకలస్థానములందును ఆతనిరాజ్యము వ్యాపించియున్నది సకలస్థానములందును ఆతనివృష్టి ప్రసరించుచున్నది. సర్వప్రదేశమును వ్యాపించియున్న చందముననే అతఁడు సర్వకాలమునందును వ్యాపించియున్నాఁడు అతఁ డెట్లు ఇహకాల నియంతయో అట్లులే పరకాలమునకుగూడ నియంత. అతఁడు నే డున్నాఁడు. తరువాతను నుండఁగలఁడు

వి ఈ వాక్యములోని ప్రథమభాగము ఛాందోగ్యోపనిషత్తు ౭-వ ప్రపా, ౨౫-వ ఖం, ౧-వ వాక్యమై యున్నది. చివరభాగము కఠోపనిషత్తులో ౪-వ అ, ౧౩-వ వాక్యము ఈ రెండుభాగములును భగవంతుని సర్వవ్యాపకత్వమును వెల్లడించుచున్నవి. ఛాందోగ్యములోని భాగము అతఁడు సమస్తప్రదేశములందును వ్యాపించియున్నాఁడనియు, కఠోపనిషత్తులోని భాగము అతఁడు సర్వకాలములకును నియంతయై యున్నాఁడనియుం చెప్పుచున్నవి

మూ॥ య ఏకోఽవర్ణో బహుధా శక్తియోగాత్
వర్ణాననేకా న్నిహితార్థో దధాతి,
విచైతి చాన్తే విశ్వమాదౌ సదేవః
సనోబుద్ధ్యా శుభయా సంయునక్తు ౪

[శ్వేతా ౪-అ, ౧-వా]

టీ॥ యః=ఎవ్వఁడు, ఏకః=ఒక్కఁడో, అవర్ణః=వర్ణరహితుఁడో, నిహితార్థః=ప్రాణులకు ప్రయోజనకరములైన పదార్థములను తెలిసికొని, బహుధాశక్తియోగాత్ = బహుశక్తుల యొక్క కూడికవలన, అనేకాన్ వర్ణాన్ = ప్రయోజనకరములగు అనేకపదార్థములను, దధాతి=ఇచ్చుచున్నాఁడో, విశ్వం =జగత్తును, ఆదౌఅంతేచ = ఆదిమధ్యాంతముల యందును, విచైతి = (ఎవ్వఁడు) వ్యాపించియున్నాఁడో, సః= అతఁడు,

దేవః=ప్రకాశస్వరూపుఁడు, సః=అతఁడు, నః=మనలను, శుభయాబుద్ధ్యా=మంచిబుద్ధితో, సంయునక్తు = చేర్చుఁగాక!

తా॥ ఎవ్వఁడు ఒక్కఁడో, వర్ణవిహీనుఁడో, ఎవ్వఁడు ప్రాణుల అక్కఱలను కనిపెట్టి నానావిధశక్తిసంయోగముచే కావలసినపదార్థములనెల్ల సమకూర్చి యిచ్చుచున్నాఁడో, ఈసమస్తబ్రహ్మాండముయొక్క ఆదిమధ్యాంతములం దెవ్వఁడు వ్యాపించియున్నాఁడో అతఁడే దీప్యమానుఁడగు పరమేశ్వరుఁడు మనకు అతఁడు శుభబుద్ధి నొసంగుఁగాక!

వ్యా. నానావర్ణములను సృజించినవాఁడయ్యు ఆ యేకేశ్వరుఁడు తా నెట్టి వర్ణమును లేనివాఁడై విశుద్ధహృదయులగు జ్ఞానుల సమక్షమున జాజ్వల్యమానుఁడై ప్రకాశించుచున్నాఁడు. ధర్మమును, అర్థమును, సౌఖ్యమును, సౌభాగ్యమును ప్రసాదించువాఁడై ఆ సత్యపురుషుఁడు తమకు అతిసమీపస్థుఁడై యున్నాఁడని గ్రహించి నిష్కాములై జ్ఞానులతనిని హృదయపూర్వకమగు భక్తితో ఉపాసనచేయుచున్నారు కేవలము అతనిని పొందుటకై శుభబుద్ధి నిమ్మని ప్రార్థించుట తప్ప వారు అతనికి చేయవలసిన ప్రార్థనము లెద్దియు లేదు

మూ॥ స వృక్షకాలాకృతిభిః పరోఽన్యో
యస్మాత్ ప్రపఞ్చః పరివర్తతేఽయమ్,
ధర్మావహం పాపనుదం భగేశం

జ్ఞాత్వాత్మస్థ మమృతం విశ్వధామ,
విశ్వ స్యైకం పరివేష్టితారం
జ్ఞాత్వా శివం శాన్తి మత్యన్త మేతి.          ౫

[శ్వేతాశ్వతరము.]

టీ యస్మాత్=ఎవ్వనివలన, అయంప్రపఞ్చః=ఈ ప్రపంచము, పరివర్తతే = నడుచుచున్నయదో, సః=అతఁడు (ఆపరమాత్మ), వృక్షకాలాకృతిభిః - వృక్ష=సంసారవృక్షమునకంటె, కాల=కాలమునకంటె, ఆకృతిభిః = ఆకారములకంటె, పరః=శ్రేష్ఠుఁడు, అన్యః=భిన్నుఁడు, ధర్మావహం=ధర్మమునకు ఆకరభూతుఁడును, పాపనుదం=పాపవిమోచనుఁడు, భగేశం=ఐశ్వర్యమునకు నాయకుఁడు, ఆత్మస్థం=ఆత్మయం దుండువాఁడును, అమృతం = మరణధర్మములేనివాఁడును, విశ్వధామ = విశ్వాధారుఁడు నైనవానిని, జ్ఞాత్వా=తెలిసికొని, విశ్వస్య=ప్రపంచమునకు, ఏకం=ఒకఁడై, పరివేష్టితారం=చుట్టుకొనియుండువాఁడును, శివం=మంగళస్వరూపియు నైనవానిని, జ్ఞాత్వా=తెలిసికొని, అత్యంతంశాన్తిం = విశేషశాంతిని, ఏతి=(జీవుఁడు) పొందుచున్నాఁడు

తా ఎవ్వనిచే సృష్టింపఁబడినదై యీ ప్రపంచము పరివర్తితమగుచున్నదో అతఁడు సంసారముకంటెను, కాలము

కంటెను, సాకారములగు సకలవస్తువులకంటెను శ్రేష్ఠుఁడు: కావుననే వేఱయినవాఁడు. అతఁడు ధర్మాధారుఁడు, పాపవిమోచకుఁడు, ఐశ్వర్యాధిపతి ఆ యెల్లరి ఆత్మలలో నుండువానిని, మృత్యువు లేనివానిని, విశ్వమునకు ఆశ్రయుఁడగువానిని, ఆ మంగళస్వరూపిని, ఏకమాత్రుఁడై పరివేష్టించియుండువానిని తెలిసికొని జీవులు అత్యంతశాంతి పొందెదరు.

వ్యా. అతఁ డెంతమాత్రమును ఈ జగత్తునందలి యే సృష్టపదార్థము వంటివాఁడును గాఁడు. అతఁడు బాహ్యవస్తువులను బోలినవాఁడు కాఁడు, అంతరస్థమగు మనస్సును బోలినవాఁడును గాఁడు అతఁడు విషయములకును, మనస్సునకును, సకలమునకును సృష్టికర్త అందుచేతనే అతఁడు సర్వముకంటె శ్రేష్ఠుఁడు, సర్వముకంటె భిన్నుఁడయినవాఁడు. అతఁడు సత్యస్వరూపి, జ్ఞానస్వరూపి, అనంతస్వరూపి, అతనితో నెవ్వరును పోల్పఁదగినవారు కాజాలరు. నియంతృరూపమున ఆకాశమునందుండి అతఁ డేతీరున సకల జడజగత్తును, పశుప్రకృతిని నియమమునం దుంచుచున్నాఁడో అదే తీరున ధర్మాధారుని రూపమున మనుష్యుల ఆత్మప్రదేశములందుండి అతఁడు సర్వదా ధర్మబుద్ధిని ప్రేరణచేయుచున్నాఁడు జడజగత్తును, పశుపక్షులును నియమము నెఱుంగకయే నియమబలమునకు కట్టువడినవై తమతమ పనులను చేయుచున్నవి. కర్తవ్యజ్ఞానమను వెలుఁగుయొక్క సాహాయ్యముచే ధర్మనియతి నెఱింగి ఆత్మ స్వాధీనభావముతో ధర్మకార్యముల నిర్వహించుచున్నది మానసిక దుష్ప్రవృత్తులకు లోనై ఆత్మ యెప్పుడు ధర్మనియమానుగుణమయిన కర్తవ్యజ్ఞానముయొక్క ఆదేశములను నిర్లక్ష్యముచేసి పాపము నొడి

గట్టుకొనునో అపుడు అయ్యది తన స్వాధీనతను గోల్పోయి మృత్యుపాశబద్ధమై దుస్సహమైన బాధను లోలోపల ననుభవించుచుండును పాపవిమోచకుఁడగు ఈశ్వరుఁడు తప్ప ఆత్మ కప్పుడు అన్యగతి యేమియు లేదు పాపాక్రాంతమయిన ఆ ఆత్మ యెన్నఁడు అకృత్రిమమైన అనుతాపాగ్నిచే దగ్ధమయినదై యిఁక ముం దిట్లు చేయనని అతని శరణుఁజొచ్చునో అపుడే అతఁడా ఆత్మను పాపమునుండి విముక్తముచేసి సత్పథమున ఉన్నతి నొందించును ఇది అతని మహిమ, అతని కారుణ్యము పాపమయము, దుఃఖమయమునగు ఈసంసారమునందు ఏకమాత్రుఁడును, శుద్ధుఁడును, అపాపవిద్ధుఁడును, అమృతుఁడు నగు అప్పరమేశ్వరుని జీవులు తమ ఆత్మప్రదేశములందు గాంచి, పాపవిమోచకునిగను, అక్షయముక్తిదాతగను అతని నెఱింగి అత్యంతశాంతి ననుభవించెదరు.

వి శ్వేతాశ్వతరములోని ౬-వ అధ్యాయములోని ౬-వ వాక్యమును, ౪-వ అధ్యాయములోని ౧౪-వ వాక్యములోని కడపటి రెండు పంక్తులును చేర్చి ఈ శ్లోకము కూర్పఁబడినది. పరమేశ్వరుఁడు పాపవిమోచకుఁ డన్న సంగతి యిందు స్పష్టీకరింపఁబడినది పాపవిమోచకునిగా నతని నెఱుంగుటచే మనుష్యుఁడు పరమశాంతిని పొందును

మూ స విశ్వ కృ ద్విశ్వ విదాత్మ యోనిః
జ్ఞఃకాలకారో గుణీ సర్వవిద్యః,
ప్రధాన క్షేత్రజ్ఞ పతి ర్గుణేశః
సంసారమోక్ష స్థితిబన్ధ హేతుః ౬

[శ్వేతా. ౬-అ, ౧౬-వా.]

టీ యః = ఏపరమేశ్వరుఁడు, ప్రధానక్షేత్రజ్ఞపతిః = ప్రధాన = ప్రపంచమునకు, క్షేత్రజ్ఞ= జీవాత్మకు, పతిః=పాలకుఁడును, గుణేశః=గుణములకు ఈశ్వరుఁడును,సంసారమోక్షస్థితిబన్ధహేతుః - సంసార=సంసారమునకు, మోక్ష = మోక్షమునకు, స్థితి = సంరక్షణకు, బన్ధ=బంధమునకు, హేతుః=కారణుఁడును (భవతి=అగుచున్నాఁడో). సః = ఆ పరమేశ్వరుఁడు, విశ్వకృత్=ప్రపంచమునకు కర్త, విశ్వవిత్=సమస్తమును తెలిసినవాఁడు, ఆత్మయోనిః = జీవులకు కారణుఁడు, జ్ఞః=తెలిసికొనుచున్నవాఁడు, కాలకారః = కాలమునకు కర్త గుణీ=విచిత్రశక్తిగలవాఁడు, సర్వవిత్ = సర్వజ్ఞుఁడు

తా అతఁడు విశ్వకర్త, విశ్వవేత్త, సకలఆత్మలకుస్రష్ట, ప్రజ్ఞావంతుఁడు, కాలమునకుకర్త, గుణవంతుఁడు, సర్వజ్ఞుఁడు. అతఁడు జడముల కేమి, జీవుల కేమి, సకలమునకును ప్రతిపాలకుఁడు, సర్వగుణములకును మహేశ్వరుఁడు, సంసారస్థితికిని, బంధమునకును, మోక్షమునకును హేతువు

వ్యా అతఁడు అన్నిఁటికిని సృష్టికర్త, అన్నిఁటికిని సంరక్షకుఁడు. అన్నిఁటికిని మిత్రుఁడు అన్నిఁటికిని ప్రభువు ఏ వస్తువు అతనిశాసనము నతిక్రమింపఁజాలదు అతని నియమమువలననే జీవాత్మ శరీరమునందు బద్ధమయియుండి జ్ఞానమునందును ధర్మమునందును స్వాధీనమై ముక్తి కధికారి

యయ్యెను తుదకు అతని ప్రసాదమువలననే అతనిని పొంది, సంసారబంధమునుండి ముక్తిని బడయును

మూ　స తన్మయో హ్యమృత ఈశ సంస్థో
జ్ఞః సర్వగో భువన స్యాస్య గోప్తా.
య ఈశేఽస్యజగతో నిత్యమేవ
నాన్యో హేతుర్విద్యత ఈశనాయ,
తంహ దేవమాత్మబుద్ధి ప్రకాశం
ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే　　౭

[శ్వేతా ౬-అ, ౧౩, ౧౮-వా.]

టీ సః=అతఁడు, తన్మయోహి = చైతన్యజ్యోతిర్మయుఁడు, అమృతః=మరణధర్మము లేనివాఁడు, ఈశసంస్థః=ప్రభువును మంచిస్థితిగలవాఁడును, జ్ఞః=ఎఱుకగలవాఁడు, సర్వగః-అంతటను నుండువాఁడు, అస్యభువనస్య = ఈలోకమునకు, గోప్తా=రక్షకుఁడు, యః=ఎవ్వఁడు, అస్యజగతః = ఈజగత్తును, నిత్యమేవ = ఎల్లప్పుడు నియమముగా, ఈశే = పరిపాలించుచున్నాఁడో, ఈశనాయ = శాసనముకొఱకు, అన్యః = మఱి యొక, హేతుః = కారణము, నవిద్యతే = లేదు ఆత్మబుద్ధి ప్రకాశం— ఆత్మ = ఆత్మయందున్న, బుద్ధి=బుద్ధిని, ప్రకాశం= ప్రకాశింపఁజేయుచున్న, దేవం=పరమేశ్వరుఁడగు, తంహ=

అతనినే, అహం=నేను, ముముక్షుర్వై=మోక్షాసక్తిగలవాఁడనై, శరణం ప్రపద్యే=శరణుఁజొచ్చుచున్నాను

తా. అతఁడు చైతన్యమయుఁడు, మరణధర్మరహితుఁడు, సర్వమునం దధిపతిరూపమున సంస్థితుఁడై యున్నవాఁడు. ఈ జగత్తునకు ప్రతిపాలకుఁడు అతఁడు ఈ జగత్తును నిత్యనియమాధీనము చేసి సంరక్షించుచున్నాఁడు అతఁడు తక్క ఈ విశ్వశాసనమునకు మఱి యెట్టిహేతువును లేదు మోక్షార్థినై నేను ఆత్మబుద్ధి ప్రకాశకుఁడగు నా పరమేశ్వరునికి శరణాపన్నుఁడ నగుచున్నాను

వ్యా అతఁడు మన ఆత్మలలో కర్తవ్యజ్ఞానమును, ధర్మబుద్ధిని ప్రకాశింపఁజేయుచున్నాఁడు. స్వాధీనులగు ప్రజలనిమిత్తము ప్రభు వెవ్విధమున సకలరాజశాసనములను ప్రచురపఱచునో తద్విధముననే ధర్మావహుఁడగు పరమేశ్వరుఁడును మానవుల ఆత్మలకు స్వాధీనత నొసంగి అందు ధర్మనియమములనెల్ల ప్రకాశపఱచెను శుభబుద్ధియొక్క ఆలోచనాద్వారమునను, కర్తవ్యజ్ఞానమనియెడు వెలుతురుయొక్క సాహాయ్యమునను ఆత్మపటమునందు చిరముద్రితములై యున్న ధర్మనియమములనెల్ల మనము పఠింపఁగల్గుదుము మఱియు తదనుసారముగా నాచరించి మనము సజ్జనుల మర్యాదము, సాధువుల మర్యాదము, వినయసంపన్నుల మర్యాదము, సుశీలుర మర్యాదము, ఈశ్వరునికి ప్రియుల మర్యాదము ధర్మానుష్ఠానమువలనను, పుణ్యప్రకాశమువలనను ఆత్మ పవిత్రమగుచో మనము సునిర్మలమయిన ఆత్మప్రసాదమును పొందుదుము ఆ యాత్మప్రసాదమువలన మనస్సు

యొక్క సకల దుఃఖములును సమసిపోవును. ధర్మప్రేరణమునకు లోనై మన స్సంబంధములగు ప్రవృత్తులను హృదయమునందలి కోరికలను ప్రతిఘటించి, మన మెంతెంతగా ఆత్మతృప్తిని పొందుదుమో అంతంతగా ఆ పవిత్ర స్వరూపునియెడల మనకు అనురాగము పెరుగును అంతియేగాక, అతనిని పొందు నిమిత్తము సంసారమృత్యుపాశమునుండి విముక్తిని గాంచ నిచ్ఛగల వారమై అతని శరణుఁజొత్తుము

మూ తస్య హవాఏతస్య బ్రహ్మణోనామ సత్యం
నిష్కలం నిష్క్రియం శాన్తం నిరవద్యం నిరఞ్జనం,
అమృతస్య పరం సేతుం దగ్ధేన్ధన మివానలమ్ ౮

[ఛాందో - శ్వేతా.]

టీ తస్యహవా ఏతస్యబ్రహ్మణః=ఆ యీ బ్రహ్మముయొక్క, నామ=నామము, సత్యం=సత్యస్వరూపమయినది (బ్రహ్మణఃరూపం దర్శయతి=బ్రహ్మయొక్కరూపమును చూపించుచున్నాఁడు) నిష్కలం=అతఁడు నిరవయవుఁడు, నిష్క్రియం = వ్యాపారములేనివాఁడు, శాంతం = శాంతుఁడు, నిరవద్యం= అనిందనీయుఁడు, నిరంజనం=నిర్దోషి, అమృతస్య=నిత్యపదవికి మోక్షప్రాప్తికి, పరంసేతుం=సేతువైన పరబ్రహ్మస్వరూపము, దగ్ధేన్ధనం - దగ్ధ =దహింపఁజేయఁబడిన, ఇంధనం=కట్టెలుగల, అనలమివ=అగ్నివలెనే ప్రకాశించుచున్నది

తా. ఆ యీ బ్రహ్మముపేరు సత్యము ఆతఁడు నిరవయవుఁడు; నిష్క్రియుఁడు, శాంతుఁడు. అతఁడు అనిందనీయుఁడు, నిర్లిప్తుఁడు, ముక్తికి పరమసేతువు దగ్ధదారునిస్స్రుతమగు అగ్నిజ్వాలవలె దీప్యమానుఁడు

వ్యా అతి దూరస్థుఁడును, అతిసమీపస్థుఁడును, సర్వవ్యాపియు నగు ఆ బ్రహ్మముపేరు సత్యము అందువలననే అతఁడు సత్యస్వరూపి ఆ సత్యస్వరూపిని అవలంబనముగా చేసికొనియుండుటచేతనే ఈ సమస్తజగత్తును సత్యమయ్యెను అతఁడు సత్యమునకు సత్యము ప్రాణమునకు ప్రాణము, చేతనమునకు చేతనము, ఆత్మకు ఆత్మ అతఁడు ఏకమాత్రుఁడు, ప్రజ్ఞానఘనుఁడు. అతనికి అవయవములు లేవు, భాగములు లేవు అతని కెట్టి పరిమాణమును లేదు. మాఱుచెందనివియు, మంగళమును కూర్చునవియు నగు నియమములనెల్ల స్థాపించి అతఁడు విశ్వరాజ్యమును పాలించుచున్నాఁడు. సర్వశక్తిమంతుఁడును, సర్వజ్ఞుఁడు నగు ఆ పరమపురుషుఁడు ఈ సంసార నిర్వహణార్థమై యెవ్వరెవ్వరి కెట్టి కార్యభారమును విధించెనో దానినెల్ల వారు వారు తమ యావచ్ఛక్తితో నిర్వహించుచున్నారు. సర్వమునకును అధిపతియై నియంతృరూపమున నతఁడు సర్వత్ర నిండియున్నాఁడు. అతని సహజ నియమమునకు లోఁబడి యథాకాలమున సూర్యుఁ డుదయించుచున్నాఁడు, మేఘము జలమును వర్షించుచున్నది, వృక్షములు ఫలవంతములగుచున్నవి. అతని ధర్మనియమము యొక్క శాసనమునుబట్టి మనుష్యులు స్వేచ్ఛాచారులై పెడత్రోవ త్రొక్కిరేని ధర్మశిక్షను పాపవేదనమును సహింపవలసినవా రగుచున్నారు. అతనికి శరణాగతులైరేని పాపమునుండి

పరిత్రాణమును పడయుచున్నారు, పుణ్యానుష్ఠానముల గావించి ధర్మబహుమానమువలనను ఆత్మప్రసాదమువలనను పవిత్రులగుచున్నారు. పవిత్రులై ఆ పవిత్రస్వరూపునిఁ బడసి సంసారబంధనమునుండి ముక్తులై ఉన్నతిని పొందుచున్నారు అతఁడు స్వయముగా నే కార్యమును చేయవలసిన పనిలేదు , అతఁడు స్వయముగా నెట్టి ప్రయాసను తీసికొనవలసిన పనిలేదు అతఁడు క్రియారహితుఁడు, శాంతుఁడు అతని యిచ్ఛామాత్రముచే ఈ సమస్తజగత్తును ఉత్పన్నమయ్యెను. కొన్ని నియమబద్ధములయ్యె, కొన్ని స్వాధీనములయ్యె మొత్తముమీఁద సమస్తపదార్థములును ఆ ఒక్కని యిచ్ఛకు వశభూతములై కలిసి అతని పనిని నిర్వహించుచున్నవి. అతఁడు సంసారమునకు కర్త, సంసారమున కతఁడు అతీతుఁడు. అతఁ డెట్టి సాంసారికకార్యమునందును తగిలియున్నవాఁడు కాఁడు, అతఁడు నిరంజనుఁడు, నిర్లిప్తుఁడు అతఁడు పూర్ణస్వరూపి అతని స్వరూపమునం దెట్టి లోపమును లేదు అతఁడు నిరవద్యుఁడు, అనిందనీయుఁడు ఆ అమృతుని శరణుఁ జొచ్చినచో అతనిని పొందనగును ఇఁక మృత్యుభయముండదు అతఁడు అమృతత్వమునకు పరమసేతువు. జ్ఞానచక్షువుమూలమున నతనిని దర్శించినవారు జ్వలించుచున్న అగ్నివలె ప్రకాశమానునిగా నతనిని సర్వత్ర గాంచెదరు.

వి ఈ వాక్యము రెండు ఉపనిషత్తులలోని రెండు వాక్యములు చేర్చి సమకూర్పఁబడినది. 'తస్యహవా ఏతస్య బ్రహ్మణోనామసత్యం' అను భాగము ఛాందోగ్యోపనిషత్తులోని ౮-వ ప్రపాఠకము, ౩-వ ఖండము, ౫-వ వాక్యమునుండియు, తక్కినది శ్వేతాశ్వతరము ౬-వ అధ్యాయము,

౧౯-వ వాక్యమునుండియుం గైకొనఁబడెను. జ్వలించు నగ్నివలె నెల్లెడల నిండి యున్న ఆ పరమేశ్వరుని శుద్ధపూర్ణస్వభావము నిది విశదీకరించుచున్నది.

మూ. స సేతుర్విధృతిరేషాం లోకానామసమ్భేదాయ,
నైనం సేతుమహోరాత్రే తరతః
న జరా న మృత్యు ర్న శోకః ౯

[ఛాందో. ౮-ప్రపా, ౪-ఖం, ౧-వా.]

టీ సః=అతఁడు, ఏషాంలోకానాం = ఈలోకముల యొక్క, అసమ్భేదాయ=భంగనివారణార్థము, సేతుర్విధృతిః= సేతురూపుఁడై ధారణచేయుచున్నాఁడు ఏనంసేతుం = సేతు స్వరూపుఁడైన యితనిని, అహోరాత్రే = అహోరాత్రములు, నతరతః = దాఁటనేరవు నజరా = ముసలితనమును దాఁట జాలదు. నమృత్యుః= మరణము అతిక్రమింపనేరదు నశోకః= దుఃఖము అతిక్రమింపదు

తా ఈలోకభంగనివారణార్థము అతఁడు సేతుస్వరూపియై సమస్తమును ధారణచేయుచున్నాఁడు. సేతుస్వరూపి యగు ఈ పరబ్రహ్మము అహోరాత్రములచే విభాగింపఁదగిన వాఁడుగాఁడు జరామృత్యుశోకము లతనిపై అధికారము చేయనేరవు.

వ్యా చూర్ణములై పోకుండునట్లు అతఁడు సకలలోకములను పట్టుకొని నిలిపియుంచుచున్నాఁడు అతఁడు నిత్యవస్తువు అతఁడు ఫలాని దినమున జన్మించినాఁడు', 'ఇన్నాళ్లు ఉన్నాఁడు', 'ఫలానిదినమువరకు నుండఁ గలఁడు' అని యివ్విధమున అహోరాత్రముల మూలమున అతని పరిమాణ మును నిర్ణయింప వీలులేదు. అతఁడు నిర్వికారుఁడు కావున జరాశోకములు గూడ నతనిని లోఁబఱుచుకొననేరవు అతఁడు కాలమునకు స్రష్ట, ఆశ్ర యము, నియంత ఇఁక కాల మెట్లు అతనిని అతిక్రమింపఁగలదు? ఎవ్వని శరణమును పొందుటవలన జరామృత్యుశోకములనుండి ముక్తినిఁ బడయనగునో అట్టి అమృతస్వరూపుని జరామృత్యువు లెట్లు లోఁబఱుచుకొనఁగలవు?

వి ఈ వాక్యములోని 'స ఆసమ్మేభదాయ' అను మొదటి భాగము బృహదారణ్యకోపనిషత్తు ౪-వ అధ్యాయము, ౪-వ బ్రాహ్మణము, ౨౨-వ వాక్యములోగూడ గలదు. ఛాందోగ్యములో ఈ వాక్యమునకు ముందు 'అధ య ఆత్మా'' అని ప్రారంభమయ్యెడు కొన్ని పంక్తులుగలవు వానిని మహర్షి వదలివైచెను ఈ వాక్యము మిక్కిలి మనోహరరూపమున భగవంతునిగూర్చి మన కొక మహోత్కృష్టభావమును స్ఫురింపఁ జేయు చున్నది సరస్సులోగాని నదిలోగాని యిమిడియున్న జలమును వెలుపలికి ప్రవహించి పోకుండ చుట్టునున్న కట్ట యెట్లు కాపాడునో అదియెవిధ మున పరస్పరవిరుద్ధములగు కోరికలును ప్రయోజనములును కల్గినట్టియు, పోరాడెడు చిత్తప్రవృత్తులు కల్గినట్టియు,సకలజీవులను పరమాత్మ ఒక్కచో నిలిపియుంచుచున్నాఁడని మన కీ వాక్యరత్నము తెలుపుచున్నది. వివిధము లయిన కోర్కెలను కల్గి అన్యోన్యవిరుద్ధములగు స్వప్రయోజనములను కల్గి కామక్రోధాది ప్రవృత్తులకు లోనై యున్న యీ ప్రపంచమునందలి మను

ష్యులను, జీవరాసులను చూడ భగవంతుఁడేగదా ఈ సమస్త భూతకోటిని చెదరిపోకుండ నొక్కచో నిలిపియుంచిన సేతుస్వరూపి యని ఋషీశ్వరుని దివ్య దృష్టికి తోఁచియుండును.

**మూ॥ య ఆత్మాఽపహతపాప్మా విజరోవిమృత్యు ర్విశోకో విజిఘత్సోఽపిపాసః సత్యకామః సత్యసఙ్కల్పః,సో ఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః, స సర్వాంశ్చలోకా నాప్నోతి సర్వాంశ్చకామాన్ యస్తమాత్మానమను విద్య విజానాతి ౧౦**

[ఛాందో ౮-ప్రపా, ౭-ఖం, ౧-వా.]

టీ॥ యః=ఎవ్వఁడు, ఆత్మా=పరమాత్ముఁడో, అపహత పాప్మా = పాపరహితుఁడో, విజరః=ముసలితనము లేనివాఁడో, విమృత్యుః = మరణము లేనివాఁడో, విశోకః = దుఃఖము లేని వాఁడో, విజిఘత్సః=భుజించుటకు ఇచ్ఛ లేనివాఁడో,అపిపాసః= దప్పి లేనివాఁడో, సత్యకామః=కోరినంతటనే కోరినది జరుగఁ దగిన శక్తిఁగలవాఁడో, సత్యసంకల్పః=సంకల్పము చేసినంత టనే సంకల్పించినది జరుగఁదగిన శక్తిఁగలవాఁడో,సః=అతఁడు, అన్వేష్టవ్యః = వెదకఁబడవలసినవాఁడు, సః=అతఁడు, విజిజ్ఞాసి తవ్యః=చక్కఁగా తెలిసికొనవలసినవాఁడు, యః=ఎవఁడు, తం ఆత్మానం=ఆపరమాత్ముని, అనువిద్య=వెదకి, విజానాతి= తెలిసి

కొనుచున్నాఁడో, సః=వాఁడు, సర్వాంశ్చలోకాన్=అన్ని లోకములను, సర్వాంశ్చకామాన్ = అన్ని అభీష్టములను, ఆప్నోతి=పొందుచున్నాఁడు.

తా॥ ఎవ్వఁడు పాపశూన్యుఁడో, జరామరణశోకరహితుఁడో, క్షుత్పిపాసావివర్జితుఁడో, సత్యకాముఁడో, సత్యసంకల్పుఁడో అట్టిపరమాత్ముని అన్వేషింపుఁడు; విశేషరూపమున నతనిని తెలిసికొనుటకు అభిలషింపుఁడు అన్వేషించి యెవ్వఁడు పరమాత్ముని తెలిసికొనఁగల్గునో అతఁడు సమస్తలోకములను పొందును, అతని కోరికలెల్లను సిద్ధించును

వ్యా॥ అపూర్ణులమును, భ్రాంతులమును, పాపాక్రాంతులము నగు జీవులమయ్యు పాపశూన్యుఁడును, పరిశుద్ధుఁడును, పరిపూర్ణుఁడు నగు ఆ అక్షయ సత్యపురుషుని మనము తెలిసికొనగల్గుట మన సామాన్యసౌభాగ్యము గాదు. కాని అతనిని తెలిసికోవలయునన్న గాఢమైన కోరికయు దృఢప్రయత్నమును మనకు ఆవశ్యకములు. దప్పిగొన్నహరిణము జలముకొఱకన్వేషించినట్లు నిశ్చలుఁడును, సత్యస్వరూపుఁడును, సృష్టింపఁబడనివాఁడును నగు ఆ అమృతుని పొందఁగోరి అతనిని అన్వేషింపవలయును. కరతలన్యస్త ఫలమునెట్లు ప్రత్యక్షముగా దర్శింతుమో తద్విధముననే విశుద్ధమైన జ్ఞానముద్వారా నిస్సంశయరూపమున మన మతనిని సమీపస్థునిగా గ్రహించుటకు నభిలషింపవలయును. సంయతేంద్రియుఁడై దోషరహితమును జ్యోతిర్మయము నగు తనయాత్మలోపల ఆత్మకు ఆత్మనుగా, ప్రాణమునకు ప్రాణ

మునుగా, సకలమునకు ఆశ్రయమును కారణస్వరూపమునుగా వెదకి వెదకి యెవ్వఁడతనిని సాక్షాత్తుగా దర్శింపఁగల్గునో అతఁడు పిపాసాపీడితమగు మృగము జలమునుపొంది తృప్తిచెందినట్లు సంతృప్తుఁడగును అతని సమస్త మనోరథములును సిద్ధించును భూలోకాదిసమస్తలోకముల సౌఖ్యమును అతఁడు అనుభవించును బ్రహ్మానందమును బడసి అతఁడు సకలానందములను ఉపభోగించును

మూ॥ ఆకాశోవై నామ నామరూపయో ర్నిర్వహితా,
తే యదన్తరా తద్బ్రహ్మ తదమృతమ్ ౧౧

[ఛాందో ౮-ప్రపా, ౧౪-ఖం, ౧-వా.]

టీ॥ ఆకాశో వై = ఆకాశమే (బ్రహ్మణః = బ్రహ్మము యొక్క), నామ=పేరు నామరూపయోః = నామరూపములు గలపదార్థములను, నిర్వహితా = వహించువాఁడు తే=ఆనామరూపములు, యదన్తరా = ఎవనికి వేఱయినవో, తత్ = అది, బ్రహ్మ = బ్రహ్మము, తత్ = అది, అమృతం = మోక్షస్వరూపము

తా॥ బ్రహ్మముయొక్క నామము ఆకాశము అతఁడు నామరూపముల విధించువాఁడు ఎవ్వఁడు నామరూపములకు వేఱయినవాఁడో, అతఁడు బ్రహ్మము; అతఁడు అమృతుఁడు

వ్యా బ్రహ్మముయొక్క అనంతత్వమును మనస్సు అనుభవించి నపుడు, తద్భావమును వాక్కు వ్యక్తము చేయఁబోయి అతనికి ఆకాశమని పేరు పెట్టుచున్నది వాస్తవమునకు అతని కెట్టి నామముగాని, రూపముగాని లేదు. నామరూపవిశిష్టములగు యావత్పదార్థములును అతనిచే సృష్టింపఁబడినవై అతని ఆశ్రయమువలన పాలింపఁబడుచున్నవి

వి ఈ వాక్యము ఛాందోగ్యములో ౮-వ ప్రపాఠకమున ౧౪-వ ఖండములోని మొదటిభాగమునం దున్నది. పరబ్రహ్మము నామరూపముల కతీతుఁడని యిది సూచించుచున్నది. నామరూపముల నెల్ల వస్తువుల కిచ్చిన వాఁడయ్యు అతఁ డెట్టి నామరూపములును లేనివాఁడు

మూ నైవ వాచా న మనసా ప్రాప్తుం శక్యో నచక్షుషా,
అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం తదుపలభ్యతే ౧౨

[కఠ. 3-అ, ౬-వ, ౧౨-వా]

టీ తత్ = ఆపరమాత్మ, వాచా = వాక్కుచేతను, ప్రాప్తుం = పొందుటకొఱకు, నైవశక్యః = శక్యుఁడు కాఁడు మనసా = మనసుచేతను, న = శక్యుఁడు కాఁడు చక్షుషా = నేత్రముచేతను, న = శక్యుఁడుకాఁడు అస్తీతి = పరమాత్మ ఉన్నాఁడని, బ్రువతః = పలికెడువానికంటె, అన్యత్ర = ఇతరుఁడగు నాస్తికునికి, తత్ = ఆపరబ్రహ్మము, కథం = ఎట్లుగా, ఉపలభ్యతే = పొందఁబడును.

తా అతఁడు వాక్కుద్వారాగాని, మనస్సుద్వారాగాని, చక్షువుద్వారాగాని, యెన్నఁటికిని లభ్యుఁడగువాఁడు కాఁడు "అతఁ డున్నాఁడు" అని యేవ్యక్తిచెప్పునో అతనికి తప్ప తదన్యులకు అతని ఉపలబ్ధి యెట్లు కలుగును?

వ్యా పరమేశ్వరుని స్వరూపము అదృశ్యము, అనిర్వచనీయము, అచింత్యము చక్షువుద్వారాగాని, వాక్కుద్వారాగాని, మనస్సుద్వారాగాని అతని ఉపలబ్ధి కలుగఁజాలదు కేవలము ఆత్మప్రత్యయము వలననే అతనిని పొందనగును. మనము అపూర్ణులము, పరతంత్రులమని విశ్వసించుచున్నాము. ఈ విశ్వాసమున కంతర్భూతమై, పూర్ణము స్వతంత్రమునగు పదార్థ మొక్కటిలేనిచో మనము అపూర్ణులము, అస్వతంత్రులమను విశ్వాసమును గల్గియుండుటకే ఆధారములేదు పరతంత్రమును అపూర్ణమునగు పదార్థముయొక్క అస్తిత్వము వ్యక్తమగును ఈ విశ్వాసము స్వతస్సిద్ధమయినది. కావున దీనికి పరీక్షతో పనిలేదు పరతంత్రమును అపూర్ణమునగు నొకపదార్థమునకు స్వతంత్రమును పూర్ణమునగు మఱియొకపదార్థము స్రష్టయు, ఆశ్రయమునై యుండునని యెల్లర ఆత్మలయందును స్వాభావికమైన ఆత్మప్రత్యయ సిద్ధమైన జ్ఞానముగలదు. ఈ ఆత్మప్రత్యయమును గూర్చి సంశయము కలిగినపుడు యుక్తివాదమును విచారమును బయలుదేరును కాని ఆ విచారానంతరముగూడ మనోవాక్కుల కతీతుఁడును, జ్ఞానగోచరుఁడు నగు ఒక స్వతంత్రపూర్ణపురుషుఁడు గలఁడను సిద్ధాంతమే యేర్పడుచున్నది మన నిర్మలజ్ఞానమునందు ఆ సత్యసుందరమంగళపురుషుని ప్రకాశమును బడసినపుడు ఆత్మప్రత్యయమువలన అతని అస్తిత్వమునందు

కలిగిన విశ్వాసము స్థాపితమగుచున్నది. ఈ ఆత్మప్రత్యయమును సంశయించుచో ఒక్కపెట్టున యుక్తిని మూలచ్ఛేదనముచేసిన ట్లగును, మహాభ్రమలో పడిపోవుట యగును అట్టి స్థితిలో తన అస్తిత్వమును గూర్చియు, బాహ్యవస్తువుల అస్తిత్వమును గూర్చియు, కార్యకారణసంబంధముయొక్క అస్తిత్వమునుగూర్చియు సంశయముదయించి ఒక్కసారిగా బుద్ధివినాశము చెందును ఎవ్వఁడు ఆత్మప్రత్యయముపై ఆధారపడఁడో అట్టివాఁడు జ్ఞానగోచరుఁడును, నిత్యసత్యమంగళ స్వరూపుఁడును, సర్వవ్యాపియు, సర్వాశ్రయుఁడును, సర్వశక్తిమంతుఁడును నగు పూర్ణపురుషుని నెన్నఁటికిని నిస్సంశయరూపమున విశ్వసింపనేరఁడు ప్రతియుక్తివాదతరంగమువలనను స్థిరత్వము గోల్పోయినవాఁడై ఈశ్వరసహవాసజనితమగు సునిర్మలశాంతి నతఁ డొకప్పుడును పొందనేరఁడు ఆత్మప్రత్యయముపై నాధారపడినవాఁడై అతఁడున్నాఁడని యేవాఁడు చెప్పునో అతనికి తప్ప మఱి ఎవ్వనికిని ఈశ్వరుని యొక్క ఉపలబ్ధి కలుగఁజాలదు

ఏ వాక్కుచేగాని చింతనచేగాని భగవంతుఁడు గ్రాహ్యుఁడు కానేరఁడనిచెప్పి "అతఁడు ఉన్నాఁడు" అని యెవ్వాడు నుడువునో అతనికి తప్ప తదన్యులకు అతని ఉపలబ్ధికలుగనేరదని ఋషిపల్కును ఆత్మప్రత్యయసిద్ధాంతము బీజరూపమున నిం దిమిడి యున్న దని చెప్పనగును సమస్త శాశ్వత సత్యములును స్వతఃప్రమాణములని యిది తెలుపుచున్నది. స్వతస్సిద్ధముల సందేహించినచో మనము మహాభ్రమలో పడిపోవుదుము జ్ఞానమునకు మూలాధారములగు ఆత్మప్రత్యయ సిద్ధసత్యములు కొన్నిఁగలవు. వానిని ఋజువుచేయుటకు వలనుపడదు. 'నేనున్నాను' అను నమ్మకముగూడ అట్టి ఆత్మప్రత్యయసిద్ధజ్ఞానమే దానిని అనుమానించినయెడల ఇఁక జ్ఞానమును

బడయుంట కవకాశమే లేదు. ఈశ్వరుఁ డున్నాఁడను జ్ఞానముగూడ నట్టి ఆత్మప్రత్యయజ్ఞానమే యని ఉపనిషత్తు ప్రతిపాదించుచున్నది.

మూ యదైతమనుపశ్యత్యాత్మానందేవమఞ్జసా,
ఈశానం భూతభవ్యస్య న తతో విజుగుప్సతే ౧౩

[బృహ. ౪-అ, ౪-బ్రా, ౧౫-వా.]

టీ యదా = ఎప్పుడు, దేవం = దేవుఁడును, భూత భవ్యస్య=భూతభవిష్యత్తులు మొదలైన కాలత్రయములకు, ఈశానం = నాయకుఁడునైన, ఏతంఆత్మానం=ఈ పరమాత్మని, అఞ్జసా=సాక్షాత్తుగా, అనుపశ్యతి=(ఎవరు) దర్శనము చేసెదరో (వారు), తతః=పిమ్మట, నవిజుగుప్సతే = పరమాత్మయందుండి తమ్మును మఱుఁగు చేసికొనఁగోరరు

తా ప్రకాశవంతుఁడును, భూతభవిష్యత్తుల నియంతయు నగు పరమాత్మ నొకఁ డెప్పుడు సాక్షాత్తుగా దర్శించునో అప్పటినుండి అతఁ డిఁక భగవంతుని నుండి తా గోప్యముగా నుండుట కిష్టపడఁడు

వ్యా ఎవ్వఁడు పాపకర్మలయందు దగిలియుండునో అట్టివాఁడు గోప్యముగా కాలము గడపఁగోరును. కాని అన్యుల కంటఁబడకుండ నొకఁ డెంత గోప్యముగానుండఁగల్గినను సకలమునకు నంతరాత్మయు సర్వసాక్షియు

నగు పరమపురుషునికి గోప్యముగా నుండనేరఁడు. ప్రకాశవంతుఁడును, భూతభవిష్యత్తుల నియంతయు నగు పరమాత్మ నెవ్వఁడు చేతిలోనున్న ఉసిరికపండువలె సాక్షాత్తుగా దర్శించునో అతఁడిక నెట్టిదోషమునందును తగిలియుండుట కిష్టపడఁడు, అందుచే భగవంతుని కంటఁబడకుండ మఱుగున నుండుటకుఁగూడ నభిలషింపఁడు కాని తన్ను ఆ దోషమునుండి తప్పింపుమని సరళహృదయముతోడను, సంతప్తచిత్తముతోడను భగవంతుని ప్రార్థించును; ఆతఁడును వానిని దోషవిముక్తునిఁ జేయును.

వి "ప్రత్యక్షముగా" అని యర్థమిచ్చు 'అంజసా' యనుపదము ఈవాక్యమున ప్రధానము. బ్రహ్మదర్శనము పూర్తిగా పాపవిమోచనమును పొందుటకు తోడ్పడును



# పదునేనవ అధ్యాయము

---

**మూ** నావిరతో దుశ్చరితాన్నాశాన్తో నాసమాహితః,
నాశాన్తమానసోవాపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్.

[కఠ. ౧-అ, ౨-వ, ౨౪-వా.

టీ దుశ్చరితాత్=పాపకర్మమునుండి, నావిరతః=విరతిని పొందనివాఁడును, నాశాన్తః=ఇంద్రియచాంచల్యరహితుఁడు కానివాఁడును, నా సమాహితః = ఏకాగ్రచిత్తము లేనివాఁడును, నాశాన్తమానసోవాఽపి=కర్మఫలాపేక్షవలన శాంతిలేని మనస్సుగలవాఁడును, ప్రజ్ఞానేన = కేవలము జ్ఞానముచేత, ఏనం=ఈ పరమాత్మను, న అప్నుయాత్=పొందఁడు

తా ఏ మనుజుఁడు దుష్కర్మలను విడిచిపెట్టఁడో, ఇంద్రియచాంచల్య రహితుఁడు గాఁడో, ఎవ్వనిచిత్తము ఏకాగ్రమయినదిగాక విక్షిప్తమై యుండునో, కర్మఫలాపేక్ష బద్ధమై యెవ్వని మనస్సు శాంతి విహీనమై యుండునో అట్టివాఁడు కేవలము జ్ఞానమాత్రముచేత పరమాత్మను పొందనేరఁడు

వ్యా ప్రియతముఁడగు పరమాత్మను తెలిసికొంటిమి; కాని అతని మీఁద నిలుకడగా మనస్సును నిలిపి, అతనితోడి ఆధ్యాత్మయోగము వలన కలిగెడు విమలానందము నెన్నఁడును ఆస్వాదింపలేక పోతిమి. అతఁడు మహనీయుఁడనియు, విశుద్ధుఁడనియు నెఱింగియు మన ప్రవర్తనమును ఉన్నతమును విశుద్ధమును జేసికొని అతని సహవాసము ననుభవించుటకు ఉప యుక్తులము గాక పోతిమి. అతనిని నియంతయనియు, విధాతయనియు తెలిసికొన్నను అతఁడుచూపిన పుణ్యపథమున నొకప్పుడును మనము నడువ లేకపోతిమి. కేవలము స్వార్థసాఫల్యము కొఱకే పుట్టినప్పటినుండియు కాల మును వినియోగించితిమి ఇట్లయినచో నిఁక నతనిని పొందఁగలమన్న ఆశ కవకాశ మెక్కడ?

వి మొట్టమొదటి పదునాల్గుఅధ్యాయములలోను బ్రహ్మస్వరూప మును గూర్చి విచారించి యీకడపటి రెండుఅధ్యాయములలోను (బ్రహ్మ జ్ఞానమును బడయుటకు నెట్టి నైతికయోగ్యత లుండవలయునో వానినిగూర్చి మహర్షి దేవేంద్రనాదరాకూరులవారు ముచ్చటించియున్నారు ఈమొదటి వాక్యము ఈశ్వరుని పొందుటకు కావలసిన ఆత్మశిక్ష, ఆత్మ పారిశుద్ధ్యము నుగూర్చి ప్రస్తావించుచున్నది చిత్తపారిశుద్ధ్యములేక కేవలము బ్రహ్మ విషయకజ్ఞానసంపాదనమువలననే ఆధ్యాత్మికజీవనము సాధ్యము గాదని యిది ఖండితముగా తెలుపుచున్నది

మూ శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్య మేతస్తౌ
సమ్పరీత్య వివినక్తి ధీరః,
తయోః శ్రేయ ఆదదానస్య సాధు భవతి
హీయతేర్థాత్ య ఉ ప్రేయోవృణీతే ౨

టీ. శ్రేయశ్చ = శ్రేయమును (ఆశ్రయింపవలసినది), ప్రేయః=ప్రేయమును (ప్రీతికివిషయమైనది), మనుష్యం=మనుష్యుని, ఏతః = పొందుచున్నవి తౌ = ఆ రెంటిని, ధీరః=వివేకి, సంపరీత్య = చక్కఁగా ఆలోచించి, వివినక్తి = విభజనచేయుచున్నాఁడు తయోః=వానిలో, శ్రేయః = శ్రేయమును, ఆదదానస్య=గ్రహించినవానికి, సాధు = సత్వదవి, భవతి=కలుగుచున్నది యఉ=ఎవ్వఁడు, ప్రేయః = ప్రేయమును, వృణీతే=గ్రహించునో (వాఁడు), అర్థాత్ = పరమార్థమును విడిచి, హీయతే=వేఱగుచున్నాఁడు.

తా. శ్రేయఃప్రేయములు మనుష్యునికి ప్రాప్తించును; అతఁడు చక్కఁగా వివేచనచేసి యీరెండింటిని విడదీయును వీనిలో నెవ్వఁడు శ్రేయమును గ్రహించునో, అతనికి శుభము సమకూడును ఇఁక నెవ్వఁడు ప్రేయమును గ్రహించునో అతఁడు పరమార్థమునుండి భ్రష్టుఁడగును.

వ్యా. ఈశ్వరునిమార్గము నవలంబించుట శ్రేయము. విషయసుఖములలో నిమగ్నమగుట ప్రేయము. ఒకప్పుడు ఈశ్వరునిమార్గము నవలంబింప బుద్ధిపుట్టును, మఱియొకప్పుడు విషయసుఖము మనస్సు నాకర్షించును. ఎవ్వఁడు ఈశ్వరునిపథము నవలంబించునో అతఁడు పరమమంగళమును పొందును. ఇఁక నెవ్వఁడు విషయసుఖమునందు నిమగ్నుఁడగునో అతఁడెన్నఁటికిని పరమపవిత్రమయిన ఆబ్రహ్మానందము ననుభవించుటకు ఉపయుక్తుఁడు కాఁజా

లఁడు ఎవ్వఁడు ఈశ్వరుని ప్రేమించునో, అతఁడు పరమప్రేమాస్పదుఁడగు ఈశ్వరునిచే విధింపఁబడినదానినిగా నెంచి సాంసారికకార్యమును నిర్వహించును ఇఁక నెవ్వఁడు సంసారాసక్తిచే బద్ధుఁడై యుండునో అట్టివాఁడు సాంసారికసుఖాభిలాషతో పరమమంగళాలయుఁడగు ఈశ్వరుని ఉపాసించును సంసారాసక్తిగల స్వార్థపరుఁడగు వ్యక్తి 'ఓపరమాత్మా! నీయాజ్ఞాను సారముగా లోకహితము నిమిత్తమును నీప్రీతి నిమిత్తమును నే నీ సంసార యాత్రను నిర్వహింపఁబూనుకొను చున్నాను" అని యెన్నఁటికిని మనః పూర్వకముగా నుడువఁజాలఁడు. ఎప్పుడు ఉత్సాహపూర్వకముగా నీవు ఈ వాక్యమును పలుకగల్గుదువో, ఎప్పుడు నీసమస్తకార్యములకును ఇదియే ఏక మాత్రలక్ష్యమగునో అపుడు శ్రేయమును చక్కఁగా నవలంబింపఁ గల్గితి నని నీవు తెలిసికొనుము.

వి. పైన సూచించినట్లు ద్వితీయవల్లిలోని ౧, ౨ వాక్యములలోని భాగములను చేర్చుటవలన నిది యేర్పడినది. ధర్మమునకును అధర్మమునకును, కర్తవ్యమునకును సుఖప్రీతికిని గలభేదమును స్పష్టీకరించుటయే ఈవాక్యము యొక్క తాత్పర్యము.

మూ యథాకారీ యథాచారీ తథా భవతి
సాధుకారీ సాధుర్భవతి,
పాపకారీ పాపో భవతి
పుణ్యః పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన　　3

[బృహ. ౧-అ, ౪-బ్రా, ౫-వా.]

టీ. యథాకారీ = ఏలాగు చేసెడివాఁడో, యథాచారీ=ఏలాగు నడిచెడువాఁడో, తథాభవతి = ఆలాగే అగుచున్నాఁడు సాధుకారీ=సత్కార్యము చేసెడివాఁడు, సాధు భవతి=సత్పురుషుఁడగుచున్నాఁడు పాపకారీ = పాపకృత్యము చేసెడివాఁడు, పాపః=పాపాత్ముఁడు, భవతి = అగుచున్నాఁడు. పుణ్యేనకర్మణా=పుణ్యకార్యముచేత, పుణ్యఃభవతి=పుణ్యాత్ముఁడగుచున్నాఁడు (ఆత్మ పవిత్రమగుచున్నది); పాపేన = పాపకృత్యముచేత, పాపః=పాపాత్ముఁ డగుచున్నాఁడు; (ఆత్మ పాపమయమగుచున్నది)

తా॥ ఎట్టికర్మలఁ జేయునో, ఎట్టినడత నడచునో, మనుష్యుని కట్టిగతి సంప్రాప్తమగును ఎవ్వఁడు సత్కర్మలఁ జేయునో, అతఁడు పుణ్యాత్ముఁడగును మఱి యెవ్వఁడు పాపకర్మలఁ జేయునో అట్టివాఁడు పాపాత్ముఁడగును. పుణ్యకర్మలవలన ఆత్మ పాపమయమగును

వ్యా॥ పాపకర్మ పరిత్యాగ మూలముననను, పుణ్యకర్మానుష్ఠాన మూలముననను, ఆత్మను పవిత్రముచేసి ఈశ్వరుని సహవాసమును పొంద వలయును.

వి॥ ఈ వాక్యము బౌద్ధమతమువలె కార్యము ప్రవర్తనము ప్రధానములైన వని నొక్కి వక్కాణించుచున్నది. తా॥ జేయుకార్యమునుబట్టి

మనుష్యుఁడు మాఱుచున్నాఁడు చెడుకార్యముల చేయువాఁడు చెడ్డవాఁ డగుచున్నాఁడు మంచికార్యములఁ జేయువాఁడు మంచివాఁ డగుచున్నాఁడు. మాఱిపోయెడు పరిస్థితులనుబట్టి ఆత్మ మాఱిపోవునట్టిది గా దని ఉపనిషత్తులందందుగల అభిప్రాయమునకు నీ భావము విరుద్ధమయినది.

మూ॥ య స్త్వవిజ్ఞానవాన్ భవత్యయు క్తేనమనసా సదా,
తస్యేంద్రియాణ్యవశ్యాని దుష్టాశ్వా ఇవసారథేః ౪

[కఠ ౧-అ, ౩-వ, ౫-వా.]

టీ. యస్తు=ఎవ్వఁడు, అవిజ్ఞానవాన్ = అవివేకియును, సదా = ఎల్లప్పుడును, అయు క్తేనమనసా = వశీభూతముగాని మనస్సుతో గూడుకొనినవాఁడును, భవతి=అగుచున్నాఁడో, తస్య=అతనియొక్క, ఇంద్రియాణి=ఇంద్రియములు, సారథేః= రథికునియొక్క, దుష్టాశ్వాఇవ=దుష్టాశ్వములవలె, అవశ్యాని= వశపడనివి (భవన్తి=అగుచున్నవి).

తా॥ ఏమానవుఁడు వివేకహీనుఁడో, ఎవ్వనిమనస్సు వశీభూతముగానిదో, అట్టివాని ఇంద్రియములు సారథియొక్క దుష్టాశ్వములంబోలి వశ్యములై యుండవు

వ్యా॥ ఎవ్వనికి మనస్సు స్వాధీనములోనుండదో ఆ దురదృష్టవంతుఁడగు మనుజుని ఆ మనస్సు ధర్మపథమునుండి తప్పించి చెడమార్గమును

బట్టించి కంటకమయమయిన పాపారణ్యమున పడఁద్రోసి అంతులేని వేదనము నకు లోనుజేయును కావున మనస్సుగాని,యింద్రియములుగాని బుద్ధివృత్తికి నెంతమాత్రము వశ్యము కానివి కాగూడదు, ధర్మశాసనము నతిక్రమింపఁ గూడదు.

వి ఇదియు, దీని తరువాతవచ్చు నాల్గువాక్యములును కఠోప నిషత్తు ౧-వ అధ్యాయము, ౩-వ వల్లిలోని, ౫ మొదలు ౮-వ వాక్య ములై యున్నవి మూలములో వీనికి ముందు మఱిరెండు వాక్యములుగలవు. వీనిలోనే యీ నాల్గువాక్యముల రహస్య మిమిడియున్నది ఇందు మానవ శరీరము రథముగను, జీవాత్మ రథికుఁడుగను, బుద్ధి సారధిగను, మనస్సు కళ్లె ముగను, ఇంద్రియములు గుఱ్ఱములుగను,విషయములు బాటలుగను వర్ణింపఁ బడినవి మహర్షి దేవేంద్రనాథఠాకూరుగా రీ రెండువాక్యములను వదలి వైచిరి. ఇపు డీవాక్యములో అస్వాధీనమైన మనస్సు వశ్యములుగాని గుఱ్ఱము లచే లాగఁబడు రథముతో పోల్చఁబడినది ఆ గుఱ్ఱము లెట్లు రథమును తప్పుత్రోవ కీడ్చుకొనిపోవునో, అదేవిధమున వశీభూతములుగాని ఇంద్రియ ములు మనుష్యుని పాపపథమునకు నెట్టుకొనిపోవును

మూ. యస్తు విజ్ఞానవాన్భవతి యుక్తేనమనసా సదా,
తస్యేన్ద్రియాణివశ్యాని సదశ్వాఇవ సారథేః ౫

[కఠ ౧-అ, ౩-వ, ౬-వా.]

టీ యస్తు=ఎవ్వఁడు, విజ్ఞానవాన్=వివేకియును, సదా= ఎల్లప్పుడును, యుక్తేనమనసా = వశీభూతమైన మనస్సుతో

గూడుకొనినవాఁడును, భవతి=అగుచున్నాఁడో, తస్య=అతని యొక్క, ఇంద్రియాణి = ఇంద్రియములు, సారథేః = రథికుని యొక్క, సదశ్వాః ఇవ=మంచిగుఱ్ఱములవలె, వశ్యాని=స్వాధీన మైనవి (భవన్తి=అగుచున్నవి).

తా॥ ఎవ్వఁడు జ్ఞానవంతుఁడో, స్వాధీనమయిన చిత్తము గలవాఁడో అట్టివానికి సకలేంద్రియములును సారథికి వశీభూతములయిన అశ్వములచందమున లోఁబడి యుండును

వ్యా॥ ఎవ్వని ఇంద్రియములు బుద్ధివృత్తి కధీనములో అతనిని ఆ ఇంద్రియములు ఈశ్వరప్రతిష్ఠితమయిన ధర్మపథమున గొంపోయి, అతనికి మిక్కిలి శుభము నొడఁగూర్చును

వి॥ ఈవాక్యము, పైవాక్యములో చెప్పఁబడినవిషయమునకు, రెండవపక్షమును సూచించుచున్నది. స్వాధీనచిత్తము వశ్యములయిన గుఱ్ఱములచే లాగఁబడిన రథమువంటిదనియు, గమ్యస్థానమునకు సురక్షితముగా చేర్చునదనియు నిది తెలుపుచున్నది

మూ. యస్త్వవిజ్ఞానవాన్ భవత్యమనస్కః సదాఽశుచిః,
న స తత్పదమాప్నోతి సంసారఞ్చాధిగచ్ఛతి  ౭

[కఠ ౧-అ, 3-వ, ౭-వా.]

టీ. యస్తు=ఎవ్వఁడు, అవిజ్ఞానవాన్=అజ్ఞుఁడును, అమనస్కః=మనస్సును వశమున లేనివాఁడును, సదా=సర్వదా, అశుచిః=అపరిశుద్ధుఁడును, భవతి=అగుచున్నాఁడో, సః=వాఁడు, తత్పదం=ఆ స్థానమును (బ్రహ్మమును), నాప్నోతి=పొందఁడు. సంసారఞ్చ=సంసారమును, అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు

తా॥ ఎవఁడు అజ్ఞుఁడో, అవశచిత్తుఁడో, సర్వదా అశుచిగా నుండువాఁడో అతఁడు బ్రహ్మపదమునుపొందఁడు; విషయములయందే నిమగ్నుఁడగును.

వ్యా॥ ఎవఁడు ఈశ్వరుని విశుద్ధస్వరూపము నెఱుఁగఁడో, ఎవఁడు తనమనస్సును స్వాధీనమం దుంచుకొనఁజాలఁడో, పాపచింతన, పాపాలాపన, పాపానుష్ఠానముల మూలమున నెవ్వఁడు సర్వదా అపవిత్రుఁడై యుండునో అట్టివాఁడు విషయభోగములయందే పరిభ్రమణము చేయును. వినశ్వరమగు ఐహిక సుఖముయొక్క యావలిగట్టగు అభయబ్రహ్మపదమును పొందఁడు.

వి॥ అస్వాధీనచిత్తులు బ్రహ్మపదమును పొందఁజాలరని పయివాక్యములలోని అభిప్రాయము నే యిది గూడ స్పష్టీకరించుచున్నది.

**మూ॥ యస్తు విజ్ఞానవాన్ భవతి సమనస్కః సదాశుచిః,**
**సతుతత్పదమాప్నోతి యస్మాద్భూయోనజాయతే. ౭**

[కఠ ౧-అ, 3-వ, ౮-వా.]

టీ యస్తు=ఎవడు, విజ్ఞానవాన్ = వివేకియును, సమనస్కః=వశ్యచిత్తుడును, సదా=సర్వదా, శుచిః=పరిశుద్ధుడును, భవతి=అగుచున్నాడో, సతు=వాడు, యస్మాత్ = ఏబ్రహ్మపదమునుండి, భూయః=తిరిగి, నజాయతే=పుట్టడో, తత్పదం= ఆ బ్రహ్మస్థానమును, ఆప్నోతి=పొందుచున్నాడు.

తా. ఎవ్వడు జ్ఞానవంతుడో, స్వాధీనుడో, సర్వదా శుద్ధచిత్తుడో, అతడు ఏబ్రహ్మపదమునుండి యిక చ్యుతిని పొందుట సంభవింపదో, అట్టి బ్రహ్మపదమును పొందును

వ్యా ఎవ్వడు ధర్మము నాశ్రయించి విశుద్ధచిత్తుడగునో అతనికి ధర్మము పరమబంధువయి బ్రహ్మరూపమయిన నికేతనమున కతనిని గొంపోవును అచ్చటనుండి యిక నతడు చ్యుతిని పొంది అధోగతి జెందుట తటస్థింపదు అనంతమైన ఉన్నతినే అతడు పొందును.

మూ. విజ్ఞానసారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్నరః,
సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదం ౯

[కఠ ౧-అ, 3-వ, ౯-వా.]

టీ యస్తు=ఎవడు, విజ్ఞానసారథిః = జ్ఞానమునే సారథిగాగలవాడును, మనః ప్రగ్రహవాన్=వశీభూతమైనమనస్సు

గలవాఁడు నైన, నరః=మనుష్యుఁడో, సః=వాఁడు, అధ్వనః= సంసారగతికి, పారః=ఆవలిగట్టగు, తత్ విష్ణోః = ఆ సర్వవ్యాపి యైన పరబ్రహ్మముయొక్క,పరమంపదం=శ్రేష్ఠమైన స్థానమును, ఆప్నోతి=పొందుచున్నాఁడు

తా విజ్ఞాన మెవ్వని సారధియో మనోరూపమయిన రజ్జు వెవనికి వశీభూతమైయున్నదో అతఁడు ఐహికమునకు పారమగు సర్వవ్యాపియైన పరబ్రహ్మరూపమగు పరమపద మును పొందును

వ్యా. ఎవఁడు తనమనసును జ్ఞానమునకును ధర్మమునకును వశము చేయునో అతఁడు దుర్జయమగు విషయమోహమునుండి ముక్తుఁడై సర్వ వ్యాపియగు పరబ్రహ్మమును పొందును.

వి. ఈ వాక్యము వెనుకటిదానిలోని భావమునే తిరిగి చెప్పు చున్నది. బ్రహ్మపదము సంసారమునకు ఆవలిగట్టున నున్నదని నుడువుట ఒక విశేషము.

మూ. తద్విష్ణోః పరమం పదం,
సదా పశ్యన్తి సూరయః దివీవచక్షురాతతమ్. ౯

[ఋగ్వే. ౧-గ్రం, ౨౨-మం, ౨౦-ఋ].

టీ తత్=ఆ, విష్ణోః = సర్వవ్యాపి యగు (బ్రహ్మము యొక్క), పరమం=శ్రేష్ఠమైన, పదం=స్థానమును, సూరయః = బ్రహ్మవిదులు. సదా=ఎల్లప్పుడును, దివి=ఆకాశమందు, ఆతతం= వ్యాపించిన (వస్తువును), చక్షుఃఇవ = కన్నువలె, పశ్యన్తి = చూతురు

తా చక్షువు లెవ్విధమున ఆకాశమునందు వ్యాపించి యున్న వస్తువులను దర్శించునో అవ్విధమున సర్వవ్యాప్త మయిన పరబ్రహ్మముయొక్క పరమస్థానమును బ్రహ్మవిదులు సర్వదా దర్శింతురు

వ్యా ఈ ఆకాశమునందలి పొడవు వెడల్పులతో కూడుకొని యున్న వస్తువులనెల్ల, కన్నులు తెరచినంతనే మన మెట్లు కాంచగల్గుదుమో తద్రూపముననే ఈశ్వరపరాయణులగు బుద్ధిమంతులు ఏకాగ్రచిత్తులై విశుద్ధ జ్ఞాననేత్రద్వారమున తమతమ ఆత్మాభ్యంతరప్రదేశములందు పరబ్రహ్మమును దర్శించెదరు అందుచే ఆత్మరూపమయిన ఉజ్జ్వలకోశమే సర్వవ్యాపియగు పరబ్రహ్మముయొక్క పరమస్థానము ప్రతిమానవుని ఆత్మయే అతని శ్రేష్ఠమైన ఆసనము

వి బ్రాహ్మధర్మముయొక్క మొదటికూర్పులలో నీవాక్యము లేదు. మహర్షి దీనిని తరువాత చేర్చెను

ఈ వాక్యము ఋగ్వేదమునందలి ప్రథమమండలములోని ౨౨-౨౦ సూక్తములలోనిది ఇందు మహర్షి దేవేంద్రనాథరాకూరు పరబ్రహ్మపద

మును నిర్వచించియున్నాఁడు. వ్యాఖ్యానములో నతఁడు పరిశుద్ధమయినమన స్సే పరమబ్రహ్మపదమని నుడివియున్నాఁడు ఆకాశమునందలి వస్తువునవలె జ్ఞాను లద్దానిని స్పష్టముగను ప్రత్యక్షముగను చూడఁగలరు ఋగ్వేదమునం దది విష్ణువుయొక్క పరమపదముగా పేర్కొనఁబడియెను. బ్రాహ్మధర్మమునం దీ విష్ణుపదము నుపయోగించుట కిదియే మొదటిసారి

మూ అనన్దా నామ తే లోకా అన్ధేన తమసావృతాః,
తాంస్తే ప్రేత్యాభిగచ్ఛన్త్యవిద్వాంసోఽబుధో జనాః.

[బృహ ౪-అ, ౪-బ్రా, ౧౧-వా.]

టీ అనన్దాః=ఆనందములేని, నామ = ప్రసిద్ధములైన, తేలోకాః=ఆలోకములు, అన్ధేనతమసా=కటిక చీఁకటిచేత, ఆవృతాః=చుట్టఁబడియున్నవి (యే=ఎవరు) అవిద్వాంసః=బ్రహ్మజ్ఞానము లేనివారును, అబుధః = దుర్బుద్ధిగలవారును అగు, జనాః=జనులో, తే=వారు, ప్రేత్య=మరణము పొంది, తాన్=ఆ లోకములను, అభిగచ్ఛన్తి=పొందుచున్నారు

తా ఆనందశూన్యములును నిబిడాంధకారపరివృతములు నగులోకములని ఎవ్వి చెప్పఁబడుచున్నవో ఆ లోకములను దుర్బుద్ధులు అజ్ఞానులు నగువ్యక్తులు మరణానంతరము పొందుదురు.

వ్యా॥ ఎవ్వరు ఈ భూలోకమునందు జ్ఞానము యొక్కయు, ధర్మము యొక్కయు సంపాదనా విషయమున నిర్లక్ష్యముగానుండి పవిత్ర బ్రహ్మానందము ననుభవింపరో అట్టివారు తమ మరణానంతరము జ్ఞానమయము లును ఆనందమయములును నగు లోకములకు దూరమునం దుండవలసినవా రగుదురు. ఎవ్వఁ డెంతమట్టునకు జ్ఞానము యొక్కయు, ధర్మము యొక్కయు, సాహాయ్యమువలన ఈ లోకములో బ్రహ్మానందము ననుభవించునో అంతమట్టునకు అతఁడు ఉత్కృష్టగతిని పొందును. కావున ఇచ్చట నుండఁగనే మానవుఁడు మనస్సును చిక్కబట్టుకొని పవిత్రుఁడై, ఈశ్వరునితో సంబంధమును స్థాపించుకొనవలయును. ఉత్కృష్టగతిని పొందుటకు ఉపాయాంతర మెద్దియు లేదు.

వి॥ ఈ వాక్యము వెనుకటిభావముయొక్క రెండవపక్షమును సూచించుచున్నది. పుణ్యాత్ములు విష్ణులోకమునకుఁ బోవుచుండఁగా దుష్ట బుద్ధులు అజ్ఞానులు నగువారు ఆనందశూన్యమును అంధకారమయము నగు లోకమున కరుగుదు రని చెప్పఁబడినది. పునర్జన్మసిద్ధాంతమును గూర్చిన ప్రస్తావన ఇచ్చట లే దని మనము గ్రహింపనగును. సన్మార్గులు విష్ణుపదమును లేక బ్రహ్మపదమును పొందుదురు. దుర్మార్గులు ఆనందశూన్యములును అంధకారావృతములు నగులోకములను పొందుదురు



# పదునాఱవ అధ్యాయము

మూ. శాన్తోదాన్త ఉపరత స్తితిక్షుః సమాహితో
భూత్వా ఆత్మన్యేవాత్మానం పశ్యతి ౧

[బృహ ౪-అ, ౪-బ్రా, ౨౩-వా]

టీ (బ్రహ్మవేత్త) శాన్తః=ఇంద్రియ చాంచల్యము లేనివాఁడుగాను, దాన్తః=జితేంద్రియుఁడుగాను, ఉపరతః=ఈశ్వరాన్యవస్తువునందు ఆసక్తిలేనివాఁడుగాను, తితిక్షుః = ఒర్పు గలవాఁడుగాను, సమాహితః=ఈశ్వరధ్యానము గలవాఁడుగాను, భూత్వా=అయి, ఆత్మన్యేవ = తన ఆత్మయందే, ఆత్మానం=పరమాత్మను, పశ్యతి=దర్శించును

తా బ్రహ్మవిదుఁడగు వ్యక్తి శాంతుఁడును, దాంతుఁడును, ఉపరతుఁడును, తితిక్షువును, సమాహితుఁడు నయి,తన యందు పరమాత్మను దర్శించును.

వ్యా. ఒకప్రక్క విషయసుఖాపేక్ష మఱియొకప్రక్క ఈశ్వరుని పొందవలయు నని కోరిక. విషయసుఖాపేక్ష యెంత తగ్గునో ఈశ్వరుని

పొందవలయునన్న కోరిక అంత ఉజ్జ్వలమగును ఈశ్వరునిపై కోరిక ఉజ్జ్వలమయ్యెనేని బుద్ధి అతనిని అన్వేషించును, అన్వేషించి ఆ పూర్ణస్వరూపిని పొందినపుడు సర్వత్ర అతఁడు పరిపూర్ణుఁడై యున్నాఁడని కన్గొనును. బ్రహ్మవిదుఁడగు వ్యక్తి జ్ఞానప్రసాదమువలన విశుద్ధుఁడై సత్యమునకు సత్యమును, ప్రాణమునకు ప్రాణమును, చేతనమునకు చేతనము నగు ఆ మంగళస్వరూపుని తన అంతరమున దర్శించి కృతార్థుఁడై పరమపవిత్రమగు బ్రహ్మానందము ననుభవించును. ఆ పూర్ణపురుషుఁడు మనలో నెవ్వరికిని దూరమునం దున్న వాఁడుగాఁడు మన జీవాత్మ యెచ్చట నుండునో, అతఁడు నచట నుండును. సమస్తభూతములును, సమస్తలోకములును, సమస్తజీవులును అతనియెడిలో నాశ్రయమును పొందియున్నవి. ఎంతకాలము జ్ఞాననేత్రము ప్రస్ఫుటితము కాదో అంతకాలము జను లతనిని దూరస్థునిగా భావించెదరు కాని యెవ్వని జ్ఞాననేత్రము ప్రకాశితమగునో, అతఁడు శాంతుఁడును, దాంతుఁడును, ఉపరతుఁడును, తితిక్షువును, సమాహితుఁడునై తన ఆత్మయందు అతనిని దర్శింపఁగల్గును.

ఈ వెనుకటి అధ్యాయమువలె నిదియు నైతికనియమములకు సంబంధించినదై యున్నది. తనమనస్సును ఇంద్రియములను వశపరుచుకొని, విషయవాంఛలకు విముఖుఁడై యెవ్వఁడు భగవంతుని పట్టుదలతో నన్వేషించునో, అతఁడు తన ఆత్మలోనే భగవద్దర్శనము పొందునని ఈ ప్రారంభవాక్యము నుడువుచున్నది. ఇది బృహ ౪-అ. ౪-బ్రా ౨౩ వాక్యములో మొదటి భాగము తక్కినభాగము తరువాతి వాక్యముగా పొందుపఱుపఁబడినది

మూ నైనం పాప్మా తరతి సర్వం పాప్మానం తరతి
నైనం పాప్మా తపతి సర్వం పాప్మానం తపతి
విపాపో విరజోఽవిచికిత్సో బ్రాహ్మణో భవతి ౭

[బృహ. ४-అ, ४-బ్రా, ౨౩-వా]

టీ ఏనం = ఇతనిని (ముముక్షువును), పాప్మా=పాపము, న తరతి=పొందనేరదు. (ఇతఁడో) సర్వం పాప్మానం=అన్ని పాపములను, తరతి = దాఁటుచున్నాఁడు ఏనం=ఇతనిని, పాప్మా = పాపము, న తపతి=దహింపనేరదు (ఇతఁడో)సర్వం పాప్మానం= సమస్తపాపములను, తపతి = దహించుచున్నాఁడు (ఇతఁడు) విపాపః=నిష్పాపియును, విరజః=నిర్మలచిత్తుఁడును, అవిచికిత్సః= కరతలామలకమువలెనే పరబ్రహ్మముయొక్క అస్తిత్వమునందు నిశ్చయబుద్ధిగలవాఁడు నై, బ్రాహ్మణః = బ్రహ్మోపాసకుఁడు, భవతి = అగుచున్నాఁడు

తా పాప మితనిని స్పృశింపనేరదు, ఇతఁడు సకల పాపముల నతిక్రమించును. పాప మితనిని తపింపఁజేయనేరదు సకలపాపముల నితఁడు తపింపఁజేయును ఇతఁడు నిష్పాపియు, నిర్మలచిత్తుఁడును పరబ్రహ్మముయొక్క అస్తిత్వమునందు నిస్సంశయుఁడు నై బ్రహ్మోపాసకుఁ డగును

వ్యా. ఎవఁడు బ్రహ్మరూపమయిన లక్ష్యమునందు తదేకభావమున తనజ్ఞాననేత్రమును నిలిపి ధర్మపథమున నడచునో అతనిని పాపము వచ్చి చేరనేరదు. అతఁడు పాపతాపవిముక్తుఁడై బ్రహ్మోపాసకుఁ డగును

మూ స మోదతే మోదనీయగ్ం హి లబ్ధ్వా
తరతి శోకం తరతి పాప్మానం
గుహాగ్రన్థిభ్యో విముక్తోఽమృతో భవతి　　3

[కర - ముండక]

టీ సః=ఆ విద్వాంసుఁడు, మోదనీయంహి=హర్షాస్పదుఁడగు (బ్రహ్మమును), లబ్ధ్వా=పొంది, మోదతే = ఆనందించుచున్నాఁడు శోకం=మానసికదుఃఖమును, తరతి=అతిక్రమించుచున్నాఁడు పాప్మానం = పాపమును, తరతి=అతిక్రమించుచున్నాఁడు గుహాగ్రన్థిభ్యః = హృదయమునందలి అజ్ఞానమోహము లనెడి బంధములనుండి, విముక్తః=విడువఁబడినవాఁడై, అమృతః=నిత్యపదవిగలవాఁడు, భవతి=అగుచున్నాఁడు

తా ఆనందమయుఁడగు పరబ్రహ్మమును పొందినవాఁడై అతఁడు ఆనందము నాస్వాదించును శోకమునుండియు పాపమునుండియు ఉత్తీర్ణుఁడగును సమస్తహృదయగ్రంథులనుండియు విముక్తుఁడై అమృతుఁడగును

వ్యా సర్వశ్రేష్ఠమును, మనస్సునకు సంపూర్ణతృప్తినీయఁగల ఏక మాత్రవస్తువు నగు పరబ్రహ్మమును పొంది తద్గతప్రాణుఁడయిన బ్రహ్మజ్ఞుఁడు అనిర్వచనీయమైన సౌఖ్యము ననుభవించును. పరబ్రహ్మమును పొంది అతని ఇచ్ఛానుసారముగా సాంసారికకార్యముల నిర్వహించువాఁడు ఫలాపేక్షా శూన్యుఁడై అతనిచే ప్రతిష్ఠింపఁబడిన ధర్మపథమున నడచుచుండును స్వార్థ పరత్వమును విసర్జించి అతనికి ప్రీతికరములగు కార్యములనుగావింప యత్నించుచుండును అందుచే అతఁడు శోకమునుండియు, పాపమునుండియు ఉత్తీర్ణుఁడగును. విషయవాంఛలనుండి విముక్తుఁడై అతఁడు శాశ్వతుఁడగు పరబ్రహ్మమునందు సర్వదా వసించును.

వి కఠోపనిషత్తు ౧-అధ్యాయము, ౨-వ వల్లి, ౧౩-వ వాక్యము లోని "స మోదతే మోదనీయగ్ం హి లబ్ధ్వా" అను భాగమును ముండకోపనిషత్తులోని ౩-వ ముండకము, ౨-వ ఖండము, ౯-వ వాక్యముయొక్క చివరభాగమునకుఁ జేర్చి యీ వాక్యము కూర్పఁబడినది బ్రహ్మవిదుఁడగు వానినిగూర్చి యిది ఇంకను విస్తరించి చెప్పుచున్నది అట్టివాఁడు పరబ్రహ్మమునం దానందించుచు, హృదయగ్రంథులనుండి విముక్తుఁడై అమృతుఁడగును.

మూ సత్యాన్న ప్రమదితవ్యం ధర్మాన్న ప్రమదితవ్యం
కుశలాన్న ప్రమదితవ్యమ్ ౪

[తైత్తి ౧-వ, ౧౧-అను.]

టీ సత్యాత్=సత్యమునుండి, న ప్రమదితవ్యం=విడిబడఁ గూడదు ధర్మాత్=ధర్మమునుండి, న ప్రమదితవ్యం = విడిబడఁ గూడదు కుశలాత్=ఆత్మరక్షణార్థమయిన శుభకర్మమునుండి, న ప్రమదితవ్యం=విడిబడఁగూడదు

తా సత్యమునుండి, విడిపోవద్దు, ధర్మమునుండి విడిపోవద్దు, శుభకర్మమునుండి విడిపోవద్దు

వ్యా సత్యవాక్కును,సత్యవ్యవహారమును, బ్రాహ్మధర్మముయొక్క ప్రాణము ఎవ్వరు సత్యస్వరూపుఁడగు బ్రహ్మమును పొంద నభిలషింతురో వా రెన్నఁడును సత్యమునుండి విడిపోరు బ్రహ్మపరాయణుఁడగు బ్రహ్మనిష్ఠుఁడు సద్భావముతోడను, సాధుభావముతోడను సర్వదాధర్మావహుఁడగు ఆ మంగళకరునిచే ప్రతిష్ఠితంబైన ధర్మానుష్ఠానమునందు తత్పరుఁడై యుండును. ధర్మానుష్ఠానము లేక హృదయము పవిత్రముగాదు. ఈశ్వరానుగ్రహము లభింపదు, బ్రహ్మజ్ఞానము ప్రకాశింపదు అందువలన ముముక్షువగువాఁ డెన్నఁడును ధర్మమునుండి విచ్ఛిన్నుఁడుకాఁడు ఈశ్వరుని మంగళేచ్ఛతో మన సదిచ్ఛను జేర్చి అతనిచే ఆదేశింపఁబడిన, సాంసారికహితసాధక కార్యములందు ప్రవేశింపమేని, మనము అతని మంగళభావమును గ్రహింప నేరము. కావున శుభకర్మమునుండి విచ్ఛిన్నము కాఁజనదు

వి ఇదియుం దీని తరువాత వచ్చు ఆరువాక్యములును తైత్తిరీయోపనిషత్తునందలి ౧-వ వల్లిలోని, ౧౧-వ అనువాకమునుండి గ్రహింపఁబడినవి. ఇందు, గురువు తన శిష్యునకు చెప్పవలసిన దంతయు చెప్పి తన్ను విడిచిపోవు

నపుడు వాని కొసంగిన కొన్ని ఆదేశములు గలవు ఇవి మిక్కిలి శ్రేష్ఠము లయినవై భాషాభావములం దెంతయుం సమంజసములై యొప్పుచున్నవి ఈ వాక్యమునందు సత్యమునుండియు ధర్మమునుండియు విడిపోవలదని గురువు శిష్యుని హెచ్చరించుచున్నాఁడు

**మూ సత్యం వద సమూలోవా ఏషపరిశుష్యతి**
**యోఽనృతమభివదతి.** **౫**

[తైత్తి - ప్రశ్న.]

టీ సత్యం=సత్యవచనమును, వద=వచింపుము యః = ఎవ్వఁడు, అనృతం = అసత్యవచనమును, అభివదతి = పలుకు చున్నాఁడో, ఏషః=ఇతఁడు, సమూలోవై = వేఱుతోఁగూడనే, పరిశుష్యతి = ఎండిపోవును (అనఁగా నశించును)

తా సత్యవాక్యమును పలుకుము. ఎవ్వఁడు అసత్య మాడునో అతఁడు సమూలముగా నెండిపోవును

వ్యా సత్యమే బ్రహ్మము, సత్యమే ధర్మమునకు మూలము. అందువలన బ్రహ్మపరాయణుఁడగు సాధుపురుషుఁడు సత్యవ్రతుఁడై సత్యవచనము పలుకును సత్యవ్యవహారము సలుపును.

వి. ఈవాక్యము సత్యమును వచించుట కర్తవ్యమని మఱింతదృఢముగా చెప్పుచున్నది తైత్తిరీయోపనిషత్తు ౧-వ వల్లి, ౧౧-వ అనువాకము

నందు గల ఆదేశము ప్రశ్నోపనిషత్తునందలి ౬వ ప్రశ్నములోని మొదటి వాక్యమునందుగల "అసత్యమాడువాడు వేఱుతోఁగూడ నశించిపోవు"నన్న వాక్యముచే బలపఱుపఁబడినది.

మూ. ధర్మం చర ధర్మాత్ పరం నాస్తి,
ధర్మః సర్వేషాం భూతానాం మధు		౬

[తైత్తి - బృహ.]

టీ ధర్మం=ధర్మమును, చర=ఆచరింపుము ధర్మాత్=ధర్మముకంటె, పరం=శ్రేష్ఠమయినది, నాస్తి = ఒక్కటియు లేదు. ధర్మః=ధర్మము, సర్వేషాంభూతానాం = సర్వభూతములకును, మధు=ఉపకారకమగుటచే మధువువంటిది

తా ధర్మము నాచరింపుము, ధర్మముకంటె శ్రేష్ఠమైనది మఱి యెద్దియు లేదు ధర్మ మెల్లరకును మధువువంటిది

వ్యా కర్తవ్యసాధనమునే ధర్మమందురు తనకు తనయెడల గల కర్తవ్యము, తలిదండ్రుల యెడల గల కర్తవ్యము, ఇరుగుపొరుగువారి యెడలను బంధుజనులయెడలను గల కర్తవ్యము, ప్రభువునెడల గల కర్తవ్యము, దీన దరిద్ర నిరాశ్రయులయెడలగల కర్తవ్యము, స్వదేశమునెడల గల కర్తవ్యము, ఈశ్వరునియెడల గల కర్తవ్యము—మనుష్యుని ఈ సమస్త కర్తవ్యసాధనకును ధర్మమని పేరు ఏదేశమునందు, ఏకాలమునందు, ఏ

అవస్థయందు ఏ కార్యమును జేయుట మనకు కర్తవ్యమో సరిగా ఆదేశము నందు, ఆకాలమునందు, ఆ అవస్థయందు ఆ కార్యమును చేయవలసిన దని మన ఒక్కొక్కరి శుభబుద్ధిని అతఁడు అనుక్షణమును ప్రేరేపించుచున్నాఁడు. మనము అతఁడు చేసెడు ఆదేశములకు సర్వదా వశవర్తులమై సత్యమార్గమున, ధర్మమార్గమున, కల్యాణమార్గమున అడుగులిడుచు పోవుదుమేని ఛిన్నశిర స్కులమయినను అతని అమృతనికేతనమునకు సజీవులమై చేరఁగలము

వి ఈ వాక్యములోని ధర్మం చర' అను మొదటిభాగము తైత్తి. ౧-వ, ౧౧-వ వాక్యములోనిది. దానికి బృహదారణ్యకోపనిషత్తు ౧-వ అధ్యా యము, ౪-వ బ్రాహ్మణము, ౧౪-వ వాక్యమునుండియు ౨-వ అధ్యాయము, ౫-వ బ్రాహ్మణము, ౧౧-వ వాక్యమునుండియు ధర్మమునుగూర్చి ప్రస్తావించు కొన్ని వాక్యములను గైకొని రామూరుగారు చేర్చిరి అయినను ఈ వాక్య ములు చేర్చి కూర్చినట్లుగాక ఒకే శ్రుతిలోనివానివలె కనుపించుచున్నవి

మూ శ్రద్ధయా దేయం అశ్రద్ధయా అదేయమ్ ౭

[తైత్తి. ౧-అ, ౧౧-అను.]

టీ శ్రద్ధయా=శ్రద్ధతో, దేయం=దానము చేయఁదగును అశ్రద్ధయా=అశ్రద్ధతో, అదేయం = దానము చేయఁదగదు

తా శ్రద్ధతో దానము చేయవలయును అశ్రద్ధతో దానము చేయఁగూడదు

వ్యా శోకావిష్టమనస్సుతో దానము చేయఁజనదు. కాని శ్రద్ధతో దానము చేయవలయును.

వి. దానముచేయవలసిన పద్ధతిని గూర్చి ఈవాక్యము నుడువు చున్నది మూలములో "శ్రియా దేయమ్, హ్రియా దేయమ్, భియా దేయమ్, సంవిదా దేయమ్" అని దానమును గూర్చిన మఱి నాల్గు ఆదేశములు గలవు. ఇవన్నియుఁ గలిసి దానమునుగూర్చి ఒక ఉత్తమాదర్శమును ప్రదర్శించు చున్నవి.

**మూ మాతృదేవో భవ పితృదేవో భవ**
**ఆచార్యదేవో భవ.** ౮

[తైత్తి. ౧-వ, ౧౧-అను.]

టీ (త్వం=నీవు), మాతృదేవః = తల్లిని దేవతగాఁ గల వాఁడవు, భవ=కమ్ము పితృదేవః=తండ్రిని దేవతగాఁ గలవాఁడవు, భవ=కమ్ము ఆచార్యదేవః = ఆచార్యుని దేవతగాఁ గల వాఁడవు, భవ = కమ్ము

తా తల్లిని దేవతుల్యురాలినిగా, తండ్రిని దేవతుల్యునిగా, ఆచార్యుని దేవతుల్యునిగా తెలిసికొనుము.

వ్యా ఈ పుడమిలో ఈశ్వరుని మంగళస్వరూపముయొక్క ప్రతిరూపులును ప్రతినిధిస్వరూపులు నై మనల నెవ్వరు ప్రీతిపూర్వకముగా

రక్షించి పాలించుచున్నారో ఆ తల్లిదండ్రుల యెడలను, ఎవ్వని ఉపదేశ ముచే మనము అజ్ఞానాంధకారమునుండి ముక్తులమై జరామరణభయరహితులమును, నిరతిశయుఁడు నగు బ్రహ్మమును పొందితిమో ఆ సద్గురువు నెడలను కృతజ్ఞులమై మనము శ్రద్ధాభక్తులను చూపవలయును

వి. జననీజనకులయెడలను ఆచార్యునెడలను నెట్లు ప్రవర్తింపవలయునో యీ వాక్యము సూచించుచున్నది సరిగా నర్థము చెప్పినచో "తల్లిని దైవముగా చేయుము. తండ్రిని దైవముగా చేయుము. ఆచార్యుని దైవముగా చేయుము" అని యగును మాతృకలో ఈ ఆదేశము అతిథికిఁ గూడ వర్తించు నట్లున్నది ఈ యాజ్ఞకు పూర్వము భగవంతునికిని తల్లిదండ్రులకును చేయవలసిన కర్తవ్యములను మీఱరాదని కలదు

మూ యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని నో ఇతరాణి. ౯

[తైత్తి ౧-వ, ౧౧-అను.]

టీ (త్వయా=నీచేత) యానికర్మాణి=ఏకర్మములు, అనవద్యాని=నిందితములుగావో, తాని=అవి, సేవితవ్యాని = ఆచరింపఁబడవలసినవి, నోఇతరాణి= ఇతరములయినవి (నిందితకార్యములు) కూడవు

తా ఏకర్మలు కల్యాణకరములో వానినెల్ల ననుష్ఠింపవలయును అకల్యాణకరములగు కర్మల ననుష్ఠింపఁగూడదు

వ్యా సకల మంగళాలయుండగు పరమేశ్వరుని శుభాభిప్రాయ మును లక్ష్యమునం దుంచుకొని శుభకాంక్షియై శుభకర్మల ననుష్ఠింపవల యును అశుభకర్మల ననుష్ఠింపరాదు.

మూ యాన్యస్మాకం సుచరితాని తాని
　　త్వయోపాస్యాని నో ఇతరాణి　　౧౦

[తైత్తి. ౧-వ, ౧౧-అను.]

టీ యాని=ఏవి, అస్మాకం=మాయొక్క, సుచరితాని = సదాచారములో, తాని=అవి, త్వయా = నీచేత, ఉపాస్యాని= అనుష్ఠింపఁబడవలసినవి నో ఇతరాణి=ఇతరములు కావు

తా ఏసదాచారములను మేమనుసరించుచుందుమో వానినెల్ల ననుష్ఠింపుము అవ్వానిని తప్ప అన్యకర్మల ననుష్ఠింపకుము.

వ్యా "మేము ఏ సదుపదేశముల నొసంగుచున్నామో, మేము ఏ సదాచారముల ననుష్ఠించుచున్నామో వాని నెల్ల నీ వనుసరింపుము. అస న్మార్గుల కుదృష్టాంతమువలన అసత్కర్మలలో ప్రవేశింపకుము" అని బ్రహ్మ విదుఁడగు ఆచార్యుఁ డుపదేశించుచున్నాఁడు

వి కట్టకడపట జ్ఞానవంతులయొక్కయు పుణ్యవంతులయొక్కయుం దృష్టాంతము ననుసరింపు మని ఆచార్యుఁడు శిష్యునికి హితోపదేశము చేయుం

చున్నాఁడు. కృత్యాకృత్యములనుగూర్చి సందేహము కలిగినపు డనుసరింపఁ దగు సాధారణ సూత్రముగా దీనిని భావింపవచ్చును కర్తవ్యమును నిర్దే శించు విధిలేనప్పుడు శిష్టాత్ముల మార్గము ననుసరింపవలయును.

మూ. ఏతైరుపాయైర్యతతే యస్తు విద్వాన్,
తస్యైష ఆత్మా విశతే బ్రహ్మధామ ౧౧

[ముండక. ౩-ముం, ౨-ఖం,౪-వా]

టీ యస్తు విద్వాన్ = ఏ బ్రహ్మవిదుఁడు, ఏతైః ఉపాయైః=ఈ పూర్వమందు చెప్పఁబడిన ఉపాయములచేత, యతతే=యత్నముచేయుచున్నాఁడో, తస్య=అతనియొక్క, ఏషః ఆత్మా=ఈ జీవుఁడు, బ్రహ్మధామ=బ్రహ్మమను మందిరమును విశతే= ప్రవేశించుచున్నాఁడు.

తా ఏ బ్రహ్మవిదుఁడు ఈ సమస్త ఉపాయములమూలమున బ్రహ్మప్రాప్తికి యత్నించునో అతని ఆత్మ బ్రహ్మరూపమయిన నికేతనమునఁ బ్రవేశించును

వ్యా ఏ బ్రహ్మవిదుఁడు సత్యము నవలంబించి, ధర్మము ననుసరించి శుభకర్మల ననుష్ఠించి మాతాపితలకును ఆచార్యునికిని భక్తిచూపి బ్రహ్మప్రాప్తికి యత్నించునో అతని ఆత్మ బ్రహ్మరూపమయిన నికేతనమున ప్రవేశించును. అతఁడు బ్రహ్మమును పొంది, అతనితో నిత్యసహవాస సంజనిత భూమానందము ననుభవించును.

ఏ ముండకోపనిషత్తులోని యీ వాక్యమును వేఱుచేసి తైత్తిరీయోపనిషత్తు ౧-వ అధ్యాయము ౧౧-వ అనువాకమునందు గల ఆదేశములతోఁ బాటు మహర్షి చేర్చియున్నాఁడు ముండకోపనిషత్తులో నున్నప్పటి కంటె నీవిధముగా మార్పుచేసినపుడే ఆ వాక్యము హెచ్చుగా రాణించుచున్నది. మహర్షి దేవేంద్రనాథుఁడు ఉపనిషత్తులలోని వాక్యముల నెట్లు సద్వినియోగము చేసెనో తెలుపుట కిది యొక నిదర్శనము. పూర్వోక్త ఆదేశముల ననుసరించుచు బ్రహ్మావాప్తికి ప్రయత్నించువాఁడు బ్రహ్మధామమును పొందునని యీ వాక్యము తెలియఁజేయుచున్నది దీనిని బట్టి యీ బ్రహ్మానందము మరణానంతరమున కలుగునదని కనిపించుచున్నది

**మూ** శృణ్వన్తు విశ్వేఽమృతస్య పుత్రా ఆ యే ధామాని
　　దివ్యాని తస్థుః　　౧౨

[యజు - శ్వేతా.]

టీ. అమృతస్య=అమృతునియొక్క, పుత్రాః=పుత్రులగు, యే=ఎవరు, దివ్యాని=ప్రకాశకములైన, ధామాని=స్థానములను, ఆతస్థుః=పొందియుండిరో, విశ్వే=వారందరును, శృణ్వన్తు=విందురుగాక.

తా ఓదివ్యధామ నివాసులగు అమృతుని పుత్రులారా! మీరు ఆలకింపుఁడు

వ్యా ప్రాతఃకాల రవిబింబమువలె అకృతుఁడును, అమృతుఁడునగు బ్రహ్మమును తన అంతరమున కనుఁగొని నూతనోత్సాహపూర్ణుఁడై బ్రహ్మవాది,—

"ఓ అమృతపురుషుని పుత్రులారా! ద్యులోక భూలోక నివాసులరగు దేవతలారా! మనుష్యులారా! వినుఁడు. తిమిరాతీతుఁడగు జ్యోతిర్మయ మహాపురుషుని నేను తెలిసికొన్నాఁడను" అని చెప్పుచున్నాఁడు

వి బ్రాహ్మధర్మముయొక్క ప్రథమ ఖండాంతమునందలి యీ వాక్యములలో, మహర్షి దేవేంద్రనాథఠాకూరు పరమోత్సాహము తోడను విశ్వాసముతోడను బ్రహ్మముయొక్క సర్వవ్యాపకత్వముచుగూర్చియు అతని ఉపలబ్ధివలన కలిగెడు ప్రయోజనమునుగూర్చియు, యజుర్వేదమునందలి ౬-వ అధ్యాయము, ౫వ ఖండము ౬-వ వాక్యము మూలమునను శ్వేతాశ్వతరోపనిషత్తు ౨-వ అధ్యాయము ౮-వ వాక్యము మూలమునను విశదపరచుచున్నాఁడు

మూ. వేదాహమేతం పురుషం మహాన్త
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్,
తమేవ విదిత్వాతిమృత్యుమేతి
నాన్యః పన్థా విద్యతేఽయనాయ. ౧౩

[యజు. ౩౧-అ, ౧౮-మం.]

టీ అహం=నేను, పురుషం=పూర్ణుఁడును, మహాన్తం=గొప్పవాఁడును, ఆదిత్యవర్ణం=ప్రకాశస్వరూపుఁడును, తమసః=అజ్ఞానముకంటె, పరస్తాత్=అవలఁగట్టునైన, ఏతం=ఇతనిని (బ్రహ్మమును), వేద=తెలిసికొనుచున్నాఁడను, తమేవ విదిత్వా=అతనిని ఎఱిఁగియే, మృత్యుం = మృత్యువును, అత్యేతి = అతిక్రమించుచున్నాఁడు అయనాయ = పరమపదప్రాప్తికి (మోక్షమునకు) అన్యఃపన్థా=వేఱుమార్గము, న విద్యతే=లేదు.

తా. నేను, ఈతిమిరాతీతుఁడగు జ్యోతిర్మయ మహాపురుషుని తెలిసికొన్నాఁడను కేవలము అతనిని తెలిసికొనియే సాధకుఁడు మృత్యువు నతిక్రమించును అదితప్ప మోక్షప్రాప్తికి మఱి మార్గాంతరము లేదు

వ్యా ఈ తిమిరాతీతుఁడగు జ్యోతిర్మయ మహాపురుషుని తెలిసికొని సాధకుఁడు మృత్యువు నతిక్రమించును. అతఁడు అనంతకాల పర్యంతము ఆ జ్ఞానమయుఁడును ప్రేమమయుఁడునగు పురుషునికి సహచరుఁడును అనుచరుఁడునై యుండి పరమానందము ననుభోగించును. అతనికి శరణాపన్నుఁడగుట తప్ప మోక్షప్రాప్తికి మఱి ఉపాయాంతరము లేదు.

వి మహోత్కృష్టమైన ఈవాక్యము తొలుత యజుర్వేదములోని ౩౧-వ అధ్యాయములో ౧౮-వ మంత్రము ఇదియే శ్వేతాశ్వతరోపనిషత్తులో ౩-వ అ ౧౮-వ వాక్యముగాఁగూడఁ గనుపించుచున్నది. ఇందు

ఒకానొక ఋషీశ్వరుఁడు దృఢవిశ్వాసముతో అంధకారమున కవ్వల ఆదిత్య వర్ణుఁడయిన మహాపురుషుని నేను తెలిసికొన్నాఁడ నని వెల్లడించుచున్నాఁడు. ఎంతయో కాలము అన్వేషణము చేసి చేసి, అనుమాన అవిశ్వాసములతో నెంతయో పోరాడి,తుట్టతుదకు ఈశ్వరసాన్నిధ్యమును బడసి,మున్నువై జ్ఞానికసత్య మనొకదానిని తెలిసికొన్నపుడు సుప్రసిద్ధ గ్రీసుదేశ పదార్థవిజ్ఞానశాస్త్రజ్ఞుఁడగు ఆర్కిమెడిస్,"యురీకా" "యురీకా," (కనుఁగొంటిని,కనుఁగొంటిని) అని సంతోషపరవశుఁడై అరచినట్లు ఆ ఋషీశ్వరుఁడును "వేదాహమేతం" అని ఉత్సాహ సంతోషముల పట్టఁజాలక ప్రకటించినట్లు తోఁచుచున్నది

**మూ** ఏతత్ జ్ఞేయం నిత్యమేవాత్మసంస్థం,
నాతః పరం వేదితవ్యం హి కిఞ్చిత్ ౧౪

[శ్వేతా. ౧-అ, ౧౨-వా.]

టీ నిత్యమేవ = ఎల్లప్పుడును, ఆత్మసంస్థం = ఆత్మలో నుండెడి, ఏతత్ =ఇది(బ్రహ్మము) జ్ఞేయం=ఎఱుఁగఁదగినది, అతః పరం=దానికంటెవేఱుగా,వేదితవ్యం=ఎఱుఁగవలసినది,కిఞ్చిత్ = కొంచెమును, నాస్తిహి= లేదుకదా!

తా ఏ పరమాత్మ తనలోతాను సర్వదా సంస్థితుఁడై యున్నాఁడో, అతఁడు తెలిసికో దగినవాఁడు అతఁడుగాక తెలిసికోదగిన పదార్థము వేఱెద్దియు లేదు

వ్యా ఏవఁపు సకలమునకును, ఆశ్రయుఁడో, అతఁడు సర్వదా తనలోఁ దా నివసించుచున్నాఁడు అన్వేషించి అతనినే తెలిసికొనుఁడు. అతనిని తెలిసికొన్నచో తెలిసికొనవలసినదంతయు పూర్తియగును. అతని కావల తెలిసికొనవలసిన వస్తువు మఱియేమియు లేదు.

వి ఈ వాక్యము బ్రహ్మజ్ఞానమును మించినదెద్దియు లేదని వాక్రుచ్చుట యెంతయు సమంజసముగా నున్నది. వెనుకటి దానితో నిది సరిగా నతికియున్నది.

మూ సంప్రాప్యైనమృషయో జ్ఞానతృప్తాః
కృతాత్మానో వీతరాగాః ప్రశాన్తాః,
తే సర్వగం సర్వతః ప్రాప్య ధీరా
యుక్తాత్మానః సర్వమేవావిశన్తి ౧౫

[ముండక. 3_ముం, ౨-ఖం, ౫-వా.]

టీ ఋషయః=సూక్ష్మదృష్టిగలవారలు, ఏనం=ఈ పరమేశ్వరుని, సంప్రాప్య=చక్కఁగా కనుఁగొని, జ్ఞానతృప్తాః=జ్ఞానముచేత తృప్తిపొందినవారును, కృతాత్మానః=పరిశుద్ధమైన ఆత్మగలవారును, వీతరాగాః=విడిచిన రాగాదిదోషములు గలవారును, ప్రశాన్తాః=ఇంద్రియచాంచల్యము లేనివారును, (భవన్తి=అగుచున్నారు) తే=ఆ, ధీరాఃఏవ=అట్టిజ్ఞానులే, సర్వగం=సర్వవ్యాపియైన పరమేశ్వరుని, సర్వత్ర=అంతటను, ప్రాప్య=

పొంది, యుక్తాత్మానః = సమాహిత స్వభావముకలవారలై, (జ్ఞానేన=జ్ఞానముచేత) సర్వమేవ = సమస్తమును, ఆవిశన్తి= ప్రవేశించుచున్నారు

తా ఋషులు ఈపరమేశ్వరునిపొంది జ్ఞానమూలక మయిన తృప్తిని గాంచినవారును ఆత్మోన్నతి బడసినవారును, విషయములందాసక్తిలేనివారును, ప్రశాంతచిత్తులు నయ్యెదరు అట్టి యుక్తాత్ములగు ధీరులు సర్వవ్యాపియగు పరమాత్మను సర్వత్ర కన్గొని అన్నిటిలోను ప్రవేశించెదరు

వ్యా ఏ ధీరులు జ్ఞానద్వారమున ఆ సత్యపురుషుని తెలిసికొనిరో, ప్రీతిద్వారమున అతని మంగళభావముయొక్క అర్చనమును గావించిరో, అతని మంగళేచ్ఛతో తమ సదిచ్ఛ నైక్యము చేసి, యుక్తాత్ములయిరో వారు సర్వగతుఁడగు సకలమంగళాలయుని సహవాసమును పొంది అన్నిటియందును ప్రవేశించి, అన్నిటిలోను ఆ ప్రేమమయుని, అమృతమయుని దర్శింతురు

వి ఈ వాక్యము వెనుకటివాక్యములోని భావమును విశదపరుచుచున్నది భగవంతుని తెలిసికొనగనే, మనుజుని జ్ఞానపిపాస తృప్తిచెందుచున్నది ప్రేమ సర్వోన్నతి మీద నిలుచుచున్నది అతని సకల వాంఛలును తీరుచున్నవి.

మూ విజ్ఞానాత్మా సహ దేవైశ్చ సర్వైః
ప్రాణా భూతాని సమ్ప్రతిష్ఠన్తి యత్ర,
త దక్షరం వేదయతే యస్తు సౌమ్య
స సర్వజ్ఞః సర్వమేవావివేశ. ౧౬

[ప్రశ్న. ౪-ప్ర, ౧౧-వా.]

టీ సౌమ్య=ఓప్రియదర్శనుఁడా, సర్వైః దేవైశ్చసహ = సకలఇంద్రియములతోఁ గూడిన, విజ్ఞానాత్మా = జ్ఞానముగల జీవాత్మయును, ప్రాణాః=ప్రాణములును, భూతాని=భూతములును, యత్ర=ఏఅక్షరస్వరూపమగు పరబ్రహ్మమునందు, సంప్రతిష్ఠంతి=ఉన్నవో, తత్ అక్షరం = ఆ నాశరహితుఁడైన పరబ్రహ్మమును, యస్తు=ఎవఁడైతే, వేదయతే= తెలిసికొనుచున్నాఁడో, సఃసర్వజ్ఞః=ఆ సమస్తమును తెలిసినవాఁడు, (జ్ఞానేన= జ్ఞానముచేత) సర్వమేవ = అన్నిటిలో. ఆవివేశ = ప్రవేశించుచున్నాఁడు

తా ఓప్రియశిష్యా! జీవుఁడును, ఇంద్రియములును, ప్రాణములును, సకలభూతములును, ఎవ్వనితో సంస్థితములై యున్నవో ఆ అవినాశియగు పరమాత్మ నెవ్వఁడు తెలిసికొనునో అతఁడు అన్నిటిని తెలిసికొనుచు అన్నిఁటిలోఁ బ్రవేశించును

వ్యా. జీవుఁడును, ఇంద్రియములును, ప్రాణములును, సమస్తవస్తువులును, ఎవ్వని ఇచ్ఛచే నుత్పన్నములయ్యెనో మఱియెవ్వని ఇచ్ఛలో సంస్థితములైయున్నవో, ఆ నాశరహితుఁడగు పురుషు నెవ్వఁడు తెలిసికొనునో అతని సమస్త సంశయములును తీరును అతఁడు అన్నిటిలోను ప్రవేశించి, అన్నిటిలోను మంగళమయుఁడగు ఆ అమృతపురుషుని జూచును.

మూ॥ యశ్చాయమస్మిన్నాకాశే తేజోమయోఽమృత
మయః పురుషః సర్వానుభూః
యశ్చాయమస్మిన్నాత్మని తేజోమయోఽమృత
మయః పురుషః సర్వానుభూః
తమేవ విదిత్వాతిమృత్యుమేతి నాన్యః పన్థా విద్య
తేఽయనాయ ౧౭

[బృహ - శ్వేతా.]

టీ అస్మిన్నాకాశే=ఈ ఆకాశమునందు (బ్రహ్మాండమునందంతట వ్యాపించియుండెడి మహాకాశమునందు) తేజోమయః=ప్రకాశస్వరూపుఁడైనట్టియు, అమృతమయః = మరణధర్మము లేనట్టియు, యశ్చాయం=ఏయీ, పురుషః=పురుషుఁడు, సర్వానుభూః=సర్వము అనుభవించువాఁడో, అస్మిన్నాత్మని=ఈ యాత్మయందు (దేహమందలి బుద్ధ్యాకాశమునందు) తేజోమయః=ప్రకాశస్వరూపుఁడును, అమృతమయః=మరణధర్మము

లేనివాఁడును అగు, యశ్చాయం = ఏయీ, పురుషః=పురుషుఁడు, సర్వానుభూః=సర్వమును అనుభవించుచున్నాఁడో, తమేవ=ఆ పురుషునే, విదిత్వా=తెలిసికొని, మృత్యుం=మరణమును, అత్యేతి = అతిక్రమించుచున్నాఁడు, అయనాయ = మోక్షముకొఱకు, అన్యః పన్థా = ఇతరమార్గము, న విద్యతే= లేదు

తా. సర్వము నెఱుంగుచున్నవాఁడై యీ అసీమాకాశమునందు ఏ అమృతమయ, జ్యోతిర్మయ పురుషుఁడు కలఁడో సర్వము నెఱుంగుచున్నవాఁడై, ఈ ఆత్మయందు ఏ అమృతమయ జ్యోతిర్మయ పురుషుఁడు కలఁడో కేవలము అతనినే తెలిసికొని సాధకుఁడు మృత్యువు నతిక్రమించును అది తప్ప మోక్షప్రాప్తికి మార్గాంతరము లేదు

వ్యా. ఈశ్వరుని పనులు రెండు మహత్తరములైనవి ఒకటి మన సమ్ముఖముననున్న అగణ్య నక్షత్రమండిత అసీమాకాశము రెండవది, మన అంతరమునందలి ఉన్నతిశీలమైన యీ చిరంజీవియగు ఆత్మ, ఆత్మ స్థూలము గాదు, అణువునుగాదు. కాని అది యెట్టి సారవంతమయిన వస్తువు! ఒక్క బిందు మాత్రమయిన ఆత్మ అసీమాకాశమును దర్శించుచున్నది ఒక్క బిందు మాత్రమయిన ఆత్మమీదనే సమస్తాకాశము ఆధారపడియున్నది. ఆత్మ లేకున్న నింకేమియునుండదు—ఆత్మ లేనిచో శతసహస్రసూర్యులును అంధకార పరివృతులే. ఆత్మయొక్క ఉదయము వలననే సకలవస్తువులును జ్యోతిష్మంతము

లగును. వెలుపల ఆకాశము, లోపల ఆత్మ ఈ రెండే "అణోరణీయాన్ మహతో మహీయాన్" అని చెప్పఁబడు అనంతపురుషుని ఆదర్శములు. ఈ రెంటియందే అతని ఆవిర్భావము అసీమాకాశమునం దతఁడు కలఁడు. హిరణ్మయమైన ఆత్మయందును అతని సింహాసనముగలదు అంతరమునందును బాహ్యమునందును అతఁడు ప్రాణరూపుఁడై యున్నాఁడు ఏకాంతస్థలమున కరిగినపుడు సాక్షిరూపమున నచ్చట నతనిని చూచుచున్నాను. కర్మక్షేత్ర మునకు వెళ్లినపుడు కర్మాధ్యక్షునిరూపమున సమస్తఘటనలను నియమించువాఁడతఁడే యని నేను గ్రహించుచున్నాను అతఁడు విషయరాజ్యమున కెట్లు ప్రభువో అదియే విధమున ఆత్మకు అధీశ్వరుఁడు. అతఁడు ఆత్మసింహాసనమున కూరుచుండి ధర్మరాజ్యమునందు పాపమును దమింపఁజేయుచు పుణ్యమునకు బహూకృతి సలుపుచు తనవైపున కెల్లరను ఆకర్షించుకొనుచున్నాఁడు. విస్తృతాకాశమునందతని కరుణ, నిభృత ఆత్మయందును అతని కరుణ. అతఁడు అమృతమును చిలికి ఆత్మను తృప్తిపఱుచుచున్నాఁడు అతనికి శరణాపన్నులమై మనము మృత్యువు నతిక్రమించుచున్నారము అమృతులమై అతని సహవాసమువలన పవిత్రానందము నుపభోగించుచున్నాము.

వి బృహదారణ్యకోపనిషత్తు ౨ అధ్యాయము ౧౧ బ్రాహ్మణము లోని వాక్యములు కొన్నిఁటిని, శ్వేతాశ్వతరోపనిషత్తు 3-వ అధ్యాయము ౧-వ వాక్యమును, సమకూర్చి మహర్షి దేవేంద్రనాథఠాకూరు అతి సుందరమైన యీ వాక్యమును సిద్ధముచేసెను మహర్షియొక్క సహజసామర్థ్యము నకేగాక ఉపనిషత్తులను ప్రజాదరణ పాత్రముచేయుటయందతఁడు కావించిన సేవకును ఇయ్యది ఉత్తమదృష్టాంతమై యొప్పుచున్నది. ఈ వాక్యము గ్రంథములో పూర్తిగా నిమిడిపోయి యెవ్వియో కొన్ని ఖండములనుకూర్చి

చేసినట్లే తోఁచుటలేదు దీనిని జనులు హెచ్చుగా వాడుకచేయుచు ఉప నిషత్తులలోని వాక్యముగనే భావించుచున్నారు బృహదారణ్యకమునందలి రెండవ అధ్యాయములోని అయిదవ బ్రాహ్మణములో ననేక వాక్యములు గలవు. అందు పృదివి, అగ్ని, జలము, సూర్యుఁడు, ఆకాశము, చంద్రుఁడు, ఉరుము, మెఱపు, సత్యము,ధర్మము, మనుష్యకోటి, ఆత్మయున్నగునవి సమస్త భూతములకును మధుప్రాయములనియు, వీనిలోనున్న జ్యోతిర్మయ అమృత పురుషుఁడును పరబ్రహ్మము నొక్కటేయని చెప్పఁబడియెను.

"ఇయం పృథివీ సర్వేషాం భూతానాం మధు
అస్యై పృథివ్యై సర్వాణి భూతాని మధు
యశ్చాయం అస్యాం పృథివ్యాం తేజోమయః
అమృతమయః పురుషో యశ్చాయం అధ్యా
త్మం శరీరః తేజోమయః అమృతమయః పురు
షః అయమేవ సః యః అయం ఆత్మా ఇదం
అమృతం ఇదం బ్రహ్మ ఇదం సర్వమ్"

ఈ పృథివి సకలభూతములయొక్క మధువు, (ఫలితము), సకల భూతములును ఈపృథివియొక్క మధువు (ఫలితము) అట్లే పృధివియందలి జ్యోతిర్మయ అమృతపురుషుఁడును, శరీరమునందలి జ్యోతిర్మయ అమృత పురుషుఁడును గూడ (ఇర్వురును మధువులే) అతఁడు నిజముగా ఆత్మయే, అమృతుఁడే, ఆబ్రహ్మమే, ఆ సర్వమే [మ్యాక్సు మూలరు.]

కలగూరగంపగానున్న యీ వస్తువులలోనుండి జ్యోతిర్మయ అమృత పురుషునికి నివాసములగు ఆకాశము ఆత్మ అను రెంటిని మాత్రము మహర్షి

యేరి పైకిదీసెను ఈ రెండే జర్మను తత్త్వవేత్తయగు, ఇమ్మాన్యుయల్ క్యాంటుయొక్క ఆశ్చర్యమునకు పాత్రములైనవి ఆ జ్యోతిర్మయ అమృత పురుషునికి "సర్వానుభూః" అను బృహదారణ్యకము ౨-వ అధ్యాయము ౫-వ బ్రాహ్మణము ౧౯-వ వాక్యమునందలి విశేషణమును జేర్చి శ్వేతాశ్వతరోపనిషత్తు ౩-వ అధ్యాయము ౮-వ వాక్యమును చివర జతపరిచి యీ మహావాక్యమును మహర్షి కల్పించెను ఈ వాక్యమును కూర్చునపుడు క్యాంటుయొక్క అమృతవాక్యము మహర్షి మనస్సులో నుండెనో, లేదో తెలియదు. ఆ జర్మను తత్త్వవేత్తయొక్క వాక్యమువలె నిదియు నతి సుందరముగానున్నది ప్రత్యక్షదర్శనమును ప్రతిపాదించు "అయమ్" "అస్మి" అను పదములు గమనార్హములు ఆ అగోచరసత్యముయొక్క ప్రత్యక్షదర్శనమునుగూర్చి నుడువుటలో మహర్షి కూర్చిన యీ వాక్యమును మించిన వాక్యము మఱెద్దియు సకలధర్మవాఙ్మయములోను కానరాదు

మూ ఉక్తా త ఉపనిషత్ బ్రాహ్మీం వావ,
త ఉపనిషద మబ్రూమే త్యుపనిషత్ ౧౮

[కేన ౪-ఖం, ౭-వా]

టీ ఉపనిషత్=ఉపనిషత్తు, తే=నీకు, ఉక్తా=చెప్పఁబడినది, బ్రాహ్మీం=బ్రహ్మసంబంధమైన, ఉపనిషదంవావ = ఉపనిషత్తునే, తే=నీకు, అబ్రూమ=చెప్పితిమి, ఇతి=ఇదియే, ఉపనిషత్=ఉపనిషత్తు

తా. నీకు ఉపనిషత్తును చెప్పినవాఁడనైతిని బ్రహ్మ సంబంధమైన ఉపనిషత్తునే మీకు నేను చెప్పితిని. ఇదియే ఉపనిషత్తు

వ్యా ఏ విద్య మనలను బ్రహ్మమునకుఁ గొంపోవునో అదియె యీ ఉపనిషత్తు ఉపనిషత్తే బ్రాహ్మధర్మముయొక్క యీ ప్రథమ ఖండములో చెప్పఁబడినది ఇందలి ఉపదేశముల ననుసరించి శ్రద్ధావంతులగు ముముక్షువులు పరమపదమును పొందుదురు

మూ ఓం ఆప్యాయన్తు మమాంగాని వాక్ప్రాణశ్చక్షుః శ్రోత్ర మథోబల మింద్రియాణి చ సర్వాణి సర్వం బ్రహ్మౌపనిషదమ్,

మాహం బ్రహ్మ నిరాకుర్యాం మామా బ్రహ్మనిరాక రోదనిరాకరణమ స్త్వనిరాకరణం మెఽస్తు తదాత్మని నిరతే య ఉపనిషత్సు ధర్మాస్తే మయి సన్తు తే మయి సన్తు

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః హరిః ఓమ్

టీ వాక్=వాక్కు, ప్రాణః=ప్రాణము, చక్షుః=నేత్రము, శ్రోత్రం=శ్రోత్రము, (అథో) బలం=బలము, ఇంద్రియాణిచ= ఇంద్రియములును, మమ=నా, సర్వాణి అంగాని=సమస్తాంగము

లను, ఉపనిషదం=ఉపనిషత్తులలో చెప్పఁబడిన, సర్వం=సర్వాంతర్యామియైన, బ్రహ్మ=బ్రహ్మము, ఆప్యాయన్తు=తృప్తిపఱచుచుఁగాక!

అహం=నేను, బ్రహ్మ=బ్రహ్మమును, మానిరాకుర్యామ్=నిరాకరింపకుందు గాక! మా=నన్ను, బ్రహ్మ=బ్రహ్మము, మానిరాకరోత్=నిరాకరింపక పోవుఁగాక! మే=నా చేత (బ్రహ్మణః=బ్రహ్మముయొక్క) అనిరాకరణం=అనిరాకరణము, అస్తు=అగుఁగాక!

తదాత్మని=పరమాత్మయందు, నిరతే=ఎక్కువ ఆసక్తి కలిగిన (మయి=నాయందు), యే=ఏవి, ఉపనిషత్సు=ఉపనిషత్తులయందు,ధర్మాః=ధర్మములో, తే=అవి, మయి=నాయందు, సంతు=ఉండుఁగాక! తే=అవి, మయి=నాయందు, సంతు=ఉండుఁగాక!

తా ఉపనిషద్వేద్యుఁడును, సర్వాంతర్యామియునగు పరబ్రహ్మము నా వాక్ప్రాణ చక్షుశ్శ్రోత్ర బలేంద్రియములను, సర్వాంగములను పరితృప్తి పరుచునుగాక! బ్రహ్మము నన్ను పరిత్యజింపలేదు. నేను బ్రహ్మమును పరిత్యజింపకుందుఁగాక! అతఁడు సర్వదా అపరిత్యక్తుఁడై యుండుఁగాక! నేను అతనిచే అపరిత్యక్తుఁడనై యుందుఁగాక! పరమాత్మయందు నేను సర్వదా ఆసక్తిగలవాఁడనై యున్నాను అగుటం

జేసి ఉపనిషత్తులో నే ధర్మములు గలవో అవి నాయవి యగుం గాక! అవి నాయవి యగుంగాక!

ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః హరిః ఓమ్

వి. కడపటి ఆశీస్సు ఛాందోగ్యోపనిషత్తునందలి శాంతి పాఠము గానిది కేనోపనిషత్తునందును నిదియె శాంతి పాఠము కలదు 'హరిః ఓమ్' అను చివరనున్న రెండుపదములును ప్రశ్నోపనిషత్తు తుదియందు కనిపించు చున్నవి.

ప్రథమ ఖండము

ఉపనిషత్తు సమాప్తము



చెన్నపురి వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచే
శ్రీరామప్రెస్సున ముద్రితము —1934–1000.

ఓం! తత్సత్!

# బ్రాహ్మధర్మము

## ద్వితీయఖండము

••••○••••

### నైతికోపదేశములు

## ౧ అధ్యాయము

వాక్యము. ఓమాచార్యోఽన్తేవాసిన మనుశాస్తి. ౧

[తైత్తిరీయోపనిషత్. ౧ వల్లి. ౧౧ అనువాక.]

పదవిభాగము. ఓమ్, ఆచార్యః, అన్తేవాసినమ్, అనుశాస్తి.

టీక. ఓమ్, ఆచార్యః=ఆచార్యుఁడు, అన్తేవాసినమ్=శిష్యుని గూర్చి, అనుశాస్తి=కర్తవ్యధర్మము నుపదేశించుచున్నాఁడు.

తాత్పర్యము. జన్మాదులకు కారణు డగు పరబ్రహ్మము యొక్క 'ఓమ్' అను మంగళనామము నుచ్చరించి, ఆచార్యుడు శిష్యునకు ధర్మోపదేశము చేయుచున్నాడు.

వ్యాఖ్యానము. పరమేశ్వరుని జ్ఞాననేత్రముతో దర్శించి, ఆయనకు ప్రియమయిన కార్యములను, భక్తిపూర్వకముగా చేయవలయును ఆయనకు ప్రియమయినది ధర్మము ఆయనకప్రియమయినది అధర్మము కనుక, ధర్మమే మానవునకు ఉపాదేయము, కర్తవ్యము అధర్మమే అకర్తవ్యము, పరిత్యాజ్యము, ధర్మానుష్ఠానము లేనియెడల, బ్రహ్మజ్ఞానము నిష్ఫలము అధర్మాచరణముచే, ఆత్మ మలినమయి అధోగతి నొందును. ధర్మాధర్మవివేచనకొరకు, మానవునకు పరమేశ్వరుడు ప్రసాదించిన శక్తినే, ధర్మజ్ఞానము లేక మనస్సాక్షి యందురు మనుష్యు డాశక్తిద్వారమున, ధర్మమునుండి అధర్మమును వేరుచేసి, అధర్మమును పరిహరించి, పాపరహితు డయి, ధర్మానుష్ఠానద్వారమున పవిత్రు డయి, పవిత్రస్వరూపు డగు పరమేశ్వరుని సాన్నిధ్యమును పొందవలయును. శిష్యుని ధర్మజ్ఞానమును వికసింపజేయుటకును, పరిశుద్ధము చేయుటకును, ఏయే కర్మలు విహితములో, ఏవేవి నిషిద్ధములో వానిని ఆచార్యుడు ప్రదర్శించుచున్నాడు.

వివరణము. బ్రాహ్మధర్మముయొక్క ఈ ద్వితీయఖండమునందు మహర్షి 'అనుశాసనము' లను శీర్షికతో ఆసక్తు డగు గృహస్థు, ఆచరింపవలసిన ధర్మములయొక్క స్మృతి నొకదానిని రచించెను. ధర్మాచరణము లేని కేవల బ్రహ్మజ్ఞానము విశేషోపయోగకరము కాదని ఆయన యభిప్రాయము. కనుక, ప్రథమఖండమునందలి ధర్మోపదేశములకు తోడుగా

నైతికాచరణమున కనుకూలమయిన స్మృతి నొకదానిని రచించుట అవశ్యక మని ఆయన భావించెను. ఈ యధ్యాయ ప్రారంభమున కనుకూలమగు ఏ వాక్యమును. ఆయన తైత్తిరీయోపనిషత్తునందు కనుగొనెను.

శ్లోకము　బ్రహ్మనిష్ఠో గృహస్థస్స్యాత్, తత్త్వజ్ఞానపరాయణః।
యద్యత్కర్మ ప్రకుర్వీత, తద్బ్రహ్మణి సమర్పయేత్॥ ౨
[మహానిర్వాణతంత్రము VIII ౨౩]

ప. బ్రహ్మనిష్ఠః, గృహస్థః, స్యాత్, తత్త్వజ్ఞానపరాయణః, యత్, యత్, కర్మ, ప్రకుర్వీత, తత్, బ్రహ్మణి, సమర్పయేత్.

టీ. గృహస్థః = గృహస్థు, బ్రహ్మనిష్ఠః=బ్రహ్మమునందు నిశ్చయమయిన స్థితి గలవాడును, తత్త్వజ్ఞానపరాయణః=తత్త్వజ్ఞానమే శ్రేష్ఠమయిన ఆశ్రయముగా గలవాడును, స్యాత్=కావలయును. యద్యత్ (యత్ యత్) కర్మ=లోకహిత మయిన ఏయే ధర్మకార్యమును, ప్రకుర్వీత=చేయునో (దాని ఫలాపేక్షను విడిచి), తత్=ఆ కర్మను, బ్రహ్మణి=(సర్వమంగళాస్పదుడును పరిపూర్ణుడును అగు) పరమేశ్వరునియందే, సమర్పయేత్=సమర్పింపవలెను.

తా. గృహస్థు బ్రహ్మనిష్ఠుడును, తత్త్వజ్ఞానపరాయణుడును, కావలయును. ఏకార్యము చేసినను, దాని ఫలమును పరబ్రహ్మమునకే సమర్పణము చేయవలయును.

వ్యా. తల్లి తండ్రి, సహోదరుడు సహోదరి, భార్య, పుత్రుడు, పుత్రిక, మొదలయినవారితోడి సంబంధమును తెంచుకొని సన్న్యాసి కాగూడదు ఈ సంబంధము మంగళస్వరూపు డగు' పరమేశ్వరునివలననే సంఘటింపబడినది దానికి భంగము కలిగించుట ధర్మము కాదు గృహస్థు ఈ సమస్త సంబంధములను పరిపాలింపవలయును కాని, శుభకరములగు నిట్టి సంబంధములను సమకూర్చిన పరమేశ్వరుని మరచి మోహపాశముల యందు తగుల్కొనగూడదు ఆయనయందే చేర్పబడిన చిత్తముగలవాడయి, సంసారధర్మములను నిర్వర్తింపవలయును. సంపత్కాలమునందు ఆయన యిచ్ఛానుసారముగా జీవితమార్గమునందు నడువవలయును. విపత్కాలమునందును ఆయననే శరణొందవలయును శరీర మీ భూమిమీద సంచరించుచుండగా, ఆత్మ పరమాత్మయందు స్థానము నొంది యుండవలయును. కార్యములు చేయు కాలమునందు, ఆయనయం దుండియే, కార్యములు చేయవలయును విశ్రాంతి సమయమున ఆయనయందే విశ్రాంతి నొందవలయును అంతరింద్రియములును, బాహ్యేంద్రియములును, ఉభయములును, ఆత్మవశములయి యుండవలయును ఆత్మ పరమాత్మకు వశమయి, వాని నన్నిటిని వానివాని వ్యాపారములయందు నియోగింపవలయును ఏది ఆయన యాజ్ఞ యని మానవుడు తెలిసికొనునో, దాని నతడు తన ప్రాణములను సహితము లక్ష్యముచేయక, యావచ్ఛక్తిని వినియోగించి చేయవలయును ఏది ఆయన యిచ్ఛకు విరుద్ధమని తెలిసికొనునో, దానిని విషము

వలె పరిత్యజింపవలయును ఈ విధముగా బ్రహ్మనిష్ఠుఁడయి, గృహస్థు సంసారమునందు ప్రవేశింపవలయును తత్త్వజ్ఞాన మనగా వస్తువుల యొక్క యథార్థజ్ఞానము స్పష్టవస్తువులను జూచి భ్రష్టయను భ్రాంతి కలుగకుండుటకొరకును, సత్యమునుండి అసత్యమును, మంగళమునుండి అమంగళమును, ధర్మమునుండి అధర్మమును భేదింపగల సామర్థ్యము కలుగుటకొరకును, తత్త్వజ్ఞానము నార్జించి, ఆ జ్ఞానానుసారముగా కర్మల ననుష్ఠింపవలయును ఫలాపేక్ష లేనివాఁడయి, కేవలము ప్రేమాస్పదుఁడగు పరమేశ్వరుని ప్రీతికొరకే, ఆయనకు హితమయిన కార్యములను చేయవలయును సుఖము రానిమ్ము దుఃఖము రానిమ్ము, సంపదలు రానిమ్ము విపత్తులు రానిమ్ము సమ్మానము రానిమ్ము అవమానము రానిమ్ము, వీనిలో నేదియు లక్ష్యము కాదు పరమేశ్వరుని ఆజ్ఞాపాలనమే సాధకుని ఏకమాత్ర లక్ష్యమయి యుండవలయును "నే నాయన సేవచేయుటకు నియమింపబడితిని, ఇదే నా గొప్ప యదృష్టము ఆయన యాజ్ఞను నిర్వర్తించి కృతకృత్యుఁడను కాగలుగుటయే నా పరమ సౌభాగ్యము నే నాయన భృత్యుఁడను, ఆయన యాదేశపాలనమే నా ధర్మము సుఖము సంప్రాప్తమయినను, దుఃఖము సంప్రాప్తమయినను దానిని లక్ష్యముచేయక, ఆయన యాజ్ఞాపాలనమునందే నియుక్తుఁడనయి యుందును" బ్రహ్మనిష్ఠుఁడయిన గృహస్థు ఈవిధముగా భావించుచు, ఫలాభిసంధిని పరిత్యజించి, అభిమానశూన్యుఁడయి, తాను చేయు సమస్త కర్మలను ఈశ్వరార్పణము చేయవలయును.

౧. మహానిర్వాణతంత్రమునందు శివుఁడు పార్వతికి ఈ శ్లోకముతో నారంభించి గృహస్థధర్మముల నుపదేశించెను కనుక, మహర్షి ఈ శ్లోకము నుపోద్ఘాతముగా జేసికొని ఈ ద్వితీయఖండమును ప్రారం

భించుట ఎంతయు యుక్తమయి యున్నది. ఆ తంత్రమునందు గృహస్థు బ్రహ్మనిష్ఠుడు, తత్త్వజ్ఞానపరాయణుడు అయి యుండవలయునని చెప్పబడినది మహర్షి బ్రహ్మనిష్ఠుడును, తత్త్వజ్ఞానపరాయణుడును గృహస్థయి యుండవలెను, సన్యాసిగా నుండగూడదు, అని కొంచెము మార్చివేసి గృహస్థధర్మముయొక్క ప్రాశస్త్యమును వెల్లడించెను.

శ్లో. మాతరం పితరం చైవ సాక్షాత్ ప్రత్యక్షదేవతామ్।
మత్వాగృహీ నిషేవేత సదా సర్వప్రయత్నతః॥ 3
[మహానిర్వాణతంత్ర VIII. ౨౫ ]

ప. మాతరం, పితరం, చ, ఏవ, సాక్షాత్, ప్రత్యక్షదేవతాం, మత్వా, గృహీ, నిషేవేత, సదా, సర్వప్రయత్నతః.

టీ. గృహీ=గృహస్థు, మాతరం = తల్లిని, పితరంచైవ (పితరం చ ఏవ) = తండ్రినిన్ని, సాక్షాత్ = సాక్షాత్కరించిన, ప్రత్యక్షదేవతాం=ప్రత్యక్షదేవతలనుగా, మత్వా = భావించి, సదా=సర్వదా, సర్వప్రయత్నతః = సర్వప్రయత్నములచేతను, నిషేవేత=సేవింపవలయును.

తా. గృహస్థు తల్లిదండ్రులు సాక్షాత్ ప్రత్యక్షదేవతాస్వరూపులని తెలిసికొని, సదా, సర్వప్రయత్నములచేతను వారికి సేవ చేయవలయును.

వ్యా. బ్రహ్మోపాసకుడు తన తల్లిదండ్రులే తన ఈశ్వరప్రతినిధులని యెంచి, వారిని ప్రేమింపవలయును, వారికి సేవ చేయవలయును. వారియందు తనకు గల హృదయానురాగము వారికి సేవ చేయుటలోనే కనబరచవలయును. ఈ విషయమయి తన శ్రద్ధ నెన్నడును తగ్గించుకొనగూడదు తల్లిదండ్రులకు సేవ చేయుటచే పుణ్యాత్ముడగును అట్లు చేయనియెడల, నింద్యుడగును విశ్వపితయు, జగన్మాతయు అగు పరమేశ్వరుడు తన పితృమాతృభావమును తల్లిదండ్రుల ద్వారమున ప్రకాశింపజేయుచున్నాడు ఆయన దృష్టియందు తల్లిదండ్రుల సేవ ఘనమును మహాపవిత్రమును అగు ధర్మము మనోవాక్కాయకర్మల ద్వారమున, స్వార్జితద్వారమున, వారి సేవచేసి, ధన్యాత్ముడు కావలయును

వి. తల్లిదండ్రులకు భక్తితో సేవచేయుట, గృహస్థునియొక్క ముఖ్యధర్మమని మహర్షి యభిప్రాయము మహానిర్వాణతంత్రమునందును శివుడు సత్యసంధతకు ప్రథమస్థానము నిచ్చి, మాతాపితృసేవకు తరువాతిస్థానము నిచ్చెను

శ్లో॥ శ్రావయేన్మృదులాం వాణీం, సర్వదా ప్రియమాచరేత్।
పిత్రోరాజ్ఞానుసారీ స్యాత్, సత్పుత్రః కులపావనః॥ ౮
[మహానిర్వాణతంత్ర.]

ప. శ్రావయేత్, మృదులామ్, వాణీమ్, సర్వదా, ప్రియమ్, ఆచరేత్, పిత్రోః, ఆజ్ఞానుసారీ, స్యాత్, సత్పుత్రః, కులపావనః.

టీ. కులపావనః=వంశమును పవిత్రముచేసెడి, సత్పుత్రః= యోగ్యుడయిన కుమారుడు, పిత్రోః=తలిదండ్రులకు, మృదులాం=కోమలమయిన, వాణీం=వాక్కును, శ్రావయేత్=వినిపింపవలయును. సర్వదా=ఎల్లప్పుడు, ప్రియం=హితమునే, ఆచరేత్= ఆచరింపవలయును. ఆజ్ఞానుసారీ=వారి యాజ్ఞ ననుసరించువాడును, స్యాత్=కావలయును.

తా. కులపావను డగు సత్పుత్రుడు తల్లిదండ్రులకు మృదుమధురవాక్యములను వినిపించుచు, సర్వదా, వారికి హితములగు కార్యముల నాచరించుచు, వారి యాజ్ఞలను పాలించుచుండవలయును.

వ్యా. తల్లిదండ్రులతో నెన్నడును కఠినముగా వ్యవహరింపగూడదు వారితో మృదుమధురముగా మాట్లాడవలయును వారిని వినయముతో సమీపింపవలయును వారిని భక్తిభావముతో దర్శింపవలయును. పరమానందముతో వారి యుపదేశవాక్యములకయి వేచియుండవలయును. అహరహమును వారి శుభమునే కాంక్షించుచు, వారికి హితమును చేయవలయును వారే కార్యమును చేయుమని ఆజ్ఞాపింతురో, దాని నెంత కష్టపడియయినను నెరవేర్పవలయును. వారి యాజ్ఞలలో నేదియయిన అన్యాయమని తోచి, ఉల్లంఘింపవలసి వచ్చినప్పుడు సహితము, వారియెడల విశేష నమ్రతను, వినయమును, సమ్మానమును చూపవలయును. తన సుఖసంతోషములను వదులుకొని యయినను, వారిని సుఖవంతులుగను,

సంతుష్టులుగను చేయుటకు ప్రయత్నింపవలయును. ఇట్టివే సత్పుత్రుని యొక్క లక్షణములు ఇట్టి పుత్రుడే పరమపితయగు జగదీశ్వరుని సత్పుత్రుడు, ఇట్టి పుత్రుని మూలముననే వంశము పవిత్రమగును

వి. తల్లిదండ్రులయెడల బిడ్డలు మెలగవలసిన విధానము, మధుర సంభాషణము, ప్రేమ, దయ, ఆజ్ఞాపాలనము మొదలయిన ధర్మము లిందు వివరింపబడినవి తల్లిదండ్రుల యాజ్ఞలకును, మనస్సాక్షియొక్క ఆదేశము లకును వైరుధ్యము తటస్థించినప్పుడు, వినయభావముతోనే తల్లిదండ్రుల యాజ్ఞనుల్లంఘించి, మనస్సాక్షినే అనుసరింపవలయునని, మహర్షి హెచ్చ రించుచున్నాడు.

శ్లో. గురూణాం చైవ సర్వేషాం, మాతా పరమకో గురుః।
మాతా గురుతరా భూమేః, ఖాత్ పితోచ్చతర స్తథా॥౫

[మొదటిపంక్తి, మహాభారత, ఆదిపర్వ ౧౯౬,౧౬ ]

[౨వ పంక్తి, మ. భా అరణ్యపర్వ ౩౧౨,౬౦,౫౯ ]

ప. గురూణాం, చ, ఏవ, సర్వేషాం, మాతా, పరమకః, గురుః, మాతా, గురుతరా, భూమేః, ఖాత్, పితా, ఉచ్చతరః, తథా.

టీ. సర్వేషాం చ గురూణాం=ఎవరెవరు గౌరవనీయు లని నిర్దేశింపబడిరో వారందరిలోను, మాతా ఏవ=తల్లియే,

పరమకః గురుః=అత్యంత గౌరవనీయురాలు. మాతా=తల్లి, భూమేః=భూమికంటె, గురుతరా=అధికముగా గౌరవింపబడ దగినది. తధా=అట్లే, పితా=తండ్రి, ఖాత్ =ఆకాశముకంటెను, ఉచ్చతరః=శ్రేష్ఠుడు.

తా. సమస్త గురువులలోను తల్లి పరమగురువు. తల్లి భూమికంటెను గురుతరమయినది. తండ్రి ఆకాశముకంటెను గురుతరుడు.

వ్యా. సమస్తమానవులలోను తన తల్లిదండ్రులే సర్వశ్రేష్ఠులని యెంచవలెను తల్లిదండ్రులకంటె అధిక సమర్థులును, విద్యావంతులును ఉండవచ్చును కాని, బిడ్డలకు ఇంతకంటె గురుతరమును, మాననీయమును అగు సంబంధము మరెవ్వరితోను ఉండదు కుమారుడు తల్లిదండ్రులకంటె అధిక ధనవంతుడును, విద్యావంతుడును, సమర్థుడును కావచ్చును. అయినను, ఆ గురుతరసంబంధమువలన వారెన్నటికిని గౌరవనీయులును, పూజనీయులును అయి యుందురు విద్యామదముచేతగాని, ధనమదముచేతగాని బిడ్డలెన్నడును తల్లిదండ్రుల నవమానింపగూడదు

వి. పూర్వశ్లోకమునందలి భావమునే ఈశ్లోకము మరింత విస్తరించుచున్నది. బిడ్డలకును, తల్లిదండ్రులకును గల సంబంధమును గురించిన యొక పవిత్రభావము నిది వ్యక్తముచేయుచున్నది. ఈశ్లోకము లన్నిటియందును, తండ్రికంటె తల్లి అగ్రస్థానము వహించుచున్నదని గ్రహింపవలెను.

శ్లో॥ యం మాతాపితరౌ క్లేశం, సహేతే సంభవే నృణామ్।
న తస్య నిష్కృతిశ్శక్యా, కర్తుం వర్షశతైరపి॥ ౬

[మనుసంహిత II ౨౨౭.]

ప. యం, మాతాపితరౌ, క్లేశం, సహేతే, సంభవే, నృణాం, న, తస్య, నిష్కృతిః, శక్యా, కర్తుం, వర్షశతైః, అపి.

టీ. నృణాంసంభవే=సంతానము కలుగుచుండగా, యం క్లేశం=ఏ కష్టమును, మాతాపితరౌ=తల్లిదండ్రులు, సహేతే= సహించుచున్నారో, తస్య=ఆ కష్టముయొక్క, నిష్కృతిః= ఋణవిముక్తి, కర్తుం=చేయుటకు, వర్షశతైరపి=నూరు సంవత్సరముల కయినను, నశక్యా=(బిడ్డలకు) సాధ్యముకాదు.

తా. సంతానము కలిగినయెడల, తల్లిదండ్రులు ఎట్టి కష్టముల ననుభవింతురో, ఆ కష్టముయొక్క ఋణమును బిడ్డలు నూరుసంవత్సరముల కయినను తీర్చుకొనజాలరు.

వా. తల్లిదండ్రులు సంతానముకొరకు ఏయే శారీరక కష్టములను, మనఃక్లేశములను అనుభవించుచున్నారో, పుత్రుడు పెరిగి పెద్దవాడయి, మనోవాక్కాయ కర్మలచేతను, ఆమరణాంతము వారికి సేవచేసినను, తల్లిదండ్రుల ఋణమునుండి విముక్తుడగుటకు సమర్థుడు కాజాలడు. కనుక,

సమస్తప్రయత్నములచేతను వారికి సేవచేసియు, వారికి శ్రమకు తగిన ప్రత్యుపకారము చేయగలిగితినని పుత్రుడెన్నడును భావింపగూడదు వారి యొక్క నిష్కపటమయిన ప్రేమను, చలింపని ఓర్పును స్మరించుకొని, సదా కృతజ్ఞుడయి యుండవలయును. మరణపర్యంతము వారికి హితమయిన కార్యములు చేయుచు, వారిని సేవింపవలయును వారు పరలోకగతులయిన తరువాతకూడ, వారి సత్సంకల్పముల కొనసాగించుటకు యత్నశీలుడు కావలయును

వి. బిడ్డలు తల్లిదండ్రుల నెందుకు ప్రేమింపవలయునో, ఎందుకు సేవింపవలయునో అను సంశయమును గురించి చెప్పబడిన ఈ హేతువు, మనుసంహితలో శిష్యునకు చేయబడిన యుపదేశములో నొక భాగమయి యున్నది

శ్లో. (భ్రాతా జ్యేష్ఠః సమః పిత్రా, భార్యా పుత్రః స్వకాతనుః।
ఛాయా స్వదాసవర్గశ్చ, దుహితా కృపణం పరం।
తస్మాదేతై రధిక్షిప్తః సహేతాసంజ్వరస్సదా॥ ౭

[మనుసంహిత IV ౧౮౪, ౧౮౫.]

ప. భ్రాతా, జ్యేష్ఠః, సమః, పిత్రా, భార్యా, పుత్రః, స్వకాతనుః, ఛాయా, స్వదాసవర్గః, చ, దుహితా, కృపణం, పరం, తస్మాత్, ఏతైః, అధిక్షిప్తః, సహేత, అసంజ్వరః, సదా.

టీ. జ్యేష్ఠః భ్రాతా=అన్నగారు, పిత్రాసమః=తండ్రిగారితో సమానుడు. భార్యాపుత్రః చ=భార్యయు పుత్రుడును, స్వకాతనః=తన శరీరమువంటివారే. స్వదాసవర్గః చ=తన భృత్య సమూహమును, ఛాయా=(నిత్యము తనతో నుండుటచేత) తన నీడవంటివారు. దుహితా=కూతురు, పరంకృపణం=విశేష కృపాపాత్రురాలు. తస్మాత్=అందువలన, ఏతైః=వీరలచే, సదా అధిక్షిప్తః=ఎప్పుడును తొందరచేయబడుచున్నను, అసంజ్వరః= సంతాపము లేనివాడయి, సహేత=సహించుకొనవలయును.

తా. అన్నగారు పితృతుల్యుడు. భార్యాపుత్రులు స్వశరీరమువంటివారు. దాసదాసీజనము తన నీడవంటివారు. కుమార్తె విశేష దయనీయురాలు. కనుక, ఈ సమస్తమయిన వారిచేతను విసిగింపబడినను, సంతప్తులుగాక, సర్వదా, సహిష్ణుత నవలంబింపవలయును.

వ్యా. పరమప్రేమాస్పదు డగు పరమేశ్వరుని ప్రీతిని కోరువాడయి, కుటుంబములోనివారి నందరను పరిపాలింపవలయును సమస్త కుటుంబమును ఆయన కుటుంబముగానే భావింపవలయును కనుక, సోదరుడు, సోదరి, భార్య, పుత్రుడు, పుత్రిక, దాసదాసీజనము, మొదలయినవారినుండి క్రోధమునకును, విసుగునకును హేతుభూతము కాగల కార్యములు తటస్థించినను, క్రోధమును విసుగును అణచుకొని,

శాంతముతో, ఎవరితో నెట్టి సంబంధమో, తదనుసారముగా వారితో సాధుభావముతో వ్యవహరింపవలయును అన్నగారిని పితృతుల్యునిగ గౌరవింపవలయును. తమ్ముని పుత్రతుల్యునిగ ప్రేమింపవలయును భార్యను బిడ్డలను, తన యవయవములవలెనే భావింపవలయును దాసదాసీజనమును దయతో నాదరింపవలయును. ఎవరియం దయినను, ఏలోపమయినను కనపడినయెడల, క్రోధాంధులయి, వారిని కఠినముగా చూడఁగూడదు. అంతే కాదు క్షమాశీలురయి వారి లోపములను సవరింప బ్రయత్నింపవలయును ఈశ్వరు డెట్లు నిశ్చలమయిన, నిరుపమానమయిన ప్రేమతో అందరిని సంరక్షించుచున్నాడో, అట్లే కుటుంబములోని ప్రతివారి యొక్కయు భారమును వహించుచు, వారిని ఘోషించుచు, వారి శారీరిక మానసిక ఆధ్యాత్మిక కల్యాణమునకయి ప్రయత్నింపవలయును.

వి. ఈ శ్లోకము మనుసంహితయందలి రెండు శ్లోకములు కూర్చి చేయబడినవి. దీనియందును కుటుంబములోని వివిధవ్యక్తులకు గల సంబంధమును, ఒండొరులయెడల అనుసరింపవలసిన ధర్మమును విశదీకరింపబడినవి.

శ్లో॥ అతివాదాం స్తితిక్షేత నావమన్యేత కంచన।
నచేమం దేహ మాశ్రిత్య వైరం కుర్వీత కేనచిత్॥ ౮

[మనుసంహిత VI. ౪౭.]

ప. అతివాదాన్, తితిక్షేత, న, అవమన్యేత, కంచన, న, చ, ఇమం, దేహం, ఆశ్రిత్య, వైరం, కుర్వీత, కేనచిత్.

టీ. అతివాదాన్=ఇతరులయొక్క అధిక ప్రసంగమును కటుసంభాషణమును, తితిక్షేత=ఓర్పుతో సహించుకొనవలయును. కంచన=ఎవరిని, న అవమన్యేత=అవమానింపగూడదు. ఇమం దేహం ఆశ్రిత్య=(క్షణభంగురమగు) ఈ దేహమును పొంది (దానికొరకు), కేనచిత్=ఎవరితోను, వైరం న కుర్యాత్=విరోధమును సాధింపగూడదు.

తా. ఇతరులయొక్క అధిక ప్రసంగమును సహించుకొనవలయును. ఎవరిని అవమానింపకుము. ఈ మానవదేహమును ధరించి, ఎవరితోను శత్రుత్వమును వహించగూడదు.

వ్యా సహిష్ణుతమూలముననే ఇతరులయొక్క కఠినోక్తులను పరాజయము నొందింపవలయును కఠినోక్తులకు బదులు, కఠినోక్తులనే ప్రయోగింపగూడదు ఏలయన, ధర్మసాధనయే జీవనోద్దేశముగాని, పగ సాధించుట కాదు ఎవరిని అవమానింపకుము పరమేశ్వరుడు ఎవరిని అవమానింపబడుటకు సృష్టింపలేదు. అందరును ఆయనకు ప్రేమాస్పదులే. కావున, అందరిని ప్రేమతో నాదరింపవలయును క్షణభంగురమయిన ఈ మనుష్యదేహమును ధరించి, గర్వితుడయి, ఎవరితోను శత్రుత్వమును సాధింపగూడదు అంతే కాదు తా నీ పృథివియం దుండునంతకాలమును అందరికిని హిత మాచరించుటయందే నియుక్తుడయి యుండవలయును. ఈశ్వరుడు మన కందరకును సామాన్య పిత మానవు లందరును పరస్పరము

సోదరులు. పరస్పర శత్రుత్వమును వహించి, ఈ పవిత్ర సంబంధమును అపవిత్రము చేయరాదు

వి. పూర్వశ్లోకములలో కుటుంబములోని వివిధవ్యక్తులతో నాచరింపవలసిన ధర్మములు తెలుపబడినవి దీనియందు అందరియెడలను సాధుభావముతో వర్తింపవలయునని యుపదేశింపబడుచున్నది.

---

# ౨ అ ధ్యా య ము



శ్లో॥ యావ న్న విందతే జాయాం, తావ దర్ధో భ వేత్పుమాన్।
యన్న బాలైః పరివృతం, శ్మశానమివ తద్గృహమ్॥ ౧
[వ్యాససంహిత II ౧౪—అత్రిసంహిత౩౦౯. ]

ప. యావత్, న, విందతే, జాయాం, తావత్, అర్ధః, భవేత్, పుమాన్, యత్, న, బాలైః, పరివృతం, శ్మశానం, ఇవ, తత్, గృహం.

టీ. యావత్ = ఎంతవరకు, పుమాన్ = పురుషుడు, జాయాం=భార్యను, న విందతే=పొందడో, తావత్=అంతవరకు, అర్ధః=అసంపూర్ణుడు, భవేత్=అగుచున్నాడు. యత్ గృహం= ఏ గృహము, బాలైః=(గృహాలంకారులగు) బాలకులతో, న పరివృతం=అలంకరింపబడియుండదో, తత్=ఆయిల్లు, శ్మశాన మివ=శ్మశానతుల్యము.

తా. ఎంతవరకు పురుషుడు భార్యాపరిగ్రహణము చేయడో, అంతవరకు అతడు అసంపూర్ణుడే. ఏగృహము బిడ్డలతో నిండియుండదో, ఆ గృహము స్మశానతుల్యము.

వ్యా. ప్రజాకాముడగు పరమేశ్వరుడు సృష్టివ్యాపారము అవిచ్ఛిన్నముగా సాగుటకు స్త్రీలను పురుషులను సృజించెను ఆయన శుభసంకల్పమును లక్ష్యమునందుంచుకొని, స్త్రీ పురుషులు పవిత్రమయిన వివాహబంధముచె బంధింపబడి పరస్పరము కలిసి యుండవలయును వివాహము ఆయన యభీష్టముకాదని యెంతమాత్రమును తలంపగూడదు. బిడ్డలు తల్లిదండ్రులకు హృదయానందసంధాయకులు, గృహభూషణములు, వివాహబంధమువలన లభించెడు పవిత్రబహుమానము సుసంతానమే

వి. ఈరెండవ యధ్యాయమునందు గార్హస్థ్యధర్మములు వివరింపబడినవి ఈమొదటి శ్లోకమునందు గృహస్థాశ్రమము ప్రశంసింపబడుచున్నది వ్యాససంహితలోని యొక శ్లోకభాగమును, అత్రిసంహితలోని యొక శ్లోకభాగమును, రెండును చెర్చి, ఈ శ్లోకము కూర్పబడినది

శ్లో. ప్రజనార్థం మహాభాగాః, పూజార్హాగృహదీప్తయః ।
స్త్రియః శ్రియశ్చ గేహేషు న విశేషోస్తి కశ్చన॥ ౨

[మనుసంహిత IX ౨౬—మహాభారత, ఉద్యోగపర్వ ౩౮, ౧౧.]

ప. ప్రజనార్థం, మహాభాగాః, పూజార్హాః, గృహదీప్తయః, స్త్రియః, శ్రియః, చ, గేహేషు, న, విశేషః, అస్తి, కః, చ, న.,

టీ. ప్రజనార్థం = సంతానోత్పత్తికి కారణులు గనుక (స్త్రీలు), మహాభాగాః=విశేషకల్యాణభాజనులు, పూజార్హాః= సమ్మానార్హులు, గృహదీప్తయః = గృహశోభాకారిణులు. గేహేషు = గృహములయందు, శ్రియశ్చ = సంపదలును, స్త్రియశ్చ=స్త్రీలును, (తుల్యరూపులే). కశ్చన విశేషః=(ఉభయులకును) ఏభేదమును నాస్తి=లేదు.

తా. సంతానోత్పత్తికి కారణులగుటచే స్త్రీలందరును కల్యాణపాత్రులును ఆదరణయోగ్యులును అగుచున్నారు. వీరు గృహమును తేజస్వంతముగా జేయుచున్నారు. స్త్రీలు గృహమునకు శ్రీస్వరూపులు. స్త్రీకిని శ్రీకిని విశేషభేదమేమియు లేదు.

వ్యా స్త్రీలును పురుషులును, ఉభయులును పరమేశ్వరుని ప్రీతికిని, ఆయన యాశీర్వాదమునకును సమానముగా పాత్రులు కాని, ఈ ప్రపంచమునందుండి ఎవరు ఏ కార్యభారమును నిర్వహింపవలసియుండునో, వారికి తదనుకూలమయిన శరీరము, మనస్సు, జ్ఞానము, భావము,

ధర్మము మొదలయిన అలంకారములన్నియు, సర్వదర్శియు మంగళ స్వరూపుడును అయిన పరమేశ్వరుడు దయచేసి యున్నాడు. స్త్రీలు గర్భధారణము, శిశుపోషణము, శిశుపాలనము మొదలయిన ధర్మముల నిర్వహింపవలసి యుండుటచే, జగన్మాతయగు పరమేశ్వరుడు తన సుకోమల మాతృభావముతో వారి నలంకరించి, వారిని గృహములయందలి సౌందర్యదేవతలుగను, సుకోమలహృదయలుగను, సృజించియున్నాడు. కనుక, వారు విశేషప్రేమతో, శ్రద్ధతో, సమాదరముతో, సంతోషముతో నాదరింపబడవలయును.

వి. ఏ హేతువుచే స్త్రీలు విశేష శ్రద్ధతో, గౌరవముతో నాదరింపబడవలెనో, ఈ శ్లోకము తెలుపుచున్నది ఇది తరతరమును వంశమును నిలిపి దానిని నిరంతరాయముగా కొనసాగించుటకు స్త్రీలు సహాయకారులగుదురను సనాతన భావమును స్ఫురింపజేయుచున్నది

శ్లో. సర్వావయవ సంపూర్ణాం,సువృత్తాం ఉద్వహేన్నరః।
క్రయక్రీతా చ యా కన్యా, పత్నీ సా న విధీయతే॥ 3
[హారీత్ సంహిత IV ౨—అత్రిసంహిత ౩౪౯]

ప. సర్వావయవసంపూర్ణాం, సువృత్తాం, ఉద్వహేత్, నరః, క్రయక్రీతా, చ, యా, కన్యా, పత్నీ, సా, న, విధీయతే.

టీ. సర్వావయవసంపూర్ణాం = ఏ యవయవలోపమును లేక, సర్వాంగసౌష్ఠవము గలిగినట్టియు, సువృత్తాం=సుశీలము

గలిగినట్టియు (కన్యకను), నరః=పురుషుడు, ఉద్వహేత్-వివాహము చేసికొనవలయును. యా కన్యా=ఏకన్య, క్రయక్రీతా చ=మూల్యమిచ్చి కొనబడినదో, సా=ఆకన్య, పత్నీ న విధీయతే=భార్యయని యెంచబడదు.

తా. పురుషుడు సర్వావయవ సంపూర్ణయు, సుశీలయు నగు స్త్రీని వివాహ మాడవలయును. ఏ కన్య శుల్క మిచ్చి కొనబడునో, ఆ కన్య శాస్త్రసమ్మతమయిన పత్ని కాజాలదు.

వ్యా. సర్వాంగసుందరమయినట్టియు, పవిత్రచరిత్ర గలిగినట్టియు స్త్రీని వివాహము చేసికొనవలయును. రోగియయినట్టియు అంగవిహీనురాలయినట్టియు, దుష్టప్రవర్తన గలిగినట్టియు, స్త్రీని వివాహమాడ గూడదు ఏ పురుషులు, స్త్రీలు చిరకాల రోగులు వికలాంగులు అయియుందురో, వారు పరమ మంగళసంకల్పు డగు ప్రజాపతియొక్క ప్రజాభివృద్ధి కార్యమునందు తా మసమర్థులమని తెలిసికొని, తా మూరింప దగినట్టియు, ఆయనకు ప్రియములయినట్టియు ఇంకను మిగిలిన వేలకొలది ధర్మకార్యములలో నేనినయిన నాచరించి, ధర్మసాధకులు కావలయును. వారింద్రియనిగ్రహము లేనివారయి, వివాహమాడి లోకమునందు రోగములను, శోకములను వ్యాపింపజేయగూడదు భార్యాభర్తలలో నెవ్వరయినను దుశ్చరిత్రులయినయెడల, చెప్పరాని చెడుగులు తటస్థించును. కనుక, స్త్రీపురుషులు అన్యోన్యము సచ్చరిత్రను పరీక్షించుకొనియే పరిణయము చేసికొనవలయును. మూల్య మిచ్చి భార్యను కొనుక్కొన గూడదు, అది ధర్మసమ్మతము కాదు.

వి. పురుషుడు ఎట్టి స్త్రీని వివాహమాడవలయునో, ఈ శ్లోకము సూచించుచున్నది మహర్షి దీనిని స్త్రీకి గూడ విస్తరింపజేసెను ధనమిచ్చి భార్యను కొనగూడదు అట్లే, కట్న మిచ్చి భర్తను కొనగూడదు హారీత్ సంహితలోని యొక శ్లోకముయొక్క మొదటి పంక్తిని, అత్రిసంహిత లోని యొక శ్లోకముయొక్క మొదటి పంక్తిని చేర్చి, మహర్షి ఈ శ్లోకమును కూర్చెను

శ్లో॥ అన్యోన్యస్యా వ్యభిచారో భవే దామరణాన్తికమ్ ।
ఏష ధర్మః సమాసేన జ్ఞేయః స్త్రీపుంసయోః పరః॥ ४
[మనుసంహిత IX. ౧౦౧.]

ప. అన్యోన్యస్య, అవ్యభిచారః, భవేత్, ఆమరణాన్తికమ్, ఏషః, ధర్మః, సమాసేన, జ్ఞేయః, స్త్రీపుంసయోః, పరః

టీ. అన్యోన్యస్య=భార్యాభర్తలలో పరస్పరము, ఆమరణాన్తికమ్=మరణపర్యంతము, అవ్యభిచారః=ధర్మార్థకామముల యందు వ్యభిచారము లేనివారలయి, భవేత్=ఉండవలయును. ఏషః=ఇది, స్త్రీపుంసయోః=స్త్రీపురుషులకు, పరఃధర్మః=శ్రేష్ఠమయిన ధర్మమని, సమాసేన=సంక్షేపముగా, జ్ఞేయః=తెలిసికొనదగినది.

తా. స్త్రీపురుషులు ఆమరణాంతము పరస్పరము ఒకరి నుండి యొకరు విడివడి వ్యభిచరింపగూడదు. సంక్షేపముగా చెప్పినయెడల, ఇదే వారికి పరమధర్మమని తెలిసికొనవలయును.

వ్యా. భార్యాభర్త లిద్దరును ధర్మమునందుగాని, సంసారకృత్యములయందుగాని, భోగానుభవమునందుగాని, ఒకరి నొకరు అతిక్రమించి వ్యవహరింపగూడదు భార్య భర్తకు సహధర్మిణియును సహకర్మిణియును, సహభోగినియును కావలయును. ధర్మకార్యములయందు ఒకరినుండి మరియొకరు వేరుపడుట, ధర్మవిషయిక వ్యభిచార మనబడును. ఇది స్త్రీపురుషుల కుండవలసిన ఆధ్యాత్మిక ప్రేమయందు అంతరాయము కలిగించును. సంసారకృత్యములయందు పరస్పరభిన్నమయిన అభీష్టము అర్థవిషయిక వ్యభిచార మనబడును. దానివలన కుటుంబమునందు అనేక అనిష్టములు సంప్రాప్తమగును భర్త అన్యస్త్రీయందును, భార్య అన్యపురుషునియందును ఆసక్తి గలవార లయిరేని, అది భోగవిషయిక వ్యభిచార మనబడును. ఇదే మిగిలిన అన్నిటికంటెను విశేష నింద్యము, గర్హ్యము. ఏలయన, ఇది పాపమును, అపవిత్రతను జనింపచేసి, ధర్మభ్రష్టత నొందించును. పురుషుడు, అన్యస్త్రీని, స్త్రీ అన్యపురుషుని మోహదృష్టితో చూచినయెడలను, భావించినయెడలను, వారు వ్యభిచారదోష దూషితు లగుదురు కనుకనే, ధర్మార్థకామములయందు ఒండొరుల నతిక్రమింపగూడదను నీ యుపదేశము భార్యాభర్తలకు సంక్షేపముగా నీయబడినది ఉభయులును మనోవాక్కాయకర్మలయందు దాంపత్యధర్మములను పరిపాలింపవలయును.

వి. ఈ శ్లోకము అవ్యభిచారమును, అనగా భార్యాభర్తలకు పరస్పరమూ ఉండవలసిన విశ్వాసమును బోధించుచున్నది. దీనిని మహర్షి ధర్మార్థకామములకు మూడింటికిని వర్తింపజేయుచున్నాడు సాంసారిక భోగవిషయములలో మాత్రమే గాక, మనస్సాక్షివిషయిక అభ్యంతరములు లేనియెడల, ఉభయులును ధర్మవిషయమయికూడ, పరస్పరానువర్తులయి యుండవలయునని, మహర్షి యభిప్రాయమయి యుండును.

శ్లో. తథానిత్యం యతేయాతాం, స్త్రీపుంసౌతు కృతక్రియా।
యథా నాభిచరేతాం తౌ, వియుక్తా వితరేతరమ్॥ ౫

[మనుసంహిత IX ౧౦౨.]

ప. తథా, నిత్యం, యతేయాతాం, స్త్రీపుంసౌ, తు, కృతక్రియా, యథా, న, అభిచరేతాం, తౌ, వియుక్తౌ, ఇతరేతరమ్.

టీ. కృతక్రియా=వివాహితులగు, తౌ స్త్రీపుంసౌతు= ఆ స్త్రీపురుషులు, ఇతరేతరం=పరస్పరము, వియుక్తౌ=వియోగము నొందినవారయి, యథా=ఎట్లు, నాభిచరేతాం=వ్యభిచారము చేయకయుందురో, తథా=అట్లు, నిత్యం=సర్వదా, యతేయాతాం=ప్రయత్నింపవలయును.

తా. భార్యాభర్తలిరువురు పరస్పరము వియుక్తులయి, ఎట్లు పరస్పరము వ్యభిచరింపకయుందురో, అట్లు వారు సర్వదా ప్రయత్నశీలురయి యుండవలయును.

వా. భార్యాభర్తలిద్దరును వ్యభిచారదోషమునుండి, తమ్ము నతి ప్రయత్నముతో రక్షించుకొనవలయును పరమేశ్వరుడు ఎట్టి శుభసంకల్ప ముతో, తమ్ము నుభయులను, పవిత్రమగు దాంపత్యసంబంధముతో బంధించి యుండెనో, దానిని సర్వదా జ్ఞప్తియం దుంచుకొనవలయును దంపతుల పవిత్రప్రేమ పరమేశ్వరునకు ప్రియము, సమస్త మానవులకును ప్రియము, దంపతులకు కల్యాణకరము, వంశమునకు శుభావహము, సమస్త లోకమున కును కల్యాణకరము కనుక, పరస్పరము యత్నశీలురయి దానిని వృద్ధి నొందింపవలయును. మనసునందయినను, దానికి విరుద్ధభావమును భావింప గూడదు ఉభయులయొక్క హృదయము, ఐక్యము, సుఖదుఃఖములు ఒక్కటయి యుండవలయును. తా ముభయులును విశ్వపతియగు పరమేశ్వ రునియొక్క సమ్మిళిత దాసదాసులని భావించి, సర్వాంతఃకరణముతో ఆయన యాజ్ఞలను పాలించుటకు చిరవ్రతులు కావలయును ఇంద్రియ సుఖము తుచ్ఛమయినదిగా నెంచవలయును వ్యర్థప్రలాపములు మాని, ఐహికాముష్మికములను సమకూర్చునట్టి ఆలోచనలనే చేయవలయును. కార్యాంతరమువలన పరస్పర వియోగము నొందవలసివచ్చినను, ఈ దాంపత్యవ్రతమును నియమపూర్వకముగా పాలింపవలయును

వి. ఈ శ్లోకముకూడ దాంపత్యధర్మమును విశదీకరించుచున్నది.

శ్లో. సంతుష్టో భార్యయా భర్తా, భర్త్రా భార్యా తథైవచ।
యస్మిన్నేవ కులే నిత్యం, కల్యాణం తత్రవైధ్రువమ్॥ ౬
[మనుసంహిత III ౬౦ ]

ప. సంతుష్టః, భార్యయా, భర్తా, భర్త్రా, భార్యా, తథా, ఏవ, చ, యస్మిన్, ఏవ, కులే, నిత్యం, కల్యాణం, తత్ర, వై, ధ్రువమ్.

టీ. యస్మిన్నేవ కులే = ఏ వంశమునందు, నిత్యం= సర్వదా, భర్తా=పెనిమిటి, భార్యయా=భార్యతో, సంతుష్టః= సంతుష్టుడయి యుండునో, తథైవ (తథా ఏవ) చ = అట్లే, భార్యా=భార్య, భర్త్రా=పెనిమిటితో, సంతుష్టా=సంతుష్టురాలయి యుండునో, తత్ర=ఆ వంశమునందు, ధ్రువం వై=నిశ్చయముగా, కల్యాణం=శుభము కలుగుచున్నది

తా. ఏ కుటుంబమునందు భర్త భార్య యెడలను, భార్య భర్తయెడలను, నిత్యము సంతుష్టులయి యుందురో, ఆ కుటుంబమునందు నిశ్చయముగా నిత్యకల్యాణము సిద్ధమయి యుండును.

వ్యా. భార్యాభర్త లిరువురును పరస్పరము ప్రేమించుకొనుట కొరకును, ఒకరితోనొకరు సంతుష్టులయి యుండుటకును, ఒకరినొకరు సుఖవంతులుగను, సంతృప్తులుగను చేసికొనుటకును ప్రయత్నింపవల యును ఒకరి ప్రవర్తన, సంభాషణ మరియొకరికి విరాగమును, వైమన స్యమును జనింపచేయకుండులాగున మెలగుటకు ప్రయత్నింపవలయును ఒకరియెడల నొకరు కఠినముగా నుండకూడదు ఒకరినొకరు నీచముగా నెంచకూడదు ఒకరి నొకరు అపనమ్మకముతో చూడకూడదు ఒకరి హితము నొకరు, ఒకరి ప్రియము నొకరు సమకూర్పు యత్నింపవల యును ఒకరియెడల నొకరు క్షమాశీలురు కావలయును. ఉభయులును కలిసి, తమ కుటుంబమున కేది హితమో ఆలోచించి, అందుకు తగిన సాధన చేయవలయును ఒకరి తలిదండ్రుల నొకరు తమ తలిదండ్రులుగాను, ఒకరి సోదరీసోదరుల నొకరు తమ సోదరీసోదరులుగాను, తలపవల యును ఒండొరుల సుఖదుఃఖములను, సంపదలను, ఆపదలను, ఉభయు లును సమముగా పంచుకొని యనుభవింపవలయును ఉభయులును పవి త్రతకొరకు, శాంతికొరకు, శుభబుద్ధికొరకు, ధర్మబలముకొరకు, ఆ మంగళ మయవిధాతకు శరణాపన్నులు కావలయును ఏ సంసారమునందు దిట్టి దంపతు లుందురో, ఆ సంసారమునందు సుఖము, శాంతి, కల్యాణము విశేషముగా వర్ధించును

వి. ఏ కుటుంబమునందు దంపతులు పరస్పరము స్వార్థరహిత మగు ప్రేమతో సమ్మిళితులయి, కేవలము తమ సుఖసంతోషాదులను విస్మ రించి, ఒండొరుల హితసాధనకొరకు ప్రయత్నించుచుందురో, ఆ కుటుం బముపయిన ఈశ్వరుని యాశీర్వాదము వర్షించును, అను శుభకర సార్వ కాలిక సత్యమును ఈ శ్లోకము వ్యక్తముచేయుచున్నది.

శ్లో. సా భార్యా యా పతిప్రాణా, సా భార్యా యా ప్రజావతీ।
మనోవాక్కర్మభిశ్శుద్ధా, పతిదేశానువర్తినీ॥ ౭
[సాంఖ్యసంహిత IV ౫. వ్యాససంహిత II ౨౬]

ప. సా, భార్యా, యా, పతిప్రాణా, సా, భార్యా, యా, ప్రజావతీ, మనోవాక్కర్మభిః, శుద్ధా, పతిదేశానువర్తినీ.

టీ. యా=ఏస్త్రీ, పతిప్రాణా=భర్తను ప్రాణతుల్యునిగా జూచునో, సా=ఆమెయే, భార్యా=భార్య, యా=ఏస్త్రీ, ప్రజావతీ=సంతానము గలదియో, మనోవాక్కర్మభిః=మనస్సుచేతను, వాక్కుచేతను, ప్రవర్తనచేతను, శుద్ధా=పరిశుద్ధురాలో, పతిదేశానువర్తినీ=భర్తయొక్క ఆదేశానుసారముగా వర్తించునదియో, సా=ఆమెయే, భార్యా=భార్యయని చెప్పబడుటకు యోగ్యురాలు.

తా. ఏ స్త్రీ పతిని ప్రాణతుల్యునిగా జూచునో ఆమెయే నిజమయిన భార్య. ఎవతె సంతానవంతురాలో, ఎవతె మనోవాక్కాయకర్మలయందు పరిశుద్ధురాలో, ఎవతె పెనిమిటికి ఆజ్ఞానువర్తురాలయి యుండునో, ఆమెయే నిజమయిన భార్య

వ్యా. భార్య భర్తను ప్రాణతుల్యునిగా చూపెవలెను వంశము నిలుచుటకయి సంతానమును కోరవలయును భావమునందు పవిత్రురాలుగను, వాక్కునందు మధురభాషిణిగను, కర్మానుష్ఠానమునందు పరిశుద్ధురాలుగను ఉండెవలయును భర్త చెప్పినదానిని ప్రేమతోను, ప్రసన్న హృదయముతోను ఆచరింపవలయును.

వి. ఇది మొదలు కొన్ని శ్లోకములలో పతివ్రతయొక్క లక్షణములు చెప్పబడుచున్నవి పతివ్రతయగు భార్య చూపవలసిన ఒక ఉన్నతాదర్శ మిందు తెలుపబడినది ఇట్టి ఆదర్శమునే పత్నీవ్రతుడుకూడ చూపవలయునని గ్రహించుకొనవలయును పురుషుని విషయమయి అట్లు స్పష్టముగా చెప్పు శ్లోకములు ఆర్యధర్మగ్రంథములలో లేకపోవచ్చును మహాభారతము, ఆదిపర్వమున ఈ యర్థమునే యిచ్చు ౭౪ ౩౯ వ శ్లోక మిట్లున్నది

సాభార్యాయా గృహేదక్షా, సాభార్యాయా ప్రజావతీ।
సాభార్యా యా పతిప్రాణా, సాభార్యా యా పతివ్రతా।

శ్లో॥ ఛాయేవానుగతా స్వచ్ఛా, సఖీవ హితకర్మసు ।
సదా ప్రహృష్టయా భావ్యం, గృహకార్యేషు దక్షయా॥
౮

[వ్యాససంహిత II ౨౭ మనుసంహిత V ౧౫౦.]

ప. ఛాయా, ఇవ, అనుగతా, స్వచ్ఛా, సఖీ, ఇవ, హితకర్మసు, సదా, ప్రహృష్టయా, భావ్యం, గృహకార్యేషు, దక్షయా.

టీ. స్త్రీ=భార్య, ఛాయేవ (ఛాయా ఇవ)=నీడవలె, అనగతా=పురుషు ననుసరించి నడుచునదిగను, హితకర్మసు=పెనిమిటికి హితమయిన కార్యములయందు, స్వచ్ఛా=పరిశుద్ధురాలగు, సఖీవ (సఖీ ఇవ)=చెలికత్తెవలెను, సదా=ఎల్లప్పుడు, ప్రహృష్టయా=మిక్కిలి సంతోషముతో కూడుకొన్నదిగను, గృహకార్యేషు = గృహకృత్యములయందు, దక్షయా=సమర్ధురాలుగను, భావ్యం=ఉండదగినది.

తా. భార్య భర్తను నీడవలెనే అనుగమింపవలయును. చెలికత్తెవలె ఆయనకు హితకరమగు కర్మము నాచరింపవలయును. పరిశుద్ధురాలును, సర్వదా సంతుష్టురాలును, గృహకృత్యములయందు సమర్ధురాలును అయి యుండవలయును.

వ్యా. స్త్రీ ధర్మార్థకామములయందు తనకు తన భర్త నియామకుడని యెంచి, ఆయనను నీడవలె ననుసరించి నడువవలయును అట్లు చేసిన యెడల, ఆమె కోమలస్వభావమున కెన్నడును భంగము రాదు. కనుక, తన భర్త తన కాశ్రయమిచ్చు వృక్షమువలెను, తా నా వృక్షము నాశ్ర

యించు లతవలెను భావింపవలెను. కాని, తాను భర్తయొక్క ప్రమ ప్రమాదములకు అంధురాలయి యుండగూడదు ఏలయన, పరమేశ్వరుడు తనకుగూడ, తగినంత వివేచనాశక్తి దయచేసి యున్నాడు కనుక, హితము నాచరించు చెలికత్తెవలె, భర్తను అసత్కార్యములనుండి మర లించి మంచి ఆలోచన చెప్పి, సత్కార్యముల ననుష్ఠింపజేయవలయును భర్త యొక్క శరీరమును, మనస్సును స్వస్థతగా నుండుటకు తగిన ప్రయత్నము చేయవలయును తాను శరీరమునందును, దుస్తులయందును, అంతఃకర ణమునందును పరిశుద్ధురాలయి యుండవలయును గృహకృత్యములయందు ప్రఫుల్లహృదయముతో నియుక్తురాలయి, గృహధర్మములను సమర్ధతతో నిర్వహింప ప్రయత్నింపవలయును

వి. ఇందును పత్నీధర్మములే వివరింపబడినవి. భార్య భర్తను ఇట్ల వలె అనుసరించవలయునని చెప్పుటచే భార్యకు నీచస్థానమును, భర్తకు ఉచ్చస్థానమును ఇయ్యబడినవి కాని, భర్తయొక్క లోపములకు భార్య అంధురాలయి యుండగూడదని, మహర్షి కొంచెము సవరించుచున్నాడు.

శ్లో॥ న కేనచిత్ వివదేచ్చ, అప్రలాప విలాపినీ।
న చాతివ్యయశీలా స్యాత్, న ధర్మార్థవిరోధినీ॥ ౯

[వ్యాససంహిత II 33. 34 ]

ప. న, కేనచిత్, వివదేత్, చ, అప్రలాపవిలాపినీ, న, చ, అతివ్యయశీలా, స్యాత్, న, ధర్మార్థవిరోధినీ.

టీ. స్త్రీ, కేనచిత్=ఎవరితోను, న వివదేత్ = జగడ మాడ గూడదు. అప్రలాపవిలాపినీ=అధిక ప్రసంగము, అనర్ధ సంభాషణము చేయునదియు, అతివ్యయశీలా=అతివ్యయము చేయునదియు, న స్యాత్=కాగూడదు ధర్మార్ధవిరోధినీ=ధర్మార్ధములకు విరోధురాలును, న భవేత్=కాగూడదు.

తా. స్త్రీ ఎవరితోను వివాదపడగూడదు. అనర్ధకమగు అధిక ప్రసంగము చేయగూడదు అతివ్యయము చేయగూడదు. ధర్మార్ధవిషయములయందు భర్తకు విరుద్ధముగా సంచరింపగూడదు.

వ్యా. ఏ కుటుంబమునందు ద్వేషము, ఈర్ష్య, వివాదము, జగడగొండితనము ప్రవేశించుచున్నవో, ఆ కుటుంబమునుండి సుఖసంతోషాదులు తొలగిపోవుచున్నవి ఆ కుటుంబ మచిరకాలములోనే సిరిసంపదల నుండి భ్రష్టమగుచున్నది కనుక, గృహాయజమానురాలీ విషయమయి జాగరూకురాలయి యుండవలయును యావత్కుటుంబమునందును ఎట్లు శాంతి నెలకొనియుండునో, అట్టి విధానమును సదా చేయుచుండవలయును అందరియెడలను న్యాయముగా ప్రవర్తింపవలెను. అందరి కల్యాణమును కోరవలయును. నిరర్ధకములగు మాటలను కట్టిపెట్టి, మితభాషిణి కావలయును. సిగ్గుకరములయిన, నిందాకరములయిన, దూషణయుక్తములయిన, అశ్లీలవాక్యములను మాని, అందరితోను మృదుమధురవాక్యములనే పలుకవలయును. ఏ విషయమునను అనావశ్యక వ్యయమును చేయ

గూడదు లోభిత్వముచే అవశ్యకవ్యయమును మానగూడదు ధార్మిక కృత్యములకుగాని, సాంసారిక కృత్యములకుగాని ప్రతిబంధకములగు ఆచరణమునందును, ఆమోద ప్రమోదములయందును ఆసక్తులు కాగూడదు.

వి. దీనియందును యోగ్యురాలగు భార్యయొక్క లక్షణములే చెప్పబడినవి.

శ్లో. పతిప్రియహితే యుక్తా, స్వాచారా సంయతేంద్రియా ।
ఇహ కీర్తి మవాప్నోతి, ప్రేత్య చానుపమం సుఖమ్॥ ౧౦
[యాజ్ఞవల్క్యసంహిత I ౮౭—మహాభారత, అనుశాసనపర్వ ౧౨౩ ఉ.]

ప. పతిప్రియహితే, యుక్తా, స్వాచారా, సంయతేంద్రియా, ఇహ, కీర్తిం, అవాప్నోతి, ప్రేత్య, చ, అనుపమం, సుఖమ్.

టీ. పతిప్రియ హితే యుక్తా=పెనిమిటికి ప్రియమయినట్టియు, హితమయినట్టియు కార్యములయందు నియుక్తురాలయినట్టియు, స్వాచారా=సత్ప్రవర్తన గలిగినట్టియు, సంయతేంద్రియా=ఇంద్రియనిగ్రహము కలిగినట్టియు, సతీ=స్త్రీ, ఇహ=ఈ లోకమునందు, కీర్తిం=యశమును, అవాప్నోతి=పొందుచున్నది. ప్రేత్య=మరణానంతరము, అనుపమం=నిరుపమానమయిన, సుఖమ్=సుఖమును, అవాప్నోతి=పొందుచున్నది.

తా. ఏ స్త్రీ పతికి ప్రియమును హితమును అగు కార్యములయందు నియుక్తురాలయి యుండునో, సదాచార సంపన్నురాలును సంయతేంద్రియురాలును అయి యుండునో, ఆమె ఇహమునందు కీర్తిని, పరమునందు సాటిలేని సుఖమును పొందును.

వ్యా. భర్తకు ప్రియమును హితమును సమకూర్చునట్టియు, సత్ప్రవర్తన గలిగినట్టియు, జితేంద్రియురాలయినటువంటియు స్త్రీని జూచి మనుష్యులందరును ఎట్లు సంతోషింతురో, అట్లే, సర్వదర్శియగు పరమేశ్వరుడును ప్రసన్నుడగును. అట్టి స్త్రీ ఐహికాముష్మిక సుఖముల నొంది, కృతార్థురాలగును. ఆమె కీర్తి సర్వత్ర వ్యాపించి లోకమునందలి ఇతర స్త్రీలను కూడ సత్కర్మనిరతులగుటకు ప్రోత్సహించును.

వి. ఇదియును విధేయురాలగు భార్యయొక్క కీర్తినే ప్రశంసించుచున్నది.

శ్లో. స్త్రీభిర్భర్తృవచః కార్యం, ఏష ధర్మః పరః స్త్రియాః।
సద్వృత్తచారిణీం పత్నీం, త్యక్త్వా పతతి ధర్మతః॥ ౧౧

[యాజ్ఞవల్క్యసంహిత I ౭౭—వ్యాససంహిత II. ౪౬.]

ప. స్త్రీభిః, భర్తృవచః, కార్యం, ఏషః, ధర్మః, పరః, స్త్రియాః, సద్వృత్తచారిణీం, పత్నీం, త్యక్త్వా, పతతి, ధర్మతః.

టీ. స్త్రీభిః=సాధ్వీమణులచే, భర్తృవచః=భర్తయొక్క ఆజ్ఞ, కార్యం=నెరవేర్పదగినది. స్త్రీణాం=స్త్రీలకు, ఏషః=ఇదే, పరః ధర్మః=శ్రేష్ఠమయిన ధర్మము. సద్వృత్తచారిణీం పత్నీం=సత్ప్రవర్తనగల భార్యను, త్యక్త్వా=విడిచి, ధర్మతః పతతి=పురుషుడు ధర్మభ్రష్టు డగుచున్నాడు.

తా. స్త్రీలు భర్తల వాక్యములను పరిపాలింపవల యును. ఇదే వారికి పరమ ధర్మము. సదాచారసంపన్నురాలును, పతిప్రియహితనియుక్తురాలును అగు భార్యను పరిత్యజించిన భర్త ధర్మపథమునుండి భ్రష్టుడగును.

వ్యా. స్త్రీ భర్తకు విధేయురాలయి యుండవలయును. స్త్రీ సామాన్యమునకు స్వాభావికమయిన కోమలస్వభావమును సహితము లక్ష్యపెట్టక, పురుషుడు తన భార్యను శక్తికి మించిన పనులను చెప్పి కష్టపెట్టగూడదు. ఆమెయొక్క శారీరక, మానసిక, ఆధ్యాత్మిక కల్యాణమును సమకూర్చుటకొరకు, తగిన ప్రయత్నము చేయవలయును. సదుపదేశము చేయుచు, తన సాధువర్తనమునే ఆమెకు దృష్టాంతముగ కనబరపవలయును. ప్రేమతోను, ఆదరముతోను ఆమెను పరిపాలించుచు, ధర్మార్థకామములలో తన కామెను సహభాగినినిగా చేసికొనవలయును. ఎవడు తన భార్య సాధ్విగా నుండవలయునని కోరునో, అతడు స్వయముగా సాధువగుటకు ప్రయత్నింపవలయును. సాధ్వియగు భార్యను పరిత్యజించినవాడు, ధర్మ

మును పరిత్యజించినవాడే యగును. కనుక, సత్పురుషు డెన్నడును సాధ్వి యగు భార్యను విడువగూడదు

వి. ఇదియును స్త్రీధర్మమునే బోధించుచున్నది. పురుషునకు కూడ స్త్రీయెడల ధర్మములు కలవని మహర్షి నిరూపించుచున్నాడు

శ్లో. సూక్ష్మేభ్యోఽపి ప్రసంగేభ్యః, స్త్రియో రక్ష్యా విశేషతః।
ద్వయోర్హి కులయోః శోకమ్, ఆవహేయు రరక్షితాః॥
౧౨

[మనుసంహిత IX. ౫]

ప. సూక్ష్మేభ్యః, అపి, ప్రసంగేభ్యః, స్త్రియః, రక్ష్యాః, విశేషతః, ద్వయోః, హి, కులయోః, శోకమ్, ఆవహేయుః, అరక్షితాః.

టీ. స్త్రియః=స్త్రీలు, సూక్ష్మేభ్యోఽపి ప్రసంగేభ్యః=అత్యల్పమయిన దుస్సహవాసమునుండి సహితము, విశేషతః=విశేషముగా, రక్ష్యాః=రక్షింపబడవలసినవారలు. హి=ఎందుచేతనంటేని, అరక్షితాః=అట్లు సంరక్షింపబడనివారు, ద్వయోః కులయోః=పుట్టినింటికిని అత్తింటికిని, రెండు వంశములకును శోకం=దుఃఖమును, ఆవహేయుః=కలుగజేయుదురు.

తా. స్త్రీలను అత్యల్పమగు దుస్సహవాసమునుండియు, విశేషముగా సంరక్షింపవలయును. ఏలయన, స్త్రీ సురక్షితురాలు కానియెడల, పుట్టినింటివారియొక్కయు, అత్తింటివారియొక్కయు దుఃఖమునకు హేతువగును.

వ్యా. ఎక్కడ, చూడరాని ప్రదర్శనములు చూచుటవలనను, వినరాని ప్రసంగములు వినుటవలనను మనస్సు కాలుష్యము నొందునో, ఎక్కడ నీచములగు ఆమోద ప్రమోదములవలన హృదయమునందలి ధర్మభావములు ఎండిపోవునో, ఎచ్చట పాప ప్రలోభనములవలన మనస్సు చలించునని ఆశంక యుండునో, అచ్చట వాసముచేయుట భావ్యము కాదు ఎవరికి అపవిత్రత అసహ్యముగా తోచక, ఆనంద ప్రదమయి యుండునో, ఎవరు అపవిత్రతయందు నిమగ్నులయి యుందురో, అట్టివారి సాంగత్యము విషమువలె పరిత్యాజ్యము ఎవరికి పాతివ్రత్యధర్మమునందు అనురాగము లేదో, అట్టివారి ప్రవర్తన బహు భయానకము అట్టి సమస్త దుష్ప్రదేశములనుండియు, దుస్సహవాసములనుండియు, స్త్రీలు విశేష ప్రయత్నముతో సంరక్షింపబడవలయును పాపులతోడి సంపర్కమువలన పాపాసక్తి, పాపపు కోరికలు జనించును

వి. ఈ శ్లోకము స్త్రీలను దుస్సహవాసమునుండి దూరముగా నుంచవలసిన యావశ్యకతను బోధించుచున్నది. అది స్త్రీలకు మాత్రమే గాక, పురుషులకు గూడ వర్తించును. ఇట్టి యుపదేశవాక్యములే మన దేశమునందలి ఘోరాపదలికి కారణమయి యుండవచ్చును.

శ్లో. అరక్షితా గృహే రుద్ధాః, పురుషై రాప్తకారిభిః।
ఆత్మాన మాత్మనా యాస్తు, రక్షేయు స్తాః సురక్షితాః॥ ౧౩
[మనుసంహిత IX. ౧౨]

ప. అరక్షితాః, గృహే, రుద్ధాః, పురుషైః, ఆప్తకారిభిః, ఆత్మానం, ఆత్మనా, యాః, తు, రక్షేయుః, తాః, సురక్షితాః.

టీ. ఏ స్త్రీలు దుస్స్వభావముచే తమ్మును రక్షించుకొన జాలరో వారు, ఆప్తకారిభిః=విశ్వాసయోగ్యులును విధేయులును అగు, పురుషైః=పురుషులచేత, గృహే రుద్ధాః అపి= గృహమునందు బంధింపబడినవారలయినను, వారు, అరక్షితాః=రక్షింపబడనివారే. యస్తు (యాః తు)=ఎవరయితే, ధర్మజ్ఞులగుటచే, ఆత్మానం=తమ్మును, ఆత్మనా=తమ ధర్మబుద్ధిచేతనే, రక్షేయుః=రక్షించుకొనుచున్నారో, తాః=వారే, సురక్షితాః=చక్కగా రక్షింపబడినవారు.

తా. విశ్వాసయోగ్యులును, ఆజ్ఞావహులును అగు పురుషులచే గృహాభ్యంతరస్థానమున బంధింపబడినను, స్త్రీలు అరక్షితలే. ఎవరు తమ్ము తాము సంరక్షించుకొందురో వారే సురక్షితలు.

వా. అంతఃకరణమునందే పాపముయొక్క మొలకలు పుట్టు చున్నవి దానినుండియే క్రమక్రమముగా పాపకార్యము లుత్పన్నమగు చున్నవి అంతఃకరణమే పవిత్రమయినయెడల, కార్యములు పవిత్రము లగును కనుక, స్త్రీలకు ధర్మము నుపదేశించి, వారి హృదయములయందు ధర్మానురాగమును ప్రజ్వలింపజేయవలయును ఆట్లయినయెడల, వారి యొక్క మనస్సు ధర్మమనెడు దుర్గములో సురక్షితమయి యుండుటచే వారు తమును తామే పాపమునుండి సంరక్షించుకొనగలరు ఎవరు తమ్ము తామే సంరక్షించుకొనగలరో వారే సురక్షితులు.

వి. ఈశ్లోకము పూర్వపక్షరహితమగు సత్యమును తెలుపుచు, సంపూర్ణాదర్శమును ప్రకటించుచున్నది. రాతిగోడలు రక్షణ నియ్యజాలవు. తన్ను తాను సంరక్షించుకొనగలిగిన స్త్రీయే సురక్షితురాలు.

శ్లో. భ్రాతుర్జ్యేష్ఠస్య భార్యా యా, గురుపత్న్యనుజస్య సా।
యవీయసస్తు యా భార్యా, స్నుషాజ్యేష్ఠస్య సా
స్మృతా॥ ౧౮

[మనుసంహిత IX. ౫౭.]

ప. భ్రాతుః, జ్యేష్ఠస్య, భార్యా, యా, గురుపత్నీ, అనుజస్య, సా, యవీయసః, తు, యా, భార్యా, స్నుషా, జ్యేష్ఠస్య, సా, స్మృతా.

టీ. యా=ఎవరు, జ్యేష్ఠస్య భ్రాతుః=అన్నగారియొక్క, భార్యా=భార్యయో, సా=ఆమె, అనుజస్య=తమ్మునికి, గురుపత్నీ=గురువుగారి భార్యవంటిది. యవీయసస్తు (యవీయసః తు) యా భార్యా=ఎవరు తమ్ముని భార్యయో, సా=ఆమె, జ్యేష్ఠస్య=అన్నగారికి, స్నుషా=కోడలువంటిదని, స్మృతా=స్మృతులచేత చెప్పబడినది.

తా. అన్నగారి భార్య తమ్మునికి గురువుగారియొక్క భార్యతో సమానురాలనియు, అన్నగారికి తమ్ముని భార్య కుమార్తెవంటిదనియు, స్మృతికర్తలు చెప్పియుండిరి.

వ్యా. తమ్మునికి అన్నగారు పితృతుల్యుడు గనుక, అతనిభార్య మాతృసమానురాలు. అన్నగారికి తముడు పుత్రసదృశుడు గనుక, అతని భార్య కోడలువంటిది. ఎవరితో నెట్టి సంబంధమో, వారి భార్యలయెడల, తదనురూప సంబంధమే యుండుట యుక్తము.

వి. ఇది వదినెగారియెడలను, మరదలియెడలను ఎట్లు నడుచుకొనవలయునో బోధించుచున్నది,



# ౩ అధ్యాయము



శ్లో॥ గృహస్థః పాలయేద్దారాన్, విద్యా మభ్యాసయేత్సుతాన్।
గోపయేత్ స్వజనాన్, బంధూన్, ఏష ధర్మః సనాతనః॥ ౧
[మహానిర్వాణతంత్రే VIII ౩౫.]

ప. గృహస్థః, పాలయేత్, దారాన్, విద్యాం, అభ్యాసయేత్, సుతాన్, గోపయేత్, స్వజనాన్, బంధూన్, ఏషః, ధర్మః, సనాతనః.

టీ. గృహస్థః=గృహస్థు, దారాన్=భార్యను, పాలయేత్=పాలనచేయవలయును, సుతాన్=బిడ్డలను, విద్యాం అభ్యాసయేత్=చదివించవలెను. స్వజనాన్=తనవారిని, బంధూన్=బంధువులను, గోపయేత్=సంరక్షింపవలెను. ఏషః సనాతనః ధర్మః=ఇదే సనాతన ధర్మము.

తా. గృహస్థు తన భార్యను పోషింపవలయును. పుత్రులకు విద్యాభ్యాసము చేయింపవలెను. స్వజనమును, బంధువర్గమును సంరక్షింపవలయును. ఇదే సనాతన ధర్మము.

వ్యా. భార్యను పాలించుటయు, బిడ్డలకు చదువు చెప్పించుటయు, బంధువులకును స్నేహితులకును సాహాయ్యము చేయుటయు, గృహస్థుయొక్క నిత్యకర్తానుష్ఠానములని తెలిసికొనవలయును. సంతానమునకు అన్నవస్త్రము లిచ్చి పోషించినంతమాత్రమున తల్లిదండ్రుల బాధ్యత పూర్తి యయినదని తలంపగూడదు. దేనివలన సంతానము ఈశ్వరునియెడలను మానవులయెడలను సాధుభావముతో, సద్భావముతో మెలగుచు, ఇహలోకమునందు ధర్మజీవనమును గడుపగలుగుటకును, పరలోకమునందు సద్గతిని పొందుటకును, సమర్థులగుదురో, తల్లిదండ్రులు బిడ్డలకు అట్టి విద్యాబుద్ధులు గరపవలయును. గృహస్థు బంధువులకును, స్నేహితులకును తన శక్త్యనుసారముగా సహాయము చేయవలెను ఇతరుల కేవిధమయిన సహాయము కావలసివచ్చినను, గృహస్థు పరాఙ్ముఖుడు కాగూడదు.

వి. ఈ యధ్యాయమునందు గృహస్థు, కుటుంబమునందలి వివిధ వ్యక్తులతో ఎట్లు వ్యవహరింపవలయునో చెప్పబడి యున్నది. వెనుకటి యధ్యాయమునందలి చివర శ్లోకమునుగూడ దీనియందే చేర్చవచ్చును.

శ్లో. కన్యాప్యేవం పాలనీయా, శిక్షణీయాతి యత్నతః ।
దేయా వరాయ విదుషే, ధనరత్న సమన్వితా ॥ ౨

[మహానిర్వాణతంత్ర VIII. ౪౭]

ప. కన్యా, అపి, ఏవం, పాలనీయా, శిక్షణీయా, అతి యత్నతః, దేయా, వరాయ, విదుషే, ధనరత్న సమన్వితా.

టీ. కన్యాపి (కన్యా అపి)=కుమార్తెయును, ఏవం=పయి విధముగానే, పాలనీయా=పాలింపబడదగినది. అతియత్నతః= విశేష శ్రద్ధతో, శిక్షణీయా=విద్యాబుద్ధులు చెప్పించదగినది. ధనరత్నసమన్వితా=తగిన బహుమానములతోను, ఆభరణములతోను కూడిన ఆమె, విదుషే వరాయ=విద్వాంసుడగు వరునికొరకు, దేయా=ఇయ్యబడదగినది.

తా. కుమార్తెను సహితము ఇట్లే పాలింపవలయును. విశేష ప్రయత్నముతో విద్యాశిక్షణాదికము నియ్యవలెను. ధనరత్నసహితముగ పండితుడును సత్పాత్రుడును అగు వరున కిచ్చి వివాహము చేయవలెను.

వ్యా. కుమారునివలెనే కుమార్తెనుకూడ పరిపాలించుచు, ఆమెకు గూడ జ్ఞానమునందును, ధర్మమునందును శిక్షణము నీయవలయును. కుమార్తె అత్తవారింట ఏయే గురుతర భారమును వహించి, ఏయే ధర్మముల నిర్వర్తింపవలసియుండునో, అవన్నియు తండ్రియొక్క ఉపదేశములమూలమునను, తల్లియొక్క దృష్టాంతములమూలమునను, పుట్టినింటనే అభ్యసింపవలసియుండును కనుకనే, జననీజనకులు కొడుకులతోపాటు కుమార్తెలకు గూడ యుక్త శిక్షణము నీయవలయును ఏ సమస్త విద్యలు అభ్యసించిన యెడల, ఈశ్వరజ్ఞానము, ఈశ్వరభక్తి ఉజ్వలవంతమగునో, ఏ శిక్షణమువలన

-హృదయమునం దుదారభావములు మేల్కొనునో, పుత్త్రులు పుత్త్రికలు అను భేదములేక ఉభయులకును అట్టి విద్యలనే నేర్పవలయును, అట్టి శిక్షణమునే పొందింపవలయును. కుమార్తెలకు వయసు వచ్చినతరువాత తగిన వరున కిచ్చి వివాహము చేయవలయును.

వి. ఆడపిల్లలుగదా యని నిర్లక్ష్యముచేయక, మగపిల్లలతోపాటు విద్యాబుద్ధులు చెప్పించి వారినిగూడ యోగ్యులనుగా చేయవలయునని ఈ శ్లోకము విధించుచున్నది

శ్లో. యాదృగ్గుణేన భర్త్రా స్త్రీ, సంయుజ్యేత యథావిధి ।
తాదృగ్గుణా సా భవతి, సముద్రేణేవ నిమ్నగా ॥ 3

[మనుసంహిత II. ౨౨]

ప. యాదృగ్గుణేన, భర్త్రా, స్త్రీ, సంయుజ్యేత, యథావిధి, తాదృగ్గుణా, సా, భవతి, సముద్రేణ, ఇవ, నిమ్నగా.

టీ. స్త్రీ=కన్యక, యథావిధి=శాస్త్రోక్తప్రకారముగా, యాదృగ్గుణేన భర్త్రా=ఎటువంటి గుణముగల భర్తతో, సంయుజ్యేత=వివాహబంధముచేత చేర్పబడుచున్నదో, సా=ఆ స్త్రీ, సముద్రేణ=సముద్రముతో చేరిన, నిమ్నగా ఇవ=నదివలె, తాదృగ్గుణా=అట్టి గుణము కలదియే, భవతి=అగుచున్నది.

తా. నదీజలము తియ్యనిదయినను, సముద్రముతో చేరినప్పు డెట్లు ఉప్పదనమును పొందునో, అట్లే, ఏ స్త్రీ ఎట్టి గుణములుగల భర్తతో విధ్యుక్తముగ వివాహము చేయ బడునో, ఆ స్త్రీ అట్టి గుణములు కలదియే యగును.

వ్యా. భర్తయొక్క గుణముచె భార్యయు గుణవంతురాలగు చున్నది. భర్తయొక్క దోషముచె భార్యయు దోషయుక్తురాలగుచున్నది. కనుక, తలిదండ్రులు కుమార్తెలకొరకు తగిన వరులనే అన్వేషింపవలయును ఎవడు జ్ఞానవంతుడో, ఈశ్వరభక్తిపరాయణుడో, సచ్చరిత్రుడో, సాధు సత్తముడో, కులశీలములయందు కన్యకకంటె హీనుడు కాడో, ఎవని యెడల కన్యకకు విరాగముగాని, విద్వేషముగాని లేవో, అట్టి వరునే వెదకి కన్యాదానము చేయవలయును.

వి. భర్తయొక్క గుణములే భార్యకును పట్టుబడునుగనుక, తల్లి దండ్రులు కుమార్తెకు తగిన వరుని ఏరుటలో విశేష జాగ్రతను వహింప వలయునని ఈ శ్లోకము బోధించుచున్నది.

శ్లో. అజ్ఞాత పతిమర్యాదాం, అజ్ఞాత పతిసేవనాం ।
నోద్వాహయేత్ పితా బాలాం, అజ్ఞాత ధర్మశాసనాం॥ ౪
[మహానిర్వాణతంత్ర VIII. ౧౦౭ ]

ప. అజ్ఞాత పతిమర్యాదాం, అజ్ఞాత పతిసేవనాం, న, ఉద్వాహయేత్, పితా, బాలాం, అజ్ఞాత ధర్మశాసనాం.

టీ. అజ్ఞాతపతిమర్యాదాం=భర్త నెట్లు గౌరవింపవల యునో తెలియనట్టియు, అజ్ఞాతపతిసేవనాం=పతి నెట్లు సేవింప వలయునో ఎరుగనట్టియు, అజ్ఞాతధర్మశాసనాం=ధర్మశాసన ములతో పరిచయము లేనట్టియు, బాలాం=కుమార్తెను, పితా = తండ్రి, నోద్వాహయేత్ (న ఉద్వాహయేత్) = వివాహము చేయగూడదు.

తా. కన్య ఎంతవరకు పతిని మర్యాదచేయుటయు, పతికి సేవచేయుటయు తెలియకయుండునో, ఎంతవరకు ధర్మ శాసనముల పరిజ్ఞానము లేకయుండునో, అంతవరకు, తండ్రి ఆమెకు పరిణయము చేయగూడదు.

వ్యా. దాంపత్యధర్మ మెంత గురుతరమయినదో, భర్తతోడి సంబంధ మెంత అనుల్లంఘనీయమో, ధర్మము ఎంత ప్రయత్నముచేసి ఆర్జింపవలసిన పవిత్రధనమో, ఇట్టి గురుతర విషయములను తెలిసికొనగల వయసు వచ్చువరకు, తండ్రి కుమార్తెకు వివాహము చేయగూడదు

వి. పవిత్రమగు దాంపత్యధర్మములు గ్రహించి ఆచరింపగల యీడు వచ్చువరకు కన్యకకు వివాహము చేయగూడదని, ఈ శ్లోకము శాసించుచున్నది ఇట్టి శాసనములుండియు, బాల్యవివాహము లెట్లు వాడుక లోనికి వచ్చినవో, ఆశ్చర్యకరముగా నున్నది.

శ్లో. న కన్యాయాః పితా విద్వాన్, గృహ్ణీయాత్ శుల్కమణ్వపి।
గృహ్ణన్ శుల్కంహి లోభేన, స్యా న్నరోఽపత్య
విక్రయీ॥ ౫
[మనుసంహిత III ౫౧.]

ప. న, కన్యాయాః, పితా, విద్వాన్, గృహ్ణీయాత్, శుల్కం, అణు, అపి, గృహ్ణన్, శుల్కం, హి, లోభేన, స్యాత్, నరః, అపత్యవిక్రయీ.

టీ. విద్వాన్=శుల్కగ్రహణ దోషజ్ఞుడగు, కన్యాయాః పితా=కన్యకయొక్క తండ్రి, అణ్వపి (అణు అపి)=కన్యాదాన నిమిత్తమయి స్వల్పమయినను, శుల్కం=మూల్యమును, న గృహ్ణీయాత్=గ్రహింపగూడదు. హి=ఏలయన, నరః=పురుషుడు, లోభేన=లోభత్వముచేత, శుల్కం గృహ్ణన్=మూల్యమును గ్రహించినవాడయి, అపత్యవిక్రయీ = సంతానము నమ్మినవాడు, స్యాత్=అగును.

తా. జ్ఞానవంతుడగు తండ్రి కన్యాదాననిమిత్తమయి కించిన్మాత్రమయినను శుల్కమును గ్రహించగూడదు. లోభవశముచే పణమును గ్రహించినయెడల, అతడు సంతానమును అమ్ముకొనినవాడే యగును.

వ్యా. కుమార్తెను సర్వవిధముల పరిపాలించుట, విద్యావతినిగా జేయుట, తగిన వరున కిచ్చి వివాహముచేయుట, ఇవి తల్లిదండ్రులు అవశ్యము నెరవేర్పవలసిన ధర్మములయి యున్నవి. ఇవి తృప్తికరముగా నెరవేర్పగలిగినప్పుడే తాము కృతార్థులమయితిమని వారు భావింపవలెను. కన్యాదానము చేసి, దానికి బదులు వారు ధనమును గ్రహింపగూడదు. ఏమాత్రము మూల్యమును గ్రహించినను, అది దానముగాక, విక్రయమే యగును ఏ తలిదండ్రులు లోభత్వముచే కన్యక నమ్ముకొందురో, వారు నరాధములుగా పరిగణింపబడుదురు ఎందుచేతనంటే, నరవిక్రయము ఏహ్యము, ధర్మవిరుద్ధము.

వి. తల్లిదండ్రులు లోభత్వముచే కన్యల నమ్ముకొను కాలములో ఈ శ్లోకము వ్రాయబడినది. ఇప్పుడు వరకట్నములు మితిమీరుచున్నవి. కన్యావిక్రయ మెంత గర్హ్యమో, వరవిక్రయమును అంత గర్హ్యమే.

---

# ౪ అధ్యాయము



శ్లో॥ న తేన వృద్ధో భవతి, యేనాస్య పలితం శిరః।
యోవై యువాప్యధీయానః ,తందేవాః స్థవిరం విదుః॥ ౧

[మనుసంహిత II ౧౫౬.]

ప. న, తేన, వృద్ధః, భవతి, యేన, అస్య, పలితం, శిరః, యః, వై, యువా, అపి, అధీయానః, తం, దేవాః, స్థవిరం, విదుః.

టీ. యేన = ఏ హేతువుచేత, అస్య = ఈ మనుష్యుని యొక్క, శిరః=తల, పలితం=నెఱసినదో, తేన=ఆ హేతువు చేత, వృద్ధః=వృద్ధు, న భవతి=కాడు, యః=ఎవడు, యువాపి= (యువా అపి) యువకుడయినను, అధీయానః=విద్వాంసుడో, తం వై=వానినే, దేవాః=దేవతలు, స్థవిరం=వృద్ధునిగా, విదుః= భావించుచున్నారు.

తా. కేవలము తల నెరసినంతమాత్రమున నెవడును వృద్ధుడు కాడు. కాని, యువకుడయినను, ఎవడు విద్యావంతుడో, అతడే వృద్ధని దేవతలు చెప్పియుండిరి.

వ్యా. మానవుడు యత్నపూర్వకముగా విద్యాభ్యాసము చేయవలయును ఇందువిషయమయి ఎంతమాత్రము అశ్రద్ధ చెయగూడదు. విద్యవలననే జ్ఞానచక్షువు నిర్మలమగును, ఏ భ్రమ ఐహికాముష్మిక మంగళమునకు విఘ్నకారియో, ఏది సత్యమును అసత్యముగాను, అసత్యమును సత్యముగాను కనబరచునో, ఏది సత్కార్మను అసత్కార్మగాను, అసత్కార్మను సత్కార్మగాను భ్రమింపజేయునో, అట్టి మోహమునుండి విముక్తి నొందుటకు, జ్ఞానముతప్ప ఉపాయాంతరము లేదు కనుక, విద్యద్వారమున జ్ఞానమును ఉజ్జ్వలవంతముగా చేసికొనవలయును. భౌతిక విద్యలన్నియు నేర్చి యుండవలయును ఏలయన, ఈ భౌతిక జగతునందే భూతాధిపతియగు పరమేశ్వరునియొక్క జ్ఞానశక్తి, మంగళభావము, అద్భుతమహిమ దేదీప్యమానముగా ప్రకాశించుటను దర్శించిన యెడల, ఆయనయందు శ్రద్ధాభక్తులు పరివర్ధితములగును అందరికిని శుభకరములగు కార్యములు చేయుటయందు సమర్థత కలుగును భౌతికజ్ఞానమును మాత్రమేగాక, ఆధ్యాత్మిక జ్ఞానమును సహితము ఆర్జింపవలయును. జీవాత్మ ఆ సత్య శివ సుందర పురుషునే పోలియున్నది. జీవాత్మ పరమాత్మయొక్క ఛాయయే, ప్రతిబింబమే జీవాత్మయొక్క స్వరూపమును తెలిసికొన్న యెడల. అదృశ్యుడు, అనిర్వచనీయుడు, అచింత్యుడు, అనంతుడు అగు ఆ పరమాత్మయొక్క ప్రకాశమును సహితము కొంతవరకు గ్రహింపవచ్చును జీవితముయొక్క పరమార్థమును అనుభవమునకు తెచ్చుకొనుటకు

తగిన యుపాయమును విశేషముగా తెలిసికొనవచ్చును. ఈ విధముగా, ఉభయవిద్యలద్వారమున, సర్వవిద్యలకు ఆశ్రయమయిన బ్రహ్మవిద్య నభ్యసించి, తద్ద్వారమున బ్రహ్మమును పొంద ప్రయత్నింపవలయును. ఆయనకు హితమయిన కార్యముల నాచరించి, ఐహికాముష్మిక శుభము లను వడసి, కృతకృత్యుడయి జన్మసాఫల్యము నొందవలయును.

వి. ఈ నాలవ యధ్యాయమునందు గృహస్థునకు భౌతికజ్ఞానము యొక్కయు, ఆధ్యాత్మికజ్ఞానముయొక్కయు ఆవశ్యకత చెప్పబడుచున్నది. కేవలము వయసువలననే ఒకడు గౌరవనీయుడు కాడనియు, జ్ఞానమువల ననే గౌరవనీయుడగుననియు, ఈ మొదటి శ్లోకము చెప్పుచున్నది.

శ్లో. మౌనాన్న స మునిర్భవతి, నారణ్యవసనా న్మునిః।
స్వలక్షణం తు యో వేద, స మునిః శ్రేష్ఠ ఉచ్యతే॥ ౧
[మహాభారత, ఉద్యోగపర్వ.]

ప. మౌనాత్, న, సః, మునిః, భవతి, న, అరణ్యవసనాత్, మునిః, స్వలక్షణమ్, తు, యః, వేద, సః, మునిః, శ్రేష్ఠః, ఉచ్యతే.

టీ. సః=మానవుడు, మౌనాత్ = మాట్లాడకుండుట వలన, మునిః=ఋషి, న భవతి=కానేరడు. అరణ్యవసనాత్= అడవియందు వాసముచేయుటవలన, న మునిః=మునికాడు.

యః=ఎవడు, స్వలక్షణంతు=ఆత్మస్వరూపమును, వేద=తెలిసికొనుచున్నాడో, సః=వాడే, శ్రేష్ఠః=శ్రేష్ఠుడగు, మునిః=ముని యని, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. మౌనము వహించినంతమాత్రమున నెవడును ముని కాజాలడు. అరణ్యవాసము చేసినను ముని కాడు. కాని, ఎవడు ఆత్మస్వరూపమును తెలిసికొనునో, వాడే శ్రేష్ఠుడగు ముని యని చెప్పబడుచున్నాడు.

వ్యా. అరణ్యవాసమును, మౌనభావమును మునియొక్క లక్షణములు కావు ఏకాంతముగా ఆత్మవిషయమయి ఆలోచింపుము. నే నెవడను, ఈ శరీరముతో నాకెట్టి సంబంధము, ఈ జగత్తుతో నాకెట్టి సంబంధము, నే నెక్కడనుండి వచ్చినాను, న న్నెవరు తీసికొని వచ్చిరి, నే నెందుకొరకు ఇక్కడనున్నాను, తుదకు నేను చేరవలసిన గమ్యస్థానమేది, ఒకప్పుడు సుఖము, ఒకప్పుడు దుఃఖము, ఒకప్పుడు సంపత్తు ఒకప్పుడు విపత్తు, ఒకప్పుడు హర్షము ఒకప్పుడు విషాదము, నాయందు పర్యాయముగా ఒకదాని తరువాత నొకటి జనించుచున్నవి. వీని యుద్దేశమేమి? ఈ శరీరము, ఈ యింద్రియములు, ఈ ప్రవృత్తులు, ఈ వాసనలు నా కెందునిమిత్త మీయబడినవి, నాకు నలుపార్శ్వములయందును సమృద్ధముగా పరవబడియున్న సుఖసామగ్రి నాకేల చిరసంతృప్తి నియ్యకున్నది, నా సమస్తకోరికలను ఛేదించుకొని నాయందు దుత్పన్నమగుచున్న అమృతత్వముకొరకుగల కోరిక ఎక్కడ ఫలవంతమగును? నిజమయిన ముని

లేన యంతరాత్మయందు ప్రవేశించి, ఇట్టి ప్రశ్నలు వేసికొని, మననము చేసి, ఈశ్వరుడు ప్రసాదించిన వెలుగులో వారికి సదుత్తరములను పొంది, తాను ప్రయాణము చేయవలసిన మార్గమును కనుగొని, సంతుష్టినొందును.

వి. అరణ్యవాసము మొదలయిన బాహ్యానుష్ఠానములచే ముని కాడనియు, తన్ను తాను తెలిసికొనినవాడే నిజమయిన ఋషియనియు, ఈ శ్లోకము చెప్పుచున్నది. గ్రీసుదేశపు ఋషియగు సోక్రటీసుకూడ ఇట్లే చెప్పెను

శ్లో॥ నాత్మాన మవమన్యేత, పూర్వాభి రసమృద్ధిభిః ।
ఆమృత్యోః శ్రియమన్విచ్ఛేత్, నైనాం మన్యేత దుర్లభామ్ ॥ 3

[మనుసంహిత IV ౧౩౭]

ప. న, ఆత్మానం, అవమన్యేత, పూర్వాభిః, అసమృద్ధిభిః, ఆమృత్యోః, శ్రియం, అన్విచ్ఛేత్, న, ఏనామ్, మన్యేత, దుర్లభామ్.

టీ. పూర్వాభిః=పూర్వకాలమందయిన, అసమృద్ధిభిః=ధనముయొక్క అభావముచేత, ఆత్మానం=తనను, న అవమన్యేత=నేను మందభాగ్యుడను గదా యని, అవమానించుకొనగూడదు. ఆమృత్యోః=మరణపర్యంతము, శ్రియం=సంపత్తిని, అన్విచ్ఛేత్=కోరి, దానిని సంపాదింప బ్రయత్నింపవలయును.

ఏనాం=ధనార్జనమును, దుర్లభాం=దుర్లభమని, నమన్యేత=తలచగూడదు.

తా. పూర్వార్జితము లేదుగదా యని నిన్ను నీ వవమానించుకొనకుము. మరణాంతమువరకును, ధనసంపాదనమునకు ప్రయత్నింపవలయును. అది దుర్లభమనుకొనకుము.

వ్యా. త్రిభువనపాలకుడగు పరమేశ్వరుడు మానవునకు అద్భుతమయిన శక్తుల నిచ్చి, కష్టపడినయెడల, ఏ యిబ్బంది లేకుండ జీవనోపాధి గలుగుటకు అనేక ఉపాయములను చేసి యుంచెను పిత్రార్జితధనము లేదుగదా యని నిన్ను దౌర్భాగ్యుడవని యెంచుకొని, ధనసంపాదనము దుర్లభమనుకొని,నిరుత్సాహమునొంది,నిష్ప్రయత్నుడవు గాకుము. దారిద్ర్య దుఃఖమునందు పడియున్నను, నిన్ను నీ వవమానించుకొనకుము. న్యాయపథము తప్పక కష్టపడుము బ్రతికియున్నంతకాలమును ధనమార్జించుటకు తగిన సామర్థ్యము నీ యందున్నదని తెలిసికొనుము. పృథివియందుండి దారిద్ర్యదుఃఖమును దూరము చేయుట, ఆనందస్వరూపుడగు పరమేశ్వరునకు ప్రీతికరమయిన కార్యమే యని తెలిసికొనుము

వి. దరిద్రుడు తన దారిద్ర్యమును తలచుకొని, తనను నిరసించుకొన గూడదనియు, ధర్మమార్గమున కష్టపడి ధనవంతుడగుటకు ప్రయత్నింపవలయు ననియు, ఈ శ్లోకము ప్రోత్సహించుచున్నది.

శ్లో. సర్వం పరవశం దుఃఖం, సర్వ మాత్మవశం సుఖం।
ఏతద్విద్యాత్ సమాసేన, లక్షణం సుఖదుఃఖయోః॥ ౪
[మనుసంహిత IV ౧౬౦.]

ప. సర్వం, పరవశం, దుఃఖం, సర్వం, ఆత్మవశం, సుఖం, ఏతత్, విద్యాత్, సమాసేన, లక్షణం, సుఖదుఃఖయోః.

టీ. పరవశం=పరాధీనమయిన, సర్వం = సమస్తము, దుఃఖం=దుఃఖహేతువయినది. ఆత్మవశం = స్వాధీనమయిన, సర్వం=సమస్తమును, సుఖం=సుఖహేతువయినది. ఏతత్=ఇదే, సమాసేన=సంక్షేపముగా, సుఖదుఃఖయోః = సుఖదుఃఖముల యొక్క, లక్షణం=లక్షణముగా, విద్యాత్=తెలిసికొనవలయును.

తా. ఏదేది పరాధీనమో, అదంతయు దుఃఖహేతువు. స్వాధీనత యంతయు సుఖహేతువు. సుఖదుఃఖములయొక్క సంక్షేపలక్షణ మిదే యని తెలిసికొనుము.

వ్యా. పరమేశ్వరుడు దయాపూర్వకముగా మానవుల కనుగ్రహించిన శక్తుల నుపయోగించి, ప్రతిమానవుడును స్వతంత్రముగా జీవింప బ్రయత్నింపవలయును. ఆత్మగౌరవము కలవాడెయి స్వయం కృషి నక్క

సింపవలయును. సాధ్యమయినంతవరకు తన సమస్త కృత్యములను తానే చేసికొనవలయును. యత్నపూర్వకముగా స్నేహితులయొక్క ఆలోచనలను, ఉపాయములను గ్రహించవలసినదే. కాని, ఏది హితమో, ఏది అహితమో తాను స్వయముగా నాలోచించుకొనుటకు బదకించగూడదు. ఇతరుల సాహాయ్యమును కృతజ్ఞతతో స్వీకరింపవలయును, కాని, స్వయముగా నిశ్చేష్టుడును, నిరుద్యముడును కాగూడదు సాధ్యమయినంతవరకు ఇతరులమీద నాధారపడకూడదు భిక్షమెత్తరాదు.

వి. ఈ శ్లోకము స్వాతంత్ర్యమును, స్వయంకృషిని, ప్రశంసించుచున్నది ఏ విషయమున నయినను, ఇతరులమీద నాధారపడి యుండుటే దుఃఖమనియు, సర్వస్వాతంత్ర్యమే సుఖమనియు బోధించుచున్నది.

శ్లో. నోచ్ఛింద్యాదాత్మనో మూలం,పరేషాం చాతితృష్ణయా।
ఉచ్ఛిన్దన్ హ్యాత్మనోమూలంఆత్మానంతాంశ్చపీడయేత్॥౫

[మనుసంహిత VII ౧౩౯.]

ప. న, ఉచ్ఛిన్ద్యాత్, ఆత్మనః, మూలం, పరేషాం, చ, అతితృష్ణయా, ఉచ్ఛిన్దన్, హి, ఆత్మనః, మూలం, ఆత్మానం, తాన్, చ, పీడయేత్.

టీ. ఆత్మనః=తనయొక్క, మూలం=ధనము మొదలయిన దానిని, న ఉచ్ఛింద్యాత్=వ్యర్థముగా ఖర్చుపెట్టగూ

డదు. అతితృష్ణయా=అత్యాశచేత, పరేషాం చ=ఇతరుల ధనాదికమునున్ను, నోచ్ఛిన్ద్యాత్=వ్యర్థముగా ఖర్చుపెట్టగూడదు. హి=ఏలయన, ఆత్మనః=తనయొక్కయు, పరేషాం చ=ఇతరులయొక్కయు, మూలం=ధనాదికమును, ఉచ్ఛిన్దన్=పాడుచేసినవాడయి, ఆత్మానం=తనను, తాంశ్చ=వారినిన్ని, పీడయేత్=దుఃఖపెట్టును.

తా. లోభపరవశుడయి, తనయొక్కగాని, ఇతరులయొక్కగాని ధనమును వ్యర్థముచేయరాదు. అట్లు చేయుట వలన తనకును ఇతరులకును కూడ బాధ కలిగించినవాడగును.

వ్యా. అతిలోభమువలన ఇతరుల ధనమును వినాశము నొందించుటయేగాక, తన సర్వస్వమునుకూడ గోల్పోవలసి వచ్చును. కనుక, అతిలోభమును పరిత్యజించి, మితవ్యయము నభ్యసింపవలయును మితవ్యయము మూలముననే, తన యొక్కయు, తన కుటుంబముయొక్కయు, తన సంఘముయొక్కయు క్షేమము నభివృద్ధి నొందింపవలయును కనుక, లోభత్వదోషముచె నెన్నడును లిప్తుడు కాగూడదు.

వి. మనుసంహితయందు రాజధర్మములు చెప్పునప్పు డీ శ్లోకము చెప్పబడినది అత్యాశచే నీ యొక్కయు, ఇతరుల యొక్కయు, మూలచ్ఛేదము చేయకుము. రాజు ప్రజలనుండి బలాత్కారముగా విశేష సుంకము గ్రహించిన యెడల, ప్రజలను వినాశము నొందించుటయేగాక

తానుకూడ వినాశము నొందును. అని యీ శ్లోకార్థము. ఇది రాజున కన్వయించి నప్పుడు సమంజసముగా నున్నది. కాని, దీనిని మహర్షి సామాన్య గృహస్థునకుగూడ అన్వయించుచున్నాడు. కనుక, దీని యర్థము కొంచెము మార్చి చెప్పవలసి వచ్చినది. ఈ శ్లోకముయొక్క మొదటి సగము మహాభారతము శాంతిపర్వము ౧౭౫. ౧౩ లో కూడ నున్నది

శ్లో. యువైవ ధర్మశీలః స్యాత్, అనిత్యం ఖలు జీవితం।
కోహి జానాతి కస్యాద్య, మృత్యుకాలో భవిష్యతి॥ ౬
[మహాభారత, శాంతిపర్వ ౧౭౫ ౧౬]

ప. యువా, ఏవ, ధర్మశీలః, స్యాత్, అనిత్యం, ఖలు, జీవితమ్, కః, హి, జానాతి, కస్య, అద్య, మృత్యుకాలః, భవిష్యతి.

టీ. యువైవ (యువా ఏవ)=యువకుడుగా నుండగానే, ధర్మశీలః=ధర్మశీలుడు, స్యాత్=కావలయును. జీవితం=జీవితము, ఖలు=నిశ్చయముగా, అనిత్యం=అనిత్యము. కస్య=ఎవనికి, మృత్యుకాలః=మరణము, అద్య=నేడే, భవిష్యతి=సంభవించునో, కోహి (కః హి) జానాతి=ఎవడెరుగును?

తా. యౌవనమునందే ధర్మశీలురు కావలయును. జీవిత మెన్నడును శాశ్వతము కాదు. నే డెవరి మృత్యువు తటస్థించునో ఎవ రెరుగుదురు?

వ్యా. యౌవనము సుఖభోగముల కొరకనియు, వార్ధక్యము ధర్మానుష్ఠానము కొరకనియు అవివేకు లనుకొందురు అధర్మము వృద్ధుని మాత్రమేగాక, యువకుని సహితము కళంకితముగా జేయును. సాధారణముగా యౌవనమునందలి అభ్యాసములయొక్క శుభాశుభఫలములే జీవితకాలమంతయు అనుభవింపవలసి యుండును యౌవనమునందే పాప ప్రలోభములు మానవుని బలాత్కారముగా వశపరచుకొనును. మృత్యువు యువకులను సహితము ఇహలోకమునుండి తీసికొనిపోవుననుమాట మరువ కూడదు కనుక, యౌవనప్రాయమునుండియు ఈశ్వరునికి శరణాపన్ను లయి, సదాచారముల నభ్యసించుచు, పాపకృత్యములనుండి నివృత్తులగుటకు ప్రయత్నింపవలయును దుస్సహవాసమును పరిత్యజించి, సత్సహవాసము చేయవలెను ఆహారహామును కఠోరముగా ఆత్మపరీక్ష చేసికొనవలయును

వి. యౌవనమునందే ధర్మాచరణము నభ్యసింపవలయును. యౌవనమునందు సమస్త భోగముల ననుభవించి, వార్ధక్యమునందు, సమస్త శక్తులు ఉడిగినప్పుడు, ధర్మసాధన చెయవచ్చు ననుకొనుట దుర్భ్రమయని యీ శ్లోకము బోధించుచున్నది.

శ్లో॥ సువృత్తశ్శీలసంపన్నః, ప్రసన్నాత్మాత్మవిద్ బుధః।
ప్రాప్యేహ లోకే సమ్మానమ్, సుగతిమ్ ప్రేత్య గచ్ఛతి॥ ౭
[మహాభారత, శాంతిపర్వ ౧౬౦ ౨౬.]

ప. సువృత్తః, శీలసంపన్నః, ప్రసన్నాత్మా, ఆత్మవిత్, బుధః, ప్రాప్య, ఇహలోకే, సమ్మానమ్, సుగతిమ్, ప్రేత్య, గచ్ఛతి.

టీ. సువృత్తః=మంచి ప్రవర్తనగలవాడును, శీలసంపన్నః=సద్గుణ సంపన్నుడును, ప్రసన్నాత్మా=ప్రసన్నచిత్తుడును, ఆత్మవిత్=ఆత్మవేత్తయు, బుధః=పండితుడును, ఇహలోకే=ఈ లోకమునందు, సమ్మానం ప్రాప్య=పూజ్యతను పొంది, ప్రేత్య=మరణానంతరము, సుగతిం=సద్గతిని, గచ్ఛతి=పొందుచున్నాడు.

తా. ఎవడు బుద్ధిమంతుడో, సచ్చరిత్రుడో, సుశీలుడో, ప్రసన్నాత్ముడో, బ్రహ్మజ్ఞానియో, అతడు ఇహలోకమునందు విశేషగౌరవమును, పరలోకమునందు సద్గతిని పొందును.

వ్యా. సదసద్వివేచనాశక్తి కలుగుటకయి, బుద్ధిని పరిశుద్ధము చేసికొనవలయును. అట్లు పరిశుద్ధమయిన శుభబుద్ధియొక్క ఆదేశానుసారముగా, సత్కార్యముల నాచరించి, సచ్చరిత్రుడును, సత్శీలుడును కావల

యున ప్రసన్నచిత్తుడయి, బ్రహ్మజ్ఞానము నొంది బ్రహ్మపరాయణుడు కావలెను ఇహమునందు పూజ్యతయును పరమునందు స్వర్గలోకప్రాప్తి జీవితముయొక్క బహుమానము

వి. ఐహికాముష్మిక సౌఖ్యమునకయి, బుద్ధిని, జ్ఞానమును పరిశుద్ధము చేసికొనవలయునని, ఈ శ్లోకము విధించుచున్నది.

శ్లో. యస్య వాఙ్మనసీ స్యాతాం, సమ్యక్ ప్రణిహితే సదా।
తపస్త్యాగశ్చ సత్యం చ, స వై పర మవాప్నుయాత్॥ ౮

[మహాభారత, శాన్తిపర్వ ౧౩౫. ౩౪.[

ప. యస్య, వాఙ్మనసీ, స్యాతాం, సమ్యక్, ప్రణిహితే, సదా, తపః, త్యాగః, చ, సత్యం, చ, సః, వై, పరం, అవాప్నుయాత్.

టీ. యస్య=ఎవనియొక్క, వాఙ్మనసీ=వాక్కును మనస్సును, సదా=ఎల్లప్పుడును, సమ్యక్=చక్కగా, ప్రణిహితే=వశములయియుండునో, తపః=తపస్సు, త్యాగః=దానము, సత్యం చ=సత్యము, వీనియందు స్థిరుడయి యుండునో, స వై=అతడే, పరమ్=పరమపదమును, అవాప్నుయాత్=పొందును.

తా. ఎవని వాక్కును మనస్సును సర్వదా నియమమునం దుండునో, ఎవడు తపస్సు, దానము, సత్యకథనము మొదలయినవానియందు నియుక్తుడయి యుండునో, అతడు అత్యుత్కృష్టస్థానము నొందును.

వ్యా. మనస్సును, వాక్కును పరస్పరము నియమింపబడనియెడల, అసత్యకథనము, అసంబద్ధప్రలాపము అను రెండు దోషములయందు పతితుడు కావలసివచ్చును. మనస్సు దేనిని ఆలోచించునో, వాక్కు దానితో కలియక అన్యథా వచించెనేని, దానినే మిథ్యాకథనమందురు. వాక్కు దేనిని చెప్పుచున్నదో, మనస్సు దాని ననుసరించి ఆలోచించనియెడల, దానినే అసంబద్ధప్రలాపమందురు కనుక, మనస్సును, వాక్కును నియమించుకొని, ఈశ్వరునియొక్క ధ్యానధారణోపాసనారూప తపము నాచరించుచు, సత్పాత్రదానము చేయుచు, సత్యమార్గమునందు నడువ ప్రయత్నింపవలయును

వి. ఈ శ్లోకము మనస్సుయొక్కయు వాక్కుయొక్కయు సంయమమును శాసించుచున్నది అట్లు చేయనియెడల, అసత్యము, అతిశయోక్తి మొదలయిన దోషములు సంప్రాప్తము లగును

శ్లో. ధర్మనిత్యః ప్రశాన్తాత్మా, కార్యయోగవహః సదా।
నాధర్మే కురుతే బుద్ధిం, న చ పాపే ప్రవర్తతే॥ ౯

[మహాభారత, ఉద్యోగపర్వ ౩౧, ౪౫.]

ప. ధర్మనిత్యః, ప్రశాన్తాత్మా, కార్యయోగవహః, సదా, న, అధర్మే, కురుతే, బుద్ధిం, న, చ, పాపే, ప్రవర్తతే.

టీ. ధర్మనిత్యః=ధర్మమునందు మిక్కిలి ఆసక్తుడయి నటువంటివిన్ని, సదా=ఎల్లప్పుడు, కార్యయోగవహః=కార్యో పాయతత్పరుడయినటువంటివిన్ని, ప్రశాంతాత్మా=సమాహిత చిత్తము గలిగినటువంటివిన్ని, జనుడు, బుద్ధిం=బుద్ధిని, అధర్మే= అధర్మమునందు, న కురుతే=ప్రవర్తింపనియ్యడు. పాపే చ= పాపమునందును, న ప్రవర్తతే=ప్రవర్తింపడు.

తా. ఏ ప్రశాంతాత్ముడు సదా ధర్మమునే యాశ్ర యించి, సత్కార్యతత్పరుడయి యుండునో, అతడెన్నడును అధర్మమును చింతింపడు, పాపప్రవృత్తుడును కాడు.

వ్యా. శాంతచిత్తుడయిన జనుడు ధర్మానుగతుడయి సత్కార్యాను ష్ఠానమునందును, ఆ కర్మోపాయ చింతనమునందును, జాగరూకుడయి యుండవలయును. సోమరిగాను, సత్కార్య విరహితుడుగాను ఉన్నయెడల, మనస్సు పాపాలోచనలయందు ప్రవృత్తమగును అందువలన అతడు చేయు కార్యములుకూడ పాపమయము లగును సోమరితనమే సకల దోష ములకు ఆకరము.

వి. సమస్తదుర్వ్యసనములకును, సమస్త పాపచింతలకును, సమస్త పాపానుష్ఠానములకును మూలాధారమగు సోమరితనమును ఈ శ్లోకము

నిందించుచున్నది. సమస్త దుర్వ్యాపారములకును సోమరితనమే కారణ మనుట సత్యము సోమరియొక్క మెదడు సైతానుయొక్క కర్మాగార మని యొక ఇంగ్లీషు సామెత కలదు.

శ్లో. ధర్మార్థౌ యః పరిత్యజ్య, స్యా దింద్రియ వశానుగః।
శ్రీ ప్రాణ ధన దారేభ్యః, క్షిప్రం స పరిహీయతే॥ ౧౦
[మహాభారత, ఉద్యోగపర్వ ౩౪, ౬౩.]

ప. ధర్మార్థౌ, యః, పరిత్యజ్య, స్యాత్, ఇంద్రియవశానుగః, శ్రీ ప్రాణ ధన దారేభ్యః, క్షిప్రం, సః, పరిహీయతే.

టీ. యః=ఎవడు, ధర్మార్థౌ=ధర్మార్థములను, పరిత్యజ్య=త్యజించి, ఇంద్రియవశానుగః = ఇంద్రియములకు వశుడయినవాడు, స్యాత్=అగుచున్నాడో, సః=వాడు, శ్రీ ప్రాణ ధన దారేభ్యః=సౌందర్యము, ప్రాణము, ధనము, భార్య ఈ మొదలయినవానినుండి, క్షిప్రం=శీఘ్రముగానే, పరిహీయతే=విడువబడుచున్నాడు.

తా. ఎవడు ధర్మార్థములను పరిత్యజించి, ఇంద్రియములకు వశుడగునో, అతడు శీఘ్రముగనే సంపదను, ప్రాణమును, ధనమును, భార్యను కోలుపోవును.

వ్యా. ఈశ్వరారాధన, సాంసారిక ధర్మములు విడిచిపెట్టి, ఇంద్రియములకు తృప్తికరములగు ఆమోదప్రమోదములయందు ఆసక్తుడవు గాకుము విషయసుఖము మానవునికొఱకు సృష్టింపబడినదిగాని మానవుడు విషయసుఖముకొఱకు సృష్టింపబడలేదు మనుష్యజీవితము యొక్క ఉద్దేశము మహోన్నతమయినది ఎవడు అజ్ఞానముచే జీవితలక్ష్యమును మరచి, ఇంద్రియములకు దాస్యము చేయుచు, విషయసుఖములయందు నిమగ్నుడయియుండునో, వానిని మేలుకొలుపుటకే మంగళమయుడయిన పరమేశ్వరుడు అప్పుడప్పుడు యుక్తదండన నిచ్చుచున్నాడు వాడు శీఘ్రముగానే శ్రీ ప్రాణ ధనదారలను పోగొట్టుకొనును

వి. ఈ శ్లోకము విషయసుఖములను నిరసించుచున్నది విషయసుఖములకు దాసుడగువాడు మానవజీవితము యొక్క ఉచ్చసుఖముల ననుభవింపజాలడు

శ్లో. బంధురాత్మాత్మన స్తస్య, యేనైవాత్మాత్మనా జితః।
స ఏవ నియతో బంధుః, స ఏవ నియతోరిపుః॥ ౧౧

[మహాభారత. ఉద్యోగపర్వ ౩౪ అధ్యా ౩౮.]

ప. బంధుః, ఆత్మా, ఆత్మనః, తస్య, యేన, ఏవ, ఆత్మా, ఆత్మనా, జితః, సః, ఏవ, నియతః, బంధుః, సః, ఏవ, నియతః, రిపుః.

టీ. యేన ఆత్మనా=ఏ ఆత్మచేత, ఆత్మా=ఆత్మ, జితః= వశపరచుకొనబడినదో, తస్య ఆత్మనః=ఆయాత్మకు, ఆత్మైవ= ఆత్మయే, బన్ధుః=మిత్రుడు. స ఏవ=ఆ యాత్మయే, నియతః బంధుః=ప్రియతమమయిన స్నేహితుడు, స ఏవ=ఆ యాత్మయే, నియతః రిపుః=గర్భశత్రువు.

తా. ఆత్మద్వారమున ఏయాత్మ వశముచేసికొనబడి నదో, ఆ యాత్మయే, ఆత్మకు బంధువు. సందర్భానుసారముగా ఆత్మయే పరమ బంధువు, ఆత్మయే పరమ శత్రువు.

వ్యా. ఆత్మయందు అనేక విధములయిన ప్రవృత్తులు కలవు ప్రతి ప్రవృత్తియు ఆత్మను తన విషయము వయిపున కొకర్షించుటకు ప్రయత్నించుచుండును. ఆత్మ లొంగిపోయి ఈ ప్రవృత్తిప్రవాహములో పడినయెడల, దాని దుర్దశకు మేర యుండదు. అందుకొరకే పరమేశ్వరుడు ఆత్మకు స్వయం కర్తృత్వ శక్తి నిచ్చెను దాని సాహాయ్యమున ఆత్మ తన ప్రవృత్తుల నన్నిటిని వశపరచుకొని, కల్యాణమయ మార్గమునందు ముం దుకు నడువగలదు. మానవుడీ విధముగా, తన్ను తాను జయించుకొనజాల డేని, ఇతర బాహ్యశత్రువు లెవరును చేయలేనంత అపకారమును తనకు తానే చేసికొనును అట్లుగాక, తన్ను తాను జయించుకొనగలిగెనేని, ఇతర బాహ్య మిత్రు లెవరును చేయలేనంత యుపకారమును తనకు తానే చేసి కొనును. కనుక, తనను తాను శాసించుకొని, తన శుభమును సమకూర్చు కొనుచు తనకు తాను మిత్రుడయి యుండవలయును. తనకు తానే శత్రువు

కాగూడదు. తన కర్తృత్వశక్తివలన తనకు తానే ప్రభువయి, తన్ను తాను బలాత్కారముగా ధర్మమార్గమునందు నడిపించుకొనగలయును ఏ యంత శత్రువయినను ప్రాణి తన శ్రేయోమార్గమున కడ్డు రాలేనేని, ఆ శత్రువును బలాత్కారముగా నణచివేయగలయును ఆత్మశాసనమునందు బద్ధకించి, లేక ఉదాసీన భావమును వహించి, తానెన్నడును స్వేచ్ఛాచారి కాగూడదు సర్వాంతఃకరణముతో ఒప్పచెప్పు ననుసరింపగలిగినేని, తనకు తాను పరమ మిత్రుడగును.

వి. ఈ శ్లోకము ఆత్మసంయమము యొక్క ప్రభావమును శ్లాఘించుచున్నది నిజముగా తనకు తానే ప్రాణమిత్రుడు, తనకు తానే గర్భశత్రువు.

శ్లో. ప్రాప్యచాప్యుత్తమం జన్మ, లబ్ధ్వాచేంద్రియ సౌష్ఠవం।
న వేత్త్యాత్మహితం యస్తు, స భవే దాత్మఘాతకః॥ ౧౨
[కులార్ణవతంత్ర V ౧]

ప. ప్రాప్య, చ, అపి, ఉత్తమం, జన్మ, లబ్ధ్వా, చ, ఇంద్రియసౌష్ఠవం, న, వేత్తి, ఆత్మహితం, యః, తు, సః, భవేత్, ఆత్మఘాతకః.

టీ. యస్తు (యః తు)=ఎవడయితే, ఉత్తమం జన్మ= శ్రేష్ఠమయిన మానవజన్మమును, ప్రాప్యచాపి (ప్రాప్య చ అపి)= పొందియును, ఇంద్రియ సౌష్ఠవం = సమస్త ఇంద్రియముల

యొక్కయు సంపూర్ణ ఆరోగ్యావస్థను, లబ్ధ్వాచ=పొందియు, ఆత్మహితం=తనకు హితమయినదానిని, నవేత్తి=తెలిసికొనడో, సః=వాడు, ఆత్మఘాతకః భవేత్=ఆత్మఘాతకు డగును.

తా. ఉత్తమమగు మానవ జన్మమును, ఇంద్రియసౌఖ్యమును పొందియుండియు, ఏ మానవుడు ఆత్మహితమును తెలిసికొనజాలడో, అతడు ఆత్మఘాతకు డగును.

వ్యా. ఆత్మయొక్క హితమునుగురించియే సర్వదా ఆలోచింపవలెను. జ్ఞానమునందును, ధర్మమునందును ఆత్మ యెట్లు ఉన్నతినొందును, ఈశ్వరభక్తియు, పవిత్రతయు ఎట్లు అభివృద్ధి నొందును, జీవాత్మ పరమాత్మతోడి యోగమునొంది, ఎట్లు ముక్తిని పొందుటకు సమర్థమగును. అని ప్రశ్నించుకొని, అందుకు తగిన ఉపాయముల నన్నిటిని అన్వేషణము చేయవలయును. ఆత్మయొక్క అనంతజీవితమును, అపరిమేయ దీర్ఘతను దృష్టియందుంచుకొని, దాని కవసరమయిన వాని నన్నిటిని సంచయము చేసికొనవలయును. క్షణభంగురములగు వస్తువులయందును, అపవిత్ర వస్తువులయందును గల మోహమును విడువవలయును. ఏది ఆత్మకు అనంతకాలమువరకు హితకారిగా నుండునో, దానినే గ్రహింపవలయును. తన పాపాచరణమువలన తనకే యనిష్టము చేసికొనును. కనుక, తానే తన కనిష్టము చేసికొని, ఆత్మవినాశము నొందించుకొనగూడదు. ఇట్టి యుత్కృష్ట మానవజన్మమును పాపకార్యములద్వారమున కలుషితము చేసికొనరాదు.

వి ఈ శ్లోకము పూర్వశ్లోకముయొక్క అభిప్రాయమునే బల పరచుచున్నది ఇది మానవజన్మముయొక్క శ్రేష్ఠత్వమును ప్రతిపాదించుచు, దానిని సదుపయోగమునకు తెచ్చుకొననివాడు ఆత్మహంతకుడని నిరసించుచున్నది

శ్లో. పూర్వం వయసితత్ కుర్యాత్, యేనవృద్ధస్సుఖంవసేత్।
యావజ్జీవేనతత్కుర్యాత్,యేనాముత్రసుఖంవసేత్॥ ౧౩

[మహాభారత, ఉద్యోగపర్వ ౩౫ అం]

ప. పూర్వం, వయసి, తత్, కుర్యాత్, యేన, వృద్ధః, సుఖం, వసేత్, యావత్, జీవేన, తత్, కుర్యాత్, యేన, అముత్ర, సుఖం, వసేత్॥

టీ. యేన=ఏ కర్మచేతను, వృద్ధస్సన్=ముసలివాడయి, సుఖం వసేత్ = సుఖముగా నుండగలడో, తత్ = ఆ కర్మ, పూర్వం వయసి=పూర్వవయస్సునందే, కుర్యాత్ =చేయవలయును. యేన=దేనిచేత, అముత్ర=పరలోకమునందు, సుఖం= సుఖముగా, వసేత్=ఉండునో, తత్=అది, యావజ్జీవేన=జీవితకాల మంతటిచేతను, కుర్యాత్=చేయవలయును.

తా. దేనిద్వారమున వార్ధక్యమునందు సుఖజీవనము చేయగలడో, అట్టి కర్మను పూర్వవయసునందే చేయవలయును. దేనిద్వారమున పరలోకమునందు సుఖమనుభవింపగలడో, అట్టి కర్మను యావజ్జీవమును చేయవలయును.

వ్యా. కేవలము వర్తమాన సుఖమునందే నిమగ్నుడయి, మఱిలి, భవిష్యత్తును గురించి ఆలోచింపకుండా ఉండగూడదు తాత్కాలిక సుఖముకొరకు శాశ్వతసౌఖ్యమును మరువగూడదు. కేవలము క్రీడలతోను, కౌతూహలములతోను బాల్యయౌవనములను గడిపివేయగూడదు బాల్యమునందును, యౌవనమునందు చేయదగిన జ్ఞానసంపాదనము, ధర్మసాధన, పరిశ్రమాభ్యాసము మొదలగు కార్యముల నన్నిటిని, ఆ వయసునందే ప్రయత్నపూర్వకముగా చేయవలయును లేనియెడల, వార్ధక్యము దుఃఖహేతువును, విరక్తిజనకమును అగును. జీవితకాలమంతయు ఈశ్వరపరాయణుడయి, ఆయనయందు భక్తి నభివృద్ధి నొందించుకొనుచు, ఆయనకు హితమయిన కార్యములు చెయుచు, పరలోకమునందు ఉత్తమగతి నొంద బ్రయత్నింపవలయును. అట్లు ప్రయత్నింపక, క్షణస్థాయులగు విషయసుఖములకొరకు, ఆశాజ్వరపీడితుడవయి, ప్రథమవయసు నంతను గడిపివేసితివేని, వార్ధక్యము తటస్థించినప్పుడు, శరీరము శుష్కించి, బలహీనమయినప్పుడు, ఇంద్రియపటుత్వము తగ్గినప్పుడు, శాంతికిగాని, విశ్రాంతికిగాని ఆశయెక్కడిది? పార్థివసౌఖ్యమే సర్వస్వమని భావించి, దానిని సేవించుటయందే ఆసక్తుడవయి జీవితకాలమంతయు నిర్విచారచిత్తముతో గడిపివేసి, జ్ఞానము, ధర్మము, పవిత్రత మొదలయిన ఆధ్యాత్మిక ధనములు

నార్జింపలేకపోతివేని, ఈ భూమండలమును విడిచి, పృథివియందలి ఒక్క వస్తువు నయినను. వెంట తీసికొని వెళ్లలేని స్థానమునకు నీవు ప్రయాణమయి వెళ్లినప్పుడు, నీకెట్టి కష్టదశ సంప్రాప్తమగునో, నీ వెట్టి వేదన ననుభవింపవలసి యుండునో, ఒకసారి భావించి చూచుకొనుము ఆ స్థానమునం దావశ్యకములయి, నీ కక్కరకు వచ్చు ఆధ్యాత్మిక ద్రవ్యములను నీవు సంచయము చేసికొనలేకపోతివి, అప్పటి నీస్థితిని ఇప్పుడే ఒకసారి భావించి చూచుకొని, ఇప్పటినుంచియు జాగ్రతపడుము. శ్రేయోమార్గమున నడువ బ్రయత్నింపుము

వి. ఐహికాముష్మిక సౌఖ్యమునకయి, యౌవనమునందే జ్ఞాన ధర్మముల నార్జింపుమని, ఈ శ్లోకము బోధించుచున్నది 'యువైవధర్మశీలః స్యాత్' అను ఈ యధ్యాయమునందలి ౬వ శ్లోకమునందలి భావము నే ఇది విస్తరించుచున్నది

శ్లో॥ నాభినందేత మరణం, నాభినందేత జీవితం।
కాలమేవ ప్రతీక్షేత, నిర్దేశం భృతకోయథా॥ ౧౮
[మనుసంహిత VI ౪౫.]

ప. న, అభినందేత, మరణం, న, అభినందేత, జీవితం, కాలం, ఏవ, ప్రతీక్షేత, నిర్దేశం, భృతకః, యథా.

టీ. మరణం=మరణమును, నాభినందేత (న అభినందేత)=కోరగూడదు. జీవితం=జీవించియుండుటను, నాభినం

చేత=కోరగూడదు. నిర్దేశం=కూలినిగూర్చి, భృతకః=కూలివాడు, యథా=ఏ ప్రకారము వేచియుండునో, ఆ ప్రకారము, కాలమేవ=పరమేశ్వరు డేర్పరచిన కాలమునే, ప్రతీక్షేత=నిరీక్షింపవలయును.

తా. మరణమును అభిలషింపగూడదు, జీవనమును కోరగూడదు. కూలివాడు తన కూలికొరకు కాలము నెట్లు ప్రతీక్షించి యుండునో, అట్లే, మానవుడును కాలమునే ప్రతీక్షించి యుండవలయును.

వ్యా. ఇక్కడి నీ జీవితము అనిత్యమనుమాటను మరచి, పార్థివ విషయములయందు మోహపరవశుడవయి యుండకుము. పారత్రిక జీవితమున కెదురుచూచుచు, ఈ ఐహిక జీవనమును ఉపేక్షతోను, నిర్లక్ష్యముతోను చూడకుము. మన యావజ్జీవితమునకును ఈశ్వరుడే ప్రభువు. ఆయన ఎంతకాలము నిన్నీపృథివియం దుంచునో, అంతకాలమును, ఆయన యాజ్ఞలను సంతోషపూర్వకముగా పాలించుచుండుము నిన్ను లోకాంతరమునకు తీసికొని పోవుటకు ఆయన మరణము నెప్పుడు ప్రేరేపించునో, అప్పుడు, శోకరహితుడవయి, ఆయన యాజ్ఞను శిరసావహింపుము. నీ యాశను భూలోకమునందును స్థాపింపకుము, ద్యులోకమునందును స్థాపింపకుము. పరమలోకమయిన ఆ పరమేశ్వరునియందే స్థాపింపుము.

వి. ఈ లోకమునుగాని, పరలోకమునుగాని అత్యాశతో చూడ గూడదనియు, నిస్సంగత్వముతో పరమేశ్వరుని యాజ్ఞకొరకు వేచి యుండవలయు ననియు, పరలోకమును మరచి, ఐహికసుఖనిమగ్నులయి యుండగూడదనియు, పరలోకమును దృష్టియందుంచుకొని, ఐహికము నందు నెరవేర్చవలసిన విధ్యుక్తధర్మములను నిర్లక్ష్యము చేయజనదనియు, ఈ శ్లోకము బోధించుచున్నది.



# ౫ అధ్యాయము



శ్లో. సంతోషం పరమాస్థాయ, సుఖార్థీ సంయతో భవేత్ ।
సంతోషమూలం హిసుఖం, దుఃఖమూలంవిపర్యయః॥ ౧

[మనుసంహిత IV ౧౨]

ప. సంతోషం, పరం, ఆస్థాయ, సుఖార్థీ, సంయతః, భవేత్, సంతోషమూలం, హి, సుఖం, దుఃఖమూలం, విపర్యయః.

టీ. సుఖార్థీ=సౌఖ్యమును కోరువాడు, పరం సంతోషం=తనకు కలిగినదానితో పరమసంతుష్టిని, ఆస్థాయ=పొంది, సంయతః భవేత్=జితేంద్రియుడు కావలయును. హి=ఎందుచేతనంటే, సుఖం=సౌఖ్యము, సంతోషమూలం = సంతుష్టియే మూలముగా గలది. విపర్యయః=అసంతుష్టి, దుఃఖమూలం= దుఃఖహేతుకము.

తా. సంతోషమే సుఖమునకు కారణము. అసంతోషమే దుఃఖహేతువు. కనుక, సుఖము నపేక్షించువాడు సంతోషము నవలంబించి, జితేంద్రియుడు కావలయును.

వ్యా. పరమేశ్వరుడు ప్రతి మానవునికి వానివాని యోగ్యతకు దగిన సుఖము నిచ్చును కనుక, అతడు తన యోగ్యతానురూప సుఖము నొంది సంతుష్టి నొందవలయును ఎవడు తన యోగ్యతకుమించిన సుఖమును వాంఛించునో, వానిని దురాశాపాతకు డందురు. దురాశకు వశీభూతుడవయి అనవసరమయిన అసంతుష్టిని పొందకుము. అందువలన నీవు వ్యర్థముగా కష్టముననుభవింపవలసి యుండును దైవవశమున నీకు సంప్రాప్తమయిన సుఖముయొక్క ఆస్వాదనను సహితము నీవు చేయలేక పోదువు నీ ప్రయత్నములకును, నీ యోగ్యతకును అనుగుణ్యమయిన ఏ సుఖమును సమస్తసుఖ సంధాయకుడగు పరమేశ్వరుడు నీకనుగ్రహించియున్నాడో దానిని కృతజ్ఞతాపూరిత హృదయముతో స్వీకరించి, సంతృప్తినొంది యుండుము ధనము, మానము, పదగౌరవము మొదలయిన భౌతికవిషయములకొరకు అత్యాశను కలిగి యుండకుము.

వి. ఈ అయిదవ యధ్యాయము ఓర్పును, సంతృప్తిని ప్రశంసించుచున్నది సంతృప్తియే సుఖమునకెల్లను మూలము కనుక సుఖార్థి సంతుష్టినొంది యుండవలయునని ఈ శ్లోకము బోధించుచున్నది

శ్లో. అసంతోషపరామూఢాః, సంతోషం యాంతి పండితాః।
అంతోనాస్తి పిపాసాయాః, సంతోషః పరమంసుఖం॥ ౨

[మహాభారత, అరణ్యపర్వ II ౪౪. ౪౫. II ౪౩.

ప. అసంతోషపరాః, మూఢాః, సంతోషం, యాన్తి, పండితాః, అన్తః, న, అస్తి, పిపాసాయాః, సంతోషః, పరమం, సుఖమ్.

టీ. అసంతోషపరాః=అసంతుష్టి నొందువారు, మూఢాః=మూర్ఖులు. పండితాః సంతోషం యాన్తి = పండితులు సంతృప్తి నొందియుందురు. పిపాసాయాః=విషయేచ్ఛ యనెడు దాహమునకు, అంతః నాస్తి=అంతము లేదు. సంతోషం= సంతృప్తియే, పరమం సుఖం=శ్రేష్ఠమయిన సుఖము.

తా. మూర్ఖులే సంతోషరహితులయి యుందురు. పండితులు సంతోషము నవలంబించియుందురు. విషయతృష్ణకు అంతము లేదు. సంతుష్టియే పరమసుఖము.

వ్యా. విషయముల ననుభవించిన కొలదిని, విషయతృష్ణ హెచ్చుచునే యుండును. ఒక విషయము హస్తగత మగుచుండగా, మనస్సు విషయాంతరమునకు పరుగిడుచుండును. దానిని సహితము పొందగలిగిన యెడల, మరల నింకొక విషయముకొరకయి తృష్ణ జనించుచుండును. బుద్ధిమంతులు విషయతృష్ణయొక్క ఇట్టి స్వభావమును తెలిసికొని, సంతుష్టాంతరంగులయి, సుఖము ననుభవింతురు నిజమయిన తృప్తికి స్థానము విషయాతీతమని తెలిసికొని, విషయాసక్తి విడుతురు స్థూలదర్శులగు బుద్ధి

హీనులు దీనిని గ్రహించలేక, బాహ్యాడంబరమే సుఖహేతువని నిశ్చయించుకొని, బాహ్యవిషయములు ఎక్కడ ఎంత సమృద్ధముగా నుండునో, సుఖము అక్కడ అంత సమృద్ధముగా నుండునని భావింతురు. కాని, బాహ్యవిషయములు ఎక్కువగానున్నను తక్కువగానున్నను, వాని న్యూనాధికతలతో సంబంధములేకయే సుఖభోగములయొక్కయు, దుఃఖభోగములయొక్కయు పరిమాణము, సర్వత్ర సమానముగానే యుండునని, వారు తెలిసికొనజాలకున్నారు. అందుచేతనే వారు సుఖరత్నమును పరీక్షించు గీటురాయి యనదగు సంతృప్తి నవలంబింపలేక, సర్వదా అసంతుష్టులును, దుఃఖితులును అయి యున్నారు. కనుక, విషయతృష్ణను జయించి పరమేశ్వరుడిచ్చినదానితో సర్వదా సంతుష్టినొందుట కభ్యసింపుము.

వి. ఈ శ్లోకము అసంతృప్తివలని నష్టములను తెలుపుచున్నది. విషయవాంఛల కంతములేదనియు, మనశ్శాంతికి నిజమయిన ఆధారము సంతుష్టియే యనియు, బుద్ధిహీనులే అసంతుష్టులయి యుందురనియు కూడ బోధించుచున్నది

శ్లో॥ సుఖదుఃఖం హి పురుషః, పర్యాయేణోపసేవతే।
సుఖమాపతితం సేవేత్, దుఃఖ మాపతితం వహేత్॥ 3

[మహాభారత, అరణ్యపర్వ ౨౫౮ ౧౩. ౧౫.]

ప. సుఖదుఃఖం, హి, పురుషః, పర్యాయేణ, ఉపసేవతే, సుఖమ్, ఆపతితమ్, సేవేత్, దుఃఖమ్, ఆపతితం, వహేత్.

టీ. హి=ఏ కారణమువలన, పురుషః=పురుషుడు, సుఖ దుఃఖం=సుఖదుఃఖములను, పర్యాయేణ = ఒకదాని తరువాతి నొకటిగా, ఉపసేవతే=అనుభవించుచున్నాడో, ఆ కారణము వలన, ఆపతితం=తటస్థించినటువంటి, సుఖం = సుఖమును, సేవేత్=అనుభవింపవలయును. ఆపతితం=తటస్థించినటువంటి, దుఃఖం=దుఃఖమును, వహేత్=అనుభవింపవలయును.

తా. మనుష్యుడు సుఖమును దుఃఖమును, ఉభయ మును ఒకదాని తరువాత నొకటిచొప్పున, అనుభవింపవలసి యుండును. కనుక, సుఖము సంప్రాప్తమయినప్పుడు, దాని ననుభవింపవలయును. అట్లే, దుఃఖము తటస్థించినప్పుడును దానిని సహించుకొనవలయును.

వ్యా. మంగళస్వరూపుడయిన పరమేశ్వరుడు నిరంతరము మన లను కనుపెట్టి చూచుచున్నాడు. ఏ సాధనమువలన మనకు మంగళ మగునో, దానినే ఆయన మనకు సమకూర్చుచున్నాడు. మన మాయన యభీష్టానుసారముగా, కల్యాణమయ మార్గమున నడచినప్పుడు, మన కాయన సుఖమును, ఆత్మసంతృప్తిని, బ్రహ్మానందమును యిచ్చి బహూకా రించుచున్నాడు ఆయన మంగళమయ ఆదేశమును వినక, అసన్మార్గమున అడుగుపెట్టినప్పుడు, మరల మనలను సన్మార్గమునకు మరలించుటకు, సుఖ సంపదలనుండి దూరస్థులనుగా జేసి, దుఃఖమును కష్టములను సంప్రాపము

చేసి, మనకు సారకము తెచ్చి మేల్కొల్పుచున్నాడు సుఖదుఃఖములు రెండును పరమేశ్వరుని శుభ సంకల్పమును సిద్ధింపజేయుటకే, ఒకదాని తరువాత నొకటి సంప్రాప్త మగుచున్నవి దుర్బలులగు మానవులు రెంటిని అనుభవింపవలసి యున్నది సుఖము సంప్రాప్తమయిన యెడల, అది యీశ్వర ప్రసాదమని కృతజ్ఞతతో ననుభవింపవలయును దుఃఖము సంప్రాప్తమయినను, అదియును మన మేలుకొరకే తటస్థించినదను విశ్వాస ముతో శాంతచిత్తముతో, భరింపవలయును. సర్వదా ఆయన కల్యాణ మయ ఆదేశము ననుసరింపవలయును.

వి సుఖదుఃఖములు రెండును అవశ్యం భోక్తవ్యములనియు, సుఖ మున కుబ్బక, దుఃఖమునకు కుంగక, ఏది వచ్చినప్పుడు దానిని శాంత చిత్తముతో ననుభవింపవలయుననియు ఈ శ్లోక ముపదేశించుచున్నది

శ్లో. న నిత్యం లభతే దుఃఖం, న నిత్యం లభతే సుఖం ।
శరీరమే వాయతనం, దుఃఖస్య చ సుఖస్య చ॥ ౪
[మహాభారత, శాంతిపర్వ ౧౭౪ ౨౧.]

ప. న, నిత్యం, లభతే, దుఃఖం, న, నిత్యం, లభతే, సుఖం, శరీరం, ఏవ, ఆయతనం, దుఃఖస్య, చ, సుఖస్య, చ.

టీ. నిత్యం=నిరంతరము, దుఃఖం=దుఃఖము, న లభతే= లభించుటలేదు. నిత్యం=నిరంతరము, సుఖం=సుఖము, న లభతే=

లభించుటలేదు. దుఃఖస్య చ=దుఃఖమునకును, సుఖస్య చ= సుఖమునకును, శరీరమేవ=శరీరమే, ఆయతనం=ఆశ్రయము.

తా. దుఃఖమును చిరకాల ముండదు, సుఖమును చిరకాల ముండదు. శరీరమే సుఖదుఃఖములు రెండింటికిని స్థానభూతము.

వ్యా. సుఖమును చిరస్థాయి కాదు, దుఃఖమును చిరస్థాయి కాదు. మంగళమే చిరస్థాయి. సుఖము, సంపద, ఐశ్వర్యము వీనివలననే మనకు శుభము చేకూరునని తోచినప్పుడు పరమేశ్వరుడు మనకు వానినే దయచేయును దుఃఖమువలనను, విపత్తులవలనను మనకు శుభము చేకూరునని తోచినప్పుడు, ఆయన వానినే అనుగ్రహించును సుఖదుఃఖములు రెండును అసంపూర్ణుడగు మానవుని పరిపూర్ణుడగు పరమేశ్వరునియొక్క మంగళ రాజ్యమునకు తోడుకొని పోవుచున్నవి కనుక, సుఖదుఃఖములను లక్ష్య పెట్టక, రాబోవు పరమమంగళమునే లక్ష్యమునందుంచుకొని, జీవితము గడుపవలెను. ఒకొక్కప్పుడు ఆయన మంగళోద్దేశమును నెరవేర్చుటకు, ఇచ్ఛాపూర్వకముగా సుఖసంపదలను విసర్జించి, దుఃఖములను విపత్తులను ఆలింగనము చేసికొనవలసియుండును. ఆ దుఃఖములు, ఆ విపత్తులు మన పరమ సౌభాగ్యమునకే తోడ్పడును

వి. సుఖముగాని, దుఃఖముగాని మన జీవితలక్ష్యములు కావనియు, అవి తటస్థములనియు, ఆ సుఖదుఃఖము లమూలముననే మన జీవితలక్ష్యమగు పరమ మంగళమును పొందగలమనియు ఈ శ్లోకము బోధించుచున్నది.

శ్లో॥ సుఖం వాయది వాదుఃఖం, ప్రియంవా యదివా ప్రియం।
ప్రాప్తం ప్రాప్త ముపాసీత, హృదయే నాపరాజితా॥ ౫

[మహాభారత, శాంతిపర్వ ౧౭౪ ౪౧—౨౫,౨౬ ]

ప. సుఖం, వా, యది, వా, దుఃఖం, ప్రియం, వా, యది, వా, అప్రియమ్, ప్రాప్తం, ప్రాప్తం, ఉపాసీత, హృదయేన, అపరాజితా.

టీ. సుఖం వా యది = సుఖమయినను, దుఃఖం వా యది=దుఃఖమయినను, ప్రియం వా యది=ప్రియమయినను, అప్రియం వా యది=అప్రియమయినను, ప్రాప్తం ప్రాప్తం= పొందబడినదానిని, (తత్సర్వం=ఆ సమస్తమును), అపరాజితా= తిరస్కరింపబడని, హృదయేన=మనసుతో, ఉపాసీత=అనుభవింపవలయును.

తా. సుఖము రానిమ్ము, దుఃఖము రానిమ్ము, ప్రియము కలుగనిమ్ము, అప్రియము కలుగనిమ్ము. ఎప్పు డేది సంప్రాప్తమగునో, అప్పుడు దానిని నిర్విచార చిత్తముతో ననుభవింపవలయును.

వ్యా. సుఖము రానిమ్ము, దుఃఖము రానిమ్ము, ప్రియము తటస్థింప నిమ్ము, అప్రియము తటస్థింపనిమ్ము. హృదయము వానికి లొంగిపోయి వానిచే పరాజితము కాకుండునట్లు మాత్రము సర్వదా జాగ్రతపడుము. వానిచేతనే హృదయము జయింపబడినయెడల, నీవు నీ కర్తవ్యమును మరచి, ఘటనాస్రోతమునందు మునిగిపోయి అనేక కష్టముల ననుభవింపవలసి వచ్చును. శ్రద్ధాభక్తులుగలవాడవయి, ఈశ్వరుని మంగళభావమునందే సంపూర్ణ విశ్వాసముంచి, ఆయనమీదనే భారము వేసి, సుఖదుఃఖముల యొక్కయు, సంపద్విపత్తులయొక్కయు బలమును పరాజయము నొందింపుము. సర్వదర్శి, సర్వశక్తుడు, మంగళమయుడు, పరిపూర్ణుడు అగు పరమేశ్వరుడు జీవవంతుడయి, చిరజాగ్రతుడయి మన సమీపమునందే యున్నాడని నిశ్చయముగా తెలిసికొనుము. అపార సుఖసంపత్తులలో నీ వోలలాడుచున్నప్పుడును, ఆయనను మరువకుము ఘోరతర దుఃఖములు, విపత్తులు వచ్చి నిన్నలముకొన్నప్పుడును ఆయనను మరువకుము సుఖదుఃఖ ముల వెనుకను, సంపద్విపత్తుల వెనుకను ఆయనయే యున్నాడని నిశ్చయ ముగా తెలిసికొనుము. సుఖదుఃఖాది ద్వంద్వములయందే ఆయనను దర్శించుట కభ్యసింపుము. అట్లయినయెడల, నిన్నేదియు పరాజయము నొందింప జాలదు.

వి. ఇదియును వెనుకటి శ్లోకముయొక్క భావమునే ఇంకను పెంచి చెప్పుచున్నది.

శ్లో. ప్రియే నాతిభృశం హృష్యేత్, అప్రియే న చ సంజ్వరేత్ ।
న ముహ్యే దర్థ కృచ్ఛ్రేషు, న చ ధర్మం పరిత్యజేత్ ॥ ౬

[ మహాభారత వనపర్వ ౧౦౬ ౪౨-౨౦౬. ౪౩. శాంతిపర్వ ౯౩. ౧౧. ]

ప. ప్రియే, న, అతిభృశం, హృష్యేత్, అప్రియే, న, చ, సంజ్వరేత్, న, ముహ్యేత్, అర్థకృచ్ఛ్రేషు, న, చ, ధర్మం, పరిత్యజేత్.

టీ. ప్రియే=ప్రియము ప్రాప్తించినప్పుడు, అతిభృశం=విశేషముగా, న హృష్యేత్=సంతోషింపగూడదు. అప్రియే చ=అనిష్టము తటస్థించినప్పుడును, న సంజ్వరేత్=విచారింపగూడదు. అర్థకృచ్ఛ్రేషు=అర్థాభావమువలని సమస్తకష్టముల యందును, న ముహ్యేత్=కార్యాకార్యవిమూఢుడవు గాకుము. ధర్మం చ=ధర్మమును, న పరిత్యజేత్=విడువగూడదు.

తా. ప్రియము కలిగినప్పుడు అతిమాత్రముగా సంతోషింపగూడదు. అప్రియము తటస్థించినప్పుడు, అతివ్యసనము నొందగూడదు. ద్రవ్యాభావకాలమునందును, మనోవ్యాకులత్వము నొందగూడదు. ధర్మము నెన్నడును పరిత్యజింపగూడదు.

వ్యా. ప్రియమయిన కార్యములు తటస్థించినప్పుడు, సంతోషముచే ప్రమత్తుడవయి పొంగకుము. అప్రియములయిన కార్యములు తటస్థించినప్పుడు, విషాద నిమగ్నుడవు గాకుము. అతి సంతోషము, అతి విచారము ఈ రెండును వివేకశక్తి నపహరించునవే. వివేకము గోల్పోయిన

మానవుడు కార్యాకార్య విమూఢుడయి అనేకానర్థముల ననుభవింపవలసి వచ్చును పరమేశ్వరుడే సమస్తమునకును మూలాధారుడని తెలిసికొని, సంపత్కాలమునందు వినమ్రుడవయి యుండుము. విపత్కాలమునందు ధర్మమున కనుగతుడవయి, ఆ విపత్తునకు ప్రతీకారమును చేసికొనుటకు ప్రయత్నింపుము ఏయే అప్రియకార్యములు తప్పించుకొనుటకు వీలు లేదో, అవశ్యం భోక్తవ్యములో, అట్టివాని నన్నిటిని, ఓర్పుతో శాంత భావముతో సహించుకొనుము మన మేది ప్రియమని భావించి, ఆనంద ముతో దానికి స్వాగత మిత్తుమో, అది మనకు నిజముగా హితకరము కాకపోవచ్చును. ఏది అప్రియమని భావించి, భీతచిత్తులమయి, మనము తప్పించుకొన బ్రయత్నింతుమో, అదే మనకు వాస్తవముగా హితకరము కావచ్చును దారిద్ర్యము తటస్థించినప్పుడు, దుర్బలహృదయులగు మానవులు ధర్మమార్గము నతిక్రమించి, తమ జీవికను సంపాదింప బ్రయత్నింతురు కాని, ఇప్పు డేది దుఃఖమునుండి పరిత్రాణోపాయముగా కానవచ్చుచున్నదో, తుద కది ఘోరతర దుఃఖముగా పరిణమింపవచ్చును కనుక, దుఃఖభారముచే ఈ క్షణభంగుర శరీరము భగ్నమయిపోనున్నను, ధర్మమును పరిత్యజించి, ఆత్మ నపవిత్రము గావించుకొనకుము

వి. శాంతిపర్వమునందలి ఈ శ్లోకమునందు 'ముహ్యేత్' అనుటకు బదులు 'వ్యథేత్' అని యున్నది ఈ శ్లోకము సంపదయందును, దారిద్ర్యమునందును శాంతభావము నాదేశించుచున్నది. సుఖసమయములయందు సంతోషముతో పొంగగూడదు, విపత్సమయములయందు దుఃఖముతో కుంగగూడదు.

శ్లో. సంతాపాత్ భ్రశ్యతే రూపం, సంతాపాత్ భ్రశ్యతే బలం।
సంతాపాత్ భ్రశ్యతేజ్ఞానం,సంతాపాత్ వ్యాధిమృచ్ఛతి॥ ౭
[మహాభారత ఉద్యోగపర్వ ౩౬ ౪౪-౩౬ ౪౪.]

ప. సంతాపాత్, భ్రశ్యతే, రూపం, సంతాపాత్, భ్రశ్యతే, బలమ్, సంతాపాత్, భ్రశ్యతే, జ్ఞానం, సన్తాపాత్, వ్యాధిం, ఋచ్ఛతి.

టీ. సంతాపాత్ = వ్యసనమువలన, రూపం = రూపము, భ్రశ్యతే = నశించుచున్నది. సంతాపాత్ = విచారమువలన, బలం=బలము, భ్రశ్యతే=నశించుచున్నది సంతాపాత్ =సంతాపమువలన, జ్ఞానం=జ్ఞానము, భ్రశ్యతే=నశించుచున్నది. సంతాపాత్ =విచారమువలన, వ్యాధిం=వ్యాధిని, ఋచ్ఛతి=పొందుచున్నాడు.

తా. సంతాపమువలన రూపము చెడును, బలము క్షీణించును, జ్ఞానము లోపించును, రోగము సంభవించును. కనుక, మనస్తాపమున కెన్నడును హృదయమునందు స్థానము నియ్యగూడదు.

వ్యా. మనస్తాపమును, హృదయవేదనను జనింపజేయు కార్యములు ఈ ప్రపంచములో నిరంతరము తటస్థించుచుండును బలహీన

హృదయులయిన మానవులు అట్టి మనస్తాపముచే పరాభూతులయి, సంపదలను, బలమును, బుద్ధిని, ఆరోగ్యమును గోల్పోయి, అత్యంత క్లేశములననుభవింతురు కనుక, నీ హృదయమధ్యమున అతి సంతాపమునకు చోటియ్యకుము సంతాపకారణము జనించినయెడల, శాంతముతో, వివేచనతో సహించుకొని, సదా నీ హృదయమును సంరక్షించుకొనుము మన జీవితమునందు తటస్థించు ప్రతి ఘటనయు, మన కేదో యొక పాఠమును బోధించుటకే తటస్థించుచున్నదని తెలిసికొనుము మనస్తాపముచే ధీరత్వమును గోల్పోయి, మంగళప్రదమగు ఆ పాఠలాభమును, పోగొట్టుకొనకుము అనేక సంతాపములు మన దోషమువలననే సంప్రాప్తములగుచున్నవి. వానివలన శాంతమును గోల్పోయి జ్ఞానవిహీనుడవు గాకుము. నీ తప్పులను నీవు సవరించుకొనుటకు బ్రయత్నింపుము. హృదయమందిరమునందు అనవరతము విరాజిల్లుచుండు ఆనందమయుడగు పరమేశ్వరునియొక్క సహవాసమే సమస్త సంతాపములకును దివ్యౌషధమని తెలిసికొనుము. ఆయనను నిరంతరము ధ్యానించుచు, నీ దుఃఖముల నన్నిటిని ఆయనకు నివేదించుకొనుము, నీ హృదయజ్వాలను చల్లార్చు శాంతి వారిని ప్రసాదింపుమని వేడుకొనుము. సదా, ప్రసన్నహృదయముతో జీవింప బ్రయత్నింపుము.

వి. ఈ శ్లోకము అనవసర దుఃఖమువలనను, మనస్తాపమువలనను కలుగు అనిష్టములను గూర్చి విశదీకరించుచున్నది అట్టి నిరర్థకచింత ఆరోగ్యమునకును, ఐశ్వర్యమునకును, మనశ్శాంతికిని భంగకర మనుమాట యథార్థము.



# ౬ అధ్యాయము



శ్లో॥ స్వీయం యశః పౌరుషం చ, గుప్తయే కథితం చ యత్ ।
కృతం యదుపకారాయ, ధర్మజ్ఞో న ప్రకాశయేత్॥ ౧

[మహానిర్వాణతంత్ర VIII. ౫౬.]

ప. స్వీయం, యశః, పౌరుషం, చ, గుప్తయే, కథితం, చ, యత్, కృతం, యత్, ఉపకారాయ, ధర్మజ్ఞః, న, ప్రకాశయేత్.

టీ. స్వీయం = తన సంబంధమయిన, యశః = కీర్తిని, పౌరుషం చ=పరాక్రమమును, గుప్తయే=దాచుటకు, యత్= ఏది, కథితం చ= (ఇతరులచేత) చెప్పబడినదో (దానిని) ఉపకారాయ=(పరులయొక్క) ఉపకారముకొరకు, యత్=ఏది, కృతం=(నీచేత) చేయబడినదో (దానిని), దీనినంతను, ధర్మజ్ఞః= ధర్మము తెలిసినవాడు, న ప్రకాశయేత్=ప్రకటన చేయ గూడదు.

తా. తన కీర్తిని, తన పౌరుషమును, ఇతరులు దాచమని తనకు చెప్పిన రహస్యమును, తా నితరులకు చేసిన యుపకారమును, ఈ సమస్తమును ధర్మజ్ఞుడయినవాడు బయటపెట్టకూడదు.

వ్యా. కీర్తికాముడవయి, కేవలము నీ యశము నే లక్ష్యమునం దుంచుకొని, వ్యవహరింపకుము నీకు కీర్తియందుగల కోరికను అణచివేసికొని, ధర్మము నే లక్ష్యమునందుంచుకొని, జీవించుము. నీ వట్లు జీవించుచున్నప్పుడు ప్రజలు నీ కీర్తిని కొనియాడినయెడల, నీవు వారి స్తోత్రముల కుబ్బి గర్వితుడవుగాక, వినయమును, నమ్రభావము నే కనబరచుము నీ వెన్నడును నిన్ను శ్లాఘించుకొనకుము నీవు స్తోత్రార్హుడ వనుకొనినప్పుడును, ఇతరులు నిన్ను స్తోత్రము చేయనప్పుడును, నీ వాశ్చర్యపడకుము చంచలమతివయి, నీ యశోగానమును నీవే చేసికొనుటకు ప్రయత్నించకుము. నీ కార్యములన్నిటిలోను, నీ మనస్సాక్షి సంతృప్తి నొందినయెడల, నీవు సంతృప్తి నొంది యుండుము ఎపుడయినను నిన్ను గురించి నీవే చెప్పుకొనుట అవశ్యకమయినయెడల, ఎంత యావశ్యకమో, అంతే చెప్పుకొనుము దానిని మించి చెప్పుకొనకుము పరమేశ్వరుడు ఎవరికి యెట్టి శక్తుల నిచ్చియున్నాడో, వానితో వారు తమ శక్త్యనుసారముగా ఆయనకు ప్రియమయిన కార్యముల నాచరింపవలయును కాని, తమ శక్తులను గురించి తాము గర్వపడకూడదు మూఢులు తాము చేయు ఘనకార్యములను కంటె తమ ఘనత నే అధికముగా ప్రేమింతురు. బుద్ధిమంతులు వినయభావముతో తమ యావచ్ఛక్తిని పరమేశ్వరుని సేవకే అర్పింతురు. ఎవరయినను

నియందలి నమ్మకముచె నీ కొక రహస్యమును చెప్పినయెడల, దానిని వెలిబుచ్చకుము నీవట్లు చేసినయెడల, నీవు విశ్వాసఘాతకుడ వనబడుదువు స్నేహముగా నున్నప్పుడు నీతో నెవరయిన, ఏదయిన రహస్యమును చెప్పిన యెడల తరువాత, ఆ స్నేహమునకు భంగము కలిగినను, నీ వా రహస్యమును వెలిబుచ్చక, గోపనముగా నుంచుటకే ప్రయత్నింపుము నీవు చేసిన పరోప కారమును నీ ముఖతః నివే వెల్లడింపకుము అట్లు వెల్లడిచేసికొనినయెడల, ఆ యుపకారముయొక్క గౌరవమును, ౖనతియు, ధర్మస్వరూపమును లోపించును

౨. ఈ ౬వ యధ్యాయమునందు ముఖ్యమయిన సుగుణములను కీర్తించు కొన్ని శ్లోకములు సమకూర్చబడినవి ఈ మొదటి శ్లోకము, ఆత్మస్తుతి వర్జింపదగిన అవగుణమని యుపదేశింపబడినది ప్రతివారును తమ కీర్తిని, ప్రతాపమును మరుగుపరచుకొన బ్రయత్నింపవలయును. పరోప కారమునకయి తాము చేసిన కార్యముల నెన్నడును ప్రకటించుకొన గూడదను ఈ శ్లోకమునందలి చివరభాగము 'నీ కుడిచెయి చేసెడు పనిని, నీ యెడమచేతికి తెలియనియ్యకుడు' అని జీససు చెప్పిన యుపదేశమును పోలియున్నది.

శ్లో॥ సత్యం మృదు ప్రియం వాక్యం, ధీరో హితకరం వదేత్ ।
ఆత్మోత్కర్షం తథా నిందాం, పరేషాం పరివర్జయేత్ ॥ ౨

[మహానిర్వాణతంత్ర, VIII ౬౨.]

ప. సత్యం, మృదు, ప్రియం, వాక్యం, ధీరః, హితకరం, వదేత్, ఆత్మోత్కర్షం, తథా, నిందాం, పరేషాం, పరివర్జయేత్.

టీ. ధీరః = వివేకి, సత్యం = యథార్థమయిన, మృదు = కోమలమయిన, ప్రియం=ప్రియకరమయిన, హితకరం=హితకరమయిన, వాక్యం = వాక్యమును, సర్వేభ్యః = అందరికొరకు, వదేత్=పలుకవలయును. ఆత్మోత్కర్షం=ఆత్మస్తుతిని, తథా= అట్లే, పరేషాం నిందాం=పరులయొక్క నిందను, పరివర్జయేత్ = విడిచిపెట్టవలయును.

తా. ధీరుడయిన పురుషుడు సత్యమును, మృదువును, ప్రియమును, హితకరమును అగు వాక్యమునే పలుకవలయును. ఆత్మస్తుతియు, పరనిందయు పరిత్యజింపవలయును.

వ్యా. త్రికరణశుద్ధి కలిగియుండుము నీ మనస్సులో నున్న భావమునకు వ్యతిరేకభావమును, నీ వాక్కుతో వ్యక్తము చెయకుము. లోకులు నిజమయిన అర్థమును గ్రహింపలేక అనుమానపడవలసివచ్చునట్లు ద్వంద్వార్థపదములు ప్రయోగించి మాట్లాడకుము "లోకులు నా మనస్సులోనుండు అభిప్రాయమును తెలిసికొనలేక, దానికి భిన్నమయిన అర్థమును గ్రహింతురుగాక" అను ఉద్దేశముతో నెన్నడును మాట్లాడకుము. నీకు సత్యమని తెలిసినదానిని చెప్పునప్పుడు, దాని నెంతమాత్రమును మార్చక, ఉన్నది ఉన్నట్లుగా చెప్పుము. నీవు మాట్లాడునప్పుడు ఇతరుల మనసునకు

నొప్పి కలిగించులాగున కఠోర వాక్యములను ప్రయోగించవచ్చును. అదే విషయమునుగురించి మృదుమధురములగు ఉపశమనవాక్యములు ప్రయోగించియు మాట్లాడవచ్చును సంకుచిత హృదయులు కటువాక్యముల నుపయోగింతురు. అది యుక్తము కాదు. నీచభావమును కఠోరభాషణమును పరిత్యజించి, సానుభూతిగలవాడవయి, అందరితోను మృదువుగా మాట్లాడుము. అప్రియవాక్యములను పలికి ఎవరి హృదయమును నొప్పింపకుము. అందరి హితమును లక్ష్యమునం దుంచుకొని, హితవాక్యములనే పలుకుము. ఎన్నడును ఆత్మస్తుతి చేసికొనకుము నీ కీర్తిని ప్రకటించుకొనుటకొరకు, నీవు చేసిన కార్యములను అతిశయోక్తిగా పొగడుకొనకుము. పరుల నెన్నడును నిందింపకుము అన్యాయముగా ఇతరుల ధనసంపదల నపహరించుటయు, ఇతరుల పేరు ప్రతిష్ఠల నపహరించుటయు రెండును సమానముగా నిందార్హములే ఎవరినయినను బాగుచేయుటకొరకుగాని, లోక కల్యాణమునకయిగాని, ఎవరి దోషములనయిన తప్పనిసరిగా ప్రకటింపవలసివచ్చినప్పుడు, వానిని సదయహృదయముతో, సానుభూతితో ప్రకటింపుము.

వి. ఈ శ్లోకముయొక్క చివరభాగము ఆత్మస్తుతిని గర్హించుచు, క్రిందటి శ్లోకముయొక్క భావమునే పెంచి చెప్పుచున్నది మొదటి సగభాగములో సత్యము పలుకవలయుననియు, అట్లు పలుకుటలో మృదులముగను, ప్రియకరముగను పలుకవలయుననియు చెప్పుచున్నది. పరనిందను గర్హించుచున్నది

శ్లో. సత్యమేవ వ్రతం యస్య, దయా దీనేషు సర్వదా।
కామక్రోధౌ వశే యస్య, తేన లోకత్రయం జితం॥ 3
[మహానిర్వాణతంత్ర VIII ౭౫.]

ప. సత్యం, ఏవ, వ్రతం, యస్య, దయా, దీనేషు, సర్వదా, కామక్రోధౌ, వశే, యస్య, తేన, లోకత్రయం, జితం.

టీ. యస్య = ఎవనికి, సత్యమేవ = సత్యమే, వ్రతం = వ్రతమో, దీనేషు=దీనులయందు, సర్వదా=ఎల్లప్పుడు, దయా= దయయో, కామక్రోధౌ = కామక్రోధములు, వశే = స్వాధీన మందు (వర్తేతే=ఉంచున్నవో), తేన=వానిచేత, లోకత్రయం= మూడు లోకములును, జితం=జయింపబడినవి.

తా. ఎవనికి సత్యమే వ్రతమో, ఎవనికి సర్వదా దీనుల యెడల దయయో, ఎవనికి కామక్రోధములు వశములయి యున్నవో, అతడు మూడు లోకములను జయించును.

వ్యా. సర్వదా సత్యమే వ్రతముగలవాడ వగుము. మనో వాక్కాయకర్మలచే సత్యము నే అనుసరింపుము. దీనులయెడ దయగలిగి యుండుము ధర్మము తెలియనివారికి ధర్మోపదేశము చేయుము. అజ్ఞానులను జ్ఞానవంతులనుగా జేయుము బీదలకు ధనదానము చేయుము. కామక్రోధ ములను వశపరచుకొనుము. ఈ యంతశ్శత్రువులు వశులు కాకేని, మానవు డనేక పాపకార్యములు చేయును. కామమును జయించుటకొరకు, కామ్య విషయములనుండి నీ మనస్సును మరలింపుము. క్రోధమును జయించుట కొరకు క్షమాశీలత నభ్యసింపుము

వి. ఈ శ్లోకము సత్యకథనము యొక్కయు దీనులయెడల దయ యొక్కయు, జితేంద్రియత్వము యొక్కయు ప్రభావమును పొగడు చున్నది

శ్లో॥ విరక్తః పరదారేషు, నిస్పృహః పరవస్తుషు।
దంభ మాత్సర్యహీనో యః తేన లోకత్రయం జితమ్॥ ౪
[మహానిర్వాణతంత్ర VIII ౬౬]

ప. విరక్తః, పరదారేషు, నిస్పృహః, పరవస్తుషు, దంభమాత్సర్యహీనః, యః, తేన, లోకత్రయం, జితం.

టీ. యః = ఎవ్వడు, పరదారేషు = పరభార్యలయందు, విరక్తః = విగతానురాగముగలవాడో, పరవస్తుషు = ఇతరుల పదార్థములయందు, నిస్పృహః=ఆసక్తిలేనివాడో, దంభమాత్సర్యహీనః=గర్వమును మత్సరమును లేనివాడో, తేన=వాని చేత, లోకత్రయం=మూడులోకములును, జితం=జయింపబడినవి.

తా. ఎవడు పరస్త్రీయందు విరక్తుడును, పరధనము నందు నిస్పృహుడును అయి యుండునో, ఎవడు దంభమాత్సర్యవిహీనుడో, అట్టి పురుషుడు త్రిలోకములను జయించును.

వ్యా. పరస్త్రీలను మోహదృష్టితో దర్శింపకుము, స్పృశింపకుము వారిని గురించి ఆలోచింపకుము. పరుల ధనమును, పరుల వస్తువులను ఆశింపకుము న్యాయముగా నీవార్జించిన విషయములతోనే సంతృప్తి నొందియుండుము. దంభమును మాత్సర్యమును పరిత్యజింపుము ధర్మాచరణము చేయుచున్నట్లు నటించుటయు, ధార్మికునివలె వేషము వేయుటయు దంభము. ఇతరులకు కలిగిన మేలును జూచి, అసూయపడుటయే మాత్సర్యము లోకులచే మెప్పువడయువలయునను ఆశను, లోకులను మోసపుచ్చవలయునను దురభిసంధిని విడిచి, బాహ్యాంతర్వర్తియగు పరమేశ్వరుని దృష్టియందే ధార్మికుడవు కా ప్రయత్నింపుము అందరిని ప్రేమించుట నభ్యసింపుము. సర్వభూతహితరతుడవు కమ్ము ఇట్టి సాధనవలన మన నీచ హృదయములయం దుత్పన్నమగు మాత్సర్య మంతర్హితమగును

వి. ఈ శ్లోకముకూడ పవిత్రతగలవాడును, నిస్సంగుడును, అసూయా రహితుడును, కాపట్యములేనివాడును, మూడులోకములను జయించునని స్తవము చేయుచున్నది

శ్లో. న బిభేతి రణాద్యోవై, సంగ్రామేఽప్యపరాఙ్ముఖః ।
ధర్మయుద్ధే మృతోవాపి, తేన లోకత్రయం జితం॥ ౫
[మహానిర్వాణతంత్ర VIII. ౬౩.]

ప. న, బిభేతి, రణాత్, యః, వై, సంగ్రామే, అపి, అపరాఙ్ముఖః, ధర్మయుద్ధే, మృతః, వా, అపి, తేన, లోకత్రయం, జితం.

టీ. యః నై=ఎవ్వడు, రణాత్=యుద్ధమువలన, న బిభేతి=భీతచిత్తుడు కాడో, సంగ్రామే అపి=యుద్ధమునందును, అపరాఙ్ముఖః=పలాయనము నొందడో, ధర్మయుద్ధే=ధర్మయుద్ధ మునందు, మృతః వా అపి=మృతుడయినను, తేన=వానిచేత, లోకత్రయం జితం=మూడు లోకములును జయింపబడినవి.

తా. ఎవడు యుద్ధమునందు భీతచిత్తుడు కాడో, ఎవడు రణరంగమునుండి వెనుకకు మరలడో, ఎవడు ధర్మయుద్ధము నందు ప్రాణముల నర్పించునో, అతడు ముల్లోకములను జయింపగలడు.

వ్యా. యుద్ధము రెండు విధములు తమ కధికారములేనిదానిని, అన్యాయముగా నార్జించుటకు దుర్మార్గులు యుద్ధము చేయుదురు. ఇది న్యాయస్వరూపుడగు ఈశ్వరునితో విరోధమును సాధించుటయే ఇది అధర్మయుద్ధము. అన్యాయమును పరాజయము నొందించి, న్యాయమును ప్రతిష్ఠించుటకు చేయబడు యుద్ధమును ప్రతికారయుద్ధమనికాని, ధర్మ యుద్ధమనికాని యందురు ఇది అన్యాయమును రూపుమాపి న్యాయమును రక్షించును. ప్రేమస్వరూపుడగు పరమేశ్వరుని రాజ్యమునందు, ఇదియును విశేషముగా శోచనీయమే ఏమానవులు పరస్పరము ప్రేమపూర్వకముగా ఆలింగనము చేసికొనవలసియున్నారో, ఏ మానవులు మంగళస్వరూపుడగు పరమపితచే, సమానప్రేమతో పోషింపబడుచున్నారో, అట్టి మానవులు తమ హస్తములను ఒకరి రక్తముతో నొకరు కలుషితము చేసికొనుట, ఒక

సోదరుడు మరియొక సోదరుని ప్రాణాపాయకరములగు ఆఘాతములచే నొప్పించుట, ఇట్టి విషయముల నాలోచించినయెడల, హృదయము శోకాచ్ఛన్నమును దుఃఖపూరితమగును శాంతివలనను, క్షమవలనను సత్యము సంరక్షింపబడగలిగినయెడల, ఎన్నడును యుద్ధము చేయగూడదు ధర్మయుద్ధమను నెపముతో, నీయాత్మగౌరవమును తృప్తిపరచుకొన బ్రయత్నింపకుము కాని, అధర్మనివారణముకొరకు ధర్మయుద్ధమునందు ప్రవేశింపవలసివచ్చినయెడల, భీతిచిత్తుడవై పరాఙ్ముఖుడవు గాకుము.

వి. ఈ శ్లోకము యుద్ధమునందు ధైర్యము, పట్టుదల మొదలయిన క్షత్రియధర్మములను ప్రశంసించుచున్నది యుద్ధమన్న భయములేనివాడును, ధర్మయుద్ధమునందు వెనుదీయనివాడును ముల్లోకములు జయించునని చెప్పబడినది మహర్షి దేవేంద్రనాథ ఠాకూరుగారు, యుద్ధముకంటె శాంతిని, క్షమాశీలతను ప్రశంసించుచున్నారు.

శ్లో॥ సత్యం బ్రూయాత్, ప్రియం బ్రూయాత్, న బ్రూయాత్ సత్యమప్రియం।
ప్రియం చ నానృతం బ్రూయాత్, ఏష ధర్మః సనాతనః॥ ౬

[మనుసంహిత IV. ౧౩౮]

ప. సత్యం, బ్రూయాత్, ప్రియం, బ్రూయాత్, న, బ్రూయాత్, సత్యమ్, అప్రియమ్, ప్రియం, చ, న, అనృతం, బ్రూయాత్, ఏషః, ధర్మః, సనాతనః.

టీ. సత్యం=యథార్థమును, బ్రూయాత్=మాట్లాడవలయును. ప్రియం=ప్రియమయినదానిని, బ్రూయాత్=మాట్లాడవలయును. అప్రియం సత్యం=ప్రియకరముగాని సత్యమును, న బ్రూయాత్=మాట్లాడవద్దు. ప్రియం చ=ప్రియకరమయిన, అనృతం=మిధ్యను, న బ్రూయాత్=పలుకవద్దు. ఏషః ధర్మః=ఈ ధర్మము, సనాతనః=నిత్యమయినది.

తా. సత్యమును పలుకవలయును, ప్రియమును పలుకవలయును. కాని, అప్రియమగు సత్యము నెన్నడును పలుకగూడదు. ప్రియమగు నసత్యమును పలుకగూడదు. ఇదే సనాతన ధర్మము.

వ్యా. సత్యమును కప్పిపుచ్చక, వెల్లడి చేయుచున్నప్పుడు సహితము హృదయరంజకముగా నుండునట్లు మాట్లాడుట నభ్యసింపవలయును. సత్యమయినను ఇతరుల మనసునకు వేదన కలిగించుదానిని, ధర్మసంరక్షణార్థమయి, అత్యంతావశ్యకమయినతప్ప, ప్రయత్నపూర్వకముగా దాచియుంచవలెను. ధర్మసంరక్షణకొరకు అత్యంతావసరమయినయెడల దయాపూర్వకముగా సత్యమును వెల్లడిచేయవలయును దానియందు తా నాహ్లాదమును పొందగూడదు మనసులో సహితము ఆనందింపగూడదు. ప్రియకరమయినను అసత్యమును సంపూర్ణముగా పరిత్యజింపవలయును. ఈవిధముగా వాక్సంయమము నభ్యసింపవలయును

వి. ఈ శ్లోకము సత్యభాషణమును మాత్రమేగాక, మధుర భాషణమునుకూడ శాసించుచున్నది. మొదటి పంక్తిలోని ౨వ భాగము "అప్రియమయినయెడల, సత్యమును మరుగుపరచమని" అర్థమిచ్చుచున్నదని కొందరందురు కనుక, సత్యమును అప్రియముగా పలుకగూడదని వారర్థము చేతురు. మొత్తముమీద ఈ శ్లోకము సత్యముయొక్క ఉచ్చ ఆదర్శమును బోధించుచున్నది.

శ్లో॥ అద్భిర్గాత్రాణి శుధ్యంతి, మనస్సత్యేన శుధ్యతి ।
విద్యాతపోభ్యాం భూతాత్మా, బుద్ధిర్జ్ఞానేన శుధ్యతి॥ ౭

[మనుసంహిత V ౧౦౯ విష్ణుసంహిత XXII ౯౨ వశిష్టసంహిత III.]

ప. అద్భిః, గాత్రాణి, శుధ్యన్తి, మనః, సత్యేన, శుధ్యతి, విద్యాతపోభ్యాం, భూతాత్మా, బుద్ధిః, జ్ఞానేన, శుధ్యతి.

టీ. గాత్రాణి=(స్వేదాదులచే మలినములయిన) శరీరములు, అద్భిః=జలముచే, శుధ్యన్తి=పరిశుద్ధములగుచున్నవి. మనః = (నిషిద్ధచింతనాదులచే కలుషితమయిన) మనస్సు, సత్యేన = సత్యకథనముచేత, శుధ్యతి = పవిత్రమగుచున్నది. భూతాత్మా=జీవాత్మ, విద్యాతపోభ్యాం = బ్రహ్మవిద్యాతపస్సులచేతను, శుధ్యతి=పవిత్రమగుచున్నది. బుద్ధిః=(విపర్యయజ్ఞానోపహతమైన) బుద్ధి, జ్ఞానేన = యథార్థజ్ఞానముచేతను, శుధ్యతి= పవిత్రమగుచున్నది.

తా. జలముచే శరీరములు పరిశుద్ధము లగుచున్నవి. సత్యమును చెప్పుటవలన మనస్సు పరిశుద్ధ మగుచున్నది. బ్రహ్మ విద్యాతపస్సులచే ఆత్మ పరిశుద్ధమగుచున్నది. యధార్థ జ్ఞానముచే బుద్ధి పరిశుద్ధమగుచున్నది.

వ్యా. సంభాషణయందు సత్యవాదివి కమ్ము. వ్యవహారమునందును సత్యపరాయణుడవు కమ్ము అట్లయినయెడల, ఆత్మప్రసాదమునొంది, పరిశుద్ధుడ వగుదువు బ్రహ్మవిద్యద్వారమున బ్రహ్మజ్ఞానమును సముజ్జ్వలము గావించుకొని, బ్రహ్మోపలబ్ధి నొందుము ఈశ్వరాదిష్టములగు ధర్మముల ననుష్ఠింపుచు, ధర్మానుష్ఠానస్వరూప తపమునందు నియుక్తుడవు కమ్ము. దాని వలన, నీ ఆత్మ మోహామునుండియు, పాపతాపములనుండియు, విముక్తి నొంది, పరిశుద్ధమగును. జ్ఞానానుశీలనద్వారమున, బుద్ధిని భ్రమప్రమాద ములనుండి విముక్తి నొందించి, పరిశుద్ధము గావింపుము. సర్వవిధములను శుద్ధసత్వప్రధానుడవయి, పరిపూర్ణ పవిత్రుడును, ఏ పాపముచే అంట బడనివాడును అగు పరమేశ్వరుని సాన్నిధ్యము నొంద బ్రయత్నింపుడు.

వి. ఈ శ్లోకము, శరీరమును, మనస్సును, ఆత్మను పరిశుద్ధముగా నుంచుకొనవలసిన కర్తవ్యమును, ఆ కర్తవ్యసాధనమును నిర్దేశించుచున్నది. శరీరము జలముచే పరిశుద్ధము చేయబడినట్లే, మనస్సు జ్ఞానముచేతను, ఆత్మ ధర్మానుష్ఠానముచేతను పవిత్రమగునని చెప్పుచున్నది.

శ్లో. యోఽన్యథాసంత మాత్మానం, అన్యథా ప్రతిపద్యతే।
కింతేన న కృతం పాపం చోరేణాత్మాపహారిణా॥ ౮

[మహాభారత,ఆదిపర్వ ౭౪ ౨౬,౨౫-ఉద్యోగపర్వ ౪౨ ౩౫-౪౧,౩౫.]

ప. యః, అన్యథా, సంతం, ఆత్మానం, అన్యథా, ప్రతిపద్యతే, కిం, తేన, న, కృతః, పాపం, చోరేణ, ఆత్మాపహారిణా.

టీ. యః=ఎవడు, అన్యథా=ఒక విధముగా, సంతం=ఉండెడి, ఆత్మానం=తన్ను, అన్యథా=మరియొకవిధముగా, ప్రతిపద్యతే=తెలుపుకొనుచున్నాడో, ఆత్మాపహారిణా=ఆత్మాపహారి యగు (తన్ను దొంగిలించెడు), తేన చోరేణ=ఆ దొంగచేత, కిం పాపం=ఏపాపము, న కృతం ?=చేయబడదు ? (అన్నియు చేయబడునని యర్థము).

తా. ఏ పురుషుడు, తా నొక విధముగా నుండి, తాను మరియొక విధముగా నున్నట్లు ప్రకటించుకొనుచున్నాడో, అట్టి ఆత్మాపహారి యగు చోరునివలన, నే పాపము చేయబడదు ? సమస్త పాపములు చేయబడునని భావము.

వ్యా సర్వదా కపటము లేనివాడవయి కార్యముల నాచరింపుము లోపల నొక ప్రకారముగానుండి, యింకొక ప్రకార మున్నట్లు పయికి కనబడు ప్రయత్నింపకుము. ఏది అయోగ్యమని తెలిసికొందువో, దానిని సర్వతోభావముగా, లజ్జాపూర్వకముగా పరిత్యజింపుము. ఏది యోగ్యమని తెలిసికొందువో, దానిని సి వాక్కులతో వ్యక్తము చేసి, కార్య రూపమున చేసి చూపింపుము

వి. ఈ శ్లోకము మోసమును ఆత్మగోపనమును నిందించుచున్నది. తన్ను తా నున్న రీతిని గాక, మఱియొకరీతిని ఇతరులకు కనబరచువాడు, దొంగయని చెప్పబడుచున్నాడు. అత డెట్టి పాపమున కయినను ఒడికట్టగలడని ఎంచబడుచున్నాడు.

శ్లో. నాస్తి సత్యసమో ధర్మః, న సత్యాద్విద్యతే పరం।
న హి తీవ్రతరం కించిత్, అనృతా దిహ విద్యతే॥ ౯

[మహాభారత, ఆదిపర్వ ౭౪. ౧౦౫.]

ప. న, అస్తి, సత్యసమః, ధర్మః, న, సత్యాత్, విద్యతే, పరం, న, హి, తీవ్రతరం, కించిత్, అనృతాత్, ఇహ, విద్యతే.

టీ. సత్యసమః=సత్యముతో సమానమయిన, ధర్మః=ధర్మము, నాస్తి=లేదు. సత్యాత్=సత్యముకంటె, పరం=శ్రేష్ఠమయినది, న విద్యతే=లేదు. ఇహ=ఐహికమునందు, అనృతాత్=మిథ్యకంటె, తీవ్రతరం=నికృష్టతరం (పనికిమాలినది), కించిత్=కొంచెమయినను, న హి విద్యతే=లేదు కదా !

తా. సత్యముతో సమానమయిన ధర్మము లేదు. సత్యముకంటె శ్రేష్ఠమయిన మరియొక వస్తువులేదు. ఐహికమునందు అనృతముకంటె తీవ్రతరమయిన మరియొక పదార్థము లేదు.

వ్యా సత్యమే ఈశ్వరుని స్వరూపమ దానియందే ధర్మము ప్రతిష్ఠితమయి యున్నది జ్ఞానద్వారమున సత్యము నార్జింపవలయును. సత్యము విషయమయి విశేషశ్రద్ధను గలిగియుండవలయును. ఆచరణమునందు సహితము సత్యపరాయణుడు కావలయును. మిథ్యను సంపూర్ణముగా త్యజింపవలయును అసత్యముకంటె అసహ్యము, కఠోరము, నింద్యము అగునది వేరొకటి లేదు మిథ్యాజీవితమువలన జ్ఞానము మోహాచ్ఛన్నమగును. వాక్కును, ఆచరణమును అపవిత్రములగును

వి. ఈ శ్లోకము సత్యముయొక్క చక్కదనమును, అసత్యముయొక్క అసహ్యతను మరల చెప్పుచున్నది. ఇది సుగుణములలోకెల్ల సత్యమునకే శీర్షస్థాన మిచ్చుచున్నది.

శ్లో. ప్రియో భవతి దానేన, ప్రియవాదేన చాపరః।
అప్రియస్య చ పథ్యస్య, వక్తా శ్రోతా చ దుర్లభః॥ ౧౦
[మహాభారతి, ఉద్యోగపర్వ ౩౯ ౩—౩౭ ౧౫ ]

ప. ప్రియః, భవతి, దానేన, ప్రియవాదేన, చ, అపరః, అప్రియస్య, చ, పథ్యస్య, వక్తా, శ్రోతా, చ, దుర్లభః.

టీ. దానేన=ఈవిచేత, ప్రియః భవతి=(ఒకడు) ప్రియుడగుచున్నాడు. అపరః=వేరొకడు, ప్రియవాదేన చ=మంచి మాటలచేత (ప్రియుడగుచున్నాడు). పథ్యస్య=హితమయినదియయినను, అప్రియస్య=ప్రియముకాని దానియొక్క, వక్తా=చెప్పెడివాడున్ను, శ్రోతా=వినెడువాడున్ను, దుర్లభః=అరుదు.

తా. ఒకడు దానముచేసి ప్రియుడగును, మరియొకడు ప్రియమయిన మాటలుచెప్పి ప్రియుడగును. కాని, అప్రియమయినను, హితవాక్యములు పలుకు వక్తయు, అట్టి వాక్యములను విను శ్రోతయు, ఉభయులును దుర్లభులు.

వ్యా. హితకరములయిన వాక్యములు సర్వదా ప్రీతికరములుగా నుండవు ప్రియవాక్యములు తరుచు అహితకరములుగా నుండును. వినువారికి కష్టముగా నుండునను భయముచే, ఎవడు హితమును పలుకడో,

వాడు నిజమయిన హితుడు కాడు. ప్రియముగా లేవని ఎవడు హితవాక్యములు వినడో, వాడు తప్పక దుఃఖము ననుభవింపవలసి యుండును. కనుక, సమస్తమయిన వారికిని హితమునే చేయగోరువాడవయి, హితవాక్యములనే పలుకుము. ఎవడయినను హితోపదేశమును చేసినయెడల, అది తాత్కాలికముగా నీకప్రియముగా నున్నను భావిఫలమును మనసునందుంచుకొని, దానిని శాంతచిత్తముతో నాకర్ణించి, తదనుసారముగా వర్తించి, శుభఫలము నొందుము.

౮. అప్రియమయినను, హితమునే చెప్పవలయునని ఈ శ్లోకము ఆదేశించుచున్నది. ఇది అప్రియమయిన సత్యమును చెప్పవద్దను, ఈ యధ్యాయమునందలి ౬ వ శ్లోకములోని భావమును పూర్వపక్షము చేయుచున్నది.



# ౭ అధ్యాయము



శ్లో. సమక్షదర్శనాత్ సాక్ష్యం, శ్రవణాచ్చైవ సిధ్యతి।
తత్రసత్యం బ్రువన్ సాక్షీ, ధర్మార్థాభ్యాం నహీయతే॥ ౧

[మనుసంహిత VIII ౭౪.]

ప. సమక్షదర్శనాత్, సాక్ష్యం, శ్రవణాత్, చ, ఏవ, సిధ్యతి, తత్ర, సత్యం, బ్రువన్, సాక్షీ, ధర్మార్థాభ్యాం, న, హీయతే.

టీ. సమక్షదర్శనాత్=ప్రత్యక్షదర్శనమువలనను, శ్రవణాచ్చైవ=వినికివలనను, సాక్ష్యం=సాక్షిత్వము, సిధ్యతి=సిద్ధించుచున్నది. తత్ర=దానియందు, సత్యం=యథార్థము (చూచినది చూచినట్లును, విన్నది విన్నట్లును,) బ్రువన్ = చెప్పెడి, సాక్షీ=సాక్షి, ధర్మార్థాభ్యాం=ధర్మార్థములనుండి, న హీయతే= విడువబడడు.

తా. సాక్షాద్దర్శనము వలనను, శ్రవణము వలనను, సాక్షిత్వము సంభవించును. సాక్షియయి సత్యము పలికిన యెడల, ధర్మార్థములనుండి విచ్యుతుడు కాడు.

వ్యా న్యాయమునకును, సత్యమునకును జయము కలుగవలయు నని పరమేశ్వరుని యభిప్రాయము. సాధుపురుషుల యభిప్రాయమును యిదే కాని, అసాధువులు ఈశ్వరోద్దేశము నుల్లంఘించి, యితరుల కన్యాయము చేయుచున్నారు దానిని నివారింపనియెడల, లోకస్థితికిని, లోక కల్యాణమునకును, విశేషముగా వ్యాఘాతము కలుగును కనుకనే, న్యాయాధిపతులు న్యాయాన్యాయములను విచారించి, న్యాయపక్షముననే తీర్పుచెప్పి, ధర్మసంరక్షణము చేయుచున్నారు. వివేకియయిన సాక్షి వివాదాస్పదవిషయములలో చూచినది చూచినట్లును, విన్నది విన్నట్లును ధర్మాధికారికి తెలిపి, ధర్మసంరక్షణమునందు సహాయకారి యగుచున్నాడు. ధర్మస్థానములయందు సాక్ష్యమిచ్చుట ధర్మార్థములకు విరోధమని యెంత మాత్రమును భావింపగూడదు

వి. ఈ ౭వ యధ్యాయము న్యాయసభయందు సత్యసాక్ష్య మిచ్చుటను గురించి చెప్పుచున్నది. సాక్షియనగా నెట్టివాడో ముందు నిర్వచించుచున్నది. ఒక కార్యమును ప్రత్యక్షముగా చూచినవాడును, విన్నవాడును మాత్రమే సాక్ష్యము నిచ్చుట కర్హులు ఇతరులు కారు. న్యాయస్థానములో సత్యమును చెప్పుట ఆధ్యాత్మిక జీవితమునకు భంగ కరము కాదు.

శ్లో. యథా శ్రుతం యథా దృష్టం, సర్వమేవాఞ్జసా వద
సత్యేన పూయతే సాక్షీ, ధర్మః సత్యేన వర్ధతే॥ ౨
[మనుసంహిత VIII అధ్యా ౧౦౧. ౘ 3]

ప. యథాశ్రుతం, యథాదృష్టం, సర్వం, ఏవ, అఞ్జసా, వద, సత్యేన, పూయతే, సాక్షీ, ధర్మః, సత్యేన, వర్ధతే.

టీ. యథాశ్రుతం=వినబడినది వినబడినట్లు, యథాదృష్టం=చూడబడినది చూచినట్లు, సర్వం=సమస్తము ను, అఞ్జసా ఏవ=యథార్థముగానే, వద=చెప్పుము. సత్యేన=సత్యకథనము చేతను, సాక్షీ=సాక్ష్యమిచ్చువాడు, పూయతే=పాపమునుండి విడువబడుచున్నాడు (పవిత్రుడగుచున్నాడు). ధర్మః=ధర్మము, సత్యేన=(అతని) సత్యకథనముచేతను, వర్ధతే = వృద్ధిపొందుచున్నది.

తా. చూచినది చూచినట్లును, విన్నది విన్నట్లును, సమస్తమును యథార్థముగా పలుకవలయును. సత్యకథనము వలన సాక్షి పరిశుద్ధుడగును, ధర్మము సంరక్షింపబడును.

వ్యా. యోగ్యుడగు సాక్షి చూచినది చూచినట్లును, విన్నది విన్నట్లును, సమస్తమును యథార్థముగా సాక్ష్య మియ్యవలయును తనకు

తెలిసినంతవరకు హెచ్చుతగ్గులులేక సంపూర్ణముగా చెప్పవలయును ఎవడు తన కంటితో తాను చూచునో వాడే నిజమయిన సాక్షి. ఇతరుల నుండి విన్న సంగతులు నిజము కావచ్చును, అబద్ధము కావచ్చును కనుక న్యాయస్థానములయందు సాక్ష్యమిచ్చునప్పుడు, చూచిన విషయములను, చూచినట్లును, విన్న విషయములను విన్నట్లును ప్రత్యేకించి, చెప్పవలయును ధర్మమును సంరక్షించుచుండుటచేత, సత్యసాక్ష్యమువలన పుణ్యము లభించును మిథ్యాసాక్ష్యమువలన పాపము లభించును.

వి. సాక్షి తాను చూచినదానిని, విన్నదానిని యథార్థముగా చెప్పవలయునని ఈ శ్లోకము నిరూపించుచున్నది అట్లు చెప్పుటవలన, సాక్షి పవిత్రుడగుటయేగాక, ధర్మమునం దభివృద్ధి నొందుచున్నాడు.

శ్లో. యస్య విద్వాన్ హి వదతః, క్షేత్రజ్ఞో నాభిశఙ్కతే।
తస్మాన్న దేవాః శ్రేయాంసం, లోకేఽన్యం పురుషం విదుః॥3

[మనుసంహిత VIII ౯౬.]

ప. యస్య, విద్వాన్, హి, వదతః, క్షేత్రజ్ఞః, న, అభిశంకతే, తస్మాత్, న, దేవాః, శ్రేయాంసం, లోకే, అన్యం, పురుషం, విదుః.

టీ. వదతః=సాక్ష్యమును చెప్పుచున్న, యస్య=ఎవని యొక్క, విద్వాన్=చేతనవంతమయిన, క్షేత్రజ్ఞః=జీవాత్మ, న

అభిశంకతే=(ఇతడు సత్యమును చెప్పుచున్నాడా, అసత్యమును చెప్పుచున్నాడా యని) శంకించదో (కాని, ఇతడు సత్యమునే చెప్పుచున్నాడని శంకలేనిదగుచున్నదో), లోకే = లోకమునందు, తస్మాత్ =అట్టి పురుషునికంటె, అన్యం=ఇతరుని, శ్రేయాంసం=శ్రేష్ఠతరుడగు పురుషుని, దేవాః=దేవతలును, న విదుః= ఎరుగరు.

తా. ఏ సాక్షి సాక్ష్యము నిచ్చుచుండగా, సచేతనమగు అతని మనస్సాక్షి 'నే నబద్ధము చెప్పుచున్నా' నని శంకింపదో, ఈ లోకమునం దట్టి పురుషునికంటె శ్రేష్ఠుడగు మరియొకనిని దేవతలుసహితము ఎరుగరు.

వ్యా. ఎవనిమట్టుకు వాని మనస్సునకు గోచరముగాని పాపము లేదు. కనుక, ఏ సాక్షి తాను సాక్ష్య మిచ్చుచున్నప్పుడు, తాను చెప్పునది అబద్ధము కాదని, సంపూర్ణముగా విశ్వసించుచున్నాడో, అతడే సత్యవాదియగు సాక్షి. సర్వదర్శియగు పరమేశ్వరుడు అతనియెడల, ప్రసన్నుడగును.

వి. ఈ శ్లోకము సత్యసాక్ష్యముయొక్క మహిమను కొనియాడుచున్నది. సత్యసాక్షికంటె ఉత్తముడగు పురుషుని దేవతలు సహితము ఎరుగరని ప్రశంసించుచున్నది

శ్లో. ఏకోఽహ మస్మీ త్యాత్మానం, యత్త్వం కల్యాణ మన్యసే।
నిత్యం స్థితస్తే హృద్యేష, పుణ్యాపాపేక్షితా మునిః॥ ౪
[మనుసంహిత VIII ౯౧]

ప. ఏకః, అహం, అస్మి, ఇతి, ఆత్మానం, యత్, త్వం, కల్యాణ, మన్యసే, నిత్యం, స్థితః, తే, హృది, ఏషః, పుణ్యపాపేక్షితా, మునిః.

టీ. హే కల్యాణ=ఓ మంగళ స్వరూపుడా, ఏకః ఏవ= ఒక్కడనే అయిన, అహమ్=నేను, అస్మి ఇతి=ఉన్నాను అని, యత్ త్వం మన్యసే=నీవు అనుకొనుచున్నావేమో (అట్లనుకొనవద్దు). (ఎందువలన ననగా) ఏషః=ఈ, పుణ్యాపాపేక్షితా= పుణ్యాపాపద్రష్టయగు, మునిః=సర్వజ్ఞుడగు పరమాత్మ, తే= నీయొక్క, హృది =హృదయమునందు, నిత్యం = ఎల్లప్పుడును, స్థితః=ఉన్నాడు.

తా. ఓ సౌమ్యుడా, 'నే నేకాకిగా నున్నా' నని, నీ వనుకొనుచున్నావేమో, ఎన్నడును అట్లనుకొనకుము. పుణ్య పాపదర్శియును, సర్వజ్ఞుడును అగు పరమపురుషుడు, సదా, నీ హృదయసీమయందు ప్రతిష్ఠితుడయి యున్నాడు.

వ్యా. శుభమును కాంక్షించు, ఓ సాక్షీ, నీవు బాహ్యమునందును ఏకాకివి కావు, అంతరమునందును ఏకాకివి కావు పుణ్యాపాపదర్శియును, సర్వజ్ఞుడును అగు పరమపురుషుడు నీ హృదయమునందు, నిత్య నివాసము చేయుచున్నాడు అతడు పుణ్యమును బహూకరించుచున్నాడు పాపమునకు యుక్తదండన విధించుచున్నాడు నీవు సాక్ష్యమిచ్చునప్పుడు, ఈ సంగతిని జ్ఞాపక ముంచుకొనుము అబద్ధపు సాక్ష్యమునిచ్చి, నీ మస్తకముపయి పరమేశ్వరుని వజ్రాయుధమును పడనీయకుము.

వి. సర్వద్రష్టయగు పరమాత్మ, సర్వదా, మన ఆత్మయందున్నాడనియు, ఇతరు లెరిగినను, ఎరుగకపోయినను, మనము సత్యము పలుకుచున్నది లేనిది, పరమేశ్వరు డెరుగుననియు, ఈ శ్లోకము చెప్పుచున్నది.



# ౮ అధ్యాయము



శ్లో॥ యత్కల్యాణమభిధ్యాయేత్, తత్రాత్మానం నియోజయేత్।
న పాపే ప్రతిపాపః స్యాత్, సాధురేవ సదా భవేత్॥ ౧

[మహాభారత, వనపర్వ, ౨౦౭. ౧౧—శాంతిపర్వ, ౯౪ ౧౦.]

ప. యత్, కల్యాణం, అభిధ్యాయేత్, తత్ర, ఆత్మానం, నియోజయేత్, న, పాపే, ప్రతిపాపః, స్యాత్, సాధుః, ఏవ, సదా, భవేత్,

టీ. యత్=దేనియందు, కల్యాణం=మంగళము, అభిధ్యాయేత్=ఉన్నదని నీకు తోఁచుచున్నదో, తత్ర = దానియందు, ఆత్మానం=ఆత్మను, నియోజయేత్=నియోగింపవలయును. పాపే=పాపాత్ముడగు జనునియందు, ప్రతిపాపః=ప్రతీకారపాపము చేయువాడవయి, న స్యాత్=ఉండవద్దు. (కాని) సదా=నిరంతరము, సాధుః ఏవ భవేత్=సాధువుగానే యుండవలయును.

తా. దేనివలన నీకు కల్యాణము లభించునని యను కొందువో, దానియందు నీవు నియుక్తుడవు కమ్ము. పాపకర్మములు చేయువాని యెడల సహితము పాపము నాచరింపకుము. సదా సాధుత్వమునే యవలంబించి యుండుము.

వ్యా. దేనివలన మంగళము చెకూరునో, దానినే ఆచరింపుము. ఈశ్వరుడు మంగళస్వరూపుడు మంగళమే ఆయనయొక్క యుద్దేశము. ఏది ఒకనికి మంగళమయి, మరియొకనికి అమంగళమగునో, ఏది నేటికి మంగళముగానుండి, రేపటికి అమంగళమగునో, అది వాస్తవముగా మంగళకరమయినది కాదు సమస్త మానవసంఘమునకును, ఏది శుభకరమో, అనంతకాలమువరకు ఏది శ్రేయస్కరమో, దానియందే నీవు నియుక్తుడవగుము. ఆదే నిజమయిన మంగళము నీవు పాపియెడలనయినను పాపము చేయకుము. అన్యాయము చేసినవానికి సహితము మరల అన్యాయము చేయకుము. సదా సాధువయి యుండుము. సాధుత్వమువలననే అసాధుత్వమును పరాజయము నొందింపుము. న్యాయపథమునందుండియే, అన్యాయాచరణమునకు ప్రతివిధానము చేయుము. దుష్టులు దుష్కృత్యములద్వారమున తమ కోపమును సంతృప్తి నొందింప బ్రయత్నింతురు. కాని, సాధువులు తమ సాధుకృత్యముల ద్వారముననే, దుష్టులకు సాధుత్వము నుపదేశించి, ప్రపంచమునందు శాంతిప్రతిష్ఠాపనమునకు సాహాయ్యము చేయుదురు.

వి. ఈ ౮వ యధ్యాయము సర్వదా, సమస్త పరిస్థితులయం దును, న్యాయమునే, ధర్మమునే ఆచరింపవలయునని నిర్దేశించుచున్నది. ఈ మొదటి శ్లోకము ఎప్పుడును మంచినే చేయవలయునని చెప్పుచున్నది. ఇతరులు తమకు అనిష్ట మాచరించినను, మరల వారికి తా మనిష్టము చేయ గూడదని బోధించుచున్నది.

శ్లో. అక్రోధేన జయేత్ క్రోధం, అసాధుం సాధునా జయేత్।
జయేత్ కదర్యం దానేన, జయేత్ సత్యేన చానృతమ్॥ ౧

[మహాభారత, ఉద్యోగపర్వ, ౩౮. ౭౩—౩౯. ౭౩.]

ప. అక్రోధేన, జయేత్, క్రోధమ్, అసాధుం, సాధునా, జయేత్, జయేత్, కదర్యం, దానేన, జయేత్, సత్యేన, చ, అనృతమ్.

టీ. అక్రోధేన=క్రోధము లేకపోవుటచేత, క్రోధం=క్రోధ మును, జయేత్ = జయింపవలయును. అసాధుం = అయోగ్య మయిన కార్యమునుగాని, భావమునుగాని, సాధునా=యోగ్య మయిన కార్యముచేతగాని, భావముచేతగాని, జయేత్=జయింప వలయును. కదర్యం=నీచుని (అపకారిని), దానేన=దానాది ఉప కారములచేత, జయేత్=జయింపవలయును. అనృతం=అబద్ధ మును, సత్యేన=సత్యముచేత, జయేత్=జయింపవలయును.

తా. క్షమవలన క్రోధమును జయించుము. సాధుత్వ ముచలన అసాధుత్వమును జయింపుము. ఉపకారముచేసి అప కారిని జయించుము. సత్యమువలన అసత్యమును జయించుము.

వ్యా. స్వయముగా తాను క్రోధపరవశుడుగాక క్రోధాంధుని జయింపవలెను వివిధోపాయముల నవలంబించి, ఏ కారణమువలన నిరర్థకముగా ఇతరులకు క్రోధము జనించుచున్నదో, ఆ కారణమును దూరీకృతముచేసి క్రోధము నుపశమింపజేయవలెను. అసాధువును సాధుత్వముచేతనే జయింపవలెను. అసద్వ్యవహారము చేసినవారియెడల సహితము నీవు సద్వ్యవహారమే చేయుము. నీ యెడల నిర్దయతో నుండువారితో సహితము నీవు దయను కనబరచుము. నీకు అహితమును చేసి, నిన్ను గురించి అహితముగా భావించెడు వారికి సహితము, నీవు హితమునే చేసి, వారిని సద్భావముతో చూడుము. సత్యముచేతనే అసత్యమును పరాజయము నొందించుము ప్రాణమునయినను పణముగా నొడ్డి, సదా, సత్యమునే అవలంబింపుము. సత్యమే జయము.

వి. ఈ శ్లోకభావము 'నీ శత్రువులను ప్రేమింపుము, నిన్ను శపించువారిని దీవించుము...' అను జీససుయొక్క మహోత్కృష్టమగు ఉపదేశమును పోలియున్నది. ప్రతి దుర్గుణమును దానికి విరుద్ధమయిన సుగుణమువలన, అనగా క్రోధమును క్షమాశీలతవలనను, అసత్యమును సత్యమువలనను, చెడ్డతనమును మంచితనమువలనను, ద్వేషమును ప్రేమవలనను జయింపవలయునని ఈ తత్త్వవేత్త చెప్పుచున్నాడు.

శ్లో. కుశలః సుఖదుఃఖేషు, సాధూంశ్చాప్యుపసేవతే ।
సత్యసాధుసమారంభాత్, బుద్ధి ర్ధర్మేషు రాజతే॥ 3

[మహాభారత, వనపర్వ ౩౦౯. ౧౨ ]

ప. కుశలః, సుఖదుఃఖేషు, సాధూన్, చ, అపి, ఉపసేవతే, సత్యసాధుసమారంభాత్, బుద్ధిః, ధర్మేషు, రాజతే.

టీ. సుఖదుఃఖేషు = (ఎవడు) సుఖదుఃఖములయందు, కుశలః=నేర్పుగలవాడయి, సాధూంశ్చాపి=సజ్జనులను, ఉపసేవతే=సేవించుచున్నాడో, బుద్ధిః=(వాని) బుద్ధి, సత్యసాధుసమారంభాత్ = సత్యసాధు లక్షణములుగల కర్మానుష్ఠానము వలన, ధర్మేషు = ధర్మములయందు, రాజతే = ప్రకాశించుచున్నది.

తా. సుఖదుఃఖాది ద్వంద్వములు సంప్రాప్తమయినప్పుడు ఎవనిహృదయము చలింపదో, ఎవడు సాధుపురుషులను సేవించుచు సత్సంగతత్పరుడయి యుండునో, అట్టి పురుషుని బుద్ధి సత్యసాధు కర్మానుష్ఠానద్వారమున ధర్మపథమునందగ్రగామియయి, దీప్తివంతమగును.

వ్యా. సుఖదుఃఖములు రెండును చిత్తచాంచల్యమును జనింపజేయును. దుఃఖసమయమున, ఒక విధమగు చిత్తచాంచల్యము కలుగును సుఖసమయమునందు, మరియొక విధమయిన చిత్తచాంచల్యము కలుగును. ఒక్కొక్కప్పుడు దుఃఖభోగమువలని బాధలకంటె సుఖభోగమువలని మత్తతయే ధర్మసాధనకు అధికతరమయిన విఘ్నములను ఉత్పాదనము చేయును. కనుక, చంచలచిత్తుడవుగాక, సుఖదుఃఖములవలని లాభములను పొందుటకు ప్రయత్నింపుము. ప్రయత్నపూర్వకముగా సాధుసాంగత్యము చేయుము. ప్రపంచమునందు మన మనేకవిధములగు పరిస్థితులలో నుండవలసి వచ్చును అందువలన మన యంతఃకరణము అనేకవిధములుగా సంచలించి, విక్షిప్తమగును. ధర్మభావములు మ్లానమగును. పవిత్రోత్సాహము చల్లారిపోవును. ధర్మాశయములు ఆశాహీనములగును మోహపంకముచే జీవితము కలుషితమగును ఇట్టి శోచనీయావస్థయందు, సత్సంగముతప్ప ఆత్మ నుద్ధరింపగలిగినది మరియొకటి లేదు సత్సహవాసము యొక్క ప్రభావమువలన మరణావస్థయందుండు ఆత్మ పునర్జీవనము నొందును. నిరాశాంధకారమున ఆశాజ్యోతి వెలుగును నిరుత్సాహాంతఃకరణమునందు ఉత్సాహాగ్ని యుదయించును. రూపవిహీనమగు సమస్త వస్తుప్రపంచమునకును సూర్యకాంతి ఎట్లు రూపమునిచ్చునో, అట్లే, సాధుపురుషులతోడి సహవాసము, అసాధువుల జీవనమును సహితము పవిత్రముగను, పుణ్యవంతముగను చేయును సాధుసంగముయొక్క గొప్పలాభమిది అది, అసాధుభావముల నణచివేసి, సాధుభావముల నుద్దీపనము కలిగించును. కనుక, ధర్మజీవనాకాంక్షులు సత్పురుషులతోడి సహవాసమును సంపాదించుటకు శ్రద్ధావంతులయి యుండవలయును. దేని నాచరించుటవలన జ్ఞానమును హృదయమును ఔన్నత్యము నొందునో, పరితృప్తి

నొందునో, అదే సత్కర్తయనియు, సాధుకర్తయనియు తెలిసికొనుము. అట్టి కార్యానుష్ఠానమువలననే, ధర్మానురాగము ప్రజ్వలించును. హృదయముయొక్కయు, మనస్సుయొక్కయు ధర్మప్రబోధముల నుల్లంఘించి ప్రవర్తించువారి ధర్మజ్ఞానము క్రమక్రమముగా నిస్సారమయి మందగించును. తుదకు వారు ధర్మాధర్మవిచక్షణజ్ఞానమును సహితము గోల్పోవుదురు. అందువలన, వారు ధర్మపథమునుండి పతితులయి అధోగతి నొందుదురు.

వి. పరిస్థితులు మంచివయినను, చెడ్డవయినను వానివలన మనశ్చాంచల్యము నొందగూడదనియు, మనస్సును వికసింపజేసి, హృదయమునందు పవిత్రాశయములను మేలుకొలుపు సజ్జనసహవాసము చేయవలయుననియు, ఈ శ్లోకము హెచ్చరించుచున్నది. ప్రతి మానవుడును ధర్మపథమునందు తన కధైర్యము తోచినపుడెల్ల, మహాపురుషుల జీవితములను పఠించుచుండవలయును అధర్మమార్గమునుండి తప్పించుకొనుట కది యొక గొప్ప సాధనము

శ్లో॥ మోహజాలస్య యోనిర్హి, మూఢైరేవ సమాగమః ।
అహన్యహని ధర్మస్య, యోనిః సాధుసమాగమః॥ ౪

[మహాభారత, వనపర్వ I ౨౪.]

ప. మోహజాలస్య, యోనిః, హి, మూఢైః, ఏవ, సమాగమః, అహని, అహని, ధర్మస్య, యోనిః, సాధుసమాగమః.

టీ. మూఢైః=మూఢులతో, సమాగమః ఏవ=సంయోగమే, మోహజాలస్య=అవివేక సమూహమునకు, యోనిః=ఉత్పత్తిస్థలము. అహన్యహని=ప్రతిదినము, సాధుసమాగమః=సాధుసాంగత్యము, ధర్మస్య=ధర్మమునకు, యోనిః=కారణము.

తా. మూఢులతోడి సహవాసమువలన, సమస్తమోహములును ఉత్పత్తియగును. అనుదిన సాధుసంసర్గమువలన, సమస్త ధర్మగుణములును ఆవిర్భవించును.

వ్యా. సాధువులతోడి సహవాసము అధ్యాత్మికాభివృద్ధికి కారణము. అసాధువులతోడి సహవాసము మోహజాలము నభివృద్ధినొందించును. సాధుసంగము ఆత్మోన్నతిహేతువు అసాధుసంగము అధఃపతనహేతువు. సాధుసంగమువలన నవజీవన ముదయించును. అసాధుసంగము మృత్యువునకు దారితీయును. సాధుసంగమువలన, ఈశ్వరునియెడల, శ్రద్ధాభక్తులు వృద్ధియగును. అసాధు సంసర్గమువలన సంశయమును, అవిశ్వాసమును జనించి, ఈశ్వరునుండి దూరమగుట తటస్థించును. అసాధువులతోడి సంభాషణము, వారి యాచరణము, స్నేహితుల ధర్మబంధమును శిథిలముచేయును. అసాధుసంగము పాపముయెడల నుండవలసిన అసహ్యతను, ధర్మముయెడల నుండవలసిన శ్రద్ధను మందముచేయును. కనుక, ధర్మానురాగము గలవారు, అనుదినము సాధుసాంగత్యము చేయుచు, దుస్సహవాసమును సంపూర్ణముగా పరిత్యజింప బ్రయత్నింపవలయును. ఎవరితోడి సహవాసము నీచకామములను, నీచప్రవృత్తులకును

ఉద్దీపనము కలిగించునో, అట్టివారినుండి సదా నిన్ను సంరక్షించుకొనుము. కాని, ఎవరిని అసహ్యించుకొనకుము. సాధుత్వమనెడు నిర్మలనదీప్రవాహమునకు జన్మస్థానమగు మంగళమయపురుషునితో నిత్యనివాసము చేయుచు, ఆయన శుభాభిప్రాయమును సిద్ధింపజేయు నుద్దేశముతోనే సర్వత్ర సంచారము చేయుము

వి. ధర్మకాముఁలు దుస్సహవాసము విడిచి, సత్సహవాసమునే చేయవలయునని ఈ శ్లోక మాదేశించుచున్నది.

శ్లో. యస్తు నిశ్శ్రేయసం వాక్యం, మోహా న్న ప్రతిపద్యతే।
స దీర్ఘసూత్రో హీనార్థః, పశ్చాత్తాపేన యుజ్యతే॥ ౫
[మహాభారత, ఉద్యోగపర్వ, ౧౨౩. ౨౩.]

ప. యః, తు, నిశ్శ్రేయసం, వాక్యం, మోహాత్, న, ప్రతిపద్యతే, సః, దీర్ఘసూత్రః, హీనార్థః, పశ్చాత్తాపేన, యుజ్యతే.

టీ. యః తు = ఎవడయితే, నిశ్శ్రేయసం = శ్రేయస్కరమయిన, వాక్యం=వాక్యమును, మోహాత్ =అవివేకమువలన, న ప్రతిపద్యతే = గ్రహింపడో, దీర్ఘసూత్రః = ఆలస్యుడును, హీనార్థః=పురుషార్థహీనుడును (అయిన), సః=అతడు, పశ్చాత్తాపేన=పశ్చాత్తాపముతో, యుజ్యతే=యుక్తుడగుచున్నాడు.

తా. మోహావశమువలన నెవడు హితవాక్యములను గ్రహించి, సత్కార్య నాచరింపడో, అట్టి కర్తజడుడు పురుషార్థమునుండి భ్రష్టుడయి, అనంతరము సంతాపము నొందవలసి వచ్చును.

వ్యా. కల్యాణకరమయిన యుపదేశము నెవరినుండి విన్నను దానిని వెంటనే స్వీకరింపుము. మరభిమానముచే దానిని తిరస్కరింపకుము. నీ కర్తవ్యమును సత్వరముగా నెరవేర్పుము. దీర్ఘసూత్రుడవయి కాలవిలంబము చేయకుము. హితవాక్యములను పెడచెవిని పెట్టుటయు, కర్తవ్య నిర్వహణమునందలసత్వమును అచిరకాలములోనే అనుతాప హేతువు లగును.

వి. ఎచ్చటనుండి వచ్చినను, మంచి యాలోచనను గ్రహింపవలయుననియు, అలసుడుగాక, కర్తవ్యమును యథాకాలముననే నెరవేర్పవలయుననియు ఈ శ్లోక మాదేశించుచున్నది,

శ్లో. సతాం మత మతిక్రమ్య, యోఽసతాం వర్తతే మతే।
శోచంతే వ్యసనే తస్య, సుహృదో న చిరాదివ॥ ౬

[మహాభారత, ఉద్యోగపర్వ, ౧౨౩. ౨౬.]

ప. సతాం, మతం, అతిక్రమ్య, యః, అసతాం, వర్తతే, మతే, శోచంతే, వ్యసనే, తస్య, సుహృదః, న, చిరాత్, ఇవ.

టీ. సతాం మతం = సత్పురుషులయొక్క అభిప్రాయమును, అతిక్రమ్య=అతిక్రమించి, యః=ఎవడు, అసతాం మతే=దుష్టులయొక్క అభిప్రాయానుసారముగా, వర్తతే=ప్రవర్తించుచున్నాడో, సుహృదః=వాని మిత్రులు, న చిరాదివ=శీఘ్రకాలములోనే, తస్య వ్యసనే=వాని విపత్తునందు, శోచంతే=దుఃఖించుచున్నారు.

తా. ఏ పురుషుడు సాధుసత్తముల యభిప్రాయము నతిక్రమించి, అసన్మార్గము నవలంబించునో, అతని మిత్రులు అత డచిరకాలములోనే విపద్గ్రస్తు డగుటను కాంచి శోకింపవలసివచ్చును.

వ్యా. సాధువులయొక్క ఆలోచనను గ్రహింపుము. అసాధువుల ఆలోచనను పరిత్యజింపుము. ఎవరి వాక్యములయందును, కార్యములయందును నిష్కపటమయిన ధర్మనిష్ఠ కనపడుచుండునో, వారే సాధుపురుషులు. సాధుపురుషులయొక్క యుపదేశమును మన్నింపక, కష్టములు తెచ్చిపెట్టుకొని, నీ సుహృద్గణమును శోకాకులులనుగా చేయకుము. కేవలము నీ యైశ్వర్యమును, నీ సుఖభోగములను జూచి, నీతో పాల్గొని సుఖించువారు మాత్రమేగాక, నీకు కష్టములు సంప్రాప్తమయినప్పుడు, నీవు దుఃఖాక్రాంతుడవయినప్పుడు, నీ కష్టపరంపరలో పాల్గొని, నీ దుఃఖమును జూచి దుఃఖించువారే నీకు నిజమయిన హితులు, స్నేహితులు. నీవు దుఃఖములను తెచ్చిపెట్టుకొని, వారిని దుఃఖితులనుగా జేయకుము.

వి. సత్పురుషులయొక్క ఆలోచనను వినకపోవుటవలన అనిష్టము సంభవించుననని, ఈ శ్లోకము నుడువుచున్నది.

శ్లో. అవిసంవాదకో దక్షః, కృతజ్ఞో మతిమానృజుః ।　　౯
కీర్తిం చ లభతే లోకే న చానర్థేన యుజ్యతే ॥　　౭

[మహాభారత, ఉద్యోగపర్వ, ౩౭. ౩౭-౩౭. ౩౧.]

ప. అవిసంవాదకః, దక్షః, కృతజ్ఞః, మతిమాన్, ఋజుః, కీర్తిం, చ, లభతే, లోకే, న, చ, అనర్థేన, యుజ్యతే.

టీ. (ఎవడు) అవిసంవాదకః=వివాదముచేయనివాడును, దక్షః=సమర్థుడును, కృతజ్ఞః=కృతజ్ఞతగలవాడును, మతిమాన్=బుద్ధిమంతుడును, ఋజుః=సరళస్వభావముగలవాడును, (భవతి=అగుచున్నాడో), (వాడు), లోకే=లోకమునందు, కీర్తిం చ=యశస్సును, లభతే=పొందుచున్నాడు. అనర్థేన=అనిష్టముతో, న యుజ్యతే=చేర్చబడడు.

తా. ఎవడు వివాదవిముఖుడో, కార్యదక్షుడో, కృతజ్ఞుడో, బుద్ధిమంతుడో, ఋజువర్తనుడో, అతడు భూమండలమునందు శాశ్వతకీర్తిని గడించును. ఏ యనర్థక కార్యములయందును నియుక్తుడు కాడు.

వ్యా. ఎవరితోను వివాదమును పెట్టుకొనకుము. సర్వసముడగు పరమేశ్వరుని మంగళభావమునే ఆదర్శముగా గ్రహించి, నీ కోపము నుప సంహరించుకొనుము. అందరియెడలను, ప్రేమతోను క్షమాశీలతతోను వ్యవహరించుచు, నీ కర్తవ్యమును సంతోషపూర్వకముగా నెరవేర్పుము. ఇతరులతోడి వ్యవహారమునందు ప్రేమయే నిన్ను నడిపించు సూత్రముగా నుండవలెను. నీ వే పనియందు ప్రవృత్తుడవయినను, దానిని స్థిరభావము తోను, నైపుణ్యముతోను, పట్టుదలతోను నిర్వర్తింపుము. ప్రతి కార్యము నుండియు నీవు కర్తృత్వనైపుణ్యము నభ్యసింపవలయును. అట్లయినయెడల, కార్యములును చక్కగా నెరవేరును, నీ సచ్చరిత్రయు అభివృద్ధినొందును. నీ కుపకారము చేసినవారియెడల, కృతజ్ఞుడవయి యుండుము. ఎవరు ఏ మాత్రము ఉపకారము చేసినను, దాని నెన్నడును విస్మరింపకుము. ఈశ్వరుడు నీ కార్యములయొక్క పరిమాణమును గ్రహించడు. నీ సాధు సంకల్పముయొక్క పరిమాణమును బట్టియే, నిన్ను బహూకరించును. అట్లే, నీకు హితముచేయుటకొరకయి, ఎవరేమాత్రము సంకల్పించినను, వారియెడల, కృతజ్ఞుడవయి యుండుము నీ బుద్ధిని వికసింపజేసికొనుము. సరళస్వభావుడవయి, నీ వాక్యములయందును, కార్యములయందును నిష్కపటముగా వర్తింపుము.

వి. ఈ శ్లోకము సాధుశీలము, త్రికరణశుద్ధి, కృతజ్ఞత మొదలయిన సద్గుణములను స్తవముచేయుచున్నది.

౧౨౪

శ్లో. కుతః కృతఘ్నస్య యశః, కుతః స్థానం కుతః సుఖం।
అశ్రద్ధేయః కృతఘ్నో హి,కృతఘ్నే నాస్తినిష్కృతిః॥ ౮
[మహాభారత, ఉద్యోగపర్వ, ౧౦౬, ౨౦—శాంతిపర్వ, ౧౭౩. ౧౮.]

ప. కుతః, కృతఘ్నస్య, యశః, కుతః, స్థానం, కుతః, సుఖం, అశ్రద్ధేయః, కృతఘ్నః, హి, కృతఘ్నే, న, అస్తి, నిష్కృతిః.

టీ. కృతఘ్నస్య=కృతజ్ఞత లేనివారికి, యశః = కీర్తి, కుతః=ఎచ్చట? స్థానం = ఉనికి, కుతః = ఎచ్చట? సుఖం= సౌఖ్యము, కుతః=ఎచ్చట? కృతఘ్నో హి=కృతఘ్నుడు ప్రసిద్ధముగా, అశ్రద్ధేయః = మర్యాదకు అర్హుడు కాడు. కృతఘ్నే=కృతఘ్నుని విషయమయి, నిష్కృతిః=ప్రాయశ్చిత్తము, నాస్తి=లేదు.

తా. కృతఘ్నునికి యశమెక్కడ, స్థానమెక్కడ? సుఖమెక్కడ? కృతఘ్నుడు గౌరవపాత్రుడు కాడు. కృతఘ్నునికి తరణోపాయము లేదు.

వ్యా. కృతజ్ఞతకు విపరీతభావమే కృతఘ్నత. ఎవడు ఇతరుల వలన ఉపకారమును పొందియు, వారియెడల తన హృదయమునందు

కృతజ్ఞత ననుభవింపడో, ఉపకారమును పొందియు, ఆ యుపకారమును హృదయపూర్వకముగా మన్నింపడో, ఇతరులు చేసిన మహదుపకారమును సహితము తృణీకారభావముతో చూచునో, ఉపకారులయొక్క సమస్త ఉపకారములను విస్మరించి, వారి కపకారము చేయదలంచునో, అట్టి పురుషుని సాధువులు నరాధముడనియు, పరమనీచుడనియు భావింతురు.

వి. కృతజ్ఞతకు విరుద్ధగుణమయిన కృతఘ్నతయొక్క నీచత్వమును కనబరచి, వెనుకటి శ్లోకములో చెప్పిన కృతజ్ఞతనే ఈ శ్లోకము స్తవము చేయుచున్నది.



# ౯ అధ్యాయము



శ్లో. సంవిభక్తా చ దాతా చ, భోగవాన్ సుఖవాన్నరః।
భవత్యహింసకశ్చైవ, పరమారోగ్య మశ్నుతే॥ ౧

[మహాభారత, వనపర్వ, ౨౫౮. ౨౪.]

ప. సంవిభక్తా, చ, దాతా, చ, భోగవాన్, సుఖవాన్, నరః, భవతి, అహింసకః, చ, ఏవ, పరం, ఆరోగ్యం, అశ్నుతే.

టీ. సంవిభక్తా చ=భక్ష్య పేయ పదార్థములు అన్యులకు విభజించి యిచ్చి, తానును వారితోడ భుజించువాడును, దాతా చ=దాతృత్వముగలవాడును, భోగవాన్=అనుభవించెడువాడును, సుఖవాన్=సుఖవంతుడును (అగు), యః నరః=ఏ మనుజుడు, అహింసకః ఏవ చ=హింసచేయనివాడుగాను, భవతి=అగుచున్నాడో, సః=వాడు, పరం=ఆరోగ్యం=విశేషమయిన ఆరోగ్యమును, అశ్నుతే=అనుభవించుచున్నాడు.

తా. ఎవడు తనకుగల భక్ష్యపేయ ద్రవ్యములను ఇతరులకుగూడ పంచియిచ్చి, వారితో కలిసి భుజించి ఆనందించునో, ఎవడు దానశీలుడో, భోగియో, సుఖవంతుడో, అహింసకుడో, అతడు పరమారోగ్యము ననుభవించును.

వ్యా. సమస్త మానవులను పరిపాలించుచు పోషించుచుండెడి పరమేశ్వరుడు ఏయే భక్ష్యములను పేయములను నీకనుగ్రహించి యున్నాడో, వానినెల్లను దల్లితండ్రులు, సోదరీసోదరులు, భార్య, బిడ్డలు బంధువులు, స్నేహితులు, దాసదాసీజనము, మొదలగువారి కందరకును, ఒక్కరిని విడిచిపెట్టక, ప్రతివారికిని వారివారికి తగినట్లుగా పంచి యిచ్చుచు, తా ననుభవింపవలెను. కేవలము తన క్షేమమునే చూచుకొనుచు, ఆశనవసనాదులలో ఆత్మంభరియు, కుక్షింభరియు కాగూడదు. సమస్తమును కేవలము తన భోగముకొరకే పరమేశ్వరుడు తన కిచ్చినాడని భావింప గూడదు తా నవశ్యము పోషింపదగిన బంధుబాంధవులను, ఆశ్రితగణమును న్యాయానుసారముగా పోషించి దుఃఖభారముచే కుంగిపోవుచున్న దీనులను, దరిద్రులను సహితము పోషింపవలెను. తానును ధర్మనిషిద్ధములుగాని సుఖములను భోగములను అనుభవింపవలయును కృపణుడును, విలాసప్రియుడునుగాక ధర్మానుగతములగు సమస్త సుఖభోగములను అనుభవింపుచు, నీ మనస్సును హృదయమును వికాసము నొందించుకొనవలయును. ఎవరిని ద్వేషింపగూడదు, హింసింపగూడదు.

వి. ఈ ౯వ యధ్యాయము ఔదార్యమునుగురించి చెప్పుచున్నది. తన భాతికైశ్వర్యమును తన బంధువులతోను, స్నేహితులతోను, పరిజనుల తోను కలిసి అనుభవింపవలయునని, మొదటి శ్లోకము నుడువుచున్నది

శ్లో. పాత్రస్య హి విశేషేణ, శ్రద్దధానత యైవచ।
అల్పం వా బహు వా ప్రేత్య, దాన స్యావాప్యతే ఫలమ్॥ ౧
[మనుసంహిత VII. ౨౬ ]

ప. పాత్రస్య, హి, విశేషేణ, శ్రద్దధానతయా, ఏవ, చ, అల్పం, వా, బహు, వా, ప్రేత్య, దానస్య, అవాప్యతే, ఫలమ్.

టీ. పాత్రస్య హి విశేషేణ=దానము తీసికొనెడివారి యోగ్యతావిశేషమునుబట్టి, శ్రద్ధధానతయా=దానము చేసెడి వారి శ్రద్ధకు తగినట్లు, అల్పం వా=దాన మల్పమయినను, బహు వా=దాన మధికమయినను, ప్రేత్య=ఈ లోకమునుండి గతించిన తరువాత, దానస్య ఫలం=దానముయొక్క ఫలము, అవాప్యతే=(దాతచే) పొందబడుచున్నది.

తా. దాత తన శ్రద్ధ ననుసరించియు, గృహీతయొక్క పాత్రత ననుసరించియు, దానక్రియయొక్క ఫలమును, అల్పముగనో, అధికముగనో లోకాంతరమునం దనుభవించును.

వ్యా. కొద్దిగానయినను సరే, గొప్పగానయినను సరే, తన కేది ఎంతదానముచేయుట సాధ్యమో, దానిని శ్రద్ధాపూర్వకముగా సత్పాత్రులకు దానముచేయవలయును. దానమువలని పుణ్యఫలము, దాతయొక్క శ్రద్ధను, గృహీతయొక్క పాత్రతను అనుసరించి యుండును. యాచకుల బాధనుండి విడిపించుకొనవలయునను ఉద్దేశముతోను, విసుగుదలతోను ఒసంగబడిన దానము యాచకుల బాధనుండి తప్పించునుగాని, ధర్మముగా పరిగణింపబడదు ఎవరికి దానముచేసినయెడల, సోమరితనమునకును, దుష్కార్యకరణమునకును ప్రోత్సాహము కలిగించునో, అట్టియపాత్రదానము ధర్మానుమోదితము కాదు ఎవడు వాస్తవముగా దారిద్ర్యముచే బాధనొందుచున్నాడో, దాతయొక్క అనుగ్రహమే ఎవనికి ఏకమాత్ర ఆధారమో, అట్టి పురుషుడే నిజమయిన దానార్హుడు. అట్టి సత్పాత్రులకు శ్రద్ధాపూర్వకముగా, యథాసాధ్యముగా దానము చేయుము

వి. ఎట్టి భావముతో దానముచేయవలయునో, ఎట్టివారికి చేయవలయునో ఈ శ్లోకము సూచించుచున్నది. పాత్రతనెరుగని దానమును, అశ్రద్ధతో చేసెడి దానమును, ఇది నిషేధించుచున్నది.

శ్లో. దానా న్న దుష్కరం తాత, పృథివ్యా మస్తి కించన।
అర్థేచ మహతీ తృష్ణా, స చ దుఃఖేన లభ్యతే॥ 3

[మహాభారత, వనపర్వ, ౨౫౯. ౨౯.]

ప. దానాత్, న, దుష్కరం, తాత, పృథివ్యాం, అస్తి, కించన, అర్థే, చ, మహతీ, తృష్ణా, సః, చ, దుఃఖేన, లభ్యతే.

టీ. హే తాత=ఓ తండ్రీ, పృథివ్యాం=భూతలమునందు, దానాత్=దానముకంటె, దుష్కరం=కష్టమయినది, కించన=కొంచెమయినను, నాస్తి=లేదు. అర్థే చ=ధనమునందు, మహతీ తృష్ణా=అత్యాశ (మానవులకు కలదు), స చ=ఆ అర్థమును, దుఃఖేన=అతి కష్టముచేత, లభ్యతే=ఆర్జింపబడుచున్నది.

తా. ఓ సౌమ్యుడా, లోకులకు ధనమునందుగల తృష్ణకు మేరలేదు. అతి కష్టమువలనగాని ధనము సంప్రాప్తము కాదు. కనుక, భూమండలమునందు దానముకంటె దుష్కరమగు కర్మ మరియొకటి లేదు.

వ్యా. ఈ భూమండలమునందు ప్రజలు ధనతృష్ణచే అత్యంత వ్యాకులులయి యున్నారు. ధనధాన్యములును, భాగ్యభోగ్యములును నిజముగా అనాయాసలభ్యములు కావు, విశేష ప్రయాసమువలనను, క్లేశములవలనను సంపాదింపవలసి యున్నవి. కనుక, ఎక్కడ ఏవిధమయిన బలవంతిముగాని, స్వార్థపరత్వముగాని లేదో, అక్కడ అర్థదానము కేవల పరమార్థచింత గలవారికేగాని, ఇతరులకు సాధ్యము కాదు. అందుచేతనే,

దానము కర్మలలోకెల్ల దుష్కరమగు కర్మయని చెప్పబడినది. ఎవడు సర్వలోకబాంధవుడగు పరమేశ్వరుని ప్రియకార్యములను సాధించు నుద్దేశముతో ధనార్జనము చేయుచున్నాడో, ఎవడు కేవలము ధనముకొరకే ధనమును ప్రేమింపడో అట్టి పురుషుడే నిస్స్వార్థభావముగా దానధర్మములను చేసి కృతకృత్యుడగుచున్నాడు

వి. మనుష్య స్వభావములో ధనాశ స్వాభావికముగా నిహితమయి యున్నది. ధనమునందు దోషము లేదు దాని వినియోగమునందే గుణదోషములు కలవు. కష్టార్జితమును ఈశ్వర ప్రీత్యర్థమయి వినియోగించుట, కఠోరసాధనలేక దుస్సాధ్యము. కనుకనే, స్వార్థరహితమగు ధర్మము కొరకు ధనమును ఖర్చుపెట్టుట, చాల కష్టమని ఈ శ్లోకము నుడువుచున్నది.

శ్లో. అన్యాయా త్సముపాత్తేన, దానధర్మో ధనేన యః ।
క్రియతే న స కర్తారం, త్రాయతే మహతో భయాత్ ॥ ౪

[మహాభారత, వనపర్వ, ౨౫౯. 33.]

ప. అన్యాయాత్, సముపాత్తేన, దానధర్మః, ధనేన, యః, క్రియతే, న, సః, కర్తారం, త్రాయతే, మహతః, భయాత్.

టీ. అన్యాయాత్ =అన్యాయమువలన, సముపార్తేన= సంపాదింపబడిన, ధనేన=ధనముచేత, యః దానధర్మః=ఏ దాన ధర్మము, క్రియతే=చేయబడుచున్నదో, సః=ఆ దానధర్మము, కర్తారం = ఆ దాతను, మహతః భయాత్ = (పాపమువలన కలిగెడి) మహాభయమునుండి, న త్రాయతే=రక్షింపదు.

తా. అన్యాయోపార్జితధనముతో నేయే దానధర్మములు చేయబడునో, అవి ఆ దాతను పాపమువలని మహాద్భయమునుండి, రక్షింపజాలవు.

వ్యా. దానముకొరకయినను అన్యాయముగా ధనోపార్జనము చేయగూడదు అట్టి దానమువలన పుణ్యము లభించదు. అంతేకాదు. అన్యాయోపార్జిత ధనదానమువలన, అధర్మజనిత మహాపాపమునందు పతితులయి, పశ్చాత్తాపాగ్నితప్తులయి, విశేషయాతనల ననుభవింపవలసి వచ్చును కనుక, నీవు ధనదానము చేయుట కసమర్థుడ వయితివేని, ఇంకను మిగిలియున్న వివిధోపాయములచే దుఃఖితులయొక్క దుఃఖవిమోచనమును గావింపుము కాని, అన్యాయముగా మాత్రము ధన మెన్నడును ఆర్జింపకుము.

వి. అన్యాయముగా నార్జించిన ధనముతో చేసెడి దానమును ఈ శ్లోకము గర్హించుచున్నది అన్యాయార్జితమువలని పాపఫలమును, ఆ ఆర్జితముతో చేసిన దానము నివర్తింపజాలదు

శ్లో. న్యాయోపార్జిత విత్తేన, కర్తవ్యం జ్ఞానరక్షణం ।
అన్యాయేన తు యో జీవేత్, సర్వధర్మ బహిష్కృతః॥ ౫
[మహాభారత, వనపర్వ.]

ప. న్యాయోపార్జితవిత్తేన, కర్తవ్యం, జ్ఞానరక్షణం, అన్యాయేన, తు, యః, జీవేత్, సర్వధర్మ బహిష్కృతః.

టీ. న్యాయోపార్జితవిత్తేన = న్యాయముగా నార్జించిన ధనముతో, జ్ఞానరక్షణం=జ్ఞానసంరక్షణము, కర్తవ్యం=చేయ దగినది. యః=ఎవడు, అన్యాయేన=అన్యాయముచేత, జీవేత్ = జీవించుచున్నాడో, సర్వధర్మ బహిష్కృతః=(వాడు) సమస్త ధర్మములనుండియు భ్రష్టు డగును.

తా. న్యాయోపార్జిత ధనముతో జీవించుచు, దాన ధర్మములు చేయుచు, కర్తవ్యజ్ఞానమును సంరక్షించుకొనుము. అన్యాయాచరణముచే, నెవడు జీవన నిర్వాహణము చేయునో, అతడు సమస్త ధర్మములనుండియు భ్రష్టుడగును.

వ్యా. తన జీవన నిర్వాహణముకొరకయినను, తా నవశ్యము పోషింపవలసిన పరివారమును సంరక్షించు నిమిత్తమయినను, అన్యాయముగా ధనమును సంపాదింపగూడదు. అధర్మాచరణమువలన క్షణభంగుర

మయిన ఈ నశ్వర శరీరమును పోషించుకొనుటకంటె, న్యాయాన్యాయ వివేచనకొరకు పరమేశ్వరు డే నైతిక జ్ఞానమును మనకు ప్రసాదించి యున్నాడో, తదనుసారముగా జీవితమును గడుపుట శ్రేష్ఠము అన్యాయాచరణమూలక జీవితమే వాస్తవమయిన మృత్యువు ధర్మజీవితమువలన మరణము తటస్థించినను, ఆ మరణమే నిజమయిన జీవితము

వి. అన్యాయార్జితమువలని దోషమును ఈ శ్లోకము ఇంకను ప్రతిపాదించుచున్నది. తన కుటుంబమును పోషించుకొనుటకయినను, తన ప్రాణరక్షణమునకయినను, అధర్మముగా ధన మార్జింపగూడదు. ఆధ్యాత్మిక మరణముకంటె శారీరిక మరణము మేలు.

శ్లో. శక్త్యాన్నదానం సతతం, తితిక్షా ధర్మనిత్యతా ।
యథార్హం ప్రతిపూజా చ, సర్వభూతేషు వై సదా॥ ౬
[మహాభారత, వనపర్వ, ౨౦౬. ౪౦.]

ప. శక్త్యా, అన్నదానం, సతతం, తితిక్షా, ధర్మనిత్యతా, యథార్హం, ప్రతిపూజా, చ, సర్వభూతేషు, వై, సదా.

టీ. శక్త్యా = శక్త్యనుసారముగా, సతతం = ఎల్లప్పుడు, అన్నదానం=అన్నదానమును, తితిక్షా=సుఖదుఃఖాది ద్వంద్వ సహనమును, ధర్మనిత్యతా = నిత్యమును ధర్మానుష్ఠానమును, యథార్హం వై=యథాయోగ్యముగా, సర్వభూతేషు=సమస్త

భూతములయందును, సదా=ఎల్లప్పుడు, ప్రతిపూజా చ=ఆదరణ భావమును (ఈ సమస్తమును ఆచరింపదగినది.)

తా. శక్త్యనుసారముగా సదా అన్నదానము చేయవలయును. సహిష్ణుత నవలంబింపవలయును. నిరంతరము ధర్మ కార్యముల నాచరింపవలయును. అందరియెడలను, యథోచిత సమాదరమును చూపవలయును.

వ్యా. మనుష్యులే బాధలనయినను సహింపగలరుగాని, క్షుద్బాధను మాత్రము సహింపజాలరు. ప్రపంచమునందలి ఎన్నెన్ని విధముల దుఃఖములనయినను ఓర్చుకొని వారు జీవింపగలరు కాని, అన్నమే లేని యెడల, అచిరకాలములోనే మృత్యుముఖమున పడిపోవుదురు. కావున, క్షుధార్తులకు అన్నదానము చేయుటయే ప్రథమ కర్తవ్యము. ఈశ్వరుడే యుద్దేశముతో పరస్పర విరుద్ధములగు వేసవికాల శీతాకాలములను సృష్టించియున్నాడో, ఆ యుద్దేశముతోనే, సుఖదుఃఖములను, సంపద్విపత్తులను ప్రేరణచేయుచున్నాడు. కనుక, ఇట్టి ద్వంద్వములను ఓర్పుతో ననుభవించుట కభ్యసింపవలయును. సహిష్ణుత నభ్యసించినయెడల, ఏది సేవ్యమో, ఏది త్యాజ్యమో వాని భేదమును తెలిసికొనుటకు సమర్థత కలుగును. దేనికి ప్రతివిధానము చేయగలమో, దానికి ప్రతివిధానము చేయుటకును సామర్థ్యము కలుగును. ఏది అనుల్లంఘనీయమో, దానిని విశేష క్లేశము లేకనే అనుభవింపగలుగుదుము. అనుదినమును ఈశ్వరారాధన చేయుము నిత్యమును కల్యాణకరమయిన ధర్మమును సంచయముచేయుము.

పెద్దలు నీయెడల చూపెడు ప్రేమకు ప్రతిఫలముగా వారిని గౌరవింపుము. నిన్ను ప్రేమించెడు స్నేహితులను నీవును ప్రేమింపుము ప్రేమాస్పదులగు వారు నీయెడల చూపెడు ప్రేమకు బదులు నీవును స్నేహభావమునే కనబరచుము. నిన్ను ప్రేమించువారియెడల మాత్రమేగాక, నిన్నుదాసీన భావముతో చూచువారియెడల సహితము సమాదరభావమును కనబరచుము. ఇదే నిజమయిన యాదరణ

వి. క్షుధార్తుల కన్నదానము మొదలయిన సుగుణము లీశ్లోకము నందు మెచ్చుకొనబడినవి.

శ్లో. దేయ మార్తస్య శయనం, పరిశ్రాంతస్య చాసనమ్ ।
తృషితస్య చ పానీయం, క్షుధితస్య చ భోజనమ్॥ ౭
[మహాభారత, వనపర్వ, అ. ౨౪.]

ప. దేయం, ఆర్తస్య, శయనం, పరిశ్రాన్తస్య, చ, ఆసనం, తృషితస్య, చ, పానీయం, క్షుధితస్య, చ, భోజనమ్.

టీ. ఆర్తస్య=రోగపీడితునకు, శయనం=పడకను, పరిశ్రాంతస్య=బడలిక చెందినవానికి, ఆసనం=ఆసనమును, తృషితస్య=దప్పిగొనినవానికి, పానీయం చ=జలమును, క్షుధితస్య=ఆకలిగొనినవానికి, భోజనం చ=భోజనమును, దేయం=ఇయ్యదగినది.

తా. దానముచేయునప్పుడు ఎవరికేది యవసరమో దానినే దానముచేయవలయును. రోగికి శయ్యను, అలసిన వాని కాసనమును, తృష్ణార్తునకు పానీయమును, క్షుధార్తునకు భోజనమును ఇయ్యవలయును.

వ్యా. ఎవరికేది యావశ్యకమో, వారికి దానినే యిమ్ము. ఇట్టి సమయోచిత దానమువలననే, గృహీత యథార్థమయిన ఉపకారమును పొందును దాత ద్విగుణీకృత ఫలము నొందును కనుక, ఎవరి కేది యావశ్యకమో, వారి కట్టిదానినే దానముచేయుము పరమేశ్వరుడుగూడ సమస్త ప్రాణిజాతమునకును ఈ విధముగనే దానముచేయుచున్నాడు.

వి. ధర్మము ఒకటే విధము కాదనియు, క్షుధార్తున కన్నమును, తృషితార్తునకు పానీయమును, పరిశ్రాంతున కాసనమును, రోగార్తునకు శయ్యను, ఇచ్చుట మొదలయిన అనేకవిధముల దానధర్మములు చేయవచ్చునని యు, ఈ శ్లోకము చెప్పుచున్నది.

శ్లో. అన్నదగ్ సుఖ మాప్నోతి, సుతృప్తగ్ సర్వవస్తుషు ।
భూమిదానాత్ పరం నాస్తి, విద్యాదానం తతోధికమ్॥ ౮
[సంవర్త సంహిత, ౮౦.]

ప. అన్నదః, సుఖం, ఆప్నోతి, సుతృప్తః, సర్వవస్తుషు, భూమిదానాత్, పరం, న, అస్తి, విద్యాదానం, తతః, అధికమ్.

టీ. సర్వవస్తుషు = అన్ని వస్తువులలోను, అన్నదః= అన్నదానము చేసెడివాడు, సుతృప్తస్సన్=మంచితృప్తి కలిగిన వాడయి, సుఖం=సౌఖ్యమును, ఆప్నోతి = పొందుచున్నాడు. భూమి దానాత్=భూమి దానముకంటె, పరం = శ్రేష్ఠమయి నది, నాస్తి=లేదు. విద్యాదానం=విద్యాదానము, తతః=దాని కంటెను, అధికమ్=ఎక్కువయినది.

తా. అన్నదానము చేయువాడు, మిగిలిన సమస్త వస్తువులను దానము చేయువానికంటె, సుతృప్తుడును, సుఖ వంతుడును అగును. భూదానము శ్రేష్ఠము. విద్యాదాన మంతకంటెను ఉత్కృష్టము.

వ్యా దానము చేయదగినది ధనమొక్కటే యనుకొనకుడు అన్నదానము దాతను, ప్రతిగృహీతను ఉభయులను వెంటనే పరమసం తృప్తులనుగా జేయును. భూదానము చిరస్థాయియు, అక్షయమును అగు టచే, అంతకంటెను మహత్తరమయినది. దాతకును, గృహీతకును ఐహిక పారత్రిక మంగళముల నొసంగగల విద్యాదానము అన్ని దానముల లోను శ్రేష్ఠతమము.

వి. భూదానము శ్రేష్ఠమనియు, విద్యాదానము సర్వశ్రేష్ఠ మనియు ఈ శ్లోకము చెప్పుచున్నది.

శ్లో. ఔషధం పథ్యమాహారం, స్నేహాభ్యంగం ప్రతిశ్రయం।
దానా న్యేతాని దేయాని, హ్యన్యాని చ విశేషతః।
దీనాంధ కృపణాదిభ్యః శ్రేయస్కామేన ధీమతా॥ ౯
[సంవర్త సంహిత, ౧౩.]

ప. ఔషధం, పథ్యం, ఆహారం, స్నేహాభ్యంగం, ప్రతిశ్రయం, దానాని, ఏతాని, దేయాని, హి, అన్యాని, చ, విశేషతః, దీనాంధ కృపణాదిభ్యః, శ్రేయస్కామేన, ధీమతా.

టీ. శ్రేయస్కామేన = శ్రేయమును కాంక్షించు, ధీమతా=బుద్ధిమంతునిచేత, ఔషధం = ఔషధము, పథ్యం=పథ్యము, ఆహారం=ఆహారము, స్నేహాభ్యంగం=తైలాభ్యంగము, ప్రతిశ్రయం=గృహము, ఏతాని దానాని చ=ఈ దానములను, విశేషతో హి = విశేషముగా, అన్యాని చ=ఇతర దానములను, దీనాంధ కృపణాదిభ్యః = దీనులకు గుడ్డివారికి, దయాపాత్రులకు, దేయాని=ఇయ్యదగినవి.

తా. శ్రేయోభిలాషియగు ధీమంతుడు దీనులు, అంధులు, మొదలయిన కృపాపాత్రులకు ఔషధము, పథ్యము, ఆహారము, తైలాభ్యంగము, నివాసస్థానము మొదలయిన వానిని, ఇంకను ఇతరమయిన దానములను ఇయ్యవలయును.

వ్యా అపాత్రునకు దానము చేయకుము. ఎవరికి దానము చేసిన యెడల, దానిని వారు సద్వినియోగముచెయక మద్యాద్యపారములయందు నియోగింతురో అట్టివారికి దాన మియ్యకుము ఎవరు కష్టపడుట కసమర్థులో, ఎవరికి దానమును గ్రహించుటకంటె వేరు జీవనోపాయము లేదో, ఎవరు తమ స్వశక్తివలన దారిద్ర్యకష్టములనుండి విముక్తినొందుటకును, కుటుంబపోషణము చేసికొనుటకును సమర్థులు కారో, అట్టివారికి యథాయోగ్యముగా దానమిచ్చి, ని దానమును సార్థకము చేసికొనుము.

వి. ఈ శ్లోకమును ఇంకను కొన్ని విధములయిన ధర్మములను, దానయోగ్యులను వివరించుచున్నది నిజమయిన దీనులకే దానమియ్యవలయునని చెప్పుచు, అపాత్ర దానమును నిషేధించుచున్నది

శ్లో. శక్తః పరజనే దాతా, స్వజనే దుఃఖజీవిని ।
మధ్వాపాతో విషాస్వాదః, స ధర్మప్రతిరూపకః॥　౧౦
[మనుసంహిత, ౧౧. ౯ ]

ప. శక్తః, పరజనే, దాతా, స్వజనే, దుఃఖజీవిని, మధ్వాపాతః, విషాస్వాదః, సః, ధర్మప్రతిరూపకః.

టీ. స్వజనే=అవశ్యము తాను పోషింపవలసిన పితృమాత్రాదిజనము, దుఃఖజీవిని సతి=కష్టజీవులగుచుండగా, శక్తః= దానముచేయశక్తిగల (ఏ జనుడు), పరజనే=సంబంధులుకాని

ఇతరజనమునందు, దాతా=దాతయయి యుండునో (వాని యొక్క ఆ దానవిశేషము), ధర్మప్రతిరూపకః=ధర్మముయొక్క మారువేషము (అగుచున్నది, నిజమయిన ధర్మము కాదు.) యతః=ఏ కారణమువలన, మధ్వాపాతః=మధురోపక్రమము గలదియును, విషాస్వాదః=విషమే ఉత్తరఫలముగాగలదియును అగునో, (ప్రథమమున యశస్కరమును, తరువాత అపకీర్తి కరమును అగుటచే) అట్టి ధర్మము చేయగూడదు.

తా. దాన సమర్థుడగు నే దాత, భార్యాపుత్రాది స్వజనము కష్టము ననుభవించుచుండగా, వారిని నిర్లక్ష్యము చేసి, ఇతరులకు దానముచేయునో, ఆ దాతయొక్క దానము ధర్మవేషధారియేగాని, నిజమయిన ధర్మము కాదు. అదియుయశ స్కరమగుటచే, ప్రథమమున మధువువలె మధురమయి యున్నను, పరిణామమునందు విషతుల్య మగును.

వ్యా. దానముచేయుటకు సమర్థుడగువాడు ముందుగా తాను ముఖ్యముగా పోషింపదగిన తన తలిదండ్రులను, భార్యను, బిడ్డలను, దగ్గర బంధువులను పోషించి వారి కష్టముల నన్నిటిని తీర్చవలయును. ఎవడు అట్టివారి నుపేక్షచేసి, ఇతరులకు దాన మిచ్చుటకు ప్రవృత్తుడగునో, అతని దానము యథార్థమయిన ధర్మానుష్ఠానము కాదు. అది ధర్మముయొక్క

మారువేషము. అది యశస్కరమగుటచే మధురమగు ఉపక్రమముగలదియు, విషమయమగు ఉత్తరఫలము కలదియు నగును గృహస్థు ముందుగా వృద్ధులగు తన తలిదండ్రులను, భార్యను, బిడ్డలను, ఇంకను భరణయోగ్యులగు నితరులను సంరక్షింపవలయును వారికిగల అభావముల నన్నిటిని తీర్చవలయును. వారి బాధలను నివృత్తిచేయవలయును అట్టివారి నందర నుపేక్షించి, తన ధర్మమును ప్రకటన చేసికొన నిశ్చయించువాడు, తన కర్తవ్య ధర్మమును నెరవేర్చనవాడు కాడు.

వి. దగ్గిర బంధువుల యవసరములను తీర్చక, లోకముయొక్క మెప్పునకయి, ఆడంబరముతో చేయు దానమును ఈ శ్లోకము నిరసించుచున్నది. అది పేరుప్రతిష్ఠలకు చేయబడునది గాన, దాన మనిపించుకొనదు.



# ౧౦ అధ్యాయము



శ్లో. ప్రజ్ఞయా మానసం దుఃఖం, హన్యాత్ శారీర మౌషధైః।
న శోచన్తి కృతప్రజ్ఞాః, పశ్యంతః పరమాం గతిం॥ ౧

[మనుసంహిత]

ప. ప్రజ్ఞయా, మానసం, దుఃఖం, హన్యాత్, శారీరం, ఔషధైః, న, శోచన్తి, కృతప్రజ్ఞాః, పశ్యన్తః, పరమాం, గతిమ్.

టీ. ప్రజ్ఞయా=జ్ఞానముచేత, మానసం దుఃఖం=మనో దుఃఖమును, ఔషధైః=ఔషధములచేత, శారీరం దుఃఖం= శరీరదుఃఖమును, హన్యాత్ = హతముచేయవలయును. కృత ప్రజ్ఞాః=సంస్కరింపబడిన బుద్ధిగలవారలు, పరమాంగతిం= పరమగతిని, పశ్యంతః=చూచుచున్నవారలయి (అనుభవించు చున్నవారలయి), న శోచన్తి=దుఃఖింపరు.

తా. జ్ఞానార్జనముచే మానసిక దుఃఖమును, ఔషధ సేవచే శారీరిక సంతాపమును ఉపశమింపజేసికొనవలయును.

ప్రజ్ఞావంతులు రాబోవు పరమగతిని ప్రతీక్షించుచు, తాత్కాలిక దుఃఖమునకు వశులు కారు.

వ్యా. శారీరక రోగములు తటస్థించినప్పుడు, ఔషధములద్వారమున నెట్లు నివారణ చెసికొందుమో, అట్లే, మానసిక దుఃఖములు తటస్థించినప్పుడు, పరమగతియగు నా పరమేశ్వరుని స్మరించి, వానికి ప్రతీకారము చెసికొనవలయును. ఎల్లప్పుడును వివేకముతో కూడినవాడెయి, పరమార్థము విచారమునందు ప్రవర్తింపవలెను పరివర్తనశీలమగు ఈ వర్తమానావస్థయందే సుఖశాంతులు కనుగొనవలెనని యాశింపకుము ఈ భూమండలము మనకు శిక్షణస్థానమేగాని, నిత్యసుఖభోగములకు నిలయము కాదు. పరమేశ్వరు డొక్కడే నిత్యసుఖమునకును, నిత్యశాంతికిని ఆలయము. అతడే మనకు శ్రేష్ఠమయిన లోకము. అతడే మన పరమగతి. అతడు మనకదృశ్యుడయి యున్నను, మన సమీపమునందే యుండి, మన సర్వావస్థలను చూచుచున్నాడు మనకు మంగళమగునుగాక! ఇదే ఆయనయొక్క ఏకమాత్ర ఇచ్ఛ ఏ యుపాయమువలన మనకు సద్గతి కలుగునో, దానిని ఆయన యెరుగును మన మంగళముకొరకు ఆయన విధించు విధానమును అన్యథా మార్చుట కెవ్వరును సమర్థులు కారు. బిడ్డలు దుఃఖాక్రాంతులయి యుండగా, చూచి, తండ్రి ఉదాసీనభావముతో నూరకుండగలడా? మన యీ వర్తమానావస్థ సర్వజ్ఞుడగు ఆయనకు తెలియకనే మనకు తటస్థించినదా? అపరివర్తనీయమును అమోఘమును అగు ఆయన మంగళేచ్ఛ క్రియారహితమయి నేడు స్తభించియున్నదా? అట్లెన్నడును కాదు. మనము కేవలము మోహాక్రాంతులమయి, శోకముచె దుఃఖముచె అభిభూతుల మగుచున్నాము. కనుక, ఈ యావత్తు దృష్టిని, వర్తమానస్థితి

యందే నిబద్ధము చేయకుము. భావికల్యాణమునకయి, ప్రతీక్షించు చుండుము. ఆ పరమగతినే స్మరించుచు, వర్తమాన మానసిక దుఃఖములకు లోనుగాకుము.

వి. ఈ పదవ అధ్యాయము ఆత్మసంయమముయొక్క విలువను స్తవము చేయుచున్నది. నిజమయిన జ్ఞానమే ఆత్మసంయమమునకు పునాది యని, ఈ మొదటి శ్లోకము చెప్పుచున్నది. సమస్త శారీరక రోగములును ఔషధమువలన నెట్లు నివారణ మగునో, అట్లే, సమస్త మానసిక రోగము లును జ్ఞానమువలన నివారణ మగును

శ్లో. మానం హిత్వా ప్రియో భవతి, క్రోధం హిత్వా న శోచతి॥
కామం హిత్వాఽర్థవాన్ భవతి, లోభం హిత్వా సుఖీ
భవేత్ ॥ ౧

[మహాభారత, వనపర్వ, ౩౧౨ ౭౬.]

ప. మానం, హిత్వా, ప్రియః, భవతి, క్రోధం, హిత్వా, న, శోచతి, కామం, హిత్వా, అర్థవాన్, భవతి, లోభం, హిత్వా, సుఖీ, భవేత్.

టీ. మానం = స్వాభిమానమును, హిత్వా = త్యజించి, ప్రియః=అందరికిని ప్రియుడు, భవతి=అగుచున్నాడు. క్రోధం= కోపమును, హిత్వా=విడిచి, న శోచతి=దుఃఖింపడు. కామం=

కోరికను, హిత్వా=విడిచి, అర్థవాన్=ధనవంతుడు, భవతి= అగుచున్నాడు. లోభం = లోభత్వమును, హిత్వా = విడిచి, సుఖీ=సుఖముగలవాడు, భవేత్ =అగును.

తా. అభిమానమును విడిచి, అందరికిని ఇష్టుడవు కమ్ము. క్రోధమును పరిత్యజించి శోకవిరహితుడవు కమ్ము. కామమును పరిహరించి, భాగ్యవంతుడ వగుము. లోభమును వదిలి సుఖవంతుడ వగుము.

వ్యా. అహంకారమును విడువుము ఈశ్వరానుగ్రహామే మానవుని సమస్తైశ్వర్యమునకును మూలము. అదే లేనియెడల, మనుష్యున కేమియు నుండదు నీకు గల ధన మాన సౌందర్యములకొరకుగాని, జ్ఞానధర్మముల కొరకుగాని, మరి దేనికొరకుగాని, మానవసమక్షమున గర్వమును కనబరపకుము హృదయమునందయినను, గర్వమునకు స్థాన మియ్యకుము గర్వ మారంభమయినదని, నీ హృదయమునం దేమాత్రపు సూచనలు కనపడినను, పతనము సమీపించుచున్నదని గ్రహించి, వెంటనే ఈశ్వరునకు శరణాగతుడ వగుము మంగళమయుడగు పరమేశ్వరుడు తన గర్వితపుత్రుని వినమ్రునిగా జేయుటకు, అతని యహంకారమును చూర్ణము చేయును. తోడి మానవులును అతనిని నిందింతురు. క్రోధముచే ప్రమత్తుడవయి, నీ వితరులను ప్రతిహింసించి, పగ సాధింప దలతువేని, తరువాత నీవు పశ్చాత్తాపాగ్నిచే దగ్ధుడవు కావలసి వచ్చును కనుక, క్రోధమును పరిత్యజించి, శోకమునుండి విముక్తుడవు కమ్ము కోరికలు పెరిగినకొలదిని, మన

యభావముల జ్ఞానము సహితము పెరుగుచుండును ఎవడు ధనోపార్జనము యొక్క నిజోద్దేశమును విస్మరించి, కేవలము ధనతృష్ణను తృప్తి నొందించుకొనుటకొరకే, ధనార్జనమునందు ప్రవృత్తుడగునో, అతడు నిత్యదరిద్రుడు, నిత్య దుఃఖితుడు. కనుక, ఎవడు కోరికలను జయింపగలుగునో, అతడే నిజమయిన భాగ్యవంతుడు ఎవడు ఆశను వశపరచుకొనునో, అతడే నిజమయిన సుఖవంతుడు

వి. ఇది నిజమయిన ఆత్మసంయమము నలవరచుకొనుటకు వలయు సాధనను నిరూపించుచున్నది కోరికలు విడుచుటవలన, మానవుడు నిజముగా భాగ్యవంతుడును, సుఖవంతుడును అగుననియు, గర్వమును విడిచి, అందరికిని ప్రియుడగుననియు, క్రోధమును విడిచి, సమస్త దుఃఖముల నుండియు విముక్తుడగుననియు, ఈ శ్లోకము నుడువుచున్నది.

శ్లో॥ క్రోధః సుదుర్జయః శత్రుః, లోభో వ్యాధి రనంతకః।
సర్వభూతహితః సాధుః, అసాధు ర్నిర్దయః స్మృతః॥ 3
[మహాభారత, వనపర్వ, ३౧౨. ౯౨ ]

ప. క్రోధః, సుదుర్జయః, శత్రుః, లోభః, వ్యాధిః, అనంతకః, సర్వభూతహితః, సాధుః, అసాధుః, నిర్దయః, స్మృతః.

టీ. క్రోధః=కోపము, సుదుర్జయః=జయించుటకు దుర్లభమయిన, శత్రుః=శత్రువు. లోభః=లోభము, అనంతకః=అంత

ములేని, వ్యాధిః=రోగము. సర్వభూతహితః=సమస్త భూతము లకును ఇష్టుడయినవాడు, సాధుః=సాధువు. నిర్దయః=దయాశూన్యుడు, అసాధుః=సాధువుగాడని, స్మృతః=స్మృతికర్తలచేత చెప్పబడుచున్నది.

తా. క్రోధము జయింపరాని శత్రువు, లోభ మొక తీరని వ్యాధి. సర్వభూతహితరతుడే సాధుపురుషుడు. నిర్దయు డెవ్వడో అతడే అసాధుపురుషుడు, అని చెప్పబడినది.

వ్యా. క్రోధమువంటి హానికరమయిన శత్రువు మరియొకడు లేడు. లోభమువంటి బాధకరమగు రోగమును లేదు క్రోధలోభముల నుండియే క్రౌర్యము జనించును క్రౌర్యము, మానవుని, సాధుభావము నుండి భ్రష్టుని చేయును క్రోధము అన్యునికి బాధను కలిగించుటకు ప్రేరేపించును లోభము స్వోత్కర్షతాదేవతయొక్క వేదికమీద సమస్త సాధుభావములను బలిగా నర్పింప ప్రోత్సహించును హత్య, చౌర్యము మొదలయిన ఘాతుక నేరములు క్రోధలోభములవలననే చేయబడుచున్నవి. కనుక, క్రోధలోభములను జయించి, అందరియెడలను దయావంతుడవు కము.

వి. క్రోధలోభములు దుర్ధర్ష స్వభావముగల అంతశ్శత్రువులు, బాహ్యశత్రువుల నెందరినయిన జయింపవచ్చునుగాని ఈఅంతశ్శత్రువుల జయించుట దుర్లభము ఇవి ఆత్మసంయమమునకు ప్రబలశత్రువులు. కనుక, వీని నెట్లయిన జయించి తీరవలయును.

శ్లో. దాంతః శమపరః శశ్వత్, పరిక్లేశం న విందతి।
న చ తప్యతి దాంతాత్మా, దృష్ట్వా పరగతాం శ్రియం॥౪

[మహాభారత వనపర్వ, ౨౫౭. ౨౩.]

ప. దాన్తః, శమపరః, శశ్వత్, పరిక్లేశం, న, విందతి, న, చ, తప్యతి, దాన్తాత్మా, దృష్ట్వా, పరగతాం, శ్రియం.

టీ. దాంతః=(ఎవడు) జితేంద్రియుడును, శమపరః=వశమయిన మనసుగలవాడును (అగుచున్నాడో, అతడు) శశ్వత్=మరల మరల, పరిక్లేశం=వ్యసనమును, న విందతి=పొందడు. దాంతాత్మా=వశీకృతమయిన అంతఃకరణము కలవాడు, పరగతాం శ్రియం=అన్యులకుగల సంపత్తును, దృష్ట్వా=చూచి, న చ తప్యతి=దుఃఖింపడు.

తా. ఎవడు ఇంద్రియములను, అంతఃకరణమును నియమమునం దుంచుచున్నాడో, అతడు మాటిమాటికి క్లేశమును పొందడు. శాంతచిత్తుడగు పురుషుడు ఇతరుల సంపత్తును జూచి సంతప్తచిత్తుడు గాడు.

వ్యా. అనుదినమును నిన్ను నీవు శిక్షణము నొందించుకొనుము, నిన్ను నీవు శాసించుకొనుము, ధర్మపరాయణుడవు కా ప్రయత్నింపుము. ఎవడు తన యింద్రియములను, అంతఃకరణమును వశము చేసికొనగలుగునో అతడు దుఃఖ మనుభవింపవలసిన యవసరముండదు. ఎవడు తన యింద్రియములను నిగ్రహింపజాలడో, అతనిని నలుపార్శ్వములనుండియు బాధలు వచ్చి యలముకొనును అతడు కేవలము తన దుఃఖమువలననే దుఃఖితుడు కాడు. ఇతరుల సౌభాగ్యముకూడ అతని మనోవేదనకు హేతువగును

వి. ఈ శ్లోకము జితేంద్రునియొక్క స్థితిని వర్ణించుచున్నది. ద్రియములను వశపరచుకొనినవాడు నిత్యశాంతిని పొందును.

శ్లో. య ఈర్ష్యుః పరవిత్తేషు, రూపే వీర్యే కులాన్వయే ।
　　సుఖసౌభాగ్యసత్కారే, తస్య వ్యాధి రనంతకః॥　　౫

[మహాభారత, ఉద్యోగపర్వ, ౩౪. ౪౩.]

ప. యః, ఈర్ష్యుః, పరవిత్తేషు, రూపే, వీర్యే, కులాన్వయే, సుఖసౌభాగ్యసత్కారే, తస్య, వ్యాధిః, అనంతకః.

టీ. పరవిత్తేషు=పరుల ధనమునందును, రూపే=రూపమునందును, వీర్యే=శౌర్యమునందును, కులాన్వయే=శ్రేష్ఠవంశపరంపరయందును, సుఖసౌభాగ్యసత్కారే = సుఖసౌభాగ్య

సత్కారములయందును, యః=ఎవడు, ఈర్షుః=ఓర్వలేనివాడయి యున్నాడో, తస్య వ్యాధిః=వాని వ్యాధి, అనంతకః=అంతములేనిది.

తా. ఇతరుల ధనమును, రూపమును, వీర్యమును, వంశమును, సంతానమును, సుఖమును, సౌభాగ్యమును, సత్కారములను చూచి, ఎవడు అసూయాపరవశు డగుచున్నాడో, అతని రోగమున కంతములేదు.

వ్యా. ఇతరుల కలిమి జూచి ఓర్వలేకపోవుటకంటె అసహ్యకరమయిన వ్యాధి మరియొకటి లేదు ఇతరుల శుభమును జూచి యోర్వలేనివానికి మనశ్శాంతి యుండదు, విశ్రాంతి యుండదు. ఈ ప్రపంచమునం దెవరెవరు ఉన్నతపదవుల నార్జించి, సుఖముల ననుభవింపుచుందురో, వారు తమకు తెలియకనే, ఈర్ష్యాగ్రస్తుల హృదయములయందు వేదనను కలిగింతురు ఎట్టి యౌన్నత్యము నొందినవారయినను, అసూయాపరులకు శత్రుతుల్యులుగా గానుపింతురు. కావున విశుద్ధప్రేమ ద్వారమున ఔదార్యము నభివృద్ధి నొందించుకొని, అసూయను జయించుము సమస్తమానవకల్యాణమునందును, నీ కల్యాణ మిమిడియున్నదని తెలిసికొని, సర్వవిధములయిన నీచభావములను పరిహరింపుము

వి. ఈ శ్లోకము హేయమగు అసూయను నిందించుచున్నది. అసూయాగ్రస్తునకు మనశ్శాంతి యుండదు. అత డందరి యైశ్వర్యమును జూచి శోకించుచుండును. తెవులులేని వేదన ననుభవించును

శ్లో. మిత్రధ్రుక్ దుష్టభావశ్చ, నాస్తికోఽథాన్‌ఋజు శ్శఠః।
గుణవంతం చ యో ద్వేష్టి,తమాహుః పురుషాధమమ్॥౬

[మహాభారత, ఉద్యోగపర్వ, ౧౩౭ ౭ ]

ప. మిత్రధ్రుక్, దుష్టభావః, చ, నాస్తికః, అథ, అన్‌ఋజుః, శఠః, గుణవన్తం, చ, యః, ద్వేష్టి, తం, ఆహుః, పురుషాధమమ్.

టీ. మిత్రధ్రుక్=మిత్రద్రోహియును, దుష్టభావః=దుష్టస్వభావము గలవాడును, నాస్తికశ్చ=నాస్తికుడు (జగత్తునకు ఆధారమయిన ఆత్మయే లేదనియు, పరలోకము లేదనియు చెప్పువాడు)ను, అథ=మరియు, అన్‌ఋజుః=కుటిలుడును, శఠః= మూర్ఖుడును, గుణవంతం చ యః ద్వేష్టి=గుణవంతుని ద్వేషించువాడును, తం=అయినటువంటి మానవుని, పురుషాధమం= (పండితులు) మానవులలో అధముడని, ఆహుః=చెప్పిరి.

తా. మిత్రద్రోహి, దుష్టస్వభావుడు, నాస్తికుడు, కుటిలవర్తనుడు, మూర్ఖుడు, గుణవంతులను ద్వేషించువాడు, ఇట్టి పురుషుని, జ్ఞానులు నరాధము డందురు.

వ్యా. మిత్రునియెడల విశ్వాసఘాతకు డగుటయు, ముందాయనకు విశ్వాసమును కలిగించి, ఆయన మనోభావముల నన్నిటిని గ్రహించి, తరువాత తన దురుద్దేశమును కొనసాగించుకొనుటయు, పరోక్షముగా గాని, అపరోక్షముగా గాని, ఆయన కనిష్టముచేయ ప్రయత్నించుటయు, మిత్రద్రోహమనబడును మిత్రద్రోహ మహాపాతకమునుండి, సర్వదా దూరమునందుండుము

మనస్సునందు ప్రచ్ఛన్నముగా దాగియున్న దురుద్దేశమునకే, దుష్టభావమని పేరు దురుద్దేశమువలనను, దుష్టభావము వలనను, సత్కార్యము లెన్నడును చెయబడవు ఈశ్వరునియెడల, శ్రద్ధాభక్తుల నెన్నడును గోల్పోకుము ఆయనయం దవిశ్వాసమును సంశయమును పాపముకంటెను అధికతర భయానకములు ఎవడు పాపమునకు దండనను, పుణ్యమునకు పురస్కారమును విధానముచేసి ముక్తిమార్గమునందు నేతయయి యున్నాడో, అట్టి పరమేశ్వరుని యెడల శ్రద్ధాభక్తులు లేకపోవుటయు, సంశయము జనించుటయు, ప్రాణహానికరములగు రోగములని తెలిసికొని, వినమ్రులయి, మహాత్ములయొక్కయు, సాధుపురుషులయొక్కయు, సాహాయ్యముచే, ఆ వ్యాధినుండి విముక్తులగుటకు ప్రయత్నింపవలయును.

సదా, సరళభావయుక్తులయి యుండుడు. సరళహృదయమే స్వయముగా నొక అసామాన్యసద్గుణము అనేక సద్గుణములు సరళత్వముయొక్క నిత్యసహచరులు. సరళత్వము నిలుపుకొన గలిగినయెడల, ఆ సద్గుణములును నిలుచును. సరళత్వమే లోపించినయెడల, ఆ సద్గుణములును లోపించును

సమక్షమున స్నేహభావము జూపుచు పరోక్షమున అనిష్టముచేయ ప్రయత్నించువానిని శఠుడందురు. శఠత్వమును సంపూర్ణముగా పరిత్యజించి, సర్వదా, సమస్త మానవసంఘముయొక్కయు హితమునే కాంక్షించుచు, హితమునే ఆచరింపుము

పరమేశ్వరునియొక్క పరిపూర్ణ మంగళభావమునుండియే, సమస్త సద్గుణములును ఉత్పన్నములగుచున్నవి కావున, సద్గుణములను ద్వేషించిన యెడల ఈశ్వరుని ద్వేషించినట్లే. సద్గుణసంపన్నులయి జగదుపకారము చేయువారిని సదా గౌరవింపుము. ఏ యుపకృతిని చేయలేనివారిని సహితము ద్వేషింపకుము.

వి. ఈ శ్లోకము కాపట్యముతో సంబంధముగల మరికొన్ని దుర్గుణములను నిందించుచున్నది

శ్లో. అనర్థ మర్థతః పశ్యన్, అర్థంచైవాప్యనర్థతః।
ఇంద్రియై రజితై ర్బాలః, సుదుఃఖం మన్యతే సుఖమ్॥ ౭

[మహాభారత, ఉద్యోగపర్వ, 33. ౬౦.]

ప. అనర్థం, అర్థతః, పశ్యన్, అర్థం, చ, ఏవ, అపి, అనర్థతః, ఇంద్రియైః, అజితైః, బాలః, సుదుఃఖం, మన్యతే, సుఖమ్.

టీ. బాలః=అల్పప్రజ్ఞగలవాడు, అజితైః=జయింపబడని, ఇంద్రియైః=ఇంద్రియములచేత, అనర్థం=అకార్యమును, అర్థతః=కార్యమునుగాను, అర్థంచైవాపి=కార్యమును, అనర్థతః=అకార్యమునుగాను, పశ్యన్=చూచుచు, సుదుఃఖం=మిక్కిలిదుఃఖమును, సుఖం=సుఖమునుగాను, మన్యతే=తలచుచున్నాడు.

తా. ఏ పురుషుడు ఇంద్రియనిగ్రహరహితుడయి, బాలకునివలె, చేయవలసినదానిని చేయరానిదిగను, చేయరానిదానిని, చేయవలసినదిగను భావించునో, అతడు అత్యంత దుఃఖమును సహితము సుఖముగనే భావించును.

వ్యా. తీక్ష్ణ విష భరితమగు నల్ల తాచును పట్ట ప్రయత్నించు బాలకులవలె, అల్ప ప్రజ్ఞులును, అజితేంద్రియులును అగు మానవులు విపత్తులనే సంపత్తులని భ్రమింతురు వారు భావి పరిణామమును దర్శింప జాలరు తాత్కాలికముగా, తమ సమస్త ప్రవృత్తులను తృప్తినొందించు వానియందే సర్వాంతఃకరణముతో నాసక్తులయి యుందురు. మీరట్లు చేయక జితేంద్రియులయి, మీ బుద్ధిని చక్కగా వినియోగించి, రాబోవు పరిణామమును దర్శింపుడు. మన జీవితమున కంతములేదు ఈశ్వరునితో మనకు గల యోగము అనంతకాలవ్యాప్తము. ఈ యనంతకాల జీవితమును దృష్టియం దుంచుకొని, మీ వర్తమాన జీవితమును యథా యోగ్యముగా గడుపుడు

వి. ఈ శ్లోకము ఇంద్రియనిగ్రహము లేకపోవుటవలని దుస్థరములను కనబరచుచున్నది ఇంద్రియనిగ్రహములేని యవివేకి భావి దుష్ఫలములను గురించి యాలోచింపక, అప్పటికి సంతోషకరముగా నుండు విషయసుఖములకయి పరుగిడు బాలకునివంటి వాడనికూడ చెప్పుచున్నది



# ౧౧ అధ్యాయము



శ్లో. ధృతి క్షమా దమోఽస్తేయం, శౌచ మింద్రియ నిగ్రహః।
ధీ ర్విద్యా సత్య మక్రోధో, దశకం ధర్మలక్షణమ్॥ ౧
[మనుసంహిత, VI. ౯౨.]

ప. ధృతిః, క్షమా, దమః, అస్తేయం, శౌచం, ఇంద్రియ నిగ్రహః, ధీః, విద్యా, సత్యం, అక్రోధః, దశకం, ధర్మలక్షణం.

టీ. ధృతిః=ధైర్యమును, క్షమా=క్షమాశీలతయు (ఇతరులు అపకారముచేసినను, వారికి మరల ప్రత్యపకారము చేయకయుండుట), దమః=నిశ్చలచిత్తమును (వికారహేతువులగు విషయములయొక్క సన్నిధానమునందున్నను, వికారమునొందకుండుట), అస్తేయం=చౌర్యరాహిత్యమును (అన్యాయముగా పరధనాదికమును గ్రహింపకపోవుట), శౌచం=పారిశుద్ధ్యమును (మృత్తు జలము మొదలయినవానిచే దేహమును శుద్ధిచేసికొనుటయు, జ్ఞానతపస్సులచే అంతఃకరణమును శుద్ధిచేసికొనుటయు), ఇంద్రియ నిగ్రహః=ఇంద్రియ సంయమమును, ధీః=శాస్త్రాది త

త్త్వజ్ఞానమును, విద్యా=పరమాత్మజ్ఞానమును, సత్యం=యథార్థముసు చెప్పుటయు, అక్రోధః=కోపములేకపోవుటయు, (క్రోధహేతువులున్నను కోపపడకపోవుట), దశకం=(ఈ) పదియును, ధర్మలక్షణం=ధర్మముయొక్క లక్షణములు.

తా. ధైర్యము, క్షమ, మనస్సంయమము, అచౌర్యము, దేహముయొక్కయు, అంతఃకరణముయొక్కయు పారిశుధ్యము, ఇంద్రియనిగ్రహము, శాస్త్రజ్ఞానము, బ్రహ్మవిద్య, సత్యమును పలుకుట, కోపములేకపోవుట, ఈపదియును ధర్మముయొక్క ముఖ్యలక్షణములు.

వ్యా. సంపత్తునందును విపత్తునందును సహిష్ణుతను వహించుము. నేయి తప్పులు చేసినవానినయినను హృదయపూర్వకముగా క్షమాపణము వేడినయెడల, తప్పక క్షమింపుము వికారజనకములగు ప్రలోభనములచె పరివేష్టితుడవయినను, నీ యంతఃకరణము సంచలింపకుండులాగున, మనస్సంయమము నభ్యసింపుము సొంతగానికి చెప్పకగాని, మోసగించికొని, బలవంతముగాకొని, ఇతరుల వస్తువులను గ్రహింపకుము. కాయిక, వాచిక, మానసిక దోషముల నన్నిటిని కడిగివేసికొని, సర్వవిధముల పరిశుద్ధుడవయియుండుము. ఇంద్రియములను వశపరచుకొనుము. బుద్ధిని సద్వినియోగమునకు తెము జ్ఞానమును సాధనచేయుము. సత్యము పలుకుము. క్రోధమునుపసంహరించుకొనుము.

వి. ఈ ౧౧ వ అధ్యాయము నిజమయిన ధర్మమేదో తెలుపుచున్నది. ఈ మొదటి శ్లోకము ధర్మముయొక్క పదిలక్షణములను చెప్పుచున్నది

శ్లో. హ్రీమాన్ హి పాపం ప్రద్వేష్టి, తస్యశ్రీ రభివర్ధతే।
హ్రీర్హతా బాధతేధర్మం, ధర్మోహన్తి హతశ్శ్రియమ్॥౧

[మహాభారత, ఉద్యోగపర్వ, ౭౧. ౩౬—౭౧ ౧౯.

ప. హ్రీమాన్, హి, పాపం ప్రద్వేష్టి, తస్య, శ్రీః, అభివర్ధతే, హ్రీః, హతా, బాధతే, ధర్మం, ధర్మః, హన్తి, హతః, శ్రియమ్.

టీ. హ్రీమాన్ హి=సిగ్గుగలవాడే, పాపం=పాపమును, ప్రద్వేష్టి=మిక్కిలిద్వేషించుచున్నాడు, తస్య=సిగ్గుగలవానికి, శ్రీః=సంపద, అభివర్ధతే=వృద్ధినొందుచున్నది. హ్రీః=సిగ్గు, హతా=నశించినదయి, ధర్మం=ధర్మమును, బాధతే=పీడించుచున్నది. ధర్మః=ధర్మము, హతస్సన్=నాశనముచేయబడినదయి, శ్రియం=సంపత్తును, హన్తి=వినాశము నొందించుచున్నది.

తా. సిగ్గుగలవాడు పాపమును ద్వేషించును. అతని సంపదయును అభివృద్ధి నొందును. లజ్జ నశించినయెడల, ధర్మ హాని తటస్థించును. ధర్మము వినష్టమయినయెడల, సిరియును తొలగిపోవును.

వ్యా. ఇతరులముఖమునుండియయినను, అశ్లీలవాక్యములు వినుటకు సిగ్గుపడువాడే, నిజమయిన లజ్జావంతుడు హ్రీమంతుడు పాపమును సంపూర్ణముగా ద్వేషించును, దాని సంపర్కమునుండి దూరముగా నుండుటకు స్వాభావికముగా నిచ్చయించును అట్టి హ్రీమంతుడే, అధిక శ్రీమంతుడగును. సిగ్గువిడిచినవానికి, అసహ్యకరమగు పాపపథమునందు నడుచుట సులభమును, కల్యాణకరమగు ధర్మమార్గమునందు నడుచుట కష్టముగను కన్పట్టును. అత డధర్మపథమునందు పడి శ్రీహీనుడును, అపవిత్రుడును అగును కనుక, లజ్జావిహీనుడవుగాక, వాక్కునందును, భావమునందును. వేషభాషలయందును ప్రయత్నపూర్వకముగా సిగ్గును నిలుపుకొనుము.

వి. మానవుని పుణ్యమార్గమునందును, ధర్మమార్గమునందును నిలుపుటలో లజ్జయొక్క ప్రాముఖ్యతను గురించి, ఈ శ్లోకము చెప్పుచున్నది.

శ్లో. అనసూయుః కృతజ్ఞశ్చ, కల్యాణాని చ సేవతే।
　సుఖాని ధర్మమర్థం చ, స్వర్గం చ లభతే నరః ॥ 3
[మహాభారత, వనపర్వ, ౨౦౭. ౪౧.]

ప. అనసూయుః, కృతజ్ఞః, చ, కల్యాణాని, చ, సేవతే, సుఖాని, ధర్మం, అర్థం, చ, స్వర్గం, చ, లభతే, నరః

టీ. అనసూయుః=ఈర్ష్యలేనివాడును(గుణవంతునియందును దోషారోపణముచేయువాడు అసూయుడు. అసూయుడు కానివాడు అనసూయుడు), కృతజ్ఞః=ఇతరులు తనకు చేసిన యువకారమును స్మరించుచుండువాడును, కళ్యాణాని చ= శ్రేయస్కరములగు కర్మలను, సేవతే=చేయువాడును, (అయిన) నరః=మనుష్యుడు, సుఖాని=సుఖములను, ధర్మం=ధర్మమును, అర్థంచ=ద్రవ్యమును, స్వర్గం చ=స్వర్గమును, లభతే=పొందుచున్నాడు.

తా. అసూయారహితుడును, కృతజ్ఞుడును, శుభకర్మానుష్ఠాన తత్పరుడును అగు నరుడు, సుఖమును, ధర్మమును, అర్థమును, స్వర్గమును పొందుచున్నాడు.

వ్యా. ఎవరి గుణములయందును దోషారోపణము చేయకుము. ఉపకారముచేసినవానియెడల, హృదయపూర్వకముగా కృతజ్ఞుడవయి యుండుము. శుభకర్మానుష్ఠానమునందు తత్పరుడవయి యుండుము. అట్లు కానియెడల, ధర్మభావ మభివృద్ధి నొందదు, హృదయము పవిత్రముకాదు, ఈశ్వరోపలబ్ధి కలుగదు హృదయమునం దానందము, ప్రాపంచికైశ్వర్య

ము, ఆధ్యాత్మికోన్నతి, అనంతకాలవ్యాప్తమగు సద్గతి, ఈనాలుగును మానవ జన్మమందున కోరింపవలసిన పరమ పురుషార్థములు.

వి. ఈ శ్లోకము కృతజ్ఞతను స్తవముచేయుచున్నది. అసూయా రహితుడును, కృతజ్ఞుడును, సత్కార్యములు చెయువాడును, ఐహికసుఖమును, ఆముష్మిక సుఖమును ఉభయమును పొందునని చెప్పుచున్నది

శ్లో. సర్వో దండజితో లోకో, దుర్లభో హి శుచి ర్నరః।
దండస్య హి భయాత్సర్వం, జగద్భోగాయ కల్పతే॥ ౪
[మనుసంహిత, VII ౨౨]

ప. సర్వః, దండజితః, లోకః, దుర్లభః, హి, శుచిః, నరః, దండస్య, హి, భయాత్, సర్వం, జగత్, భోగాయ, కల్పతే.

టీ. సర్వలోకః=సమస్తలోకము, దండజితః = దండముచేత నియమింపబడుచున్నదయి (మంచిమార్గమునందు ప్రవర్తించుచున్నది) శుచిః = స్వభావముచేతనే పరిశుద్ధుడయిన, నరః=మానవుడు, దుర్లభః=దుర్లభము. దండస్య హి భయాత్ = దండన భయమువలననే, సర్వంజగత్=సమస్త భువనమును, భోగాయ కల్పతే=భోగముకొరకు సమర్థమగుచున్నది.

తా. సమస్త మానవులును దండమువలననే శాసింపబడి, సన్మార్గమునందు ప్రవర్తించుచున్నారు. స్వభావము చేతనే పరిశుద్ధుడగు నరుడు దుర్లభుడు. దండన భయమువలననే సమస్త భువనమును పరిపాలింపబడుచున్నది.

వ్యా. సమస్త మానవులు, దండనభయమువలనగాక, పరస్పరము ప్రేమచే బంధింపబడి, సదుద్దేశములతో, ధర్మముయొక్క ఆదేశానుసారముగా, మనస్సాక్షియొక్క ప్రబోధమువలననే, ఈశ్వరమహిమను వెల్లడి చేయుటకే, సమస్త కార్యములను చేసినప్పుడే మానవసంఘము పరమోత్కృష్టదశ నొందియుండును. అట్టిదిన మింకను చాల దూరముగా నున్నది. ఇప్పుడు సాధుపురుషులకంటె అసాధువులే ఎక్కువగా నున్నారు సద్వ్యవహారముకంటె అసద్వ్యవహారమే అధికముగా నున్నది. నేటికిని రాజదండముయొక్క శాసనమువలననే, ఈ భూమండలమునందలి ప్రజలు కించిన్మాత్రముగా నయినను ధర్మమును, అర్థమును, సుఖమును భోగింపగలుగుచున్నారు. కనుక, మానవసంఘముయొక్క పరాకాష్ఠదినమును సమీపమునకు తెచ్చుటకు ప్రతిమానవునకును కర్తవ్యమయి యున్నది.

వి. ఈ శ్లోకము న్యాయాధికారుల శిక్షణము యొక్కయు, శిక్షయొక్కయు అవసరమును తెలుపుచున్నది. లోకమునందు అధర్మమే ఎక్కువగా నున్నదని యూహించి, అధికారుల దండనవలనను, బహూకరణము వలననే సంఘము మంచిస్థితియందుంచబడునని నిశ్చయించుచున్నది

శ్లో. అధర్మదండనం లోకే, యశోఘ్నం కీర్తినాశనం।
అస్వర్గ్యం చ పరత్రాపి, తస్మాత్తత్ పరివర్జయేత్॥ ౫
[మనుసంహిత, VIII ౧౨౭.]

ప. అధర్మదండనం, లోకే, యశోఘ్నం, కీర్తినాశనం, అస్వర్గ్యం, చ, పరత్ర, అపి, తస్మాత్, తత్, పరివర్జయేత్.

టీ. (ఏహేతువువలన) లోకే=లోకమునందు, అధర్మదండనం=అన్యాయముగా శిక్షించుట, యశోఘ్నం = యశస్సును పోగొట్టునదియును, కీర్తినాశనం=కీర్తిని నశింపజేయునదియు, పరత్రాపి=పరలోకమునందును, అస్వర్గ్యం చ=స్వర్గప్రాప్తికి ప్రతిబంధకమును (అగునో), తస్మాత్=ఆ కారణమువలన, తత్=దానిని, పరివర్జయేత్=విడిచిపెట్టవలయును.

తా. అన్యాయదండనము ఇహలోకమునందు యశమును, కీర్తిని వినాశమునొందించును. పరలోకమునందు స్వర్గప్రాప్తికి ప్రతిబంధక మగును. కనుక, ఎవరిని అన్యాయముగా దండింపగూడదు.

వ్యా. అన్యాయముగా దండింపగూడదు దండధారణము యొక్క ఉద్దేశము, మంగళమయుడగు పరమేశ్వరునియొక్క ధర్మ

రాజ్యమును విస్తరింపజేయుటకే అయి యుండవలయును కనుక, ప్రభువులు క్రోధావేశపరవశులయి, అధర్మదండనమునకు పూనుకొనరాదు

వి. ఈ శ్లోకముకూడ, ప్రస్తుత పరిస్థితులలో రాజదండనము యొక్క అవసరము నంగీకరించుచు, రాజకీయోద్యోగులు, అధర్మదండనము చేసి, తమ యధికారమునకు కళంకము తీసికొనిరాగూడదనిమాత్రము నొక్కి వక్కాణించుచున్నది.

శ్లో. క్షమా వశీకృతి ర్లోకే, క్షమా హి పరమం ధనం
క్షమా గుణో హ్యశక్తానాం, శక్తానాం భూషణం క్షమా॥
౬

[మనుసంహిత]

ప. క్షమా, వశీకృతిః, లోకే, క్షమా, హి, పరమం, ధనమ్, క్షమా, గుణః, హి, అశక్తానాం. శక్తానాం, భూషణం, క్షమా.

టీ. క్షమా=ఓరిమి, లోకే=లోకమునందు, వశీకృతిః=వశీకరణము (అవశమయినదానిని వశముచేయును). క్షమా హి=క్షమయే, పరమం ధనమ్=శ్రేష్ఠమయిన ధనము. అశక్తానాం=శక్తిలేనివారికి, క్షమా హి=క్షమయే, గుణః=గుణము. శక్తానాం=శక్తిగలవారికి, క్షమా=క్షమ, భూషణం=ఆభరణము.

తా. ఓర్పువలననే, సమస్త మానవులును వశీభూతు లగుదురు. ఓరిమియే పరమ ధనము. ఓరిమియే శక్తివిహీను లకు సద్గుణము, శక్తిమంతులకు భూషణము.

వ్యా. సర్వదా క్షమాశీలుడవయి యుండుము. వైరులను బాధించి పగతీర్చుకొనవలయు ననెడి సంకల్పమును సంపూర్ణముగా విడిచిపెట్టుము. ప్రత్యపకారము చేయుటకు తగినంత సామర్థ్యమున్నప్పుడు సహితము, ఇత రులుచేసెడు అపకారమును సహించి, యోర్చుకొనుటలోనే నిజమయిన క్షమాశీలతయొక్క లక్షణ మిమిడియున్నది. 'నా కపకారము కలిగిన కలుగును గాక, కాని, నావలన పరుల కపకారము కలుగకుండును గాక' అను సత్సంకల్పము స్వర్గీయ క్షమాగుణ సంభూతము

వి. ఈ శ్లోకము క్షమాశీలతను ప్రశంసించుచున్నది. కాని, 'నీ శత్రువులను సహితము ప్రేమించుము నిన్ను శపించువారిని దీవించుము' అను జీసను ఉపదేశమునకు సాటిరాదు

శ్లో. యథైవాత్మా పరస్తద్వత్, ద్రష్టవ్యశ్శుభమిచ్ఛతా ।
సుఖదుఃఖాని తుల్యాని, యథాత్మని తథా పరే ॥　　౭

[దక్షసంహిత III ౨౦.]

ప. యథా, ఏవ, ఆత్మా, పరః, తద్వత్, ద్రష్టవ్యః, శుభం, ఇచ్ఛతా, సుఖదుఃఖాని, తుల్యాని, యథా, ఆత్మని, తథా, పరే.

టీ. శుభమిచ్ఛతా = శుభమును కోరెడి జనునిచేత, ఆత్మా = తాను, యథైవ = ఎట్లో, తద్వత్ = అదే తీరున, పరః = ఇతరుడు, ద్రష్టవ్యః = చూడదగినవాడు. ఆత్మని = తనయందు, యథా = ఎట్లో, తథా = అదే తీరున, పరే = ఇతరునియందును, సుఖదుఃఖాని చ = సుఖదుఃఖములు, తుల్యాని = సమానములు.

తా. శుభమును కోరువాడు తన్నెట్లు చూచుకొనునో, ఇతరులనుకూడ అట్లే చూడవలయును. ఏలయన, సుఖదుఃఖములు తనకును పరులకును, ఉభయులకును సమానములే.

వ్యా. సుఖదుఃఖములు రెండును నీకెట్లో, ఇతరులకును అట్లే. కావున, నీవు దేనిని కావలయునని కోరుదువో, దానిని ఇతరులనుండి యపహరింపకుము. నీవు దేనిని నీనుండి తొలగించుకొన బ్రయత్నింతువో, దానిని ఇతరులకు ప్రాపింపజేయకుము. ఇతరులు నిన్ను ప్రేమించుచుండగా చూచి, నీవెట్లు సుఖింపగోరుదువో, అట్లే, నీవును ఇతరులను ప్రేమించి, వారిని సుఖవంతులనుగా జేయుము. ఇతరులు నిన్ను ద్వేషించుచుండుటను జూచి, నీవెట్లు బాధపడుదువో, అట్లే, నీవును ఇతరులను ద్వేషించి, వారిని బాధపెట్టకుము. ఈ విధముగా సకల విషయములయందును, ఇతరులను నీతో పోల్చుకొని, వారితో వ్యవహరింపుము సుఖదుఃఖములు రెండును, నీయందెట్లో, ఇతరులయందును అట్లే సమానముగా అనుభవింపబడుచున్నవి. ఇట్టి సదాచరణమే, కళ్యాణప్రాప్తికి పరమసాధనము

వి. ఈ శ్లోకము ఇతరులను తనవలెనే చూడవలయునను నీతిని బోధించుచున్నది. ఇది 'ఆత్మౌపమ్యేన సర్వత్ర' అను గీతావాక్యమును ప్రతిధ్వనించుచున్నది. "నీ కితరు లేమి చేయగోరుదువో, నీవు దాని నితరులకు చేయుము" అను జీసను ఉపదేశమును స్మరణకు దెచ్చుచున్నది

శ్లో. మాతృవత్ పరదారాంశ్చ, పరద్రవ్యాణి లోష్టవత్ ।
ఆత్మవత్ సర్వభూతాని, యః పశ్యతి స పశ్యతి ॥ ౮

[ఆపస్తంభసంహిత, X ౧౧.]

ప. మాతృవత్, పరదారాన్, చ, పరద్రవ్యాణి, లోష్టవత్, ఆత్మవత్, సర్వభూతాని, యః, పశ్యతి, సః, పశ్యతి.

టీ. పరదారాంశ్చ = అన్యుని భార్యను, మాతృవత్ = తల్లివలెను, పరద్రవ్యాణి=ఇతరులధనమును, లోష్టవత్=మట్టిబెడ్డవలెను, సర్వభూతాని=సమస్తభూతములను, ఆత్మవత్=తనవలెను, యః=ఎవడు, పశ్యతి=చూచుచున్నాడో, స ఏవ=వాడే, పశ్యతి=వాస్తవముగా చూచుచున్నాడు.

తా. ఎవడు పరస్త్రీని తల్లివలెను, పరద్రవ్యమును మట్టిబెడ్డవలెను, సమస్తప్రాణులను తనవలెను చూచునో, అతడే యథార్థద్రష్ట.

వ్యా. పరస్త్రీని తల్లివలె చూడుము పరధనమును పనికిమాలిన మట్టిబెడ్డవలె చూడుము. నిన్ను నీవెట్లు ప్రేమించుకొందువో, ఇతరులను సహితము అట్లే ప్రేమదృష్టితో చూడుము.

వి. ఈ శ్లోకము సమస్త భూతములను తనవలెనే చూచుకొనవలయునని, ఉపనిషత్తులనాటినుండియు వచ్చిన హైందవ భావమును సూచించుచున్నది.

---

# ౧౨ అధ్యాయము



శ్లో. అన్యాన్ పరివదన్ సాధుః, యథా హి పరితప్యతే।
తథా పరివదన్ అన్యాన్, తుష్టో భవతి దుర్జనః॥ ౧

[మహాభారత, ఆదిపర్వ, ౭౪ ౯౧]

ప. అన్యాన్, పరివదన్, సాధుః, యథా, హి, పరితప్యతే, తథా, పరివదన్, అన్యాన్, తుష్టః, భవతి, దుర్జనః.

టీ. అన్యాన్=ఇతరులను, పరివదన్=నిందచేయుటచేత, సాధుః=సజ్జనుడు, యథా=ఎట్లు, పరితప్యతే = పరితాపము నొందుచున్నాడో, తథా=అట్లే, దుర్జనః=దుర్మార్గుడు, అన్యాన్=ఇతరులను, పరివదన్=నిందించుటచేత, తుష్టః=సంతోషించినవాడు, భవతి=అగుచున్నాడు.

తా. ఇతరులను నిందించి సాధుపురుషుడెట్లు పరితపించునో, ఇతరులను నిందించి, దుర్జనుడట్లు సంతోషించును.

వ్యా. ఈశ్వరునియందు భక్తి, మానవులయందు ప్రేమ కలవాడే సాధుపురుషుడు. అతడెన్నడును మనుష్యులమీద అపవాదములను వేసి ఆనందింపడు మానవు డతనికి ప్రేమాస్పదుడు అతడెవరి దోషమునయి నను చూచినప్పుడు దుఃఖించును, ప్రేమతో దానిని సంస్కరింప ప్రయత్నించును అతడు మానవుని మానవుడనే ప్రేమించును. కనుకనే, అతడెవరి సద్గుణమునయిన చూచినప్పుడు ఆనందించును, ఎవరి దోషమునయిన చూచినప్పుడు పరితపించును అతనికి సుఖము కలిగినను, దుఃఖము కలిగినను ఉభయమును ప్రేమసంజనితములే. కావున, అతడెన్నడును ఇతరుల దోషములను ఘోషించి యానందించడు. తల్లిదండ్రులు పుత్త్రుని పుత్త్రుడనియే ఎట్లు ప్రేమింతురో, పుత్త్రుని సుగుణములను జూచినప్పుడు ఆనందించుచు, దుర్గుణములను జూచినప్పుడు విచారించుచు నుందురో, అట్లే, మనుష్యుని కేవలము మనుష్యుడనియే ప్రేమించుటకు సాధన చేయుము అట్లయినయెడల, నీ వితరుల దోషములను జూచి యానందింపజాలవు. ఎవడు అన్యుల దోషములను జూచి, అన్యుల దోషములను ఘోషించి, యానందించునో, అట్టివాని హృదయ మతిక్షుద్రము అట్టి నీచత్వము నుండి నిన్ను సర్వదా సంరక్షించుకొన ప్రయత్నింపుము

వి. ఈ ౧౨వ అధ్యాయము సత్పురుషునియొక్క మరికొన్ని సుగుణములను వర్ణించుచున్నది. సాధుపురుషుడు పరుల దోషములను చెప్పవలసి వచ్చినప్పుడు విచారించుననియు, గుణములను చెప్పవలసి వచ్చినప్పుడు సంతోషించుననియు ఈ మొదటిశ్లోకము చెప్పుచున్నది.

శ్లో. విపత్తి ష్వవ్యథో దక్షో, నిత్య ముత్థానవాన్ నరః।
అప్రమత్తో వినీతాత్మా, నిత్యం భద్రాణి పశ్యతి॥ ౨
[మహాభారత, సభాపర్వ, ౫౪ ౮ ]

ప. విపత్తిషు, అవ్యథః, దక్షః, నిత్యం, ఉత్థానవాన్, నరః, అప్రమత్తః, వినీతాత్మా, నిత్యం, భద్రాణి, పశ్యతి.

టీ. విపత్తిషు=(ఎవడు) ఆపత్తులయందు, అవ్యథః= దుఃఖములేనివాడును, దక్షః=నేర్పరియును, నిత్యం=ప్రతిదినమును, ఉత్థానవాన్=ఉద్యమశీలుడును (అయిన), నరః= నరుడో, అప్రమత్తః=ప్రమాదరహితుడును, వినీతాత్మా=వినీతస్వభావుడును (అగుచున్నాడో, అతడు), నిత్యం=ఎల్లప్పుడు, భద్రాణి=శుభములను, పశ్యతి=చూచుచున్నాడు.

తా. ఎవడు విపత్కాలమునందు దుఃఖింపడో, ఎవడు కార్యసమర్థుడో, నిరంతర కార్యశీలుడో, ప్రమాద రహితుడో, వినమ్రస్వభావుడో, అతడు సదా శుభములనే దర్శించును.

వ్యా. సహనశక్తియు, అభినివేశమును లేని మానవుడు ఆపత్కాలమున విశేష వ్యథ నొందును. కనుక, యుద్ధభటు లెట్లు విపత్సంకుల భీకర సంగ్రామరంగమునందు, ఏ తొట్రుపాటును లేక స్థిరచిత్తముతో

నిలువబడుటకు మొదటినుండియు, శిక్షణము నొందియుందురో, అట్లే, జీవితసంగ్రామమునందును ధైర్యస్థైర్యములతో నిలువబడుట కభ్యసింపుము. అట్లయినయెడల, ఎన్ని విపత్తులు సంభవించినను, నిన్నవి వ్యాకుల చిత్తునిగా చేయజాలవు. ఈశ్వరుఁడేయే శక్తులను నీకు ప్రసాదించి యున్నాడో, వాని నన్నిటిని వికాసము నొందించుకొని, శక్తిసామర్థ్యములలో దినదిన ప్రవర్ధమానుడవగుము. ఆలసత్వమును బదకమును విడిచి నిరంతర కార్యశీలుడవు కమ్ము. మత్తతను, అన్యమనస్కతను పరిత్యజించి, అభినివిష్ట చిత్తముతో లక్ష్యసాధనమునందు ప్రవృత్తుడవు కమ్ము. ఈశ్వరాను గ్రహమువినా, నీవొక అడుగయినను ముందుకు పెట్టలేవను సంగతి సదా స్మరణయందుంచుకొనుము. శరీరము, మనస్సు, ఆత్మ, బలము, బుద్ధి మొదలగు సమస్తమును, ఆయన దయమీదనే ఆధారపడియున్నవి. కనుక, నీకు గల సర్వమునకును ఆయనే మూలమని తెలిసికొని, అహంకారమును, ఔద్ధత్యమును పరిత్యజించి, వినమ్రుడవు కమ్ము.

వి. ఈ శ్లోకము ఓర్పు, పట్టుదల, కార్యశీలత మొదలయిన మరికొన్ని సుగుణములను మెచ్చుకొనుచున్నది.

శ్లో. బహవోఽవినయా న్నష్టాః, రాజానః సపరిచ్ఛదాః।
వనస్థా అపి రాజ్యాని, వినయాత్ ప్రతిపేదిరే॥ 3

[మనుసంహిత VII. ౪౦.]

ప. బహవః, అవినయాత్, నష్టాః, రాజానః, సపరిచ్ఛదాః, వనస్థాః, అపి, రాజ్యాని, వినయాత్, ప్రతిపేదిరే.

టీ. బహవః రాజానః=అనేకమంది రాజులు, స పరిచ్ఛదాః=ఏనుగులు, గుఱ్ఱములు, రథములు, యుద్ధభటులు, ధనాగారములు మొదలయిన పరిచ్ఛదములతో కూడినవారు (అయినను), అవినయాత్=వినయములేకపోవుటవలన, నష్టాః=ప్రాణములను గోలుపోయిరి. (కాని) వనస్థాః అపి=(నిస్సహాయులయి) అరణ్యమునం దుండువారయినను, వినయాత్=వినయమువలన, రాజ్యాని=(పరివారముతో గూడిన) రాజ్యములను, ప్రతిపేదిరే=పొందిరి.

తా. వినయవిహీనులగుటచే, అశ్వరథాది బహుపరివారముతో కూడినవారయినను, అనేకులగు రాజులు వినాశమునొందిరి. వినయసంపన్నులగుటవలన, అనేకులగు రాజులు ఏకాకులయి వనవాసులయినను, పోయిన రాజ్యములను మరల పొందగలిగిరి.

వ్యా. వినయముగలవాడే ఆధ్యాత్మిక సంపదను పొందుటకు సమర్థుడగును. వినయముగలవాడే భౌతికైశ్వర్యమును పొందగలడు. వినయ విహీను డందరిచేతను ద్వేషింపబడును. నీకు సంపద యున్నయెడల, వినయము దాని శోభ నభివృద్ధి నొందించును విపత్తు తటస్థించినయెడల, వినయము దానినుండి నిన్ను విముక్తి నొందించును. కనుక, అంతరము

నందు నీ కీశ్వరుడు ప్రసాదించిన సద్గుణసంపత్తిని గురించిగాని, బాహ్యము నందు నీ కాయన యనుగ్రహించిన భాగ్యభోగ్యములకొరకుగాని, క్షణ కాలమయినను అహంకార యుక్తుడవు గాకుము

వి. ఈ శ్లోకము వినయమును కీర్తించుచున్నది మహాసత్యసంపన్ను లగు రాజులు సహితము గర్వమువలన చెడిపోయిరి. ఏకాకులగు రాజులు సహితము వినయమువలన రాజ్యములను పొందగలిగిరి

శ్లో. యత్కర్మకుర్వతోఽస్యస్యాత్, పరితోషోఽన్తరాత్మనః।
తత్ప్రయత్నేన కుర్వీత, విపరీతం తు వర్జయేత్॥ ౪
[మనుసంహిత IV ౧౬౧]

వ. యత్, కర్మ, కుర్వతః, అస్య, స్యాత్, పరితోషః, అన్తరాత్మనః, తత్, ప్రయత్నేన, కుర్వీత, విపరీతం, తు, వర్జయేత్.

టీ. యత్ కర్మ కుర్వతః=ఏ కర్మను చేయుటవలన, అస్య=ఈ, అంతరాత్మనః=అంతరాత్మకు (మనస్సాక్షికి), పరితోషః=సంతోషము, స్యాత్=అగునో, తత్=దానిని, ప్రయత్నేన=సర్వప్రయత్నములచేతను, కుర్వీత=చేయవలయును. విపరీతం తు=దానికి విరుద్ధమయినదానిని, వర్జయేత్=విడిచిపెట్టవలయును.

తా. ఏ కర్మ చేసినయెడల, అంతరాత్మ ప్రసన్నమగునో, అట్టి కర్మనే సర్వప్రయత్నములచేతను చేయవలయును. తద్విపరీతమగు కర్మను పరిత్యజింపవలయును.

వ్యా. ధర్మానుష్ఠానముయొక్క అమోఘ ఫలము ఆత్మప్రసాదము—అంతరాత్మయొక్క సంతోషము. ఆత్మప్రసాదమునందే, ఈశ్వర ప్రసాద మనుభవమునకు వచ్చును ఆత్మ ప్రసన్నమయినయెడల, సమస్త దుఃఖములు సమసిపోవును ధర్మానుష్ఠానము లేనిది, ఆత్మ సంతృప్తి నొందదు విషయసుఖానుభవమువలనను, మనస్సు సుఖము ననుభవించును. కాని, ఆత్మయందు అపవిత్రత యున్నయెడల, మనోమాలిన్య మున్నయెడల, రాసులు రాసులుగా నుండు ప్రాపంచిక సౌఖ్యములన్నియు, నిరుపయోగములగును కనుక, ధర్మాచరణద్వారమున ఆత్మప్రసాదము నొందుడు. దేనివలన ఆత్మసంతోషమునకు హాని కలుగునో దానిని సంపూర్ణముగా పరిత్యజింపుడు ఏ కార్యమును చేయుటచేత అంతరాత్మ సంతోషించునో, ఆ కార్యము తనకెంత అయిష్టముగా నున్నను, సర్వప్రయత్నములచేతను ఆచరించి తీరవలయును. అంతరాత్మ కిష్టములేని కార్యమును, తన కెంత యిష్టమున్నను మానివేయవలెను ధర్మావహుడును, పాపనుదుడును అగు పరమేశ్వరుడు మానవ హృదయమునందు మనస్సాక్షిస్వరూపమున ప్రకాశించుచున్నాడు. మనస్సాక్షిప్రబోధములే ఈశ్వరాజ్ఞలు. కనుక, వేదవాక్యముకంటెను, శాస్త్రప్రమాణముకంటెను, గురూపదేశముకంటెను, అంతరాత్మప్రబోధమే అధిక అనుసరణీయము

వి. ఈ శ్లోకము తన అంతరాత్మకు తృప్తి నిచ్చు కార్యమును చేయవలయుననియు, తద్విరుద్ధమును మానుమనియు బోధించుచున్నది.

శ్లో. ధర్మకార్యం యతఞ్ శక్త్యా, నో చేత్ ప్రాప్నోతిమానవః।
ప్రాప్తో భవతి తత్ పుణ్యం, అత్ర మే నాస్తి సంశయః॥ ౫

[మహాభారత, ఉద్యోగపర్వ, ౯౨. ౬.]

ప. ధర్మకార్యం, యతన్, శక్త్యా, నో, చేత్, ప్రాప్నోతి, మానవః, ప్రాప్తః, భవతి, తత్, పుణ్యం, అత్ర, మే, న, అస్తి, సంశయః.

టీ. మానవః=మనుష్యుడు, ధర్మకార్యం = ధర్మకార్యమును (చేయుటకు), శక్త్యా=శక్తికొలదిని, యతఞ్=యత్నము చేసినవాడయి, న ప్రాప్నోతిచేత్=కార్యసిద్ధిని పొందకపోయినను, తత్ పుణ్యం=ఆ పుణ్యఫలమును, ప్రాప్తః భవతి=పొందినవాడగుచున్నాడు. అత్ర=ఈ విషయమును, మే=నాకు, సంశయః=సందేహము, నాస్తి=లేదు.

తా. మానవుడే ధర్మకార్యమునయిన చేయుటకు తన శక్తికొలదిని ప్రయత్నము చేసినవాడయి, కృతకార్యుడు కాక

పోయినను, అతడు దాని పుణ్యఫలమును పొందితీరును. ఈ విషయమయి ఎంతమాత్రమును సంశయములేదు.

వ్యా. ధర్మకార్యము లాచరించుటకు నీకు సాధ్యమయినంత వరకు, ప్రయత్నము చేయుము నీ యావచ్ఛక్తిని వినియోగించి, కృత కార్యుడవు కాకపోయినను, దాని నిశ్చయఫలమగు పుణ్యము మాత్రము నీకు లభించితీరును. ఈశ్వరుని కార్యము లనంతములు ఎవడెంతవరకు తన కార్యములు నెరవేర్చెనని ఆయన గణింపడు ఆయన ఎవరికే శక్తి నిచ్చి యున్నాడో, వారు దానిని నిష్కాపట్యముతో వినియోగించవలయు ననియే, ఆయన యభీష్టము. అట్లయిన యెడల, ఆయన వానిని కృత కృత్యుని చెయును

వి. ఇది శ్రీకృష్ణమూర్తి వినురునకుచేసిన యుపదేశము. నిజమయిన గొప్పతనము బాహ్యాకర్మలమీద నాధారపడి యుండదు తన విధికృత్యము నను నెరవేర్చుటకు తన యావచ్ఛక్తిని వినియోగించుటలోనే యున్నది. ఈ శ్లోకము 'కర్మణ్యేవాధికారస్తే' అను గీతాశ్లోకమును ప్రతిధ్వనించు చున్నది.



# ౧౩ అధ్యాయము



శ్లో. ఇంద్రియాణాం విచరతాం, విషయేష్వపహారిషు।
సంయమే యత్నమాతిష్ఠేత్, విద్వాన్ యన్తేవ వాజి
నామ్॥ ౧

[మనుసంహిత, II ౮౮.]

ప. ఇంద్రియాణాం, విచరతాం, విషయేషు, అపహారిషు, సంయమే, యత్నం, ఆతిష్ఠేత్, విద్వాన్, యన్తా, ఇవ, వాజినామ్.

టీ. అపహారిషు = అపహరణశీలములగు, విషయేషు=విషయములయందు, విచరతాం=సంచరించుచున్న, ఇంద్రియాణాం=ఇంద్రియములయొక్క, సంయమే=నియమించుటయందు, విద్వాన్=విద్వాంసుడు, వాజినాం (రథమునకు కట్టబడిన) గుర్రములయొక్క, యంతా ఇవ=సారథివలెనే, యత్నం=ప్రయత్నమును, ఆతిష్ఠేత్=చేయవలయును.

తా. రథసారథి రథాశ్వముల నన్నిటిని వానివాని యిష్టానుసారముగా పరుగిడనియ్యక, వాని నన్నిటిని, తన వశమునం దుంచుకొని, తన యిష్టానుసారముగా నెట్లునడిపించునో, అట్లే, జ్ఞానియగువాడు మోహమయవిషయములయందు ప్రవృత్తములయిన తన యింద్రియముల నన్నిటిని, వశమునం దుంచుకొని, తన యిష్టానుసారముగా ప్రవర్తింపజేయువలయును. తానే వానికి వశుడు కాగూడదు.

వ్యా. ఏ సమస్త విషయములు ఇంద్రియగోచరములయిన యెడల అంతఃకరణమునం దసద్భావములు జనించునో, అట్టి అపవిత్ర విషయముల యందు నీ మనస్సును వినియోగింపకుము పవిత్ర విషయభోగముల ద్వారమున, ఇంద్రియములను పరితృప్తి నొందించుచు, జీవితోద్దేశమును సాధించుటకొరకు అనుదినమును ప్రయత్నింపుము

వి. ఈ ౧౩ వ అధ్యాయము ఆత్మసంయమమును గురించి వివరించుచున్నది "సారథిచే నియమింపబడని రథాశ్వములవలె మోహజనకములగు విషయములతో సంబంధముగల ఇంద్రియములు ఆత్మసంయమములేని మానవుని తప్పుదారికి ఈడ్చివేయును," అని చెప్పుచున్నది. ఈ భావమును, ఈ అలంకారమును ఉపనిషత్తులయందును, భగవద్గీతయందును కూడ కలవు.

శ్లో. ఇంద్రియాణాం హి చరతాం, యన్మనోఽనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం, వాయుర్నావ మివాంభసి॥ ౨
[భగవద్గీత, II ౬౭.]

ప. ఇంద్రియాణాం, హి, చరతాం, యత్, మనః, అనువిధీయతే, తత్, అస్య, హరతి, ప్రజ్ఞాం, వాయుః, నావం, ఇవ, అంభసి.

టీ. చరతాం=(స్వచ్ఛందముగా విషయములయందు) సంచరించుచున్న, ఇంద్రియాణాం హి=(అవశీకృతములయిన) ఇంద్రియములకే, యత్ మనః=ఏ మనస్సు, అనువిధీయతే= అనుకూలమయినదగునో, తత్ మనః=ఆ మనస్సు, అస్య= ఈ పురుషునియొక్క, ప్రజ్ఞాం=జ్ఞానమును, హరతి=హరించి వేయుచున్నది. (దేనివలె?) అంభసి=(సముద్రాది) జలము నందు, (ప్రమత్తుడయిన కర్ణధారునియొక్క) నావం=ఓడను, వాయుః ఇవ=వాయువువలెనే (వాయువు ముంచివేసినట్లే).

తా. ఎప్పుడు మానవుని మనస్సు స్వేచ్ఛాప్రవృత్తము లగు ఇంద్రియములకు వశమగునో, అప్పుడు ప్రచండ వాయు వెట్లు నావను నదియందు ముంచివేయునో, అట్లే, వాని మనస్సు ఆ పురుషునియొక్క బుద్ధిని వినాశము నొందించును.

వ్యా. ఎప్పుడే ప్రవృత్తి జనించునో, దానియందెల్ల నీ యింద్రియగణమును సంచారము చేయనియ్యకుము కాని, ఆధ్యాత్మిక ధర్మము యొక్క ఆదేశానుసారముగా, మనస్సును సుశిక్షితమును, వశీభూతమును చేసికొని, ఇంద్రియములను నిగ్రహింపుము మనస్సే వశీభూతమయిన యెడల, ఎన్ని అపవిత్రవిషయములు ఇంద్రియసంచారమార్గములయందు గోచరించినను, అవి, ఆ మానవుని పవిత్రపథమునుండి భ్రష్టుని చేయజాలవు. ఎప్పుడు ప్రలోభనసంకుల ప్రాపంచమునయందియే, ధర్మసాధన చేయవలసి యున్నదో, అప్పుడు మనోనిగ్రహమే లేకపోయినయెడల, అడుగడుగునకును విపత్తులే తటస్థించును. మనస్సు ఇంద్రియానుగతమే యయిన యెడల, మానవుడు హతచేతసుడయి, కింకర్తవ్యవిమూఢుడయి. పాపమోహములయందు నిమగ్నుడగును.

వి. ఈ శ్లోకము వెనుకటి శ్లోకములో చెప్పిన యంశమునే అనగా, అవశమయిన మనస్సువలన సంభవించెడు అపాయములనే, ఇంకొక అలంకారముతో వర్ణించుచున్నది. ఎవని మనస్సు ఇంద్రియములకును, కోరికలకును లోనగునో, అట్టి మానవుడు తుపానులో చిక్కుకొన్న ఓడవలెనే వినాశమునొందును.

శ్లో॥ న జాతు కామః కామానాం, ఉపభోగేన శామ్యతి।
హవిషా కృష్ణవర్త్మేవ, భూయ ఏవాభివర్ధతే॥ 3

[మనుసంహిత, II. ౯౪-మహాభారత, ఆదిపర్వ ౭౫. ౪౯-౫౦. ౧౨.]

ప. న, జాతు, కామః, కామానాం, ఉపభోగేన, శామ్యతి, హవిషా, కృష్ణవర్త్మా, ఇవ, భూయః, ఏవ, అభివర్ధతే.

టీ. కామానాం = విషయములయొక్క, ఉపభోగేన = అనుభవముచేత, కామః=కోరిక, జాతు=ఒకానొకప్పుడును, న శామ్యతి=శమనమును పొందదు. (కాని) హవిషా=ఘృతముచేత, కృష్ణవర్త్మా ఇవ=అగ్నిహోత్రమువలెను, భూయః ఏవ=మరల మరల, అభివర్ధతే=వృద్ధియగుచున్నది (భోగముల ననుభవించినవానికి సహితము ప్రతిదినము, పూర్వముకంటెను అధికమయిన భోగాభిలాష కలుగుచుండుటచేత).

తా. కామ్యవస్తువులను భోగించుటవలన కామ మెన్నడును, తృప్తినొంది, నివృత్తము కాదు. అంతేకాదు, ఘృతము వేల్వబడిన అగ్నిహోత్రమువలె మరింత జ్వాలగా ప్రజ్వరిల్లును.

వ్యా. "విషయభోగములతో సంతృప్తి నొందించినయెడల, ఇంద్రియములు వానంతటవే వశీభూతములగును, యత్నపూర్వకముగా ఇంద్రియసంయమమునుగురించి సాధనచేయవలసిన యవసరము లేదు" అని ఎన్నడును అనుకొనకుము విషయభోగముల ననుభవించినకొలదిని, విషయతృష్ణ అధికమగుచుండును, అంతఃకరణ మంతకంతకు దుర్దాంత

మగుచుండును. కనుక, ఇంద్రియదమనమునందును, మనస్సంయమము నందును, ఎన్నడును శిథిలభావమును కనబరపకుము

వి. ఈ శ్లోకము 'కోరికలు అనుభవించినకొలదిని అధికమగు చుండును' అను మానసిక విజ్ఞాన నియమమును తెలుపుచున్నది భోగానుభవమువలన, భోగవాంఛ తగ్గుననుకొనుట అజ్ఞానము ఈ శ్లోకమునందలి భావమే యథార్థము

శ్లో. ఇంద్రియాణాం తు సర్వేషాం, యద్యేకం క్షరతీంద్రియం।
తేనాస్య క్షరతి ప్రజ్ఞా, దృతేః పాత్రాదివోదకమ్॥ ౮

[మనుసంహిత II ౯౯]

ప. ఇంద్రియాణాం, తు, సర్వేషాం, యది, ఏకం, క్షరతి, ఇంద్రియం, తేన, అస్య, క్షరతి, ప్రజ్ఞా, దృతేః, పాత్రాత్, ఇవ, ఉదకమ్.

టీ. సర్వేషాం ఇంద్రియాణాం=సకల ఇంద్రియముల లోపల, ఏకం ఇంద్రియం=ఒక్క యింద్రియమయినను, యది క్షరతి=స్ఖలనమయినయెడల, (విషయాసక్తమయినయెడల), తేన=(ద్వారభూతమయిన) దానిచేత, అస్య=(విషయాసక్తుడయిన) ఆ మానవునియొక్క, ప్రజ్ఞా=బుద్ధి, క్షరతి=స్ఖలన

మగుచున్నది (వినాశమునొందుచున్నది ఇతర ఇంద్రియముల చేత నిలువదు). (ఇందుకు దృష్టాంతము) దృతేః పాత్రాత్= ఛిద్రముగల చర్మపాత్రమునుండి, ఉదకమ్ ఇవ=ఉదకమువలె (ఒక్కచోట నున్న చిల్లివలన పాత్రయందుండెడి సమస్త జలము ఎట్లు స్రవించిపోవునో, అట్లే, వశీభూతముకాని ఇంద్రియమనెడు ఛిద్రముద్వారా, హృదయకలశమునందలి జ్ఞానామృత మంతయు కారిపోవునని భావము.)

తా. ఒక పాత్రకు ఒక్క చిల్లి యున్నను, దాని యందలి జలమంతయు ఎట్లు కారిపోవునో, అట్లే, ఇంద్రియము లన్నిటిలోను, ఒక్క ఇంద్రియము చలించినను, దానివలననే మానవునియొక్క బుద్ధియంతయు భ్రష్టమగును.

వ్యా. అపవిత్రవిషయములు ఒక్క యింద్రియముద్వారాగాని, అనేక ఇంద్రియములద్వారాగాని, అంతఃకరణమునందు ప్రవేశించి, అపవిత్రపుకోరికలను జనింపజేసినయెడల, మనుష్యుని పతనమునకు హేతు వగును. కనుక, ఏ యింద్రియమునకును యథేచ్ఛగా విషయభోగముల ననుభవించుటకు సమయము దొరకనియ్యకుము.

వి. ఒకని ప్రవర్తనయందు ఏమాత్రము లోపమున్నను సవరించు కొనవలయుననియు, అశ్రద్ధచేసినయెడల అపాయకరమనియు, ఈ శ్లోకము

సూచించుచున్నది ఉదాహరణము—ఒక పాత్రయందు ఎంత చిన్న చిల్లి యున్నను, పాత్రమునందలి జలమంతయు ఎట్లు కారిపోవునో, అట్లే, నిగ్రహింపబడని ఒక యింద్రియ మయినను, సర్వనాశనమునకే దారి తీయును

శ్లో॥ న తథైతాని శక్యన్తే, సంనియన్తు మసేవయా ।
విషయేషు ప్రజుష్టాని, యథా జ్ఞానేన నిత్యశః॥  ౫

[మనుసంహిత II ౯౬.]

ప. న, తథా, ఏతాని, శక్యన్తే, సంనియన్తుం, అసేవయా, విషయేషు, ప్రజుష్టాని, యథా, జ్ఞానేన, నిత్యశః.

టీ. యథా=ఎట్లు, జ్ఞానేన=జ్ఞానముచేత (శక్యమగునో), తథా = అట్లు, విషయేషు = విషయములయందు, ప్రజుష్టాని= ప్రవర్తించియుండెడి, ఏతాని=ఈ యింద్రియములను, నిత్యశః= సర్వదా, అసేవయా=నితాంత విషయసేవనము లేకపోవుట చేత, సంనియంతుం=వశపరచుకొనుటకు, న శక్యంతే=శక్యములు కావు.

తా. జ్ఞానముయొక్క సహాయముతో, యథాయోగ్యముగా విషయసుఖముల ననుభవించుచు, విషయానక్తములగు

ఇంద్రియముల నన్నిటిని, నిరంతరము వశమునందుంచుకొనుట సాధ్యమగునుగాని, సంపూర్ణ విషయపరిత్యాగమువలన, ఇంద్రియములను వశపరచుకొనుట ఎన్నడును సాధ్యము కాదు.

వ్యా. విషయసుఖాస్వాదనము సంపూర్ణముగా పరిత్యజించిన యెడల, ఇంద్రియములు తప్పక వశీభూతము అగు ననుకొనగూడదు. వివేకముయొక్క సాహాయ్యమువలన, ఏ విషయములు హేయములో, ఏవి ఉపాదేయములో, విభజించి తెలిసికొని, హేయవిషయములను పరిత్యజించుచు, ఉపాదేయ విషయములను గ్రహించుచు, క్రమక్రమముగా ఇంద్రియసంయమరూపసంసిద్ధిని పొందవలయును.

ఏ ఇంద్రియములను సంపూర్ణముగా అణచివేయుటకంటె, వానిని సద్విషయములలో చొప్పించుట మేలనియు, ఇంద్రియనిగ్రహమునకు సంపూర్ణ అసేవనముకంటె, వాని సద్వ్యవహారమును, జ్ఞానముచే నడుపబడుటయు, మంచి యుపాయములనియు ఈ శ్లోకము చెప్పుచున్నది.

శ్లో॥ అవిద్వాంస మలం లోకే, విద్వాంస మపి వా పునః ।
ప్రమదా హ్యుత్పథం నేతుం, కామక్రోధ వశానుగం॥౬

[మనుసంహిత II. ౨౧౪ ]

ప. అవిద్వాంసం, అలం, లోకే, విద్వాంసం, అపి, వా, పునః, ప్రమదాః, హి, ఉత్పథం, నేతుం, కామక్రోధ వశానుగమ్.

టీ. లోకే=లోకమునందు, అవిద్వాంసం=విద్వాంసుడు కాని వానిని, పునః=మరియు, విద్వాంసమపి వా=విద్వాంసు నయినను, కామక్రోధవశానుగం=కామక్రోధములకు స్వాధీను డయిన పురుషుని, ప్రమదాః=స్త్రీలు, ఉత్పథం=విషమమార్గ మును, నేతుం=పొందించుటకు, అలం=సమర్థులు.

తా. ఈ ప్రపంచమునందు కామక్రోధపరవశుడగు పురుషుడు పండితుడయినను సరే, పామరుడయినను సరే, అతనిని స్త్రీలు సులభముగా దుష్పథమున కీడ్వ సమర్థులు. ఇంద్రియసంయమము తోడుపడినట్లు, పాండిత్యము సాయ పడదు.

వ్యా. విద్యయున్నంతమాత్రమున జితేంద్రియుడు కాడు. ఎవడు కామక్రోధాది అరిషడ్వర్గముయొక్క అధీనుడయి యుండునో అతడు విద్వాంసుడయినను సరే, మూర్ఖుడయినను సరే, సులభముగా, ధర్మపథభ్రష్టుడు కావలసి వచ్చును. కావున, సర్వవిధములచేతను, అంతి శ్శత్రువుల వశపరచుకొన ప్రయత్నింపుము.

వి. కేవల పాండిత్యము సచ్చరిత్రకు సాధనభూతము కాజాలదు కామక్రోధాదులకు లోనగువాడు సులభముగా తప్పుదారి కీడ్వబడును. ఈ శాస్త్రకారుడు, పురుషులయందుండెడు పక్షపాతముచే, స్త్రీల మీద, అనవసరముగా, అన్యాయముగా, ఒక నిందాబాణమును వదలుచున్నట్లు, ఈ శ్లోకమువలన కానవచ్చుచున్నది.

శ్లో॥ వశేకృత్వేంద్రియగ్రామం, సంయమ్య చ మన స్తథా।
సర్వాన్ సంసాధయే దర్థాన్,అక్షిణ్వన్ యోగత స్తనుమ్॥ ౭

[మనుసంహిత, II ౧౦౦]

ప. వశే, కృత్వా, ఇంద్రియగ్రామం, సంయమ్య, చ, మనః, తథా, సర్వాన్, సంసాధయేత్, అర్థాన్, అక్షిణ్వన్, యోగతః, తనుమ్.

టీ. ఇంద్రియగ్రామం = బహిరింద్రియగణమును, వశే కృత్వా=వశముచేసికొని, తథా=ఆలాగుననే, మనః=మనస్సును, సంయమ్య చ=నియమించి, తనుం = శరీరమును, అక్షిణ్వన్=పీడించక, యోగతః=ఉపాయమువలన, సర్వాన్ అర్థాన్= సకల పురుషార్థములను, సంసాధయేత్=సాధింపవలయును.

తా. శరీరము కృశించి శిథిలము కాకుండు నుపాయము నవలంబించి, ఇంద్రియముల నన్నిటిని వశపరచుకొని సర్వార్థములను జయప్రదముగా సాధింప ప్రయత్నింపవలయునుగాని, కృచ్ఛ్ర సాధనముల నవలంబించి, శరీరారోగ్యము చెడగొట్టుకొనరాదు.

వ్యా. ఉపవాసాదుల ద్వారమున, శరీరమును క్షీణింపజేయుట, పురుషార్థమును సాధించుటకు నిజమయిన యుపాయము కాదు. అట్టి కృచ్ఛ్ర సాధనలవలన మనుష్యుడు నిస్తేజుడయి, శక్తివిహీనుడయి పాపాచరణమునుండి ఎట్లు మరలునో, అట్లే పుణ్యకార్యములు చేయుటకును అసమర్థుడగును కావున, మనస్సును ఇంద్రియములను అపవిత్ర విషయ భోగములకొరకు ఉన్ముఖములు గాకుండునట్లు, వశపరచుకొని, తగిన యుపాయము నవలంబించి పురుషార్థమును సాధించుటయందు ప్రవృత్తుడవు కమ్ము నేత్రశ్రోత్రాది జ్ఞానేంద్రియములద్వారా జ్ఞానము నార్జించుచు, హస్తపాదాది కర్మేంద్రియములద్వారా కర్మల నాచరించుచు, లోకలోకాంతరములకు ప్రయాణము చేయుచు, జీవాత్మ జ్ఞానమునందును ధర్మమునందును అంతకంత కభివృద్ధి నొందుచుండునను పరమోద్దేశముతో పరమేశ్వరుడు మనుష్యునకు ఈ రెండు విధములయిన ఇంద్రియములను అనుగ్రహించెను. కాని, ఇంకను ఆయన దయ యెట్టిదో చూడుడు.- ఆ జ్ఞానోపార్జన, సత్కర్మానుష్ఠానములతోపాటు విషయ సుఖమును సహి

తము ఆస్వాదించి, సౌఖ్య మనుభవింపగలుగుట కంగీకరించెను. కాని, ఏ పురుషుడు ఇంద్రియములుండుటవలని ప్రధానోద్దేశమును మరచి, కేవలము వాని ఆనుషంగికఫలములయిన విషయసుఖభోగములయందే ప్రమత్తుడయి, సంతృప్తి నొందుచుండునో, అట్టి నరుడు తప్పక అవనతి నొందును, పరమ పురుషార్థమును గోల్పోవును.

వి. ఈ శ్లోకము శరీరమును శుష్కింపజేయుట మొదలయిన కృచ్ఛ్రసాధనలను నిషేధించుచున్నది. మనస్సంయమమును, ఇంద్రియసంయమమును, ఈ యుభయమును ప్రశంసిచుచున్నది



# ౧౪ అధ్యాయము



శ్లో. యదా న కురుతే పాపం, సర్వభూతేషు కర్హిచిత్ ।
కర్మణా మనసా వాచా, బ్రహ్మ సంపద్యతే తదా ॥ ౧

[మహాభారత, ఆదిపర్వ, ౩౭. ౫౧.]

ప. యదా, న, కురుతే, పాపం, సర్వభూతేషు, కర్హిచిత్, కర్మణా, మనసా, వాచా, బ్రహ్మ, సంపద్యతే, తదా.

టీ. యదా=ఎప్పుడు (మనుష్యుడు), కర్హిచిత్=ఒకప్పుడయినను, కర్మణా=తన ప్రవర్తనచేతగాని, మనసా=మనస్సుచేతగాని, వాచా = వాక్కుచేతగాని, సర్వభూతేషు = సమస్త భూతములయందును, పాపం న కురుతే=పాపమును చేయడో, తదా=అప్పుడు, (అతడు), బ్రహ్మ=బ్రహ్మమును, సంపద్యతే=పొందుచున్నాడు.

తా. మానవు డెప్పుడు, మనస్సుచేతగాని, వాక్కుచేతగాని, కర్మముచేతగాని, ఏ జీవియెడలను పాపము నాచరింపడో, అప్పుడే బ్రహ్మోపలబ్ధిని పొందగలడు.

వ్యా. ఎవరికిని అనిష్టమును చేయకుము. ఎవరికయినను అనిష్టము చేయవలయునని మనసునందయినను సంకల్పించుకొనకుము అన్యుల కనిష్టము కలుగు వాక్యముల నయినను పలుకకుము. నీ వితరుల కనిష్టము నాచరించితివా, నీవే పాపపంకమునందు నిమగ్నుడ వగుదువు కనుక, మనోవాక్కాయములయందు పరిశుద్ధుడవయి, అందరియెడలను సద్భావ మును కనబరచుము. అందువలన, నీవు పవిత్రాత్ముడవయి, పవిత్రస్వరూపు డయిన పరమేశ్వరుని పొందుటకు సమర్థుడ వగుదువు

వి. ఈ పదునాల్గవ యధ్యాయము, దుష్కార్యములు పరిత్యజించి, ధర్మజీవనము గడుపవలెనని బోధించుచున్నది ధర్మజీవనముయొక్క ప్రాముఖ్యతను తెలుపు పెక్కు శ్లోకము లిందు చేర్పబడినవి. మనోవాక్కాయకర్మలచే దుష్టకర్మలను పరిత్యజించిననేగాని, ఈశ్వరోపలబ్ధి కలుగదని, ఈ మొదటి శ్లోకము నుడువుచున్నది.

శ్లో. పుణ్యం కుర్వన్ పుణ్యకీర్తిర్, పుణ్యస్థానం స్మ గచ్ఛతి।
పుణ్యం ప్రాణాన్ ధారయతి, పుణ్యం ప్రాణద ముచ్యతే॥ ౧

[మహాభారత, ఆదిపర్వ, ౧౫౭ ౪౫-ఉద్యోగపర్వ ౩౪. ౬౪ ]

వ. పుణ్యం, కుర్వన్, పుణ్యకీర్తిః, పుణ్యస్థానం, స్మ, గచ్ఛతి, పుణ్యం, ప్రాణాన్, ధారయతి, పుణ్యం, ప్రాణదమ్, ఉచ్యతే.

టీ. పుణ్యం కుర్వన్=పుణ్యముచేయువాడయి, పుణ్యకీర్తిస్సన్=పవిత్రమయిన కీర్తిగలవాడయి, (మానవుడు) పుణ్యస్థానం=పుణ్యలోకమును, గచ్ఛతిస్మ=పొందుచున్నాడు గదా! (ఏ హేతువుచేత) పుణ్యం=పుణ్యము, ప్రాణాన్=ప్రాణములను, ధారయతి=ధరింపజేయుచున్నదో, (ఆకారణమువలన) పుణ్యం=పుణ్యము (లోకులకు), ప్రాణదం = ప్రాణమిచ్చునదియని, ఉచ్యతే=చెప్పబడుచున్నది.

తా. మనుష్యుడు పుణ్యకర్మము చేసినయెడల, పవిత్రకీర్తిని పొందును. పుణ్యలోకముల కేగును. పుణ్యము జీవుల ప్రాణమును సంరక్షించును. పుణ్యము ప్రాణదాత యని చెప్పబడుచున్నది.

వ్యా. అన్నపానము లెట్లు భౌతిక జీవనమును పోషించి సంరక్షించునో, అట్లే, ధర్మము ఆధ్యాత్మిక జీవనమును పోషించి, సంరక్షించును. కనుక, ఏ కర్మలు చేయుటవలన హృదయము ధర్మయుతమయి, పవిత్రవంతమగునో, అట్టి కర్మలు చేయుటయందు, సదా యత్నశీలుడవు కమ్ము నిషిద్ధకర్మలు పరిత్యజించి, ఎట్లు పాపరహితుడ వగుదువో, అట్లే విహిత కర్మల నాచరించి, పుణ్యవంతుడ వగుము ధర్మాత్ముడు ఐహికము నందు పవిత్ర కీర్తి నార్జించి, ఆముష్మికమునందు ఉన్నతలోకముల నొందును.

వి. ఈ శ్లోకము ధర్మజీవనమును విశేషముగా స్తవము చేయు చున్నది. ధార్మికునకు ఇహసౌఖ్యమును, పరసౌఖ్యమును ఉభయమును కలుగునని చెప్పుచున్నది.

శ్లో. పాపం చింతయతే చైవ, బ్రవీతి చ కరోతి చ।
తస్యాధర్మే ప్రవిష్టస్య, గుణా నశ్యన్తి సాధవః॥ 3

[మహాభారత, వనపర్వ, ౨౧౯ ౯.]

ప. పాపం, చింతయతే, చ, ఏవ, బ్రవీతి, చ, కరోతి, చ, తస్య, అధర్మే, ప్రవిష్టస్య, గుణాః, నశ్యన్తి, సాధవః.

టీ. పాపమేవ=(ఎవడయితే) పాపమునే, చింతయతే చ=తలంచుచున్నాడో, బ్రవీతి చ=వచించుచున్నాడో, కరోతి చ=చేయుచున్నాడో, అధర్మే ప్రవిష్టస్య=అధర్మమునందు ప్రవేశించిన, తస్య = అతనియొక్క, సాధవః = యోగ్యములయిన, గుణాః=గుణములు, నశ్యన్తి=నశించుచున్నవి.

తా. ఎవడు అధర్మమునందు ప్రవృత్తుడయి, పాపచింత, పాపాలాపము, పాపానుష్ఠానము చేయునో, వాని సద్గుణము లన్నియు అచిరకాలముననే వినష్టమయిపోవును.

వ్యా. చింతాస్రోత మేదో యొక విషయమునందు ప్రవహింపక, నిరాధారముగా నుండెజాలదు మనుష్యు డెప్పుడు సద్విషయములను గురించి యాలోచించునో, అప్పు డాయన సద్భావములన్నియు స్ఫూర్తి యుక్తములయి, సత్కర్మానుష్ఠానముకొరకు ఆయనకు ప్రవృత్తిని, కోరికను జనింపజేయును. అట్లే, అత డెప్పుడు అసద్విషయములను గురించి యాలోచించుచుండునో, అప్పు డాయన యసద్భావము లన్నియు ఉద్దీపనము నొంది, ఆయనను పాపాలాపమునందును, పాపాచరణమునందును ఉత్సాహవంతునిగా జేయును కావున, పాపచింత ఉదయమయిన వెనువెంటనే, దాని నున్మూలనముచెయ సమకట్టుము పాపపు టాలోచనలు ప్రబలమయిన యెడల, మానవులు సహిష్ణుతను గోల్పోయి, పాపకార్యములయందు ప్రవృత్తులగుదురు వా రిట్లు క్రమక్రమముగా పాపమునందు నిమగ్నులగుదురు ఎవరిట్లు క్రమాగతముగా పాపకార్యముల నాచరించుచు, పాపమునందు ప్రవిష్టులయి యుందురో, అట్టివారి మిగిలిన సద్గుణము లన్నియు, అంతర్హితములగును కనుక, నీ యాలోచనల నెప్పుడును సద్విషయములయందే వినియోగింపుము. పాపాలాప పాపకర్మములు సంపూర్ణముగా పరిత్యజింపుము

వి. ఈ శ్లోకము అధర్మజీవితమును నిరసించుచున్నది మనోవాక్కాయకర్మలలో అపరిశుద్ధుడయిన మానవుని సుగుణములన్నియు, స్వల్పకాలములోనే నశించుననికూడ చెప్పుచున్నది.

శ్లో. యే పాపాని న కుర్వంతి, మనో వాక్కర్మ బుద్ధిభిః ।
తే తపంతి మహాత్మానో, న శరీరస్య శోషణం ॥ ౪

[మహాభారత, వనపర్వ, ౧౯౯ అ.]

ప. యే, పాపాని, న, కుర్వన్తి, మనోవాక్కర్మబుద్ధిభిః, తే, తపన్తి, మహాత్మానః, న, శరీరస్య, శోషణం.

టీ. యే = ఎవరు, మనోవాక్కర్మ బుద్ధిభిః = మనోవాక్కర్మ బుద్ధులచేత, పాపాని=పాపములను, న కుర్వంతి=చేయరో, తే మహాత్మానః=ఆ మహాత్ములు, తపంతి=తపము చేయుచున్నారు. శరీరస్య శోషణం=శరీరశోషణమును (చేయువారు), న=(తపస్సు చేసెడివారు) కారు.

తా. తపస్సు చేయు వ్యాజమున శరీరమును శుష్కింపజేసికొనువారు నిజమయిన తపస్వులు కారు. ఎవరు మనోవాక్కాయకర్మలచేతగాని, బుద్ధిద్వారమునగాని, ఎంతమాత్రమును పాపము నాచరింపరో, అట్టి మహాత్ములే నిజమయిన తపోధనులు.

వ్యా. పాపపు కోరికలు, పాపపు టుద్దేశములు, పాపోత్పత్తికరములగు వాక్యములు, కార్యములు విడిచిపెట్టుము. సర్వవిధములను

నిష్పాపులయి యుండుటకు చేయు తీవ్ర ప్రయత్నమే తపస్సు ఉప వాసాది కృచ్ఛ్రసాధనములద్వారా శరీరమును శుష్కింపజేయుట తపస్సు కాదు

వి. మనోవాక్కాయకర్మలచే పాపమునకు దూరముగా నుండ వలయు ననియు, అదే నిజమయిన తపస్సనియు, శరీరశోషణము మొద లయినవి తపస్సు కాదనియు, ఈ శ్లోక ముపదేశించుచున్నది.

శ్లో॥ ప్రాజ్ఞో ధర్మేణ రమతే, ధర్మంచైవోపజీవతి।
ధర్మాత్మా భవతి హ్యేవం చిత్తం చాస్యప్రసీదతి॥　　౫
[మహాభారత, వనపర్వ, ౨౦౮. ౪౬—౩౦౮ ౪౫.]

ప. ప్రాజ్ఞః, ధర్మేణ, రమతే, ధర్మం, చ, ఏవ, ఉపజీ వతి, ధర్మాత్మా, భవతి, హి, ఏవం, చిత్తం, చ, అస్య, ప్రసీదతి.

టీ. ప్రాజ్ఞః=ప్రజ్ఞావంతుడు, ధర్మేణ సహ = ధర్మముతో కూడ, రమతే=విహరించుచున్నాడు. ధర్మంచైవ ఉపజీవతి= ధర్మకార్యములు చేయుటయే జీవనోపాయముగా జేసికొని ప్రాణములు నిలువబెట్టుకొనుచున్నాడు. ఏవం హి=ఈ ప్రకా రముగానే, ధర్మాత్మా=ధర్మశీలుడు, భవతి=అగుచున్నాడు.

అస్య=ఈ ధర్మాత్ముని యొక్క, చిత్తం=చిత్తము, ప్రసీదతి= ప్రసన్నమగుచున్నది (నిర్మలమగుచున్నది)

తా. ప్రాజ్ఞుడయినవాడు ధర్మమునందే ఆనందించును. ధర్మమార్గముననే జీవితనిర్వాహణము చేసికొనును. ఇట్టి మార్గానుసరణమువలననే, మనుష్యుడు ధర్మాత్ముడగుచున్నాడు, మరియు వాని చిత్తమును ప్రసన్నతనొందుచున్నది.

వ్యా. ప్రాజ్ఞుడు, వివేకముయొక్క వెలుగులో పవిత్రత యొక్క సౌందర్యమును, పాపముయొక్క వికార స్వరూపమును దర్శించి, పాపకృత్యములనుండి మరలి, ధర్మకార్యముల ననుష్ఠించుచు, ధర్మపథమునందుండియే తన జీవన నిర్వాహణమును చేసికొనుచుండును. పాపాచరణజనితమును పరిణామమునందు క్లేశజనకమును, అగు క్షణభంగురసుఖమును పరిత్యజించి, అమూల్యమగు ఆత్మప్రసాదము ననుభవించుచుండును. కనుక, ధర్మానుష్ఠానమునందు తాత్కాలికముగా నెట్టి కష్టమనుభవింపవలసి వచ్చినను భీతచిత్తుడవయి ధర్మాచరణమునుండి పరాఙ్ముఖుడవు గాకుము అట్లే, పాపాచరణమునం దెట్టి తాత్కాలిక సుఖము లభించినను, మోహపరవశుడవయి, దానియందు ప్రవృత్తుడవు గాకుము రెండవ పక్షమున, నీ ప్రజ్ఞయొక్క సాహాయ్యమువలన పుణ్యపాపముల యొక్క భావిఫలాఫలములను గురించి, సదా పర్యాలోచనము చేయుచుండుము.

వి. ఈ శ్లోకము ధర్మముయొక్క జగన్మోహన సౌందర్యమును పునః ప్రశంసించుచున్నది. పామరులు, అల్పజ్ఞులు అగువారు ఆకర్షింపబడు శారీరిక సౌందర్యముకంటె, హృదయ సౌందర్యమే ఘనసౌందర్యము ధర్మజీవనముచె ఈశ్వరప్రసాదమును ఆత్మప్రసాదమును ఉభయమును కలుగుచున్నవి.

శ్లో. యస్యాత్మా విరతః పాపాత్, కల్యాణే చ నివేశితః ।
తేన సర్వ మిదం బుద్ధం, ప్రకృతి ర్వికృతిశ్చ యా ॥ ౬
[మహాభారత, ఉద్యోగపర్వ, ౩౪ అ—౩౬ అ ]

ప. యస్య, ఆత్మా, విరతః, పాపాత్, కల్యాణే, చ, నివేశితః, తేన, సర్వం, ఇదం, బుద్ధం, ప్రకృతిః, వికృతిః, చ, యా

టీ. యస్య ఆత్మా=ఎవని యాత్మ, పాపాత్=పాపము నుండి, విరతః=మరలినదయి, కల్యాణే చ=శుభకార్యమునందు, నివేశితః=ప్రవేశించి యున్నదో, తేన=ఆ వివేకిచేత, యా=ఏది, ప్రకృతిః=స్వభావసిద్ధమో, (ఏది) వికృతిః=స్వభావ విరుద్ధమో, ఇదం సర్వం=ఈ సమస్తము, బుద్ధం=తెలియబడుచున్నది.

తా. ఎవని హృదయము పాపమునుండి విరతినొంది, శుభకార్యానుష్ఠానమునందు ఆసక్తమయి యుండునో, అట్టి పురుషుడే, ఏది స్వభావసిద్ధమో, ఏది స్వభావవిరుద్ధమో, స్పష్టముగా తెలిసికొనగలడు.

వ్యా. ఆత్మ, పాపప్రవృత్తియం దున్నంతకాలము సత్యమును దర్శింపజాలదు విపరీత దృష్టిని కలిగియుండును దుఃఖమును జూచి సుఖమనుకొనును. పాపాకార్యములే సుఖహేతువులని భ్రమించును ఆపి చేదగును. ధర్మముయొక్క మధురాస్వాదనము తిక్తముగా కానుపించును. పాపకృత్యములను ప్రోత్సహించు దుష్టాత్ములే ప్రేమాస్పదులగుదురు. సాధుసంగమునందు విరక్తి కలుగును. ఈశ్వరుడు ఛాయామాత్రుడగును. ధర్మము శూన్యమని తోచును. తాత్కాలికసుఖమే సర్వస్వమని తోచును. అనంతజీవనము వయిపునకు దృష్టి మందగించును. ఆత్మ, ఇట్టి వికారదశను పొందినప్పుడు, ఏది స్వభావసిద్ధమో, ఏది స్వభావవిరుద్ధమో, తెలిసికొనలేనంత శోచనీయావస్థ సంప్రాప్తమగును కనుక, పాపాచరణమునుండి నివృత్తినొంది, పుణ్యాచరణమునందే ప్రవృత్తుడవు కమ్ము అట్లయిన యెడల, నీప్రజ్ఞ ప్రజ్వలితమయి, ఏది సత్పథమో, ఏది దుష్పథమో సులభముగా ప్రదర్శించుచుండును

వి. ఈ శ్లోకము ధర్మజీవనముయొక్క ఫలములను సూచించుచున్నది. పాపమును పరిత్యజించి, పుణ్యజీవితము నవలంబించినవాడు ధర్మాధర్మములయొక్క భేదమును సులభముగా తెలిసికొనగలడు. ఆయనయొక్క ఆధ్యాత్మికదృష్టి విమలమును తేజస్వంతమును అగును.

—౨౦౨—

శ్లో. ప్రజ్ఞాచక్షుం ర్నర ఇహ, దోషాన్నైవానురుధ్యతే।
విరజ్యతే యథా కామం, న చ ధర్మం విముంచతి॥ ౭
[మహాభారత, వనపర్వ ౨౦౮. ౫౦.]

ప. ప్రజ్ఞాచక్షుః, నరః, ఇహ, దోషాత్, న, ఏవ, అనురుధ్యతే, విరజ్యతే, యథా, కామం, న, చ, ధర్మం, విముంచతి.

టీ. ప్రజ్ఞాచక్షుః=జ్ఞాననేత్రములుగల, నరః = నరుడు, ఇహ=ఈలోకమునందు, దోషాన్=పాపములను, న ఏవ అనురుధ్యతే=అనుసరించడు. యథాకామం=కామాతిక్రమణము లేక (కామాతిశయము కలుగకుండుట కయి), విరజ్యతే=వీతరాగుడగుచున్నాడు (ఆశలు విడిచినవాడగుచున్నాడు). ధర్మం చ= ధర్మమునున్ను, న విముంచతి=విడువడు.

తా. ఎవనియొక్క జ్ఞాననేత్రము వికాసమునొందునో, అట్టివాడు ఈ లోకమునం దిక నెన్నడును, ఏ దోషమును చేయనొల్లడు. అతడు హృదయపూర్వకముగా విషయాసక్తిని పరిత్యజించును. ఎట్టి విపత్సమయమునందును ధర్మమును పరిత్యజింపడు.

వ్యా. అధర్మమునందు విరాగమును, ధర్మమునం దనురాగమును కల్యాణలాభమున కుపాయములు ఎవని జ్ఞాననేత్రము వికసించునో, అతడు ధర్మాధర్మముల ప్రకృతిని, పరిణామమును, యథార్థముగా దర్శించి, ధర్మము విషయమయి జాతరాగుడును, అధర్మము విషయమయి వీతరాగుడును అయి, మరే దోషమునందును లిప్తుడు కాడు. కావున, జ్ఞానము ద్వారా పాపమునందు విరాగమును, ధర్మమునం దనురాగమును అభివృద్ధి నొందించుకొనవలయును జ్ఞానియగువాడు ధర్మాధర్మములను విచారించి, ధర్మానుమోదితములు కాని విషయములయం దనురాగమును, అట్టి విషయ సేవనమును స్వేచ్ఛానుసారముగా పరిత్యజించును కాని, ధర్మానురాగమును, ధర్మానుష్ఠానమును ఎన్నడును పరిత్యజింపడు

వి. ఈ శ్లోకముకూడ ధర్మజీవనముయొక్క ఫలితముల నింకను పెంచి చెప్పుచున్నది ఆధ్యాత్మిక దృష్టి వికసించినవాడు ఎన్నడును పాప ప్రలోభనములలో దగుల్కొనడని కూడ చెప్పుచున్నది.

శ్లో. వార్యమాణోఽపి పాపేభ్యః, పాపాత్మా పాపమిచ్ఛతి।
చోద్యమానోఽపి పాపేన, శుభాత్మా శుభమిచ్ఛతి॥ ౭

[మహాభారత, ఉద్యోగపర్వ, ౧౩౯ ౭-౧౩౭ ౭.[

ప. వార్యమాణః, అపి, పాపేభ్యః, పాపాత్మా, పాపం, ఇచ్ఛతి, చోద్యమానః, అపి, పాపేన, శుభాత్మా, శుభం, ఇచ్ఛతి.

టీ. (ఎవడు) పాపాత్మా=పాపాచరణశీలుడో (వాడు), పాపేభ్యః=పాపకృత్యములనుండి, వార్యమాణః అపి=(అనేకులచే) నివారింపబడినవాడయినను, పాపం=పాపమునే, ఇచ్ఛతి=(చేయ) గోరుచున్నాడు. (ఎవడు) శుభాత్మా=ధర్మానుష్ఠానశీలుడో (వాడు), పాపేన=పాపముచేత, చోద్యమానః అపి=ప్రేరేపింపబడినవాడయినను, శుభమ్ ఇచ్ఛతి=శుభమునే చేయ గోరుచున్నాడు.

తా. పాపాత్ముడు పాపకృత్యములనుండి మరలింపబడుచున్నను, మరల మరల పాపమును చేయుటకే ప్రవృత్తుడగుచుండును. పుణ్యశీలుడు పాపకర్మలను చేయుటకు ప్రోత్సహింపబడినను, పుణ్యకృత్యములయందే ఆసక్తుడగుచుండును. కనుక, ధర్మానురక్తుడగు మానవుడు హృదయమును సంపూర్ణముగా ధర్మమునకే వశముచేయ నభ్యసింపవలయును.

వ్యా. పాపకార్యములు చేయుట ఒకసారి అభ్యాసమయిన యెడల ఆ యభ్యాసమునుండి తప్పించుకొనుట సులభసాధ్యము కాదు అట్లే, పుణ్యకార్యములు చేయుటయే, అభ్యాసమయినవానికి, పాపకార్యములయందు ప్రవృత్తి కలుగుటయు సులభము కాదు కనుక, అనుదినమును ధర్మానుష్ఠానము చేయు నభ్యాసము నలవరచుకొనుటయే, ధర్మమార్గము

నందు ముందుకు నడువగలుగుటకు ఉత్కృష్టోపాయము. ప్రప్రథమమున నది కష్టముగా కానుపించినను, దాని నెట్లో సహించుకొని, ధర్మాచరణ మభ్యసించినయెడల, తుద కది అత్యంత సులభ వ్యాపార మగును

వి. ఈ శ్లోకము అభ్యాసముయొక్క బలమును సూచించుచున్నది. ఒక్కసారి దురభ్యాస మలవడినయెడల, దానినుండి విముక్తు డగుట దుర్లభము. అట్లే, సదభ్యాసములుగలవాడు సులభముగా దుర్వ్యసనములలో దిగడు కావున, సదా సదభ్యాసములనే అలవరచుకొనవలయును

శ్లో. ధర్మ ఏవ హతో హన్తి, ధర్మో రక్షతి రక్షితః ।
తస్మాద్ధర్మో నహంతవ్యో, మానో ధర్మో హతో వధీత్ ॥ ౯

[మనుసంహిత, ౮ ౧౫_మహాభారత, వనపర్వ, ३౧౨. ౧౨౮.]

ప. ధర్మః, ఏవ, హతః, హన్తి, ధర్మః, రక్షతి, రక్షితః, తస్మాత్, ధర్మః, న, హన్తవ్యః, మా, నః, ధర్మః, హతః, వధీత్.

టీ ధర్మః=ధర్మము, హతః=హతముచేయబడినదయి (అతిక్రమింపబడినదయి), హన్తి ఏవ=(తనను హతముచేసెడి వారిని) హతముచేయుచున్నది. ధర్మః=ధర్మము, రక్షితః= రక్షింపబడినదయి, రక్షతి=(రక్షించెడివారిని) రక్షించుచున్నది.

తస్మాత్=అందువలన, ధర్మః=ధర్మము, న హంతవ్యః=హతము చేయబడగూడదు (అతిక్రమింపబడగూడదు). ధర్మః=ధర్మము, హతః=హతముచేయబడినదయి, నః=మమ్ము, మా వధీత్ = హతముచేయకుండునుగాక!

తా. ఎవడు ధర్మమునకు హానిచేయునో, అనగా ధర్మము నుల్లంఘించునో, వానిని ధర్మమే హతమొనరించును. ఎవడు ధర్మమును సంరక్షించునో, అనగా ధర్మము ననుసరించునో, అతనిని ధర్మమే సంరక్షించును. కనుక, ధర్మము నెన్నడును మీరరాదు. ధర్మము మనచే హతమొనరింపబడినదయి, మనలను హతమొనరింపకుండునుగాక!

వ్యా. ఎవడు ధర్మము నుల్లంఘించునో, అతడు దుర్గతిని పొంది, దుఃఖ మనుభవింపవలసి వచ్చును ఎవడు ధర్మమును పాలించునో అతడౌన్నత్యము నొంది సుఖించును. ఈశ్వరుడు మన కల్యాణముకొరకే ఇట్టి నియమమును ప్రతిష్ఠించెను కనుక, ఆయన శుభాభిప్రాయము యెడలను, అనుల్లంఘనీయ నియమము యెడలను శ్రద్ధావంతులయి, ప్రాణమునయినను పణముగా నొడ్డి ధర్మమును పాలించుచు, ఆయన కిష్టమయిన కల్యాణమయ మార్గమునందే ముందుకు నడువవలెను. ధర్మము నుల్లంఘించి అధః పతితులు కాగూడదు.

వి. ఈ శ్లోకము ధర్మముయొక్క అనతిక్రమణీయ నియమమును చక్కని భాషలో వర్ణించుచున్నది. ధర్మనియమమును మీరినయెడల సర్వనాశ మనివార్యము. ధర్మపాలనమువలన జయము నిస్సందేహము.

శ్లో. ఏక ఏవ సుహృద్ధర్మో, నిధనే ప్యనుయాతి యః ।
శరీరేణ సమం నాశం, సర్వ మన్యద్ధి గచ్ఛతి ॥ ౧౦

[మనుసంహిత]

ప. ఏకః, ఏవ, సుహృత్, ధర్మః, నిధనే, అపి, అను యాతి, యః, శరీరేణ, సమం, నాశం, సర్వం, అన్యత్, హి, గచ్ఛతి.

టీ. ధర్మః ఏవ ఏకః సుహృత్ = ధర్మమొక్కటే మిత్రుడు, యః=ఏది (అది), నిధనే అపి=మరణమునందును, అనుయాతి=(అభీష్టఫలము నిచ్చుటకయి) వెంబడించుచున్నది. అన్యత్ సర్వం=మిగిలిన వన్నియు (భార్యాపుత్రధనాదికము సమస్తమును), హి=ప్రసిద్ధముగా, శరీరేణసమం=శరీరముతో, నాశం గచ్ఛతి=వినాశము నొందుచున్నది (కనుక, దారా పుత్రాదుల యందలి మమకారముచే ధర్మోల్లంఘనము చేయ గూడదు.)

తా. ధర్మము మరణకాలమునందయినను మానవుని విడిచిపెట్టక, వెంటనంటి వచ్చును. మిగిలినవన్నియును, శరీరముతోపాటు వినాశము నొందునవియే. మిగిలినవారందరును మరణముతో నాగిపోవువారే. కనుక, అందరికిని ధర్మమొక్కటే పరమమిత్రము.

వ్యా. మరణానంతర మేయే విషయములతో మనుష్యునకు సంబంధము విడిపోవునో, అట్టి విషయములయందు అత్యంతాసక్తుడవు గాకుము. మరియు, ధర్మముయొక్క అనురోధమువలన వాటినన్నిటిని తృణప్రాయముగా పరిత్యజించుటకును కుంఠితుడవు గాకుము. ఇక్కడి దేవియు మన వెంటరావు. పుణ్యపాపములు రెండే మన వెంటనంటి వచ్చును. పుణ్యము ప్రాణస్నేహితునివలె మనలను ఉన్నతలోకములకు గొనిపోవును. పాపము గర్భశత్రువువలె, భయానకమయి, మనల దుఃఖాగ్ని యందు దగ్ధముచేయును. కనుక, జీవితకాలమంతయు, ధర్మము నాశ్రయించియుండి, మిగిలిన యన్నిటియందు కంటెను, ధర్మమునందే అత్యంతానురక్తులు కండు

వి. ఈ శ్లోకము ధర్మముయొక్క శాశ్వతఫలమును గురించి చెప్పుచున్నది. ఐహిక జీవితముతో విడిచిపెట్టక మరణానంతరముకూడ వెంబడించునది ధర్మమొక్కటే. లోకుల మెప్పున కుబ్బియు, నిందకు భయపడియుగాక, ధర్మముయొక్క సౌందర్యమును, అధర్మముయొక్క వికారమును గ్రహించి, చిరజీవనసఖుడగు ధర్మమును చేపట్టుము

శ్లో. న ధర్మోఽస్తీతి మన్వానాః, శుచీ నవహసన్తి యే ।
అశ్రద్దధానా ధర్మస్య, తే నశ్యన్తి న సంశయః॥ ౧౧

[మహాభారత, వనపర్వ, ౨౦౬. ౪౬.]

ప. న, ధర్మః, అస్తి, ఇతి, మన్వానాః, శుచీన్, అవహసన్తి, యే, అశ్రద్దధానాః, ధర్మస్య, తే, నశ్యన్తి, న, సంశయః.

టీ. యే=ఎవరు, ధర్మః=ధర్మము, నాస్తి ఇతి=లేదని, మన్వానాః=తలచినవారలయి, శుచీన్=ధర్మిష్ఠులను,అవహసన్తి=పరిహాసము చేయుచున్నారో, (ఎవరు) ధర్మస్య అశ్రద్దధానాః=ధర్మమునందు శ్రద్ధాళువులు గాకయున్నారో, తే=వారును, నశ్యన్తి=నశించుచున్నారు. న సంశయః=సందేహము లేదు.

తా. ధర్మమనున దొకటి లేదనుకొని, ధర్మాత్ములగు సాధుపురుషుల నపహసించుచు, ధర్మమునం దశ్రద్ధ వహించువారు, తప్పక వినాశము నొందుదురు. అందుకు సందేహము లేదు.

వ్యా. ధర్మమనున దొకటి లేదని, ఎన్నడును అనుకొనకుము, ధార్మికులను పరిహాసింపకుము. ఎప్పుడయినను ధర్మమునెడల, అవిశ్వాసము

జనించినయెడల, నీవు నీ స్వాభావికస్థితిని గోల్పోయితివనియు, మహా విపత్తు తటస్థింప నున్నదనియు, గ్రహించి సావధానుఁడవు కమ్ము జడ రాజ్యమునం దెట్లు భౌతికనియమములు స్థాపితములయి యున్నవో, అట్లే ఆధ్యాత్మిక ప్రపంచమునందును ధర్మనియమములు సంస్థాపితములయి యున్నవి ఎంతమాత్రమును సందేహము లేదు ఈశ్వరు డెట్లు ప్రకృతికి నియంతయయి యున్నాడో, అట్లే, సమస్త ఆత్మలకును నియంతయయి యున్నాడు విశ్వమునం దెక్కడను అరాజకత యనునది లేదు పాపాత్ము డవశ్యము దండింపబడును, పుణ్యాత్ము డవశ్యము బహూకరింపబడును.

వి. ఈ శ్లోకము ధర్మముయొక్క సత్యత్వమును గురించి చెప్పుచున్నది ధర్మమనునది లేదని, మతమును మతప్రవర్తకులను పరిహసించువారు తప్పక వినాశము నొందుదురు.

శ్లో. సుఖం హ్యవమతః శేతే, సుఖం చ ప్రతిబుధ్యతే।
సుఖం చరతి లోకేఽస్మిన్, అవమన్తా వినశ్యతి॥     ౧౨
[మహాభారత, శాంతిపర్వ, ౨౯౯. ౨౬.]

ప. సుఖం, హి, అవమతః, శేతే, సుఖం, చ, ప్రతిబుధ్యతే, సుఖం, చరతి, లోకే, అస్మిన్, అవమన్తా, వినశ్యతి.

టీ. అవమతః=అవమానింపబడినవాఁడు, సుఖం హి=సుఖముగా, శేతే=నిద్రించుచున్నాఁడు. సుఖం చ=సుఖముగానే, ప్రతిబుధ్యతే=మేల్కొనుచున్నాఁడు. అస్మిన్ లోకే=ఈ

లోకమునందు సుఖం చరతి=సుఖముగా సంచరించుచున్నాడు. అవమన్తా=అవమానించెడువాడే, వినశ్యతి=నశించుచున్నాడు.

తా. అవమానింపబడినవాడు సుఖముగా నిద్రించి, సుఖముగా మేల్కొని, సుఖముగా జీవననిర్వహణము చేయును. కాని, అవమానించువాడుమాత్రము వినాశము నొంది తీరును.

వ్యా. ఎవరిని అవమానింపకుము. ఎవడు అవమానింపబడునో, అతనికి నిజముగా నేయనిష్టమును సంభవింపదు. కాని, ఎవడు అవమానించునో, అతడే ఆ యవమానమువలని యనిష్టము ననుభవింపవలసి వచ్చును

వి. అన్యాయాచరణము ఆత్మహత్యవంటిదని ఈ శ్లోకము సుడువు చున్నది అన్యాయము చెయబడినవానికి ఏ యనిష్టమును కలుగదు. అన్యాయము చేసినవాడే దాని ఫలము ననుభవించును. ప్రకృతి నియమముల వలెనే, ఇదియును ఒక అనుల్లంఘనీయ ఆధ్యాత్మిక నియమము.

శ్లో. పాపం కుర్వన్ పాపకీర్తిః, పాపమే వాశ్నుతే ఫలమ్।
పుణ్యం కుర్వన్ పుణ్యకీర్తిః, పుణ్యమత్యంతమశ్నుతే॥ ౧౩
[మహాభారత, ఉద్యోగపర్వ, ౩౫. ౭౧.]

ప. పాపం, కుర్వన్, పాపకీర్తిః, పాపం, ఏవ, అశ్నుతే, ఫలమ్, పుణ్యాం, కుర్వన్, పుణ్యకీర్తిః, పుణ్యాం, అత్యన్తం, అశ్నుతే.

టీ. పాపం కుర్వన్=పాపము చేసినట్లయితే, పాపకీర్తిః=పాపియను అపకీర్తిని పొంది, పాపమేవ=పాపమునే, ఫలం=ఫలముగా, అశ్నుతే=అనుభవించుచున్నాడు. పుణ్యాం కుర్వన్=పుణ్యము చేసినట్లయితే, పుణ్యకీర్తిః=పుణ్యాత్ముడను కీర్తిని పొంది, అత్యంతం=విశేషముగా, పుణ్యాం=పుణ్యమును, అశ్నుతే=అనుభవించుచున్నాడు.

తా. మనుష్యుడు పాపము నాచరించినయెడల, పాపాత్ముడను అపకీర్తి పాలగుటయేగాక, అశుభ ఫలముల ననుభవింప వలసి వచ్చును. పుణ్యకార్యములు చేసినయెడల, పుణ్యాత్ముడను సత్కీర్తి వహించుటయేగాక, అత్యంత శుభ ఫలముల ననుభవించును.

వ్యా. పాపకార్యములు చేసినయెడల, మనుష్యు లసంతుష్టులయి, వాని యపకీర్తిని ఘోషింతురు సర్వసాక్షియగు ఈశ్వరుడు సహితము వానిని దండించును. పుణ్యకార్యములు చేసినయెడల, మనుష్యులు సంతుష్టులయి వాని పవిత్ర కీర్తిని ప్రచారము చేయుదురు ఈశ్వరుడును వానిని బహూకరించును కనుక, పాపకృత్యములు చేసి, ఈ ప్రపంచమునందు

సుఖసంతోషములు పొందవచ్చుననియు, ధర్మమార్గమునందు నడిచినయెడల, ఈ లోకమునందు కేవలము కష్టములే అనుభవింపవలసి వచ్చుననియు, ఎన్నడును తలంపకుము. సర్వశక్తుడగు పరమేశ్వరుడు ధర్మమున కనుకూలుడు, అధర్మమునకు ప్రతికూలుడు. అతడు మనుష్యులను సహితము స్వాభావికముగా పాపమునకు విపక్షులుగను, పుణ్యమునకు స్వపక్షులుగను చేసి సృష్టించెను. ఎవడయినను పాపము నాచరించినయెడల, పరమేశ్వరుడు వానియంతరమునందుండి దండనను విధించును, మనుష్యులు బాహ్యమునందుండి దండింతురు మరియు, ఎవడయినను పుణ్యమాచరించినయెడల, ఈశ్వరుడు వాని హృదయమునందుండి బహూకరించును, మనుష్యులు వెలుపలనుండి బహూకరింతురు మానవసంఘముయొక్క తెలివిలేమి వలనను, విచారదోషమువలనను, అప్పుడప్పుడు, ఇందుకు వ్యతిక్రమము ఘటింపవచ్చును. కాని, న్యాయస్వరూపుడగు పరమేశ్వరుని మంగళ విధానమువలన, అత్యల్పకాలములోనే పుణ్యకార్యములు ద్విగుణీకృత తేజముతో విరాజిల్లుచుండును. పాపకార్యములు ద్విగుణీకృత హేయ భావముతో పదతలమునం దణచివేయబడును. మహాతేజస్వియగు దివాకరుని ప్రభను, మంచు ఎంతకాలము దాచియుంచగలదు? కనుక, పాపకర్మను పరిత్యజించి, పుణ్యకర్మల నాచరించి, ఉభయలోకములయందును తేజస్వంతముగా ప్రకాశించుము.

వి. ఈ శ్లోకముకూడ పాపకృత్యములవలని పాపఫలములను, పుణ్యకార్యములవలని పుణ్యఫలములను, గురించి విస్తరించుచున్నది.

శ్లో॥ తస్మాత్పాపం న కుర్వీత, పురుషః శంసితవ్రతః ।
పాపం ప్రజ్ఞాం నాశయతి, క్రియమాణం పునః పునః॥ ౧౮
[మహాభారత, ఉద్యోగపర్వ, ౩౮, ౬౨.]

ప. తస్మాత్, పాపం, న, కుర్వీత, పురుషః, శంసితవ్రతః, పాపం, ప్రజ్ఞాం, నాశయతి, క్రియమాణం, పునః, పునః.

టీ. తస్మాత్=ఆ కారణమువలన, పురుషః=పురుషుడు, శంసితవ్రతః=ప్రతిజ్ఞ చేసికొనినవాడయి, పాపం=పాపమును, న కుర్వీత=చేయకుండునుగాక ! పాపం=పాపము, పునః పునః= మరల మరల, క్రియమాణం (సత్) = చేయబడినదయి, ప్రజ్ఞాం=బుద్ధిని, నాశయతి=నాశనము చేయుచున్నది (కనుక, శ్రేయఃకాములచేత పాపసంబంధమును విడిచి, ధర్మాచరణమే చేయదగినది.)

తా. మరల మరల పాప మాచరించు పాపాత్ముని బుద్ధి త్వరలో వినాశమునొందును. కనుక, పురుషుడు దృఢ ప్రతిజ్ఞ చేసినవాడయి, పాపము నెన్నడును చేయకుండునుగాక!

వ్యా. దృఢప్రతిజ్ఞచేసి పాపకర్మముల బరిత్యజింపుడు. ప్రతిజ్ఞా బలమే లేనియెడల, పాపమును జయించుట కష్టసాధ్యము. పాపము

యొక్క సమ్మోహనశక్తి మనుష్యుని హఠాత్తుగా విమోహితునిగా జేయును. పాపము చేయనను కఠోర ప్రతిజ్ఞను సహితము శిథిలముచేసి, మానవ హృదయమును బలాత్కారముగా నాక్రమించును హృదయమునందు పాపానలము ప్రజ్వరిల్లినయెడల, బుద్ధి, హేతుజ్ఞానము వివేకము దగ్ధమగును. కావున, పరమేశ్వరుని హృదయమునందు నిలిపి దృఢవ్రతమును పూనుడు ఆయన సాహాయ్యమువలననేగాక, మరిదేని వలనను, పాపము చేయనను నీ ప్రతిజ్ఞ నెరవేరజాలదు

వి. దృఢప్రతిజ్ఞ చేసికొని, పాపకృత్యములు పరిత్యజింపవలయునని, ఈ శ్లోకము ఈ యధ్యాయమునందు మరల నొకసారి ప్రబోధించుచున్నది.



# ౧౫ అధ్యాయము



శ్లో. నిషేవతే ప్రశస్తాని, నిందితాని న సేవతే ।
అనాస్తికః శ్రద్దధానః, ఏతత్ పండితలక్షణమ్ ॥ ౧

[మహాభారత, ఉద్యోగపర్వ, 33 – ౨౩ ]

ప. నిషేవతే, ప్రశస్తాని, నిందితాని, న, సేవతే, అనాస్తికః, శ్రద్దధానః, ఏతత్, పండితలక్షణమ్.

టీ. (ఎవడయితే), ప్రశస్తాని = స్తుతియోగ్యములయిన శుభకర్మలను, నిషేవతే=చేయుచున్నాడో, నిందితాని=నింద నీయములయినవానిని, న సేవతే=చేయడో, అనాస్తికః=నాస్తి కుడు కాడో, శ్రద్దధానః=శ్రద్ధావంతుడో, (వానికి), ఏతత్ = ఇది, పండితలక్షణమ్=జ్ఞానముయొక్క ఫలము.

తా. ఎవడు నింద్యకర్మలను పరిత్యజించి, ప్రశస్త కర్మ ముల నాచరించునో, ఎవడు ధర్మమునందు శ్రద్ధావంతుడును, ఈశ్వరాస్తిత్వమునందు దృఢవిశ్వాసియు, అయియుండునో, అతడే నిజమయిన జ్ఞానసంపన్నుడు, పండితుడు.

వ్యా. ఎట్టి జ్ఞానము నార్జించినయెడల, హృదయము విశాల మగునో, సత్కార్యానుష్ఠానమునం దాసక్తి, అసత్కార్యలయందు విరక్తి కలుగునో, ధర్మమునం దాస్థయు, పరమేశ్వరునియెడల భక్తిశ్రద్ధలును ఉదయించునో, అట్టి జ్ఞానము నార్జించి, జ్ఞానవంతుడవు కమ్ము

వి. ఈ ౧౫ వ యధ్యాయము ధర్మజీవితమును నుతించుచు కొన్ని ధర్మకార్యములను, కొన్ని అధర్మకార్యములను వివరించుచున్నది. ఈ మొదటి శ్లోకము నిజమయిన జ్ఞానము ధర్మజీవితమునందే యున్నదని నిరూపించుచున్నది

శ్లో. ఏకో ధర్మః పరం శ్రేయః, క్షమైకా శాన్తి రుత్తమా।
విద్యైకా పరమా తృప్తిః, అహింసైకా సుఖావహా॥ ౧

[మహాభారత, ఉద్యోగపర్వ, 33. 48.]

ప. ఏకః, ధర్మః, పరం, శ్రేయః, క్షమా, ఏకా, శాంతిః, ఉత్తమా, విద్యా, ఏకా, పరమా, తృప్తిః, అహింసా, ఏకా, సుఖావహా.

టీ. ఏకః ధర్మః=ధర్మమొక్కటే, పరం=శ్రేష్ఠమయిన, శ్రేయః=కల్యాణ సాధనము. ఏకా క్షమా=క్షమ యొక్కటే, ఉత్తమా శాంతిః=ఉత్తమమయిన శాంతి. ఏకా విద్యా=విద్య యొక్కటే, పరమా తృప్తిః=ఉత్తమమయిన తృప్తిహేతువు.

ఏకా అహింసా=హింసచేయక పోవుట యొక్కటే, సుఖావహా=
సుఖమును పొందించునది.

తా. ధర్మ మొక్కటే సమస్త మంగళములను సమ
కూర్పగల పరమ సాధనము. క్షమాశీలతయొక్కటే మన
శ్శాంతిని సమకూర్పగల ఉత్తమ సాధనము. విద్యయొక్కటే
పరమ తృప్తిని కలిగింపగల ప్రశస్తోపాయము. అహింస
యొక్కటే నిత్య సుఖమునకు అమోఘ కారణము.

వ్యా. ధర్మానుసరణము తప్ప శుభప్రాప్తికి వేరొండు యుపా
యము లేదు కనుక, ధర్మపరాయణుడవు కమ్ము క్షమాశీలతను, సహిష్ణు
తను అభ్యసించి, శాంతి నార్జింపుము. విద్యానురక్తుడవయి తృప్తిసుఖము
ననుభవింపుము. ఎవరిని హింసింపక సుఖవంతుడవు కమ్ము.

వి ఈ శ్లోకము క్షమ, అహింస, విద్య మొదలయిన సుగుణము
లను స్తవము చేయుచున్నది

శ్లో. శుభాశుభ ఫలం కర్మ, మనోవాక్ దేహ సంభవం।
కర్మజా గతయో నృణాం, ఉత్తమాధమ మధ్యమాః॥౩

[మనుసంహిత, XII 3 ]

ప. శుభాశుభఫలం, కర్మ, మనోవాగ్దేహసంభవం,
కర్మజాః, గతయః, నృణాం, ఉత్తమాధమమధ్యమాః.

టీ. శుభాశుభఫలం = సుఖదుఃఖఫలముల నిచ్చెడు, కర్మ=కర్మము, మనోవాగ్దేహసంభవం=మనోవాగ్దేహసంభూతమయినది. (అట్లే) నృణాం=మనుష్యులకు, ఉత్తమాధమమధ్యమాః=ఉత్తమాధమమధ్యమములయిన, గతయః=గతులు (సహితము) కర్మజాః=కర్మలవలన కలుగునవే (అగుచున్నవి).

తా. మానవులయొక్క మానసిక, వాచిక, కాయికములగు త్రివిధ కర్మలనుండియే శుభాశుభ ఫలము లుద్భవించును. వానిననుసరించి, వారి ఉత్తమ, మధ్యమ, అధమ గతులు సహితము ఏర్పడును.

వ్యా. ఆలోచన మొదలయిన మానసిక క్రియలవలనను, వాక్యోచ్చారణము మొదలయిన వాచిక క్రియలవలనను, శరీరము ద్వారా అనుష్ఠింపబడిన శారీరిక క్రియలవలనను, ఈ త్రివిధ క్రియలవలనను, శుభాశుభ ఫలములు సంప్రాప్తములగును. మనస్సుతోగాని, వాక్కుతోగాని, శరీరముతోగాని మనుష్యుడు దేనిని చేయునో, దానిలో బిందుమాత్రమయినను విఫలము కాదు ఒక్క యాలోచన యయినను వ్యర్థము కాదు, ఒక్క వాక్యోచ్చారణమయినను వ్యర్థము కాదు, ఒక్క కార్యమయినను

వ్యర్థము కాను. సమస్తవిధ కర్మలనుండియు ఏదో యొక శుభఫలమో అశుభఫలమో ఉత్పన్నమయి ఆత్మయందు ప్రవేశించును ఆత్మ, తదను సారముగా ఉత్తమ, మధ్యమ, అధమ గతులను పొందును ఆలోచనద్వార మున, వాక్యోచ్చారణముద్వారమున, కర్మేంద్రియములద్వారము ఎంతెంత పుణ్యకార్యముల నాచరింతువో, అంతంత పవిత్రత నీ యాత్మ యందు సంచితమగును ఎంతెంత పాపకార్యముల నాచరింతువో, అంతంత మాలిన్యము నీ యాత్మయందు ఘటించును. కనుక, మనో వాక్కాయములచే సదా, శుభకర్మములయందే ప్రవృత్తుడవు కమ్ము

వి. మనుష్యులు వారివారి ప్రవర్తన ననుసరించియే మంచివా రును, చెడ్డవారును అగుచున్నారని ఈ శ్లోకము చెప్పుచున్నది మనో వాక్కాయకర్మలయొక్క మంచిచెడ్డలు ఆత్మయందవశ్యము పరిణ మించును

శ్లో. పరద్రవ్యే ష్వభిధ్యానం, మనసాఽనిష్టచింతనం।
వితథాభినివేశశ్చ, త్రివిధం కర్మ మానసం॥　　౮

[మనుసంహిత, XII ౫]

వ. పరద్రవ్యేషు, అభిధ్యానం, మనసా, అనిష్టచింత నమ్, వితథాభినివేశః, చ, త్రివిధం, కర్మ, మానసం.

టీ. పరద్రవ్యేషు = పరధనములయందు, అభిధ్యానం= తలంపు (ఎట్లు పరుల ధనమును అన్యాయముగా సంగ్రహిం

తును అను సంకల్పము), మనసా=మనస్సుచేతను, అనిష్టచింతనమ్=(లోకులకు) అనిష్టమును కలిగింతునను ఆలోచన, వితథాభినివేశః=వ్యర్థమయిన యభిప్రాయము (పరలోక మనునది లేదు, జగత్తునకు కారణమయిన పరమాత్మయనున దొకటి లేదు, అను అయోగ్యాభిప్రాయము)ను, త్రివిధం=ఈ మూడు విధములయిన (కర్మయు), మానసం=మనస్సువలన జనించు, కర్మ=(అశుభ ఫలప్రదమగు) కర్మగా నున్నది.

తా. పరద్రవ్యాపహారణచింత, లోకమున కనిష్టము కలుగవలయుననెడి ఆలోచన, జన్మాదులకు కారణుడగు పరమేశ్వరునియందును, పరలోక పరకాలములయందును అవిశ్వాసము, ఈ మూడు విధములయిన ఆలోచనలును మానసిక దుష్కర్మలు.

వ్యా. ఏ పురుషుడు పరద్రవ్యాపహారణము చేయవలయునని యూహించుకొనునో లోకుల కనిష్టము చేయవలయునని తలంచునో, "ఈశ్వరుడు లేడు, పరలోకము లేదు, ధర్మము లేదు" అని యాలోచించునో, అతడు మనస్సులోనే పాపము చేయును. మనసులోనే పాపము నాలోచించుకొనుట, సంకల్పించుకొనుట, ఇది మానసిక పాపకర్మయని పరిగణింపబడును. ఏలయన, ఇది కార్యరూపముగా పరిణమింపక పోయి

వను, ఆత్మను కలుషితముగా చేసివేయును. ఎవడు పాపమునకు దండ విధాయకుడో, అతడు బాహ్యానుష్ఠానములనుమాత్రమేగాక, హృదయభావ ములను సహితము వీక్షించును.

వి. ఈ శ్లోకము వివిధములగు మానసిక దుష్కార్యలను తెలుపు చున్నది

శ్లో. పారుష్య మనృతంచైవ, పైశున్యం చాపి సర్వశః ।
అసంబద్ధ ప్రలాపశ్చ, వాఙ్మయం స్యా చ్చతుర్విధమ్॥ ౫

[మనుసంహిత, XII. ౬.]

ప. పారుష్యం, అనృతం, చ, ఏవ, పైశున్యం, చ, అపి, సర్వశః, అసంబద్ధప్రలాపః, చ, వాఙ్మయం, స్యాత్, చతుర్విధం.

టీ. పారుష్యం=కఠినవచనములు పలుకుట, అనృతం చైవ=అబద్ధమాడుటయు, పైశున్యంచాపి = పరోక్షమునందు పరదూషణము చేయుటయు, అసంబద్ధప్రలాపశ్చ=నిష్ప్రయోజన వాగ్విన్యాసమును, సర్వశః = ఇవన్నియు, చతుర్విధం= నాలుగు విధములయిన, వాఙ్మయం=వాక్కుతోచేరిన (అశుభ ఫలప్రదమగు కర్మ), స్యాత్=అగును.

తా. నిష్ఠురవాక్యప్రయోగము, అసత్యకథనము, పరోక్షమునందు పరనింద, అసంబద్ధప్రలాపము ఈ నాలుగును వాచిక దోషములు.

వ్యా. మానసిక దోషములవలెనే, వాక్యదోషములనుండియు, నానావిధ అనిష్టములు ఉత్పన్నములగును. అవియును మానవుని యాత్రయందు సంక్రమించును.

వి. ఈ శ్లోకము వాచిక సంబంధమయిన వివిధ దుష్కార్యలను తెలుపుచున్నది.

శ్లో. అదత్తానా ముపాదానం, హింసా చైవావిధానతః।
పరదారోపసేవా చ, శారీరం త్రివిధం స్మృతమ్॥ ౬
[మనుసంహిత, ౧౨. ౭]

ప. అదత్తానాం, ఉపాదానం, హింసా, చ, ఏవ, అవిధానతః, పరదారోపసేవా, చ, శారీరం, త్రివిధం, స్మృతమ్.

టీ. అదత్తానాం = దానముచేయబడని, ఉపాదానం= ధనగ్రహణము (అన్యాయముగా పరుల ధనమును గ్రహించుట), అవిధానతః=అవిహితమయిన, హింసాచైవ=హింసయును, పరదారోపసేవా చ=పరుని భార్యతో గమనమును,

త్రివిధం=ఈ మూడు విధములయిన (కర్మలను), శారీరం=శరీర సంబంధమయిన (అశుభకర్మలని), స్మృతం = స్మృతికర్తలచే చెప్పబడుచున్నది.

తా. అన్యాయముగా పరుల ధనము నపహరించుట, నిష్కారణముగా ఇతరులను హింసించుట, పరదారాభిగమనము, ఈ మూడును శారీరిక కుకర్మలు.

వ్యా. అన్నిటికంటెను శారీరిక దుష్కర్మములు అధిక అనిష్టమును కలుగజేయును. మానసిక దోషములు కేవలము దోషినిమాత్రమే బాధించును. శారీరిక దోషములు ఇతరులకుగూడ ఘోరములగు అనిష్టములను సమకూర్చును

వి. ఈ శ్లోకము శారీరిక విషయమయిన మూడు దుష్కర్మములను గురించి చెప్పుచున్నది

శ్లో. త్రిదండమేత న్నిక్షిప్య, సర్వభూతేషు మానవః।
కామక్రోధౌ తు సంయమ్య, తత స్సిద్ధిం నియచ్ఛతి॥ ౭
[మనుసంహిత, XII ౧౧.]

ప. త్రిదండం, ఏతత్, నిక్షిప్య, సర్వభూతేషు, మానవః, కామక్రోధౌ, తు, సంయమ్య, తతః, సిద్ధిం, నియచ్ఛతి.

టీ. మానవః=మనుష్యుడు, సర్వభూతేషు=సమస్త భూతములయందును, ఏతత్ త్రిదండం=పయిని చెప్పబడిన మనోవాక్కాయములయొక్క నియమ త్రయమును, నిక్షిప్య=చేసి, కామక్రోధౌ తు=కామక్రోధములను, సంయమ్య = జయించి, తతః = పిమ్మట, సిద్ధిం=(మోక్షప్రాప్తి లక్షణమయిన) సిద్ధిని, నియచ్ఛతి=పొందుచున్నాడు.

తా. స్వార్థపరత్వముతో స్వేచ్ఛాచారిగాక, సమస్త ప్రాణులకును హితమును కలుగజేయు నిమిత్తమయి, తన మనస్సును, వాక్కును, శరీరమును నియమమునం దుంచుకొని, కామక్రోధాది శత్రువర్గమును జయించి, మానవుడు మోక్షప్రాప్తి లక్షణముగల పరమ పురుషార్థమును సాధించును.

వ్యా. మనస్సునుండి దోషములు జనింపకుండునట్లు, మనస్సును స్వాధీనము చేసికొనవలయును. ఏ సమస్త ఆలోచనలు, సంకల్పములు, కామములు మనస్సును కలుషితముగా జేయునో, అవి హృదయమునం దుదయించినంతమాత్రముననే, ఈశ్వరచింతనము, సాధుసంగము మొదలయిన సమస్తోపాయముల నవలంబించి, ప్రయత్నపూర్వకముగా వానిని నిర్మూలింపవలయును. వాక్యదోషము లుత్పన్నము గాకుండునట్లు, వాఙ్నియమము నభ్యసింపుము. హస్తపాదాది కర్మేంద్రియములను మనస్సుయొక్క దుష్టప్రవృత్తుల ననుసరింప నియ్యకుము.

వి. ఈ శ్లోకము మనోవాక్కాయములయొక్క నియమ ప్రాశస్త్యమును వర్ణించుచున్నది. అట్టి సంయమమే పరమ పురుషార్థమునకు దారితీయును

శ్లో. కృత్వా పాపం హి సంతప్య, తస్మాత్ పాపాత్ ప్రముచ్యతే।
నైవం కుర్యాం పునరితి, నివృత్త్యా పూయతే తు సః॥ ౮

[మనుసంహిత, ౧౧ -౨౩౧.]

ప. కృత్వా, పాపం, హి, సంతప్య, తస్మాత్, పాపాత్, ప్రముచ్యతే, న, ఏవం, కుర్యాం, పునః, ఇతి, నివృత్త్యా, పూయతే, తు, సః.

టీ. (మానవుడు అజ్ఞానవశమువలనగాని, మోహము వలనగాని) పాపం హి=పాపమును, కృత్వా=చేసి, (తరువాత) సంతప్య = (అట్లు చేసినందుకు) సంతాపమునొంది, తస్మాత్ పాపాత్ = ఆ పాపమునుండి, ప్రముచ్యతే = విముక్తుడగుచున్నాడు, ఏవం=ఈ ప్రకారము, పునః=మరల, న కుర్యాం ఇతి=చేయనని, నివృత్త్యా తు=నివృత్తుడగుటచేత, సః=అతడు, పూయతే=పవిత్రుడగుచున్నాడు.

తా. పొరపాటువలన నేదయిన పాపముచేసి, దాని విషయమయి పశ్చాత్తాపము నొందినయెడల, మానవు డా పాపఫలమునుండి విముక్తుడగును. ఇట్టి పాపకృత్యము నింకెన్నడును చేయనని ప్రతిజ్ఞచేసి, అట్లు నివృత్తుడయిన యెడల, అతడు పవిత్రుడును కాగలడు.

వ్యా. మనుష్యుడు పాపమునందు క్రమక్రమముగా మునిగి పోయి వినాశము నొందకుండునట్లు కరుణామయుడగు పరమేశ్వరుడు పాపముతో బాధను సంయుక్తము చేసియున్నాడు. ఎట్లు శారీరిక రోగము తటస్థించినప్పుడు, శారీరిక బాధ సంప్రాప్తమగునో, అట్లే, ఆత్మయందు పాపము జనించినయెడల, ఆత్మానందమును, ఆత్మశాంతియు అంతర్ధాన మగును, మనస్తాపమును, అశాంతియు ఆత్మను క్షతవిక్షతముగా చేయును ఇదే పాపానుష్ఠానమువలని దండన మనుష్యు డీ విధముగా ఆంతరిక దండన ననుభవించి, అనుతప్తుడగును పాపమునుండి నివృత్తుడయి, పుణ్యా మార్గమున నడుచుట కుత్సుకుడగును. పాపకార్యములు చేయు మానవుని హృదయమునందు అతడు తన వికృతావస్థను తెలిసికొనగలుగు జ్ఞానము నుదయింపజేయుటకుగాను, పరమేశ్వరుడు వానిని దండించును. దండా ఘాతమువలన పాపబోధ ముదయించి, పశ్చాత్తాపము కలుగును అను తాపము కలిగినప్పుడు, దండనవిధానము యొక్క యుద్దేశము సఫలమగు టను గాంచి, పరమేశ్వరుడు ఆ పాపియొక్క పూర్వాపరాధముల నన్ని టిని, క్షమించును అప్పుడా మనుష్యుడు మరల పాపముల నాచరింపక, సన్మార్గము నవలంబించినయెడల, మరల వాని హృదయమునందు ఎప్పటి

వలె, శాంతియు, పవిత్రతయు వర్షించును అనుతాపము నొందుటయు, పాపమునుండి మరలి పుణ్యమార్గమున నడచుటయు, ఈ రెండును ప్రాయశ్చిత్తముయొక్క రెండు అంగములు అనుతాపము ఈశ్వరనియమాను సారముగా తటస్థించును రెండవ యంగము మనుష్యుడు యత్నపూర్వకముగా సాధింపవలసిన విషయము సర్వదా ఆత్మపరీక్ష చేసికొనుచు, పాపమునుండి నివృత్తుడవు కమ్ము పుణ్యకర్మముల ద్వారమున పాపపరిహారమును గావించుకొనుము

౬. ఈ యధ్యాయముయొక్క ఈ చివర శ్లోకము పాపమునుండి విముక్తినొందు మార్గమును సూచించుచున్నది. అనుతాపమువలన, మానవుడు పాపవిముక్తు డగుననియు, మరల నట్టి పాపము చేయనని ప్రతిజ్ఞ పట్టి, అట్లాచరించుటచే, శాంతి పవిత్రతలు మరల హృదయమునందు ప్రకాశించుననియు కూడ చెప్పుచున్నది.



# ౧౬ అ ధ్యా య ము



శ్లో. అధార్మికో నరో యోహి, యస్య చాప్యనృతం ధనం।
హింసారతశ్చ యో నిత్యం, నేహాసౌ సుఖ మేధతే॥ ౧

[మనుసంహిత, IV ౧౭౦]

ప. అధార్మికః, నరః, యః, హి, యస్య, చ, అపి, అనృతం, ధనం, హింసారతః, చ, యః, నిత్యం, న, ఇహ, అసౌ, సుఖం, ఏధతే.

టీ. యః హి నరః=ఏ నరుడు, అధార్మికః=అధర్మముగా వ్యవహరించునో, యస్యాపి చ=ఎవనికి, అనృతం=అబద్ధమాడుటయే, ధనం=జీవనోపాయమో, యః చ=ఎవ్వడు, నిత్యం=నిరంతరము, హింసారతః=ఇతరులను హింసించెడు స్వభావము గలవాడో, అసౌ=అట్టి పురుషుడు, ఇహ=ఈ లోకమునందు, సుఖం=సుఖమును, నఏధతే=పొందడు.

తా. ఏ మనుష్యుడు అధార్మికుడో, అసత్యమాడుటయే ఎవని ధనార్జనమునకు ఏకమాత్ర ఉపాయమో, ఎవడు సదా

పరహింసారతుడయి యుండునో, అట్టి పురుషుడు ఇహలోక మునందయినను సుఖమును పొందజాలడు.

వ్యా. అధర్మాచరణముద్వారా ఐహిక సుఖసంతోషముల నయినను పొందుదమని ఎన్నడును కోరకుము ఐహికమునందయినను, ఎవడును, ఎన్నడును అధర్మము నాచరించి సుఖవంతుడు కాజాలడు. ఇహలోక మును ఈశ్వర రాజ్యములోనిదే ఆయన న్యాయదండము ఇహలోకము నందును వ్యాప్తమయి యున్నది

వి. ఈచివర యధ్యాయము ధర్మజీవనముయొక్క ప్రాముఖ్యతను ఇంకను బలపరచుచున్నది మొదటి మూడు శ్లోకములును అధర్మజీవనము వలని నష్టములను పేర్కొనుచున్నవి. ఈ మొదటిశ్లోకము "దురాచరుడు ఆముష్మిక సుఖము మాట యటుండనిచ్చి, ఐహిక సుఖమునయినను పొంద జాల"డని చెప్పుచున్నది.

శ్లో. న సీదన్నపి ధర్మేణ, మనోఽధర్మే నివేశయేత్ ।
అధార్మికాణాం పాపానాం, ఆశు పశ్యన్ విపర్యయమ్॥౨

[మనుసంహిత, IV ౧౭౧.]

ప. న, సీదన్, అపి, ధర్మేణ, మనః, అధర్మే, నివేశయేత్, అధార్మికాణాం, పాపానాం, ఆశు, పశ్యన్, విపర్యయమ్.

టీ. ధర్మేణ=ధర్మజీవనముచేత, సీదన్నపి = అవసన్నుడయ్యును (దుఃఖము పొందినవాడయినను,) అధార్మికాణాం=ధార్మికులుగాని, పాపానాం=పాపాత్ములయొక్క, ఆశు=శీఘ్రమయిన, విపర్యయం=వ్యత్యస్తదశను, పశ్యన్=చూచుచు, మనః=మనస్సును, అధర్మే=అధర్మమునందు, న నివేశయేత్=ఎన్నడును ప్రవేశపెట్టకూడదు.

తా. ధర్మమార్గమునందు నడచుటచేత, గొప్ప కష్టములు సంప్రాప్తము కావచ్చును. అధార్మికులగు పాపాత్మలే తాత్కాలికముగా సుఖసంపదలలో నోలలాడుచుండవచ్చును. ఇట్టి పరిస్థితులు స్థిరములు కావని తెలిసికొని, అధర్మమువయిపున కెన్నడును మనసును మరలింపకుడు.

వ్యా. ధర్మమార్గమునం దుండుటచే కష్ట మనుభవింపవలసి వచ్చుచున్నది శరీరము మనస్సు అవసన్నమగుచున్నవి మరియు పాపకృత్యములు చేయువాడు అచిరకాలముననే సుఖసంపతులతో తులతూగుచున్నాడు. ఇవన్నియు చూచి, ధర్మము నిష్ఫల మనుకొని, నీ వెన్నడును అధర్మాచరణమునందు ప్రవృత్తుడవు గాకుము ధార్మికజీవనము చేయువానియొక్క దీనదశలలో, హీనావస్థలలో అమృతఫలములు దాగియున్నవనియు, పాపాత్ముని సుఖసంపతులయందు మారాత్మకాగ్ని ప్రచ్ఛన్నమయి యున్నదనియు, తెలిసికొనుము యుక్తకాలమున, ధర్మపరాయణుడు ఆనంద

నీరమునందు అభిషిక్తుడగును, పాపి హాహాకారములు సలుపవలసివచ్చును. కావున, ప్రాణమునయినను పందెముగా నొడ్డి ధర్మమార్గమునందు స్థిరముగా నిలువబడుము నిరుత్సాహము నొంది అధర్మమార్గమునం దొక్కయడుగయినను కిందికి దిగకుము.

వి. అధర్మజీవనమువలన తాత్కాలిక సుఖ మొకప్పుడు కలుగవచ్చునని, ఈశ్లోక మంగీకరించుచున్నది కాని, అది క్షణస్థాయియగుటచే, వాంఛనీయము కాదు. కనుక, ధర్మజీవనము నిష్ఫలమని యెంచి అధర్మజీవనము నెన్నడును చేపట్టకూడదు

శ్లో. అధర్మే ణైధతే తావత్, తతో భద్రాణి పశ్యతి।
తతః సపత్నా ఞ్జయతి, సమూలస్తు వినశ్యతి॥　　3
[మనుసంహిత, IV ౧౭౪ ]

ప. అధర్మేణ, ఏధతే, తావత్, తతః, భద్రాణి, పశ్యతి, తతః, సపత్నాన్, జయతి, సమూలః, తు, వినశ్యతి.

టీ. అధర్మేణ=ఇతరులను ద్రోహముచేయుట మొదలయిన వ్యాపారములచేత (దుర్మార్గుడు), తావత్=తాత్కాలికముగా గ్రామధనాదికములతో), ఏధతే = వర్ధిల్లుచున్నాడు. తతః=ఆ యైశ్వర్యముచే, భద్రాణి = బహు భృత్యగవాశ్వాది శుభములను, పశ్యతి=పొందుచున్నాడు. తతః=తదనంతరము,

సపత్నాన్=శత్రువులను, జయతి=జయించుచున్నాడు. (తరువాత కొలదికాలములోనే అధర్మపరిపాకవశమున) సమూలః=మూలకారణమయిన ధనాదికముతో, వినశ్యతి=నాశమునొందుచున్నాడు.

తా. అధర్మజీవనమునందు తాత్కాలికముగా సర్వవిధముల నభివృద్ధి నొందవచ్చును, శుభముల పడయువచ్చును, శత్రువులను పరాజయము నొందింపవచ్చును. కాని, ఇవన్నియు శీఘ్రకాలములోనే సమూలముగా వినాశమునొందును

వ్యా. పాపాత్ముడు తన పాపఫలము నెప్పుడో యొకప్పుడు అవశ్యము అనుభవింపవలసి యున్నది. మనుష్యుడు పాపాచరణముద్వారా మొదట ఎంత ఔన్నత్యమునొందునో, తరువాత అంత దుర్గతి ననుభవించును. ఎవడు ఎంత ఉచ్చస్థానమునకెక్కునో, పడునప్పు డతడు అంత పెద్ద దెబ్బను సహించుకొనవలసి యుండును ఒకచోటనుండు వాయువు సూర్యకిరణముల వేడిమిచే నుత్తప్తమయి మింటికెగసినప్పుడు నలుపార్శ్వములనుండు వాయువు ఆందోళితమయి, దాని స్థానము నాక్రమించుకొనుట కెట్లు పరుగిడునో, అట్లే, ఈశ్వరునియొక్క ధర్మరాజ్యము సహితము శృంఖలాబద్ధమయి యుండుటచే, ఎవడయినను, ఎక్కడనయినను, దాని నేమాత్రమయినను అతిక్రమించినయెడల, నలువయిపులనుండు ఆధ్యాత్మిక శక్తులన్నియు ఆందోళితమయి, దానికి ప్రతివిధానమును చేయుటయందు ప్రవృత్తమగుచున్నవి. కనుకనే, పాపాత్ముడు పాపకార్య

ములుచేసి, చిరకాలము జయమును పొందజాలడు, తాత్కాలికముగా అతడెంత శ్రీమంతుడయినను, కాలము వచ్చినప్పు డతడు సమూలముగా వినాశము నొందును అతని యయిశ్వర్యమే అతనిని కాలసర్పమయి కరచును. కావున, ప్రాపంచిక సుఖముల కాశించి, నీ వెన్నడును పాపమార్గమును బట్టకుము పరిపూర్ణ న్యాయస్వరూపుడయిన పరమేశ్వరునిమీద భారమువేసి, ఆయనచె ప్రతిష్ఠితమయిన ధర్మశాసనముల పాలింపుము

వి. ఈ శ్లోకముకూడ వెనుకటి శ్లోకభావము నే బలపరచుచున్నది. పాపియొక్క అధఃపతనము నిశ్చయమని నొక్కి చెప్పుచున్నది.

శ్లో. ధర్మం శనైస్ సంచినుయాత్, వల్మీకమివ పుత్తికాః।
పరలోకసహాయార్థం, సర్వభూతా న్యపీడయన్॥ ౪
[మనుసంహిత IV ౨౩౮.]

ప. ధర్మం, శనైః, సంచినుయాత్, వల్మీకం, ఇవ, పుత్తికాః, పరలోకసహాయార్థం, సర్వభూతాని, అపీడయన్.

టీ. పుత్తికాః = చెదపురుగులు, వల్మీకమివ=(మహాంతమగు) పుట్టనువలెనే, (మానవుడు) సర్వభూతాని=సమస్త భూతములను (ఏ భూతమును), అపీడయన్=పీడించక (అహింసా సాధనమువలననే), ధర్మం=ధర్మమును, శనైః=అల్పాల్పముగా, సంచినుయాత్=ఆర్జింపవలయును.

తా. మానవుడు ఏ ప్రాణికిని హింసను కల్పింపక, పరలోక సహాయార్థమయి, చెదపురుగులు చెదపుట్టలను నిర్మాణముచేయురీతిని, మెల్లమెల్లగా, ధర్మధనమును సంచయము చేసికొనవలయును.

వ్యా. చెదపురుగులు పుట్టలనువలె ధర్మసంచయము చేయుము. అవి ఎంత అల్పప్రాణులయినను కొంచెము కొంచెముగా, ఎంత ఆశ్చర్యకరములయిన పుట్టలను నిర్మాణము చేయుచున్నవో చూడుడు. అట్లే, కొంచెము కొంచెముగా నయినను, ధర్మకార్యములు చేసి, పుణ్యము నార్జించి పరలోకమునం దనుకూలించు ధర్మధనమును సంచయము చేసికొనుడు

వి. ఈ శ్లోకము క్రమక్రమముగా వికాసమునొందు ఆధ్యాత్మికాభివృద్ధిని సూచించుచున్నది. అల్పప్రాణులగు పగడపు పురుగులను, చెదపురుగులను ఉదాహరణముగా తీసికొనుచున్నది. పగడపు పురుగులును, చెదపురుగులును నిశ్శబ్దములయి, నిరంతర క్రియాశీలములయి రవంత రవంత చొప్పున చేర్చి మహాంతములగు దీవులను, పుట్టలను నిర్మాణముచేయుచున్నవి. అట్లే, మానవులుకూడ, నిరంతర క్రియాశీలురయి, తమ ఆధ్యాత్మిక జీవితములను నిర్మాణముచేసికొనవలసియున్నది

శ్లో. నాముత్రహి సహాయార్థం, పితా మాతా చ తిష్ఠతః ।
న పుత్రదారం న జ్ఞాతిః, ధర్మస్తిష్ఠతి కేవలః॥ ౫

[మనుసంహిత, IV ౨౩౯].

ప. న, అముత్ర, హి, సహాయార్ధం, పితా, మాతా, చ, తిష్ఠతః, న, పుత్రదారం, న, జ్ఞాతిః, ధర్మః, తిష్ఠతి, కేవలః.

టీ. హి=ఏ కారణమువలన, అముత్ర=పరలోకమునందు, సహాయార్ధం = సహాయముకొరకు, పితా మాతా చ = తలి దండ్రులు, న తిష్ఠతః=ఉండరో, (అట్లే) పుత్రదారం=పుత్రులు గాని భార్యగాని (ఉండరో), న జ్ఞాతిః=జ్ఞాతులయినను ఉండరో, కేవలః ధర్మః=కేవలము ధర్మ మొక్కటే, తిష్ఠతి=ఉండునో, ఆ కారణమువలన ధర్మసంచయమునకు మహాయత్నము చేయ వలయును.

తా. పరలోకమునందు సహాయముచేయుటకు తల్లి దండ్రులుగాని, భార్యాపుత్రాదులుగాని, జ్ఞాతులుగాని, మిత్రులు గాని, మరేబంధువులుగాని ఉండజాలరు. కేవలము ధర్మ మొక్కటే, అక్కడ సాహాయ్యము చేయుటకు సంసిద్ధమయి యుండును. కనుక, సర్వప్రయత్నములచేతను ధర్మసంచయము చేయవలయును.

వ్యా. మృత్యువు వచ్చి, ఆత్మను దేహమునుండి వేరుచేసినప్పుడు, భూమండలమునందలి ఏ స్నేహితులుగాని, ఏ బంధువులుగాని, ఎంతమాత్ర మును సహాయము చేయజాలరు. అప్పుడు కేవలము ధర్మముమాత్రమే

-వచ్చి, ఓదార్చి, శాంతిమార్గమునకు దారి చూపును కనుక, తల్లిదండ్రులు మొదలయిన సమస్త బంధువులకంటెను ధర్మమే ప్రియతరమయిన బంధు వని తెలిసికొనుము.

౬. భూమండలమునందు సహాయభూతులయిన బంధుమిత్రాదు లెవరును మరణానంతరము తోడ్పడజాలరనియు, అప్పుడు సహాయము చేయగలిగినది ధర్మమొక్కటేయనియు, ఈ శ్లోకము చెప్పుచున్నది

శ్లో॥ ఏకః ప్రజాయతే జంతుః, ఏక ఏవ ప్రలీయతే।
ఏకోఽనుభుఙ్క్తే సుకృతం, ఏక ఏవ తు దుష్కృతమ్॥ ౬

[మనుసంహిత, IV ౨౪౦.]

ప. ఏకః, ప్రజాయతే, జన్తుః, ఏకః, ఏవ, ప్రలీయతే, ఏకః, అనుభుఙ్క్తే, సుకృతం, ఏకః, ఏవ, తు, దుష్కృతమ్.

టీ. (మరియు) జంతుః=జీవుడు, ఏకః ఏవ=ఒక్కడే, ప్రజాయతే = పుట్టుచున్నాడు (బంధువులతో కూడ పుట్టుట లేదు). ఏకః ఏవ = ఒక్కడయ్యే, ప్రలీయతే = మృతినొందు చున్నాడు. ఏకః=ఒక్కడే, సుకృతం=పుణ్యఫలమును, అనుభుఙ్క్తే=అనుభవించుచున్నాడు (ఎవనితోను కూడి అనుభవించుటలేదు). ఏకః ఏవ తు=ఒక్కడే, దుష్కృతం=పాపఫలమును (అనుభవించుచున్నాడు).

తా. మానవుడీ ప్రపంచమున ఒంటరిగా జన్మించును. ఒంటరిగా చనిపోవును. ఒంటరిగా స్వీయ పుణ్యఫలము ననుభవించును. అట్లే, పాప ఫలమును సహితము ఒంటరిగానే అనుభవించును.

వ్యా. ఎవరియొక్క అనురోధమువలనను ధర్మమార్గమును విడువకుము. ఏ కారణమువలనను, ఎన్నడును, అధర్మము నాచరింపకుము. ధర్మరక్షణార్థమయి నీవు సమస్తమును పరిత్యజింపవలసివచ్చినను, అవశ్యము పరిత్యజింపుము. ఎందువలనంటే, ధర్మపరిత్యాగమువలన నీవే నరకయాతనను అనుభవింపవలసివచ్చునో, దానినుండి నిన్ను ఉద్ధరింపగలవాడుగాని, లేక దానిని నీతోపాటు పంచుకొని అనుభవింపగలవాడుగాని, ఎవడును ఉండడు. పాపపుణ్యములయొక్క ఫలము మనుష్యుడు ఇతరుల కొంత మాత్రమును పంచియియ్యక, స్వయముగా, ఏకాకిగా అనుభవింపవలసియుండును

వి. ఈ శ్లోకము, మానవుని సమస్తానుభవములలోను, అతనియొక్క ఏకాకిత్వమును, హృదయస్పర్శములగు భావములతో చిత్రించుచున్నది. మానవుడు ఏకాకిగా జనించుచున్నాడు, మరణించుచున్నాడు, పుణ్యపాప ఫలముల ననుభవించుచున్నాడు. ఇది నిస్సందేహముగా సత్యమే. కాని, ఇది సంపూర్ణ సత్యము కాదు, అర్ధ సత్యము. మానవుడెన్నడును తన యే యనుభవములోను సంపూర్ణముగా ఏకాకి కాడు. అతడు తన కర్మఫలమును లోకమునకుకూడ పంచియిచ్చుచున్నాడు. తన కర్మఫలమునకు మాత్రమే గాక, లోకులయొక్క కర్మఫలమునకు గూడ, తన జన్మవలననే వారసు

డగుచున్నాడు, అనగా వారియొక్క కర్మఫలమును గూడ తాను పంచుకొని అనుభవించుచున్నాడు పలువురు హైందవ ధర్మశాస్త్రకారులు మానవజీవితముయొక్క ఈ పక్షమును చూడజాలరయిరి

శ్లో॥ మృతం శరీర ముత్సృజ్య, కాష్ఠ లోష్ఠ సమం క్షితౌ।
విముఖా బాంధవా యాన్తి, ధర్మ స్త మనుగచ్ఛతి॥ ౭

[మనుసంహిత, IV ౨౪౧]

ప. మృతం, శరీరమ్, ఉత్సృజ్య, కాష్ఠలోష్ఠసమం, క్షితౌ, విముఖాః, బాన్ధవాః, యాన్తి, ధర్మః, తం, అను గచ్ఛతి.

టీ. మృతం = ప్రాణాది రహితమయిన, శరీరం = దేహమును, క్షితౌ= స్మశానభూమియందు, కాష్ఠలోష్ఠ సమం=కర్రముక్కవలెను, మట్టిబెడ్డవలెను, ఉత్సృజ్య=విడిచి పెట్టి, బాంధవాః=బంధువులందరు, పరాఙ్ముఖాః = పరాఙ్ముఖులయి, యాన్తి=గృహమును గూర్చి పోవుచున్నారు. ధర్మః=ధర్మము, తం=వానిని (ఆ మృతినొందిన ధార్మికుని), అనుగచ్ఛతి=వెంబడించుచున్నది.

తా. ఎట్టి బంధువులయినను, మృత శరీరమును కట్టె పుల్లవలెను, బెడ్డముక్కవలెను, స్మశానభూమియందు దిగవిడిచి, గృహాభిముఖులయి వెడలిపోవుదురు. అట్టి సహాయమును వెంటనంటి వచ్చునది ధర్మ మొక్కటే.

వ్యా. ధర్మముతో సమానమయిన బంధువు మరెవ్వరును లేరు. మరణము తటస్థించినప్పుడు, పృథివియందలి సమస్త బంధువులును మృత కళేబరమును స్మశానభూమియందు దిగవిడిచి ఇంటికి మరలిపోదురు. ఆత్మ ఏకాకియయి లోకాంతరమునకు చేరి, కేవలము తానదివరకు సంచయము చేసికొనియున్న ధర్మముయొక్క బలముపలననే, తదనుగుణమయిన సద్గతిని పొందును. ఇట్టి పరమ బంధువు నెన్నడును పరిత్యజింపకుడు.

వి. ఈ శ్లోకము మానవాత్మయొక్క మరణానంతర దశను వివరముగా వర్ణించుచున్నది బంధుమిత్రాదులు మృతకళేబరమును వదిలి మరలిపోదురు ఆత్మను వెంబడింపజాలరు ధర్మమొక్కటే ఆత్మ ననుసరించును.

శ్లో. తస్మా ద్ధర్మం సహాయార్థం, నిత్యం సంచినుయాత్ శనైః।
ధర్మేణ హి సహాయేన, తమ స్తరతి దుస్తరమ్॥ ౮

[మనుసంహిత, IV. ౨౪౨.]

ప. తస్మాత్, ధర్మం, సహాయార్థం, నిత్యం, సంచినుయాత్, శనైః, ధర్మేణ, హి, సహాయేన, తమః, తరతి, దుస్తరమ్.

టీ. తస్మాత్ =అందువలన, సహాయార్థం=తన సహాయముకొరకు, నిత్యం=ప్రతి దినమును, ధర్మం=ధర్మమును, శనైః=మెల్లగా, సంచినుయాత్ = సంచయము చేసికొనవలయును. ధర్మేణ హి సహాయేన=ధర్మముయొక్క సహాయమువలననే, దుస్తరం తమః=దాట శక్యముకాని అజ్ఞానాంధకారమును, తరతి=(మానవుడు) దాటుచున్నాడు.

తా. కావున మరణానంతరము మీకు సాహాయ్యము చేయుటకు, మీ జీవితకాలమునందే, ధర్మమును కొంచెము కొంచెముగా నయినను చేర్చిపెట్టుకొనుడు. జీవుడు ధర్మముయొక్క సాహాయ్యమువలననే దాటరాని విషయమోహాంధకారజలధిని దాటగలుగుచున్నాడు.

వ్యా. ధర్మహీనుడయి, ఈ లోకమునం దెవడు సుఖమనుభవింపగలడు? పరలోకమునందయినను, ధర్మద్వారమున తప్ప, మరే ద్వారమునను జీవుడు సాంత్వనమును పొందగలడు? ధర్మమువలన తప్ప మరిదేనివలన, మనుష్యుడు మనుష్యత్వము నార్జింపగలడు? దేవతలు తమ దేవత్వమును సంరక్షించుకొనగలరు? ధర్మమే ధార్మికులయొక్క బలము ధర్మమే పురుషుల పౌరుషము, ధర్మమే స్త్రీల యలంకారము ధర్మమే సుఖసంపాదనమున కుపాయము. ధర్మమే ఆత్మప్రసాదమునకును, మనస్సంతుష్టికిని ఆకరము ధర్మమే బ్రహ్మానందోపలబ్ధికి పరమహేతువు. కేవలము

ధర్మముయొక్క సాహాయ్యమువలననే, మానవుడు దుస్తర తిమిర జలధిని దాటి, అభయ మమృత మశోక మనాద్యనంతుడును, నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావుడును, పరమానంద స్వరూపుడును అగు పరబ్రహ్మము యొక్క సాన్నిధ్యమును పొందగలడు.

వి. ఈ చివర శ్లోకము, దేని సాహాయ్యమువలన, మానవుడు జ్ఞానాంధకారమును దాటగలడో, అట్టి ధర్మము ననుష్ఠింపవలయునని శాసించుచున్నది. ఇది ఈ యధ్యాయముయొక్క సమాప్తికేగాక, ఈ గ్రంథముయొక్క సమాప్తికే ఎంతో అనుకూలముగా నున్నది.

వా. ఏష ఆదేశ ఏష ఉపదేశ, ఏత దనుశాసనమ్ ।
ఏవ ముపాసితవ్య, మేవ ముపాసితవ్యమ్ ॥ ౯

[తైత్తిరీయోపనిషత్, ౧ వల్లి, ౧౧ వాక్య.]

ప. ఏషః, ఆదేశః, ఏషః, ఉపదేశః, ఏతత్, అనుశాసనమ్, ఏవమ్, ఉపాసితవ్యమ్, ఏవమ్, ఉపాసితవ్యమ్.

టీ. ఏషః ఆదేశః=ఇదే కర్తవ్యవిధి. ఏషః ఉపదేశః= ఇదే మనుష్యులకొరకు ఉపదేశము. ఏతత్ అనుశాసనమ్=ఇదే ప్రమాణవచనము. ఏవ ముపాసితవ్యం = ఇట్లే ఉపాసింపవలయును. ఏవ ముపాసితవ్యమ్=ఇట్లే ఉపాసింపవలయును (గ్రంథ సమాప్తి సూచకముగా ద్విరుక్తముగా చెప్పబడినది).

తా. ఇదే ఆదేశము, ఇదే యుపదేశము, ఇదే శాస్త్రము ఈ విధముననే, ఆ పరమపురుషు నుపాసింపుడు, ఆ పరమపురుషు నుపాసింపుడు.

వ్యా. నీ నిండు మనసుతో పరమేశ్వరుని ప్రేమింపుము. సంసారమునందుండియే ఆయనకు హితమయిన కార్యములను చేయుము ఇదే ఆయన యారాధన. ఇదే మనుష్యుడు పురుషార్థమును సాధించు నుపాయము. దీనివలననే ఐహిక శుభమును, పారత్రిక శుభమును, ఉభయమును చేకూరును ఇదే బ్రాహ్మధర్మముయొక్క ఆదేశము, ఇదే బ్రాహ్మధర్మముయొక్క యుపదేశము, ఇదే బ్రాహ్మధర్మముయొక్క ప్రమాణము. ఆయనను ప్రేమించి, ఆయనకు హితమయిన కార్యములు చేయుటకంటె, జీవునకు గత్యంతరము లేదు

వి ధర్మజీవనమును జీవించుటయు, ఆయనకు ప్రియకరమైన కార్యములు చేయుటయు, ఇదే నిజమయిన ఈశ్వరోపాసన యని ఈ వాక్యములు చెప్పుచున్నవి. ఈ విధముగా, ఆదర్శ జీవితమునందు జ్ఞానమును, భక్తియు, కర్మయు సమన్వయము కావలయును

ఓమ్ ఋతమ్ వదిష్యామి, సత్యమ్ వదిష్యామి, తన్మామవతు, తద్వక్తార మవతు, అవతు మామ్, అవతు వక్తారమ్, అవతు వక్తారమ్.

[తైత్తిరీయోపనిషత్, ౧ వల్లి, ౧ వాక్య.]

ప. ఓమ్, ఋతమ్, వదిష్యామి, సత్యమ్, వదిష్యామి, తత్, మామ్, అవతు, తత్, వక్తారమ్, అవతు, అవతు, మామ్, అవతు, వక్తారమ్, అవతు, వక్తారమ్.

టీ ఓమ్=బ్రహ్మమునకు నమస్కారము. ఋతమ్=యథార్థకర్తవ్యమును, వదిష్యామి=చెప్పెదను. సత్యం=సత్యమును, వదిష్యామి=చెప్పెదను. తత్=సత్యము (బ్రహ్మము), మామ్=నన్ను, అవతు = రక్షించునుగాక! తత్ = సత్యము (బ్రహ్మము), వక్తారమ్=ఆచార్యుని, అవతు=రక్షించునుగాక! మామ్=నన్ను, అవతు=రక్షించునుగాక! వక్తారం=ఆచార్యుని, అవతు=రక్షించునుగాక! వక్తారం=ఆచార్యుని, అవతు=రక్షించునుగాక!

వ్యా. నేను (తప్పును చెప్పను) ఒప్పును చెప్పుదును, నేను సత్యము పలుకుదును, సత్యము (బ్రహ్మము) నన్ను రక్షించునుగాక! సత్యము వక్తను రక్షించునుగాక! సత్యము నన్ను రక్షించునుగాక! సత్యము వక్తను రక్షించునుగాక! సత్యము వక్తను రక్షించునుగాక! (ద్విరుక్తి ఆదరణార్థము)

౫. ఇది సత్యమును (బ్రహ్మమును), ధర్మమును శరణొందుమనని చేయు ప్రతిజ్ఞ. రక్షింపుమని, సత్యమును (బ్రహ్మమును), ధర్మమును ప్రార్థించుట

ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః ! హరిః ఓమ్

(ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక విఘ్నములు శమించునుగాక !)

ద్వితీయఖండము సంపూర్ణము

భారతవర్ష బ్రాహ్మసమాజములకు ప్రధానాచార్యులవారగు మహర్షి దేవేంద్రనాథ ఠాకూరుగారిచేత, అందరకును పరమార్థతత్త్వజ్ఞానోదయము కలుగుటకొరకును, సర్వేశ్వరునియొక్క ప్రత్యక్షదర్శనప్రాప్తి సంఘటనముకొరకును, చక్కగా రచింపబడిన శ్రుతిస్మృతి సంగ్రహసారమయిన బ్రాహ్మధర్మగ్రంథమునందు ద్వితీయఖండము సమాప్తము.

బ్రాహ్మధర్మము సమాప్తము.

# తప్పొప్పుల పట్టిక

## ప్రథమ ఖండము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౭ | ౧౬-౧౪ | మూలమగు కారణచైతన్యము | చేతనకారణమనియు. |
| ౧౦ | ౫ | రసగ్ | రసగ్ం |
| | ౪ | రసగ్ హ్యేవ | రసగ్ంహ్యేవ |
| ౧౯ | ౫ | లేము ? | లేను. |
| ౨౨ | ౨ | ఇదగ్ | ఇదగ్ం |
| | ౬ | ఇదగ్ సర్వం | ఇదగ్ం సర్వం |
| ౪౬ | ౯ | మస్నావిరగ్ | మస్నావిరగ్ం |
| | ౧౮ | శుక్ర | శుక్రం |
| ౯౮ | ౫-౬ | న గృహ్యతే గ్రహింపబడదు, | న గృహ్యతే = గ్రహింపబడదు. |
| ౧౦౨ | ౧ | కచ్చిత్ | కశ్చిత్ |
| ౧౧౫ | ౮ | విహితాః | నిహితాః |
| ౧౫౨ | ౮ | అనాదిమత్వం | అనాదిమత్త్వం |
| | ౯ | విభుత్వే | విభుత్వేన |
| ౧౭౭ | ౧౭ | బుద్దిద్వారమున నే | బుద్ధిద్వారమున నే |
| ౧౯౧ | ౧౮ | అమ్ర వేషు | అభ్ర వేషు |

